౧౮-౧౯. ధర్మాత్ముండగు నాదశరథుడు కాలము ప్రాప్తించుటచే (తనకు మరణకాలము సమీపించుటచేగాని, శ్రీరామునికి యౌవనము ప్రాప్తించుటచేగాని) భీతుడై, నాగరులను, జానపదులను, ప్రధానులగు మేదినిపతులను వేర్వేర బిలువనంపెను.

౨౦. పనుల తొందరలో నుంటచే నభిషేకం బైనతరువాత నా శుభవార్తను వారు విందు రని తలంచి కేకయుని, జనకునిమాత్ర మాయన పిలువనంపలేదు.

౨౧. పరబలపీడకుండగు నాదశరథుం డట్లు కొలువుదీరియుండ, కేకయుండును జనకుండునుదక్క మిలిగిన ప్రసిద్ధు లగురాజు లందఱు విచ్చేసిరి.

౨౨-౨౩. ప్రాగ్దిశయందలివారును, దక్షిణదిశయం దుండువారును, ఉదగ్దిశ నుండువారును, ప్రత్యగ్దిశనుండువారు నగు రాజులును, మ్లేచ్ఛులును, నార్యులును, వనశైలంబుల నుండువారు నగు నెల్లరును, నింద్రుని దేవతలువోలె నాదశరథుని సేవించియుండిరి.

౨౪-౨౫. అంత నాపుడమిఱేడు సకలరాజసమన్వితంబగు నాపరిషత్తుం గాంచి దుందుభిస్వనగంభీరంబగు కంఠనాదంబున, హితంబును, సంతోషకరంబును, నగువాక్యంబు నిట్లు పలికెను.

౨౬-౨౭. విశాలంబగు నీమహాసామ్రాజ్యము నాకు ముందటిరాజు లెల్లరచే బుత్రవాత్సల్యంబునం బరిపాలింపబడిన దని మీ కెల్లరకు విశదమే.

---

సప్తసోమంబులు:-అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, ఉక్థ్యము, షోడశి, వాజపేయము, అతిరాత్రము, అప్తోర్యామము. ఇట్లు సంస్కారంబులు నలుబది.

[illegible]యా ప్యాచరితం పూర్వైః పంథాన మనుగచ్ఛతా,
[illegible]జా నిత్య మనిదేశేన యథాశ క్త్యభిరక్షితాః. ౨౬½
[illegible]ంకుర స్యాతపత్రస్య చ్ఛాయాయాం జరితం మయా ౨౭
[illegible]ష్వ వర్ష సహస్రాణి బహూ న్యాయూంషి జీవతః,
[illegible] స్యాస్య శరీరస్య విశ్రాంతి మభిరోచయే. ౨౮
[illegible]హం విశ్రమ మిచ్ఛామి పుత్త్రం కృత్వా ప్రజాహితే.
౨౮½
[illegible]రసమో వీర్యే రామః పరపురంజయః ౨౯
[illegible] చంద్ర మివ పుష్యేణ యుక్తం ధర్మభృతాం వరం,
[illegible]రాజ్యే నియోక్తాఽస్మి ప్రీతం పురుషపుంగవమ్. ౩౦

* [illegible]రూప స్స్వవై నాథో లక్ష్మీవాన్ లక్ష్మణాగ్రజః

---

*అనురూపఇతి:— విష్ణుపరత్వప్రతిపాదనప్రసంగేన [illegible]రూప ఇత్యాదా శివసంబంధివిరూపాక్షత్వాద్యమంగళ [illegible]రహిత ఇత్యాద్యర్థవిషయికతాత్పర్యకతయా వాల్మీకి [illegible]స్తుతిపరోఽయం శ్లోక ఇతి గోవిందరాజీయ వ్యాఖ్యానం [illegible] శరథస్య శ్రీరామచంద్రస్య మాహాత్మ్యాఽజ్ఞానతాత్ప [illegible] వా స్వపుత్త్రసంబంధి మహిమాతిశయస్య దశరథ [illegible]వర్ణన మనుచిత మితి తాత్పర్యేణ వా శివనిందా [illegible]రా స్వీయవిష్ణువిషయకభక్తిప్రకటనతాత్పర్యేణ వా న [illegible] విరూపాక్షత్వాదిశివసంబంధివికృతరూపే ఇవ విష్ణ్వవ [illegible]భూతమత్స్యకూర్మవరాహాదివిరూపభగవదంశేఽపి హే

౨౬౫-౨౭. అట్లు పూర్వులమార్గం బే నను గమించుచు నాశ క్త్యనుసారముగ బ్రజలను గంటికి ఱెప్పవోలె గాచుచు రాజ్యం బేలితిని. ఇంతయేల? ఆశ్వేతచ్ఛత్త్రము నీడలోనే నావయు సంతయు చెల్లిపోయినది.

౨౮. ఇప్పటికే యరువదివేల వత్సరము లున్నవి నాకు. వార్ధక్యంబునం గ్రుంగు నాశరీరమునకుం గొంత విశ్రాంతి నిచ్చుట తగును.

౨౮౫. అట్టి వృద్ధుండ నగు నేను, రాజ్యపరిపాలనాభారము నాకొమరునిపై బెట్టి విశ్రాంతి గొనఁగోరుచున్నాను.

౨౯-౩౦. పరపురంజయుండగు నాశ్రీరాముడు పరాక్రమంబున నిందృసముం డున్నాడు. పుష్యమీనక్షత్రముతో గూడిన చంద్రునివలె నుండు వాడును, ధర్మం బెఱిగినవారిలో మిన్నయగువాడును, బురుషపుంగవుండును, యుక్తగుణంబులు గలవాడును నగు నట్టిశ్రీరామచంద్రుని యౌవరాజ్యంబున నియోగింతును.

౩౧. లక్ష్మీసంపన్నుడగు నాశ్రీరాముడు అయ్యధికారంబున *కను

---

* అనురూపుడు:— ఈ శ్లోకంబునకు విష్ణుపరంబుగ నర్థంబు సేయుటలో "ముక్కంటింబోలె మిక్కిలికన్ను గల్గియుండు టాదిగా గల యమంగళరూపం బేమియు లేనివాడను నర్థమును బోధించుటకై వాల్మీకి స్తుతిపరంబుగ నీశ్లోకము వ్రాసె" నని గోవిందరాజీయవ్యాఖ్యానము. ఇయ్యది, శ్రీరాముండు మహాత్ముం డను నెఱుక దశరథునకు లేదను భావంబుననో, తనపుత్త్రుని మహిమాతిశయంబు తానై వర్ణించుట యనుచితం బనియో, శివుని నిందించురూపమున, విష్ణునందు తన కుండు భక్తిప్రకటనముం గావించుటకో మాకు తెలియరాదు. శివునకు విరూపాక్షత్వాధికము వికృతరూపం బగునెడల విష్ణువునకు మాత్ర మాతని యంశావతారంబు లగు మత్స్యకూర్మవరాహ

♦త్రైలోక్య మపి నాథేన యేన స్యా న్నాథవ త్తరమ్. 31

ఇతి బ్రువంతం ముదితాః ప్రత్యనంద న్నృపా నృపమ్,
వృష్టిమంతం మహామేఘం నర్దంత ఇవ బర్హిణః. 32

స్నిగ్ధోఽనునాదీ సంజజ్ఞే తత్ర హర్ష సమీరితః,
జనౌఘోద్ఘుష్టసన్నాదో విమానం కంపయ న్నివ. 33

బ్రాహ్మణా జనముఖ్యాశ్చ పౌరజానపదై స్సహ,
సమేత్య మంత్రయిత్వా తు సమతాగతబుద్ధయః. 34
ఊచుశ్చ మనసా జ్ఞాత్వా వృద్ధం దశరథం నృపం. 345

---

యత్వబుద్ధిప్రసక్త్యా తద్వ్యాఖ్యాతుః కథం వా విష్ణు భక్తిరిత్యాది చింతనీయం.

♦త్రైలోక్య మపీతి:—నను కథ మయ మనురూపో నాథః బ్రహ్మరుద్రాదయోపి హి సంతి నాథా ఇత్యత్రాహ-త్రైలోక్య మపీతి. యేన నాథేన నాథవ దిత్యనే నేంద్రాదివ్యావృత్తిః. తరసా బ్రహ్మరుద్రాదివ్యావృత్తిః, తన్నాథత్వస్య తన్మూలత్వాత్. శ్లో॥ 'యుగకోటిసహస్రాణి విష్ణు మారాధ్య పద్మభూః, పునస్త్రైలోక్యధాతృత్వం ప్రాప్తవా నితి శుశ్రుమః' 'మహాదేవ స్సర్వమేధే మహాత్మా హుత్వా త్మానం దేవదేవో బభూవ.' ఇత్యాదిస్మృతయ స్త్వత్ర మానమ్, త్రైలోక్యం నాథవ త్తరం రక్ష్యాపేక్షయా రక్షకత్వ రాఽధికేత్యర్థః.

రూపుడు. అతని నాథుంగా గల్గిన ♦ ముల్లోకంబులకు నాధవత్తరంబు లగును.

3౨. ఇట్లు వల్కుచున్న నాదశరథుని, వర్షంబువ్వారిగ గురియుమేఘుని జూచిన నెమ్మిగుంపువోలె వా రందర రభినందించిరి.

33. ఉత్కృష్ట హర్షంబునం బలుకబడిన స్నిగ్ధానునాదంబగు తత్సభాస్థులసంతోషనాద మాసభాభవనంబు నుత్తూత లూగించివైచెను.

3౪-3౪౫. బ్రాహ్మణులును, బ్రజానాయకులును, పౌరులును, జానపదులు నాదిగాగలవా రందఱు వచ్చి వారివారిమనంబుల నాయాలోచన బాగుగనే యున్నదని నిశ్చయించుకొని, యందఱు నొక్కటేమాటగ, దశరథునితో నిట్లనిరి.

---

దికంబులపై నేవగిం పేల కలుగదో? ఏమో! విష్ణుభక్తిపరిపూరితంబగు తద్వ్యాఖ్యాతృగంభీరహృదయం బెవ్వరి కెఱుక!!

♦ ముల్లోకము లనుచోట:— బ్రహ్మేంద్రాదు లగు లోకనాథు లుండగా నీత డెట్లనురూపు డగు నాథు డగునను శంకాసమాధానారము.ముల్లోకములని చెప్పబడినది. ఏన=ఏనాథునిచేతననియరము. నాథుడు కలవి యనుటలో నింద్రాదులకంటె నాధిక్యమును, నాథవత్తరుడనుటచే బ్రహ్మరుద్రాదులకంటె నాధిక్యమును సూచింపబడును.వారివారియధికారంబులకు విష్ణువేకారణము. ఇందులకు స్మృతిప్రమాణములు: 'సహస్రకోటి యుగంబులు విష్ణు నారాధించి పంకజాసనుండు త్రిలోకములు సృష్టించు నధికారము నొందెను,'

'మహాత్ముండగు రుద్రుండు సర్వమేధం బనుయాగంబున ఆత్మను వేల్చి దేవదేవుం డయ్యెను.'

అనేకవర్షసాహస్రో వృద్ధ స్త్వమసి పార్థివ,
స రామం యువరాజాన మభిషించస్వ ధార్మికం. 3౫౫

* ఇచ్ఛామోహి మహాబాహుం రఘువీరం మహాబలం. 3౬

---

* ఇచ్ఛామోహీతి:—నను రక్షకే మయి విద్యమానే కిమర్థం రామాభిషేకోఽపేక్షిత ఇత్యాశంకాయాం నహి వయం రక్షణార్థం త మపేక్షామహే, కింతు సౌందర్యవిశేషానుభవార్థ మిత్యాహుః- ఇచ్ఛామ ఇతి. ఇచ్ఛామ ఇతి బహువచనేన సర్వేషా మిచ్ఛావైషమ్యాభావ ఉక్తః.

మహాబాహుమితి:—ఆయతాశ్చ సువృత్తా శ్చేత్యుక్తరీత్యా సహజబాహుసౌందర్యమ్, తత్కాలాంకుశాకర్షణాదివ్యాపారవిశేష శ్చోచ్యతే ఇచ్ఛామ ఇత్యాది:-ఇచ్ఛామః పట్టాభిషేక పట్టబంధాది యుక్తతయా స్థితం ద్రష్టు మిచ్ఛామః. ఇచ్ఛా మాత్ర మస్మాకం, కార్యనిర్వహణంతు భవదధీనం. ఇచ్ఛామః - అస్మాక మిచ్ఛా వర్తతే, 'శ్రేయాంసి బహు విఘ్నానీ' త్యేవంవిధ శ్శ్రేయోఽస్మాకం లభ్యతే కిం? ఇచ్ఛామః, అభిషేక స్సిధ్యతు వా నవా ? ఇచ్ఛా నివృత్తి బాధా - సుందరవస్తుదర్శనే ఇచ్ఛా ప్రవర్తతే ఖలు. ఇచ్ఛామః - సర్వప్రకారేణ రక్షకత్వా ద్వాచా ప్రార్థయితు మశక్తా మనసా ఇచ్ఛామః. భవదభిప్రాయజ్ఞానేనై వేదానీ మిచ్ఛామ ఇతి వదామః, కేషాంచి దస్తి, న కేషాంచి దితి న

౩౫. ఓ రాజా! నీకు వేనవేలు సంవత్సరములు గడచినవి. మిగుల వృద్ధుండవైతివి. కావున ధార్మికుండగు శ్రీరాముని యౌవరాజ్యాభిషిక్తుం గావింపుము.

౩౬. *శ్రీరాముడు మహాబాహుసంపన్నుడు, మహాశక్తియుతుండు.

---

*ఇచ్ఛామః అనుచోట:—'నేను (దశరథుడు) మీకు రక్షకుడనై యుండ రామాభిషేకం బేమిటకు మీరు కోరెద'రని యాశంక రాగా. 'మేము మా రక్షణార్థమై యాతని గోరుటలేదు. అతని సౌందర్యము ననుభవించుటకే (ఇచ్ఛామః) కోరుచున్నా'మని చెప్పిరి. 'కోరుచున్నాము' అను బహువచనసారస్యంబునం జేసి యాతని యభిషేకవిషయములో నభిప్రాయభేదంబు లేదని సూచన.
మహాబాహుడు:—దీర్ఘంబులును, వృత్తపీనంబులు నైన బాహువు లని చెప్పుటచే, తద్బాహుసౌందర్యమును, తత్కాలంబుల నంకుశాముల బట్టుటలో నాతనికి గల సౌలభ్యంబును గూడ సూచితములగును.
'ఇచ్ఛామ' యనుశ్లోకంబునకు:—పట్టబంధాయితలలాటమండితుండగు నాతని జూడగోరుచున్నాము.

అతడు యౌవరాజ్యాభిషిక్తుం డగుటను జూచుకోర్కెయే మాకున్నది. ఆ కార్యమును నిర్వహించుటమాత్రము మీయధీనం బై యున్నది. పట్టాభిషేకము జూచుకోర్కెమాత్రము మాకు బలముగానే యున్నది. కాని శ్రేయంబులు బహువిఘ్నమూలకంబులు. అట్టివిఘ్నసమన్వితం బగు శ్రేయంబు గాదుకదా మేము కోరునది? శ్రీరాముని యభిషేకంబు గోరుచుంటిమి. కాని యది తుద నెగ్గునా లేదా? ఎట్లైనను కోరుట కాటంక మేముండును? సుందరవస్తుదర్శనార్థము కోర్కె లూరుచుండునుగదా! తమయందు పాలనాలోపం బిసుమంతయు లేక సురక్షితముగా నుంటిమి. అట్టిచో శ్రీరాము నభిషేకింపు డనుటకు మాకు నోరాడుటలేదు. కావున మనంబున గోరుచుంటిమి. మీ యభిప్రాయ మెఱింగియే 'కోరుచుంటి' మని చెప్పుచుంటిమి. అభిషేకవిషయమై కొందఱి కిష్టంబును మఱి కొందఱ కనిష్టంబును లేదు. అందఱమును గోరుచుంటిమి. — 'షాః పరిసిద్ధా!

కింతు సర్వే ఇచ్ఛామః. హి - సర్వలోక ప్రసిద్ధం ఖలు. 'జనాఘోద్ఘుష్టసన్నాదో విమానం కంపయన్ని' వేతి సర్వ జనకోలాహలేన తవ గృహం విశిష్టబంధం ఖలు. 'లోకపాలోపమం నాథ మకామయత మేదినీ' త్వయి నిర్వాహకే సత్యేవ భూమిః స్వయంవరం కృతవతీ ఖలు. త్వయి కరగ్రహణం కుర్వతి రామకామనా న యుక్తేతి ధ్వన్యతే, కాముకీనాం న మర్యాదా ఖలు. లోకపాలోపమం - విష్ణుసదృశం. అతఏవ వృతవతీ భూమిః. మేదినీ మధుకైటభ వసావిస్రగంధేన ఉపహతా సర్వగంధ ఇతి రామసౌగంధ్యేన వాసయితు మకామయత. మహాబాహుం బాహుబల స్యాఽలక్ష్యో ఖల్వయం. 'శక్త స్త్రైలోక్య మప్యేక' ఇతి న కేవలం కోసలరాజ్యం, లంకారాజ్య మపి రక్షితుం శక్తి రస్తి. మహాబాహుం ఆయతాశ్చేతి ఆజానుబాహు రితిచ మహాపురుషలక్షణేన న జ్ఞాయతే కిం? విభూతిద్వయనిర్వాహకబాహుః ఖలు, మహాబాహుం బాహుచ్ఛాయా మవష్టభ్యేతి ఛాయాఽస్మా ద్రక్షణే న పర్యాప్తా కిం? 'రక్షతు ధర్మేణ బలేన చైవ' ఇతి ధర్మబలమ ప్యస్తీ త్యాహుః. రఘువీరం:— దీనాన్ దానేన రాఘవః ఇతి ప్రసిద్ధఃఖలు. రఘ్వపేక్షయాఽస్యైవ ధర్మిష్ఠతా జ్ఞాయతే ఖలు. 'రఘుంప్రతి క్షుధార్తస్య మరణే తవ పాపం సంభవతీత్యుక్తే తూష్ణీం స్థితవాన్. అయం తు 'అప్యహం జీవితం జహ్యా' మితి ఖ లూక్తవాన్. మహాబలం:— మనోబలయుక్తం. 'నహి ప్రతిజ్ఞాం సంశ్రుత్య న త్యజేయం' ఏతద్వ్రతం మమేతి వక్ష్యతి.

అన్నట్లు హి అనునది ప్రసిద్ధార్థమందు వాడబడును. 'అచ్చట నున్న జనులు సంతోషాతిశయముచే జేసిన కోలాహలశబ్దముచే నారాజగృహము కంపించిపోయెను' గదా! కాన నిది ప్రసిద్ధవిషయమే యని తెల్పుటకు 'హి' యను నవ్యయము. "విష్ణుసముం డగు నాతని నాథునిగా భూమి కోరెను.":—రాజ్యభారం బెల్ల మీరు నిర్వహించుచుండగనే యీభూమి యాతని వరించినది. మీరు చేపట్టిన యీయామె యాతని వరించుట యుక్తము గాదని ధ్వని.

కాముకురాండ్రకు మర్యాద లేదుగదా! లోకపాలోపముడు_ విష్ణుసదృశుడు. కనుకనే భూమి యాతని వరించినది. మధుకైటభుల వసాగంధ మలమికొనుటచే భూమికి సర్వగంధ యనిపేరు వచ్చినది. అట్టి యీయామె శ్రీరాముని సౌగంధ్యంబున బరిమళింప నెంచుచున్నదియనుభావము దెల్పుటకై మేదిని యనుపదము. మహాబాహుడు:— బాహుబలసంపన్నుండగు నాతనికి నీభూమిని వహించు టొక లెక్కలోనిది కాదు. 'త్రిలోకరాజ్య పరిపాలనాదక్షుండు' అనుటచే నాతని కొక కోసలరాజ్యంబును మాత్రమే కాదు - లంకారాజ్యంబును రక్షించుశక్తికూడ యున్నది. ఆయతబాహుడు, ఆజానుబాహుడు' ఇట్టి మహాపురుషలక్షణములు కలిగినవాడని ద్యోతకమగుచున్నది. ఐహికాముష్మిక విభూతిద్వయంబును నిర్వహించువాడే మహాబాహుడన బరగువాడు. మఱియు నీతని బాహుచ్ఛాయ నలమికొని ఈతనిరక్షణముచుండ లేదా యీయామె? 'ధర్మంబును బలంబునుగూడ బురస్కరించుకొని పాలనముచేసెను' అని చెప్పంబడుటచే నీతనికి ధర్మబలంబుగూడ నెలకొనియున్నది.

రాఘువుడు 'దానంబున దీనులను జయించును' (వశపఱచుకొనును) రఘుమహారాజుతో 'ఆకలిచే నారుడైనవాడు మరణించినచో నీకు బాపము సంఘటిల్లు' ననిచెప్పగా, నాతడు పెడచెవిని బెట్టి యూరకుండెను. మఱి యీతడో 'జీవితమైనను ధారవోసెదను' అని కదా పల్కినాడు. కాన రఘువుకంటె నీతనియందే ధర్మం బెక్కుడని ప్రతీత. మహాబలుడు:_మనోబలముతో గూడినవాడని భావము. 'ప్రతిన వట్టితినో మఱి దానిని విడిచిపుచ్చు టెన్నడును లేదు' ఇది నావ్రతం బనికదా యాతడు చెప్పెను.

•గజేన మహతాయాంతం రామం ఛత్రావృతాననం. •౩౬౪

రామ స్సత్పురుషో లోకే సత్యధర్మపరాయణః,
సాక్షా ద్రామా ద్వినిర్వృత్తో ధర్మశ్చాపి శ్రియాసహ. ౩౭౪

---

•గజేన మహ తేతి: —గజేన - త్వాయా ద త్తకిరీటపట్ట
బంధాదియు క్త శ్శత్రుంజయే నాగచ్ఛతి చే త్తదా జ్ఞాయతే.
గజేన - న రథాదినా. 'మ త్తమాతంగ గామిన' మితి తద్గమ
నోపమానగతిమతా, మహతా - అత్యున్న తేన సర్వశక్తి
మతా. ఆయాంతం మహావీథిమధ్యే ప్రతిగృహాంగణ మాగ
చ్ఛ ఆయాంతం 'ఏక స్స్వాదు న భుంజీత' ఇతి పుత్రకళ
త్రాదిభి స్స హానుభవరస మాస్వాదయామః. రామం సౌం
దర్యగుణై స్సకలమనోరంజకం ఛత్రావృతాననం దృష్టిదోష
పరిహారాయాంతరంగేణ ఛత్రేణావృతముఖం దృశ్యాదృ
శ్యైకదేశతయా సాకల్యేన ముఖదర్శనాభిలాష ముత్పాద
యంతం. అంతరంగసుహృద్భి ర్వాతాతపపరమ్లానతాశంకయా
భూచక్రిచ్ఛత్రేణాచ్ఛాదిత ముఖపంకజం. ఛత్రావృతాననం
'ఏకచ్ఛత్రాం మహీం భుంక్తే' ఇతి లక్షణశాస్త్రకథితసమ
వృత్త విశాలోత్తమాంగత్వవ్యంజకేన నిరంకుశప్రశాసనవశీ
కృత నిఖిలభూపాలవలయతానిరూపకేణ ఛత్రేణ పాండురేణ

౩౬౪. ♦ అట్టియాతడు తెల్లగొడుగుచే గప్పంబడిన మోముప్పారుచుండ శత్రుంజయం బను భద్రగజం బెక్కి వచ్చుటను మేముకోరుచున్నాము.

౩౭౪. లోకంబున రాముఁ డొక్కఁడే సత్పురుషుడు. ఆతనికి సత్యమంచును ధర్మమంచును నున్న యాసక్తి చెప్పదరముకాదు. ఇంతయేల? ధర్మము, దానికి ఫలంబగు సంపదంగూడి యాతనివలననే యుద్భవించినది.

---

♦ 'గజేన' యనుచోట:_మీ రిచ్చిన కిరీటంబున గ్రాలుచు లలాటభాగంబున బట్టం బొప్ప శత్రుంజయం బను పట్టపుటేనుంగు నెక్కి శ్రీరాముండు విచ్చేసినచో నాత డందఱికి విస్పష్టంబుగ గానవగును. ఏనుంగు నెక్కియే - రథాదికం బెక్కి కాదు, 'మదప్రటేనుఁగువోలె నడచువాడు' - ఇట్లని చెప్పబడుటచే, యాతనినడక కుపమానమగు నడకగల యేనుగు నెక్కియే రావలెను. అదియు మిక్కిలి యున్నతంబును, మహాశక్తిమంతంబును నైయుండును. వచ్చుచున్న (ఆయాంతం) :—వీథులలో ప్రతిగృహంబును గడచివచ్చుచున్నవానిని అని భావము. 'మాధుర్యము గలవస్తువు నొక్కఁడే యనుభవింపరాదు' అని చెప్పంబడుటచే సౌందర్యాదిగుణంబులచే సకలజనమనోరంజకుం డగు నా శ్రీరామచంద్రుని దర్శనమాధుర్యమును మేము భార్యాపుత్రసమేతులమై యనుభవింతుము. తెల్లగొడుగుచే గప్పంబడిన మోముగలవాఁ డనుచోట:— ఆతనికి దృష్టి తగిలిపోవునని తెల్లగొడుగిడబడెను. (ఆగొడుగును నేనుగు కదలినపుడెల్ల గదలుచుండుటచే) నాతని ముఖములో గొంతకొంతభాగము మాత్రమే కానవచ్చుటం జేసి యాతని సంపూర్ణముఖావలోకనమహాభాగ్యం బెప్పుడబ్బునా యను తహతహ మఱియు బాడముచున్నది. ఆతని యాంతరంగికులు, వాతాతపంబులకుం జిక్కి యాతని ముఖపంకజ మెక్కడ వాడిపోవునో యని యాభూచక్రఛత్రంబు పై నుంచిరి. భూరాజ్యంబు నంతయు నేకచ్ఛత్రాధిపత్యంబుగ నేలుచుండెనని తెలుపు

యదా వ్రజతి సంగ్రామం గ్రామార్థే నగరస్య వా
గత్వా సౌమిత్రిసహితో నావిజిత్య నివర్తతే. ౩౮

స్మితపూర్వాభిభాషీచ ధర్మం సర్వాత్మ నాశ్రితః,
శక్త స్త్రైలోక్య మప్యేకో భోక్తుం కిం ను మహీ మిమాం.
౩౯

స్త్రియో వృద్ధా స్తరుణ్యశ్చ సాయంప్రాత స్సమాహితాః
సర్వా న్దేవా న్నమస్యంతి రామస్యార్థే యశస్వినః. ౪౦

---

పరభాగభావ మాపన్నేన నితరాం ప్రకాశితేందీవరసదృశ
ముఖం విశదీకృతముక్తం రామం స్వసౌందర్యేణ గజ మలం
కుర్వాణ మివ స్థితం, ఛత్రావృతాననం, వదనపరిభామండలేన
ఛత్రావరణేన జనితసౌందర్యం-ప్రత్తై రభిషేకానంతరభావిభిః
విశేషణై రభిషేకః కర్తవ్య ఇతివ్యంజనావృత్త్యా ప్రార్థ్యతే.

౩౮వ. గ్రామములకును, పట్టణములకును మేలుసేయు నిమిత్తమై లక్ష్మణునితో గలిసి యుద్ధమున కెప్పు డాతడు పోయినను జయలక్ష్మిం జేకొనకుండ నెప్పుడును నూఱక తిరిగిరాడు.

౩౯వ. ఎవరితోడనుగూడ మందహాసపూర్వకంబుగ నాతడే ముందు మాట్లాడును. ధర్మం బెట్టికష్టదశయందును వీడువాడుగాడు. అట్టియాతడు ముల్లోకములనుగూడ శాసించుటకు దగును. మఱి యీరాజ్య మాతని కొక లెక్కలోనిదా?

౪౦వ. స్త్రీలు, వృద్ధరాండ్రు, యౌవనురాండ్రునుగూడ శ్రీరామునికి మేలు గల్గుటకై సమస్తదేవతాప్రార్థనములు జేయుచున్నారు. (సహజముగ స్త్రీలు గూఢాభిప్రాయములు గలవారు. వృద్ధరాండ్రు, పెద్దతనముచే బుద్ధి పెడతల నుండుటచే ప్రతిపనికిని నడ్డు దవ్వులు చుందురు. మఱి యౌవనవతులకు దేవతాప్రార్థనము సేయు మనస్థిమితముకూడనా? అట్లయ్యుగూడ నీ రందఱును శ్రీరామనిమిత్తమై యట్లు సేయుచుండిరట!!)

---

టకునుగూడ నాగోడు గుంచబడెను. లక్షణశాస్త్రానుసారంబుగ, నుండి వర్తులమును విశాలమును నగు నాశ్రీరాముని శిరంబునకు వ్యంజకంబును, అతనిచే వశీకృతసమస్తరాజమండలంబును స్ఫురింపజేయునదియు, శత్రుభాగంబుల నన్నింటిని వశపఱుచుకొన్న భావంబును దెలుపుటకు తెల్లనైయున్న నాఛత్రముచే వెలారుచు స్ఫుటంబుగ గానవచ్చుచున్న నల్లగలువంబోలు మోముగల వాడును, స్వసౌందర్యంబుచేగూడ నా భద్రగజంబునకు వన్నె దెచ్చుచు, పైన ఛత్రం బావరించియుంటచే వదనప్రభ లేమియు దూసికొనపోకుండుటచే ద్విగుణీకృతసౌందర్యుండై - ఇత్యాదిగ నభిషేకానంతరము గనవచ్చు విశేషణంబులచే నభిషేకము సేయవలెనని యాదశరథుని సమస్తజనంబులును గోరుచుండి రని వ్యంగ్యవ్యాప్తిచే దెలిపికొనవలెను.

[1]ప్రతిగృహ్య బ్రువ న్రాజా తేభ్యః ప్రియహితం వచః. ౪౧
అహో ఽస్మి పరమప్రీతః ప్రభావ శ్చాతులో మమ,
య న్మే జ్యేష్ఠం ప్రియం పుత్త్రం యౌవరాజ్యస్థ మిచ్ఛథ. ౪౨

ఇతి ప్రత్యర్చ్య తా న్రాజా బ్రాహ్మణా నిద మబ్రవీత్,
చైత్త్ర శ్శ్రీమా నయం మాసః పుణ్యః పుష్పితకాననః. ౪౩
యౌవరాజ్యాయ రామస్య సర్వ మేవోపకల్ప్యతామ్,
శ్వ ఏవ పుష్యో భవితా శ్వోఽభిషేచ్యస్తు మే సుతః. ౪౪

తచ్ఛ్రుత్వా భూమిపాలస్య వశిష్ఠో ద్విజసత్తమః,
ఆదిదేశాగ్రతో రాజ్ఞః స్థితా న్యుక్త్వా న్కృతాంజలీన్. ౪౫

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అయోధ్యాకాండే
ప్రథమ స్సర్గః.

---

## ద్వితీయ స్సర్గః

[2]తత స్సుమంత్త్రం ద్యుతిమా న్రాజా వచన మబ్రవీత్
రామః కృతాత్మా భవతా శీఘ్ర మానీయతా మితి. ౧

---

1 వాల్మీ. రా: సర్గ 3. 2 వాల్మీకి రా. సర్గ 3.

౪౧. ఇట్లు వారి ప్రార్థనంబు లంగీకరించి వారికి బ్రియంబును హితకరంబును నగునట్లుగా దశరథుఁ డిట్లనియె.

౪౨. ఓహో! నాపెద్దకొమరుని కభిషేకము సేయుమనుచుండిరి. మీ రిట్లాడుటచే నా కెంతయు ముదంబగుచున్నది. నాభాగ్య మేమని చెప్పవచ్చును!

౪౩-౪౪. ఇట్లు తేఁడు వారి నభినందించి చెంతనుండు బ్రాహ్మణులతో నిట్లనియె. పుష్పితనానావనతరుసంశోభితంబై శోభావిరాజమానంబగు చైత్రమాసముగదా యిది. కాన రాముని యౌవరాజ్యాభిషేకంబునకు వలయు సంభారంబుల వెంటనే సమకూర్పుఁడు. ఈపే పుష్యమీనక్షత్రము. కాన ఈపటనే నాకొమరునియభిషేకోత్సవమయితీరవలయును.

౪౫. రా జిట్లు పలుకుట ద్విజకులచంద్రుండగు వశిష్ఠుఁడు విని రాజాంతికమున గృతాంజలులు వట్టియున్నవారలలో నర్హులగువారలతో నిట్లనియె.

ఇది శ్రీరామాయణసారోద్ధారమున బాలకాండమునందు
ప్రథమసర్గము.

---

## ద్వితీయసర్గము.

౧. ప్రీతిభావంతుఁ డగు నాదశరథుఁడు 'కృతాత్ముం డగు నా శ్రీరాముని ట దోడ్తె మ్మని సుమంత్రు నాజ్ఞాపించెను.

స తథేతి ప్రతిజ్ఞాయ సుమన్త్రో రాజశాసనాత్,
రామం తత్రానయాంచక్రే రథేన రథినాం వరమ్. 3

ప్రాసాదస్థో దశరథో దదర్శాయాన్త మాత్మజమ్,
చన్ద్రకాన్తాననం రామ మతీవప్రియదర్శనమ్,
రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్. 34

*స ప్రాంజలి రభిప్రేత్య ప్రణతః పితు రన్తికే
నామ స్వం శ్రావయన్ రామో వవన్దే చరణౌ పితుః. 84

---

* స ప్రాంజలిరితి:—అనేన బద్ధాంజలిపుట స్సన్నమస్కృత్య స్వనామ సంకీర్త్య గుర్వాద్యభివాదనం కుర్యా దితి సూచితం. తథాచ గౌతమః— సూ. 'నామ ప్రోచ్యాయమహ మిత్యభివాదయ'ఇతి. స్త్రీణాం జ్యాయ స్త్వే విశేషమాహ ప్రచేతాః - పతివయస స్స్త్రియ ఇతి. వయసాఽధికోపి క్షత్రియో బ్రాహ్మణేన నాభివాద్య ఇత్యాహ స ఏవ. 'దశవర్షస్తు బ్రాహ్మణ శ్శతవర్షస్తు క్షత్రియః, పితాపుత్రౌ చ తౌ విద్ధి తయోస్తు బ్రాహ్మణః పితా.'

ఏకహస్తాభివాదనే దోష మాహ విష్ణుః: శ్లో॥ జన్మప్రభృతి యత్కించి చ్చేతసా ధర్మ మాచరేత్, సర్వం తం నిష్ఫలం యాతి ఏకహస్తాభివాదనాత్' ఇతి.

౨. సుమంత్రుడును వల్లెయని రాజశాసనంబున రథికశ్రేష్ఠుండగు నా శ్రీరామచంద్రు నటకు దోడితెచ్చెను.

3-3౫. రూపము, ఔదార్యము, సౌశీల్యము నాదిగాగల గుణంబులచే బురుషుల దృష్టిని మనంబునుసైత మాకర్షించువాడును, జంతువునికెంతేను మనోహరంబుగ నుండు నాననంబుతో నందఱకు జూడవలయువాడును నై యేతెంచుచున్న తన ముద్దులతనయుని దశరథుడు మేడపైనుండి కాంచెను.

౪౫. *శ్రీరాముండును దోయిలొగ్గుచు పితృంతికంబు నల్లనల్లన డాసి తన నామం బుచ్చరింపుచు దండ్రిచరణముల కెఱగెను.

---

* ప్రాంజలిర్భూ అనుచోట:—ఇట్లనుటచే దోయి లొగ్గుచు నమస్కరించి, స్వనామం బుచ్చరించుచు బెద్దలకు నభివాదనంబు సేయవలెనని సూచితము. గౌతముడును 'స్వనామం బుచ్చరించి నేను ఫలానవాడ నని యభివాదనము సేయవలె'నని సూత్రించెను. స్త్రీలు వయసున బెద్దవారైనచో వారి కభివాదనము సేయుపద్ధతి నాపస్తంబులు భర్త కెంతవయసో భార్యకు నంతే వయస్సను సూత్రంబున వేఱుగా జెప్పిరి. వయసుచే నధికుడైనను క్షత్రియుడు బ్రాహ్మణునిచే నభివాదనము సేయదగడని ఆయనయే యిట్లుచెప్పెను. 'బ్రాహ్మణుడు దశవత్సరప్రాయమువాడైనను, క్షత్రియుడు శతవర్షప్రాయము వాడైనను, వీ రిద్దఱును తండ్రియు, కొమరుడు నని తెలియవలెను. వీ రిరువురిలో బ్రాహ్మణుడే తండ్రి.

ఒక హస్తముచేతనే అభివాదనము సేయుటలో గలదోషమును విష్ణువిట్లు చెప్పుచున్నాడు:—'ఎవడైనను నొకహస్తముచే నభివాదనం బొనర్చినచో జన్మము మొదలు చేసినపుణ్యము లన్నియు నిష్ఫలము లగును'

దిదేశ రాజా రుచిరం రామాయ పరమాసనం. ౫

*తదాసనవరం ప్రాప్య వ్యదీపయత రాఘవః,
స్వయైవ ప్రభయా మేరు ముదయే విమలో రవిః. ౬

---

*తదితి—తదాసనవరం ప్రాప్య తదాసనం స్వయైవ ప్రభయా వ్యదీపయత్ విమలో రవి రుదయే మేరుం ప్రాప్యేవ. సూర్యస్య ప్రధానమేరుప్రాప్తే స్సాక్షా దభావాత్ అత్ర మేరుశబ్దేన అస్తాద్రిసమీపవర్తీ సావర్ణిమేరు రుచ్యతే. ఉదయశ్చ ఉత్తరవర్షస్థితసిద్ధపురవాసిజనాపేక్షయా. ఇయ ముదయాస్తమయవ్యవస్థా సూర్యసిద్ధాంతే ఆర్యభటే చ ప్రసిద్ధా "భూవృత్తపాదే పూర్వస్యాం యవకోటీతి విశ్రుతా, భద్రాశ్వవర్షే నగరీ స్వర్ణప్రాకారతోరణా. యామ్యాయాం భారతే వర్షే లంకా తద్వ న్మహాపురీ, పశ్చిమే కేతుమాలాఖ్యే రోమకేతి చ కీర్తితా. ఉదక్సిద్ధపురీ నామ కురువర్షే ప్రతిష్ఠితా. ఉదయో యో లంకాయాం సోఽస్తమయ స్సవితు రేవ సిద్ధపురే, మధ్యాహ్నో యవకోట్యాం రోమకవిషయేఽర్ధరాత్రం స్యాత్. భారతాదిషు వర్షేషు తద్వదేవ పరిభ్రమన్, మధ్యోదయార్ధరాత్రాస్త కాలాన్ కుర్యా త్ప్రదక్షిణం.

౫. దశరథుండును కాంతిమంతంబగు నాసనం బొందు శ్రీరాముని గూర్చుండ జూపెను.

౬. * నిర్మలుండగు నుదయసూర్యుండు తన కాంతిపుంజముచే మేరువు నుద్దీపింపజేసినట్లు శ్రీరాముండును తన వినిర్మలకాంతులచే నాయాసనంబు నుద్దీపింపజేసెను. (అనగా నామహాసనము వన్నెగాంచె నని భావము).

---

* తదాసనము:—ఆ యాసనముపై గూర్చుండి ప్రాతఃకాలంబున సూర్యుండు మేరుపర్వతంబును బోలె తన ప్రభాసముదయంబుచే నాయాసనము నుద్దీపింపజేసె నని భావము. సూర్యునకు సాక్షాత్తుగా మేరువు చెంతకుబోవు టెన్నడు గలుగదు. కాన నిట మేరుశబ్దముచే నసగిరిప్రాంతమందు సావర్ణిమేరు వనియే యర్థము సేయవలెను. ఉత్తరవర్షంబున సిద్ధపురంబున నుండు జనుల కప్పుడు ప్రాతఃకాలమే యగును గాన శ్లోకములో 'ఉదయకాలమందు సూర్యుడు...శైలింగించెను' అని చెప్పినను నసంగతము లేదు.

ఈ ఉదయాస్తసమయముల వివర మంతయు సూర్యసిద్ధాంతమందును నార్యభట్టీయమందును నిట్లు చెప్పబడినది. 'భూమండలంబున దూర్పుదిక్కునందు భద్రాశ్వవర్షం బున్నది. అందు సువర్ణమయప్రాకారతోరణవాటియగు యవకోటి యనునగరం బొండు గలదు. దక్షిణంబున భారతవర్షంబున నల్లే లంకాపట్టణమును, బశ్చిమంబున కేతుమాలవర్షంబున రోమకంబును, నుత్తరదిశయందు కురువర్షంబున సిద్ధపురంబును వెలయుచుండును. లంకాపట్టణంబున సూర్యున కుదయకాలంబైన సిద్ధపురంబున నస్తమయసమయము. యవకోటినగరంబున మధ్యాహ్నకాలంబైన, రోమకపురంబున నర్ధరాత్రం బగును. ఇట్లు సూర్యుడు భారతాదివర్షంబుల గ్రమంబుగ బ్రదక్షిణం బొనరింపుచు ఉదయాస్తమయమధ్యాహ్నార్ధరాత్రంబులు గల్పించుచుండు.

ఇత్యేవం వచో రాజా దేవేంద్ర మివ కాశ్యపః. ౬౪
యత స్త్వయా ప్రజా శ్చేమా స్స్వగుణై రనురంజితాః
తస్మా త్త్వం పుష్యయోగేన యౌవరాజ్య మవాప్నుహి. ౭౪
గుణవత్యపి తు స్నేహాత్ పుత్త్ర వక్ష్యామి తే హితం. ౮
* భూయో వినయ మాస్థాయ భవ నిత్యం జితేంద్రియః,
కామక్రోధసముత్థాని త్యజేథా వ్యసనానిచ. ౯

---

* భూయ ఇతి:—భూయోఽతివినయం స్వాతిశయ వినయం. తత్ర వినయ స్యావశ్యకత్వే వినయావినయయోః ఫల మాహ మనుః: 'బహవోఽవినయా న్నష్టా రాజాన స్సప రిచ్ఛదాః. వేనో వినష్టోఽవినయా న్నహుష శ్చైవ పార్థివః, సుదాసో యవన శ్చైవ సుముఖో నిమి రేవ చ. పృథుస్తు విన యా ద్రాజ్యం ప్రాప్తవా న్మను రేవచ, కుబేరశ్చ ధనై శ్వర్యం బ్రాహ్మణ్యం చైవ గాధిజః' ఇతి. జితేంద్రియః - అస్మి న్నర్థే కామందకః: ' జితేంద్రియత్వం వినయస్య లక్ష ణం, గుణప్రకర్షో వినయా దవాప్యతే, గుణాధికే పుంసి జనోఽనురజ్యతే, జనానురాగప్రభవా హి సంపదః' ఇతి. కామక్రోధసముత్థాని వ్యసనాని:—'స్త్రీ ద్యూత మృగయా మద్య వాక్పారుష్యోగ్రదండతాః, అర్థసందూషణం చేతి రాజ్ఞాం వ్యసనస ప్తక' మిత్యుక్తాని వ్యసనాని. అర్థసందూ షణం - పిత్రాదిసంచితార్థస్య నాశనం ఇతి. ఇంద్రియ

౬౪-౭౪-౫. దేవేంద్రునితో గాశ్యపుఁడువోలె నాదశరథుఁడు [illegible]
విట్లనియె. శ్రీరామా! నీసుగుణంబులచే నీప్రజ లందఱు [illegible]
[illegible]సించిరి. పుష్యమీనక్షత్రము ఱేపేగాన యౌవరాజ్యపరిపా[illegible]
భారమును వహింపుము. నీవు సకలగుణసంపన్నుండ వని యెఱుంగుదును.
కాని పుత్రవాత్సల్యంబున నింత జెప్పుచుంటిని.

౯. ✦విశేషవినయముగల్గి జితేంద్రియుండవై యుండుము. కామక్రోధ
ములచే గల్గు సప్తవ్యసనముల చెంత జేరనీకుము.

---

✦ విశేష వినయము:—అనగా నింతకంటె నెక్కువ వినయం బని భావము. వినయం బవసరమనుచు, వినయంబునను నవినయంబునను గలుగుఫలాఫలములను మనుధర్మశాస్త్ర మిట్లు చెప్పుచున్నది. 'అవినయంబుచే జాలమందిరాజులు పరిజనసహితంబుగ నష్టపడిరి. వేను డవినయంబుచే జెడెను. నహుషుడును జెడిపోయెను. సుదాస యవన సుముఖ నిములుగూడ నట్లే నష్టమొందిరి. కాని వినయప్రభావంబున పృథుచక్రవర్తి రాజ్యము బొందెను. అట్లే మనువును రాజ్యము బొందెను. కుబేరుఁడు ధనసంపన్నుఁ డయ్యెను. విశ్వామిత్రుఁడు బ్రహ్మత్వము నొందెను. జితేంద్రియత్వమునుగూర్చి కామందకుఁడు చెప్పినది:— "జితేంద్రియత్వము వినయలక్షణము (జితేంద్రియత్వము వినయమువలన గల్గునని భావము.) అట్టి వినయంబు గల్గినా గుణాధిక్యత పొందును. గుణాధిక్యత యెప్పు డొదవునో జనానురాగంబును నప్పుడే యొదవును. అట్టి జనానురాగంబు ననుసరించియేగదా సంపదలు ప్రభవించుచుండును.' కామక్రోధాదులం గలుగు వ్యసనంబులు:— స్త్రీలోల్యము, జూదము, వేట, మద్యపానము, వాక్పారుష్యము, ఘోరదండనము, అర్థదూషణము నను నివి సప్తవ్యసనంబులు. పితార్జితం బగుధనము నంతయు నాశనము సేయుట యర్థదూషణ మనబడును. ఇంద్రియజయత్వ మావశ్యకమనుటకు కామందకుఁడు:— జితేంద్రియుడును, నీతిమార్గగామియు

[illegible]త్వా సుహృద స్తస్య రామస్య ప్రియకారిణః,
[illegible]రికాః శీఘ్ర మభ్యేత్య కౌసల్యాయై న్యవేదయన్. ౧౦
*సా హిరణ్యం చ గాశ్చైవ ప్రియాఖ్యేభ్యో దదౌ ముదా.౧౦౪

---

జయస్యావశ్యకత్వే కామందకః, "జితేంద్రియస్య నృపతే ర్నీతిమార్గానుసారిణః, భవం త్యుజ్జ్వలతా లక్ష్మ్యః కీర్తయ శ్చ నభస్పృశః. సజ్జమానో హ్యకార్యేషు విమధీ ర్వ్యాకృతే క్షణః, ఆవహ త్యగ్రిభయదాం స్వయమే వాపదం నృపః. శబ్ద స్స్పర్శశ్చ రూపం చ రసో గంధశ్చ పంచమః, ఏకైక మల మేతేషాం వినాశప్రతిపత్తయే. శుచిశష్పాంకురాహారో విదూరక్రమణక్షమః, లుబ్ధకోద్గీతలోభేన మృగో మృగపతే ర్వధమ్. గిరీంద్రశిఖరాకారో లీలయోన్మీలితద్రుమః, కరిణీస్పర్శసమ్మోహా దాలానం యాతి వారణః. స్నిగ్ధదీప శిఖాలోకవిలోభితవిలోచనః, మృత్యు మృచ్ఛతి సమ్మోహా త్పతంగ స్సహసా పతన్. దూరేపి హి భవన్ దృష్టే రగాధే సలిలే చరన్, మీన స్తు సామిషం లోహ మాస్వాద యతి మృత్యవే. గంధలుబ్ధో మధుకరో దానాసవపిపా సయా, అభ్యేత్య సుఖసంచారాన్ గజకర్ణఝల్లరీన్' ఇతి.

*సా హిరణ్య మితి:—నను స్త్రియాః దానాభావా త్కథం దానేఽధికార ఇతిచే దుచ్యతే. అత్ర కార్యా

౧౦. ప్రియ కరుండగు నా శ్రీరాముని స్నేహితు లీ శుభవార్త విని వెంటనే పోయి కౌసల్యకు నివేదించిరి.

౧౦౪. ఆమెయును నా శుభవార్తను దెచ్చినవారికి బంగారంబును, గోవులను * దాన మిచ్చెను.

---

నైన రాజునకు, మహాప్రీతియు, గొప్పసిరులును, నాకసంబంధు కీర్తియుగూడ గలుగును. విసపుబుద్ధియై, విసపుజూపులు గలవాడై, యకార్యంబుల బ్రవర్తిల్లు నేని, అతడు స్వయముగానే భయంకరం బగు నాపదను గోరి తెచ్చుకొనుచున్నాడు. శబ్దస్పర్శరూపరసగంధంబు లైదింటిలో నే యొకటియున్నను సర్వనాశన మగును. అట్టిచో నైదును నున్నచో జెప్పనక్కెమి ? 'రుచ్యంబగు లేగసవు నాహారముగా గల్గి యొంతదవ్వైనను దుప్రిటికాలములో నేగు మృగమును (చుప్పి) కిరాతుం డొనరుచు గానంబుచే బ్రలోభింపబడి యసువుం గోల్పోవుచున్నది. (ఇట్లు శబ్దముచే గల్గునాశనము చెప్పబడినది.) పర్వతసన్నిభంబగు నాకారము గల్గి, పెద్దమ్రాకులను సైతము నతిసులువుగ, మూలముట్టుగ బెకలించు మదపుటేనుంగును, ఆడేనుగు స్పర్శ సోకినంతనే మోహంపుటురులం జిక్కి కట్టుగంబమున గట్టుపడుచున్నది. (ఇది స్పర్శముచే గలుగునది). తలతల లాడు దివ్వె వెలుంగుం గాంచి యారూపంబునకు తహతహ పుట్టిన మిడుత తటాలున వచ్చి దానిలో బడి మడియుచున్నది. (ఇది రూపంబున గల్గు నుపద్రవము) ఎంతయో లోతునీటిలో దిరుగాడుచు, నెంతయో దూరంబున నున్న యెరను రసనాచాపల్యముచే మ్రింగి మీనము మిత్తిపా లగుచున్నది. (ఇది రసోపద్రవము) గండేంద్రుని గండస్థలంబుల వెల్వడు మదజలగంధము ననుభవించు తలంపున నేగి తుమ్మెద యయ్యేనుగు చెవులతాకుడుం గాంచి దిమ్మరవోవుచున్నది. (ఇది గంధోపద్రవము) గాన నివి కూడ వనిభావము.

* దానముచేసె ననుచోట:—స్త్రీలకు దానముసేయు నధికారమే లేనప్పుడు కౌసల్య దాన మెట్లు చేసెనని ప్రశ్నింపరాదు. దానికి

అథాభివాద్య రాజానం రథ మారుహ్య రాఘవః,
యయౌ స్వం ద్యుతిమ ద్వేశ్మ జనౌఘైః ప్రతిపూజితః. ౧౧౪

అథాంతర్గృహ మావిశ్య రాజా దశరథ స్తదా
సూత మామంత్రయామాస రామం పున రిహానయ. ౧౨౪

[2]సోఽపి గత్వాఽఽనయామాస రామం రాజాఽపి సాదరం,
ఉవాచేదం వచో రాజా రామం రహసి ప్రీమతః. ౧౩౪

[3]రామ వృద్ధోఽస్మి దీర్ఘాయు ర్భుక్తా భోగా మయేప్సితాః,
అద్య ప్రకృతయ స్సర్వా స్త్వా మిచ్ఛంతి నరాధిపం, ౧౪౪
అత స్త్వాం యువరాజాన మభిషేచ్యామి పుత్త్రక. ౧౫

యనః:—'వివాహకాలే య స్త్రీభ్యో దీయతే హ్యగ్ని సన్నిధౌ, త దధ్యగ్ని స్మృతం సద్భిః స్త్రీధనం పరికీర్తితమ్. యత్పున ర్లభతే నారీ నీయమానా హి పైతృకాత్, అధ్యావహానికం నామ స్త్రీధనం పరికీర్తితమ్.' ఇతి. స్త్రియాః ధనస్వామిత్వాభావవచనం తు భర్తృకులే సాధారణద్రవ్యపర మేవ. తథాచ స ఏ వాహ:— 'న నిర్హారం స్త్రియః కుర్యుః కుటుంబా ద్బహుమధ్యగాత్, స్వకాదపిచ విత్తాద్ది స్వస్య భర్తు రనాజ్ఞయా.' ఏవం స్త్రియాఅపి ధన సత్త్వా త్కౌసల్యయా దత్తభర్త్రాజ్ఞయా కృతం ప్రీతిదానం యుక్తమేవ.

1 వాల్మీ. రా: సర్గ ౪; 2 కవి; 3 వాల్మీ. రా: సర్గ ౪.

౧౧౫. అంత శ్రీరాముండును దండ్రికి బ్రణతుండై అచ్చటి జనంబులు జేజేలు వెట్టుచుండ నరదం బెక్కి కాంతిమంతం బగు స్వగృహంబునకు బోయెను.

౧౨౫. అంత దశరథుం డంతఃపురంబు బ్రవేశించి రాము నటకు దోడి తెమ్మని సుమంత్రుని మరల బంపెను.

౧౩౫. అతడును బోయి రాము నటకు తీసుకొనివచ్చెను. ఆ శ్రీరామునితో రహస్యముగా బ్రేమ మచ్చువడ రా జిట్లనియె.

౧౪౫-౧౬. శ్రీరామచంద్రా! నేను మిక్కిలి వయసు జెల్లిన ముసలివాడనైతిని. భోగంబు లవ్వారిగ ననుభవించితిని. అదిగాక సమస్తప్రకృతులును నిన్నే రాజుగా వలచుచున్నవి. కావున నిన్ను యువరాజుగా జేయనిశ్చయించితిని.

---

కాత్యాయను డిట్లు చెప్పుచున్నాడు: 'వివాహకాలమం దగ్నిసన్నిధానంబున స్త్రీల కేమేమి యియ్యబడునో యయ్యది అధ్యగ్ని నాబరగును. అది స్త్రీధనము. పుట్టినింటినుండి కాపురమునకై కొంపోబడునాడు పడుచున కేమేమి యొసంగబడునో అది అధ్యావహనిక మనబడును. అయ్యదియు స్త్రీధనమే' మఱి స్త్రీలకు ధనము గలిగియుండు నధికారమే లేదని చెప్పు ధర్మము, భర్తృగృహమునందలి సాధారణద్రవ్యపరము. ఈ విషయము కాత్యాయనుడే యిట్లు చెప్పుచున్నాడు: 'భర్తృకుటుంబద్రవ్యము నుండి స్త్రీ గడ్డిపోచ యైనను ముట్టరాదు. తన సొంతవిత్తమునుండి కూడ పతియాజ్ఞ లేకయే యేమియు వెచ్చింపరాదు.' ఇట్లు విధింపంబడుటజేసి స్త్రీలకు ధనస్వామిత్వ మున్నట్లును, భర్తయాజ్ఞ గైకొని స్వంతధనంబును వెచ్చించు నధికార మున్నట్లును తేలుచున్నది. కావుననే కౌసల్య యదివరలోనే భర్త్రనుజ్ఞ నొంది యిట్లు గోదానాదికం బొనరించె నని యెఱుంగునది.

అపి చా ద్యాశుభా న్రామ స్వప్నే పశ్యామి దారుణాన్,
సనిర్ఘాతా దివోల్కా చ పతతీహ మహాస్వనా. ౧౬

అవష్టబ్ధం చ మే రామ నక్షత్రం దారుణై ర్గ్రహైః,
ఆవేదయంతి దైవజ్ఞాః సూర్యాంగారకరాహుభిః. ౧౭

ప్రాయేణ హి నిమిత్తానా మీదృశానాం సముద్భవే,
రాజా హి మృత్యు మాప్నోతి ఘోరాం వాపద మృచ్ఛతి. ౧౮

[1]ఆసప్తరాత్రపర్యంత మితి హోవాచ మే గురుః. ౧౮½

[2]తద్యావదేవ మే చేతో న విముంచతి రాఘవ,
తావదే వాభిషించస్వ చలా హి ప్రాణినాం మతిః. ౧౯½

భవంతి బహువిఘ్నాని కార్యా ణ్యేవంవిధాని హి ౨౦

విప్రోషితశ్చ భరతో యావదేవ పురాదితః
తావదేవాభిషేక స్తే ప్రాప్తకాలో మతో మమ. ౨౧

---

•'విప్రోషిత ఇతి:— కేకయాధిపతిః స్వసుతాయాః కైకేయ్యాః పరిణయావసరే తజ్జ్యేష్ఠపుత్రస్య రాజ్యప్రదాతురే వాహం దాస్యామీతి ప్రతిజ్ఞాతవాన్, తథైవ ప్రతిజ్ఞాయ దశరథ స్తాం పరిణీతవా నితీయం కథా బహుగ్రంథేషు దార్వ్యాస వాశిష్ఠరామాయణాదిగ్రంథేషు ప్రసిద్ధతయా శ్రూ

1 ఆగ స్త్యరామా. 2 వాల్మీకి రా: సర్గ ౪.

౧౬–౧౭. అదిగాక ఘోరంబులగు నశుభంబు లెన్నియో నాకు స్వప్నంబున గానుపించుచున్నవి, అతిశబ్దసమన్వితంబయి పిడుగుతోడియుల్క కూడ రాలుచున్నది. నానక్షత్రంబును సూర్యాంగారక రాహువులాది గాగల దారుణగ్రహంబు లాక్రమించి యున్నవని జ్యోతిష్కులు చెప్పుచున్నారు.

౧౮. ఈలాటి మహోత్పాతంబు లుద్భవిల్లినప్పుడు ప్రాయికంబుగ రాజు మృత్యువువాతనైన బడును, ఘోరాపదలపాలైన నగును.

౧౮½. అదియును సప్తరాత్రములలోనే యని మద్గురుపాదులు సెలవిచ్చిరి.

౧౯½. కాన నామనం బింకొకతెన్నున జనకమునుపే పట్టాభిషేచనమును బొందుము. జీవుల మతు లతిచంచలములుగదా!

౨౦. అదిగాక యీలాటికార్యంబుల కెప్పుడును విఘ్నంబు లెక్కుడుగా గల్గును.

౨౧. ♦ దేశాంతరము బోయియున్న భరతుండు మఱలి పురంబునకు రాక మునుపే నీ వభిషేకింపబడుట నామతము.

---

♦ దేశాంతరము:—కేకయాధిపతి తనకూఁతురగు కైకేయికి వివాహం బొనరించునప్పుడు, ఆమెకు గలిగిన జ్యేష్ఠపుత్రునికి రాజ్యాభిషేకము సేయువానికే నామెను బరిణయంబు చేతునని ప్రతిజ్ఞ చేసెనట! దశరథుండటులనే ప్రతిజ్ఞచేసి యామెను వివాహమాడెను. ఈగాథ దౌర్వాస వాశిష్ఠాది రామాయణంబుల బ్రసిద్ధిగా వెలయుచున్నది. వాల్మీకీయంబునను, నయోధ్యాకాండము నూటయేడవసర్గమందలి యీ క్రిందిశ్లోకంబునను సంగ్రహముగ శ్రీరామునిచే నిట్లు చెప్పంబడినది

ఇత్యుక్త స్సోఽభ్యనుజ్ఞాత శ్శ్వో భావి న్యభిషేచనే
వ్రజేతి రామః పితర మభివా ద్యాభ్యయా ద్గృహమ్. ౨౨

---

యతే. శ్రీమద్వాల్మీకిరామాయణేఽపి అయోధ్యాకాండే ౧౦౭. సర్గే అయ మర్థస్సంగ్రహేణ శ్రీరామేణ ప్రతిపాదితః. తథాహి 'పురా భ్రాతః పితా నస్స మాతరం తే సముద్వహన్, మాతామహే సమాశ్రౌషీ ద్రాజ్యశుల్క మనుత్తమం.' ఏవం చేత్ నిఖిలశాస్త్రవిరుద్ధా మిమాం చోరవృత్తి మంగీకుర్వాణో దశరథః ఉద్వాహకాలే కైకేయీపుత్త్రాయ ప్రతిశ్రుతం రాజ్యం కథం రామాయ దాతు ముద్యుక్తవా నితిచేచ్ఛృణు - శ్రీమహాభారతే:—'ఉద్వాహకాలే రతిసంప్రయోగే ప్రాణాత్యయే సర్వధనాపహారే, విప్రస్య చార్థే హ్యనృతం వదేయుః పంచానృతా న్యాహు రపాతకాని' ఇతి న్యాయేన దోషాభావం హృది నిధాయ తథా కృతవా నిత్యదోషః. మను రపి:—'కామినీషు వివాహేషు గవాంభక్తే తథేంధనే, బ్రాహ్మణస్య విపత్తౌ చ శపథే నాస్తి పాతకమ్' ఇతి. అతఏవాగ్రే భరతరాజ్యాభిషేకోపాయం వదన్త్యా కుబ్జయా వివాహకాలీనప్రతిజ్ఞాయా అసత్యత్వ మాశంకమానయా యుద్ధకాలే ప్రతిశ్రుతవరద్వయేనైవ రాజ్యం ప్రార్థయ స్వేత్యభిహితా కైకేయీ వరద్వయమేవ ప్రార్థయతి. అయ మేవార్థః ఉమాసంహితాయాం సప్తమాధ్యాయే పార్వతీం ప్రతి మహేశ్వరేణ సమ్యగుపదిష్టః. పార్వతీ:— రాజ్ఞో దశరథ స్యాస్య మృషావాదిత్వ మాగతం, ప్రతిజ్ఞోల్లంఘనం యస్మాత్కృతం

౨౨. మఱుసటిదినమున గాఁబోవు నభిషేకము విషయమున నాదశరథుం డిట్లాడినతోడనే శ్రీరాముం డాతనికి బ్రణమించి గృహమునకు బోయెను.

---

'తమ్ముఁడా! మనతండ్రి నీ తల్లిని బెండ్లియాడునపు డాతని యుత్కృష్టరాజ్యంబునే యుంకువగా నుంతు నని మన తాతగారితో చెప్పినాడు.' ఇది యిట్లుండ నిఖిలశాస్త్ర నిషిద్ధం బగు నీచోరవృత్తి దశరథుఁ డెట్లంగీకరించెను? అంగీకరించి వివాహకాలంబున గైకేయీపుత్రుని కిత్తునన్న రాజ్యమును శ్రీరామున కట్లిచ్చుటకు సంసిద్ధుఁ డయ్యెను? ఇట్లుగ బ్రశ్నించినచో సమాధానము మహాభారతంబున నిట్లు చెప్పంబడినది. 'వివాహకాలమునందును, రతికాలమందును. ప్రాణాపాయసమయంబునను, సర్వధననాశనకాలంబునందును, విప్రుని సంరక్షించుపట్టునను నాడిన యసత్యంబున బాతకము వొరయదు.' కాన నీభావంబును మనంబున నిడియే యాదశరథుఁ డట్లు చేసెను. దీన నాతనికి దోస మంటదు. దీనికి ప్రోద్బలంబుగ మనువును 'స్త్రీవిషయంబునను, వివాహంబులలోను, గోబ్రాహ్మణధనంబులకు విపత్తులు వొడమినపుడును, ఆడినమాట పొల్లువోయినను దోషము లేదు' అని చెప్పెను. కనుకనే భరతున కభిషేక మగు నుపాయముం దెల్పునపుడు వివాహకాలంబున జేసిన ప్రతిజ్ఞకు భంగము గలిగినను దశరథునకు దోస మంటదని, ఆతడు శంబరాసురయుద్ధమం దిచ్చిన వరద్వయంబుచేతనే భరతున కభిషేకము గావింపు మని నీభర్తను గోరుమని మంథర కైకేయికి తెరవు దెల్పినది. ఈవిషయమే ఉమాసంహితలో శ్రీ శంకరునకును, పార్వతీదేవికిని బొసగిన సంవాదమున నిట్లు గాననగును.

పార్వతి:— కైకేయిని బరిణయం బగుటకు బూర్వము దశరథుడు కేకయరాజుతో జేసిన ప్రతిన నెరవేర్చుకొనలేకపోయెను. కాన నత డబద్ధమాడినవా డయ్యెను.

[1]అథ రాజా దశరథః కదాచి ద్రహసి స్థితః,
వశిష్ఠం స్వకులాచార్య మాహూయేద మభాషత, ౨౩
సంభారా స్సంభ్రియన్తాం చ గచ్ఛ మంత్రయ రాఘవం..

ఆహూయ మంత్రిణం రాజా సుమంత్రం మంత్రి సత్తమం,
ఆజ్ఞాపయతి యద్య త్త్వం ముని స్తత్త త్సమానయ. ౨౮౪

యత్కేకయాధిపే, కైకేయ్యా గ్రహణే పూర్వం తదు ద్వాహే వ్యవస్థితౌ. ఈశ్వర ఉవాచ: "వివాహసమయే రాజ్ఞా ప్రతిజ్ఞాత మిదం శృణు, 'పట్టాభిషేకసమయే భవేయం స్మారితో యది, త్వయా వాక్యేన భూపాల వచ్మి సుద్వాక్య మగ్రవై, ప్రజాహితం సమాలోక్య యథా భావ్యం తథా భవేత్.' ఇత్థం ప్రతిజ్ఞా మకరో ద్వివాహగ్రహణే నృపః; తస్మా దస్మి న్నరవ్యాఘ్ర దోషో నాస్తి వరాననే" ఇతి. రామాభిషేకవృత్తాంతం దూతముఖేన కేకయాధిపతేః కథం మనివేదితవా నితిచేత్, వాల్మీకిరామాయణే అయోధ్యాకాండే ౮ సర్గే ప్రయేణేత్యాదినా సప్తదినా దర్వాగేవ రాజా మృత్యు మవాప్నోతీతి వశిష్ఠాదిమునిభి ర్నిర్దిష్టత్వా ద్భరతానయనవర్ణనావసరే శ్రీమద్రామాయణే సిద్ధార్థాదయో దూతాః దినచతుష్టయమాత్ర మధ్వని గత్వా పంచమేఽహని గిరివ్రజపట్టణం గతా ఇతి, అయోధ్యాం ప్రతి ప్రత్యాగమనకాలే 'సప్తరాత్రోషితః పథ' ఇత్యుక్తత్వాచ్చ తావత్కాలో నాస్త్యేవేతి విజ్ఞాయతే.

1. అధ్యా. రా: సర్గ. 2.

౧౩-౧౩౪. అంత నాకానాకనాడు దశరథుడు మంతనంబుండి వశిష్ఠుని రావించి 'రామునితలంపు గమనింపుడు. కావలసిన సంబారంబులు సమకూర్పు' డని చెప్పెను.

౧౮౪. 'అవశిష్ఠ డేమేమి యాజ్ఞాపించునో అయ్యవన్నియు జేకూర్పింపు' మని మంత్రిసత్తముండగు సుమంత్రునిగూడ నట్లే రావించి చెప్పెను.

---

ఈశ్వరుడు:—దేవీ! అట్లుగా దలచుచుంటివా? విను మాతడు వివాహకాలంబున చేసిన ప్రతిజ్ఞ. 'కేకయాధిపా! నీవు తెల్పినది లెస్సగ వింటిని. అట్లే కానిమ్ము. పట్టాభిషేకసమయంబున నాకీ విషయము జ్ఞాపకముసేయుము. ప్రజల కేది హితంబో అయ్యది తప్పకుం డజేయుదును'. కాన దీన నాతనికి బారియుదోషం బేమి? ఏమియు లేదు గదా! ఇత్యాది ప్రమాణంబుల బట్టి దశరథుని కనృతదోషం బంటదు.

అట్లయినచో గేకయరాజునకు దశరథుడు రామాభిషేకవృత్తాంత మేలమలకు గబురంపలేదని మఱియొక ప్రశ్న.

వాల్మీకిరామాయణంబున నాల్గవసర్గములో 'ప్రాయికముగ నిట్టి యుత్పాతంబులు గల్గునప్పుడు రాజు మృత్యువొందును' ఇత్యాద్యర్థ మిచ్చు శ్లోకంబులలో దశరథునకు జీవితావధి యేడుదినంబు లనియు, గేకయునికొఱకై పోయినసిద్ధార్థాదులగు దూతలు నాల్గుదినములు పయనంబుసేసి యైదవదినంబున గిరివ్రజపట్టణంబు సేరి రనియు, మఱి సప్తరాత్రములు త్రోవనే గడచిన వనియు గదా చెప్పబడినది. అట్టిచో గేకయునకు వర్తమాన మంపి పిలిపించుటకు వ్యవధి చాలదు గాన పైప్రశ్న కవకాశంబు లేదని గ్రహింపవలెను.

తథేతి వార్త్వా త్స మునిం కింకరో మిత్యభాషత. ౨౫

త మువాచ మహాతేజా వశిష్ఠో జ్ఞానినాం వరః.

శ్వః ప్రభాతే మధ్యకక్ష్యే కన్యకా స్స్వర్ణభూషితాః,
తిష్ఠంతు షోడశ గజా స్స్వర్ణరత్నాదిభూషితాః. ౨౬½
చతుర్దంతా స్సమాయాతు ఐరావతకులోద్భవాః,
హిరణ్యశృంగ మృషభం సమగ్రం వ్యాఘ్రచర్మ చ. ౨౭½
నానాతీర్థోదకైః పూర్ణా స్స్వర్ణకుంభా స్సహస్రశః,
శ్వేతచ్ఛత్రం రత్నదండం ముక్తామణివిరాజితం. ౨౮½
దివ్యమాల్యాని వస్త్రాణి దివ్యా న్యాభరణాని చ,
హస్త్యశ్వరథపాదాతా బహి స్తిష్ఠంతు సాయుధాః. ౨౯½
నగరే యాని తిష్ఠంతి దేవతాయతనాని చ,
తేషు ప్రవర్తతాం పూజా నానాబలిభి రావృతా. 30½

ఇత్యాదిశ్య ముని శ్శ్రీమాన్ సుమంత్రం నృపమంత్రిణం,
స్వయం జగామ భవనం రాఘవ స్యాతిశోభనం. 3౧½

అంతః ప్రవిశ్య భవన మాచార్య స్త్వా దవారితః. 3౨

గురుమాగత మాజ్ఞాయ రామ స్తూర్ణం కృతాంజలిః,
ప్రత్యుద్గమ్య నమస్కృత్య దండవద్భక్తిసంయుతః. 33

స్వర్ణపాత్రేణ పానీయ మానినా యాశు జానకీ,
రత్నాసనే సమావేశ్య పాదౌ ప్రక్షాళ్య భక్తితః. 3౪

౨౫. ఆతడును, 'స్వామీ! వశిష్ఠమహర్షి! తమకింకరుడిట వేచియున్నాడు. సెలవిండు చేయవలసినపని' యనెను.

౨౫½. జ్ఞానినామగ్రగణ్యుండగు నవ్వశిష్ఠుండును నిట్లనియె,

౨౬½-౨౭½-౨౮½-౨౯½-౩౦½. 'రేపు తెలతెలవేగుసరికి మధ్యకక్ష్యంబున స్వర్ణాలంకారభూషితలగు కన్యలు పదునార్గురును, రత్నాలంకారరాజితంబులగు నన్నియగజంబులు సిద్ధముగా నుండవలెను. ఐరావతకులంబున బుట్టిన చౌదంతియు రావలెను. జాంబూనదబద్ధశృంగంబగు పుంగవంబును సమగ్రమగువ్యాఘ్రచర్మంబును గావలెను. నానాతీర్థసమానీతజలపూరితకనకకలశంబులును బెక్కులు వలయును. ముక్తామణివిరాజితంబై రత్నదండచిత్రితంబగు శ్వేతచ్ఛత్రంబును సిద్ధపఱుపవలెను. అట్లుగ దివ్యమాల్యవస్త్రాభరణంబులును సమకూరుపవలెను. గజతురంగాదిచతురంగంబులును దమతమ యాయుధపరికరంబులతోడ నాయత్తమైయుండవలెను. నగరంబునంగల దేవళంబుల నెల్ల వివిధబలిపూజలు జరుగవలెను.

౩౧½. ఇట్లుగ నన్నియు సిద్ధముసేయింపుమని సుమంత్రునితో జెప్పి వశిష్ఠుండు శుభాకరంబగు శ్రీరామునిగేహంబునకు జనెను.

౩౨. ఐక్ష్వాకుల కాచార్యుం డగుట నాతని నెవ్వరు నడ్డగింపలేదు.

౩౩-౩౪-౩౫. గురుపాదులు వచ్చుట దెలిసి శ్రీరాముడు కృతాంజలియై ససంభ్రమంబుగ నెదురేగి దండవత్ప్రణామం బాచరించెను. జానకియు బంగరుగిండి నుదకంబులు దేర నవ్వశిష్ఠు రత్నాసనాసీనుం గావించి పాదంబులు గడిగి భక్తి యుప్పార సీతతోసహా తజ్జలం

తదప శ్శిరసా ధృత్వా సీతయా సహ రాఘవః,
ధన్యోస్మీ త్యబ్రవీ ద్రామ స్తవ పాదాంబుధారణాత్. ౩౫
శ్రీరామే ణైవ ముక్త స్తం ప్రహస న్ముని రబ్రవీత్. ౩[illegible]
త్వత్పాదసలిలం ధృత్వా ధన్యోఽభూ ద్గిరిజాపతిః. ౩౬
బ్రహ్మాపి మత్పితా తే హి పాదతీర్థహతాశుభః,
ఇదానీం భాషసే యత్త్వం లోకానా ముపదేశకృత్ ౩౭
జానామి త్వాం పరాత్మానం లక్ష్మ్యా సంజాత మీశ్వరమ్,
దేవకార్యార్థసిద్ధ్యర్థం భక్తానాం భక్తిసిద్ధయే,
రావణస్య వధార్థాయ జాతం జానామి రాఘవ. ౩౮½
తథాపి దేవకార్యార్థం గుహ్యం నోద్ఘాటయా మ్యహం ౩౯

యదా త్వం మాయయా సర్వం కరోషి రఘునందన,
తథైవానువిధాస్యేఽహం శిష్య స్త్వం గురు రిత్యహం. ౪౦

గురు ర్గురూణాం త్వం దేవ పితౄణాం త్వం పితామహః,
మనుష్య ఇవలోకేఽస్మిన్ భాసి త్వం యోగమాయయా ౪౧

పౌరోహిత్య మహం జానే విగర్హ్యం దూష్యజీవనం. ౪౧½
ఇక్ష్వాకూణాం కులే రామః పరమాత్మా జనిష్యతి,
ఇతిజ్ఞాతం మయా పూర్వం బ్రహ్మణా కథితం పురా. ౪౨½

బులు శిరసావహించి 'తమ పాదజలంబులు ధరించి ధన్యుడనైతి'
ననెను.

౩౫. శ్రీరామునం డిట్లనుటతోడనే వశిష్ఠుడు ఇకఇక నగుచు నిట్లనియె.

౩౬-౩౭-౩౮. శ్రీరామా! నీ పాదపవిత్రజలంబులు దాల్చి పార్వతీపతి ధన్యుండయ్యె. నా తండ్రియగు బ్రహ్మయు సమస్తకిల్బిషంబుల నడంచెను. ఇట్టి నీవు లోకముల కుపదేశకర్తవై యీ విధంబుగ బలుకుచుంటివి. భక్తుల ననుగ్రహించుకొఱకును, రావణవధంబుజేసి దేవతల గరుణించుకొఱకును లక్ష్మిసహితంబుగ నవతరించిన పరమేశ్వరుండ వీవ యని యెఱుంగుదు.

౩౯. అయినను దేవహితం బుపలక్షించి యీ రహస్యము బయల్వెట్టను లెమ్ము.

౪౦. రఘునందనా! సర్వంబును నీ వెటుల మాయోపగూహితంబు గావించుచుంటివో దాని కనురూపంబుగనే నీవే శిష్యుడవు నేనే గురువుగ మెలంగెదను.

౪౧. దేవా! నీవు గురువులకు గురువవు, పితరులకు బితామహుండవు. అయినను నీ వీలోకంబున మానుషజన్మం బెత్తి యోగమాయచే నిట్లు విరాజిల్లు చుంటివి.

౪౧½. పౌరోహిత్యజీవనము దూష్యంబనియు గర్హ్యంబనియు నెఱుంగుదును.

౪౨½. కాని యిక్ష్వాకువంశంబున బరమాత్ముండు శ్రీరాముండై యవతరించునని బ్రహ్మదేవుం డెన్నడో చెప్పుటంజేసి నా కీవిషయ మిది వరలోనే తెలియును.

తతో౽హ మాశయా రామ తవసంబంధకాంక్షయా,
అకార్షం గర్హిత మపి తవాచార్యత్వసిద్ధయే. ౪౩½
తతో మనోరథో మే౽ద్య ఫలితో రఘునందన. ౪౪

త్వదధీనా మహామాయా సర్వలోకైకమోహినీ,
మాం యథా మోహయే న్నైవ తథా కురు రఘూద్వహ. ౪౫

ప్రసంగా త్సర్వ మప్యుక్తం నవాచ్యం కుత్రచిన్మయా ౪౫½

రాజ్ఞా దశరథేనాహం ప్రేషితోస్మి రఘూద్వహ,
త్వా మామంత్రయితుం రాజ్యే శ్వో౽భిషేక్ష్యతి రాఘవ. ౪౬½

అద్య త్వం సీతయా సార్ధ ముపవాసం యథావిధి
కృత్వా శుచి ర్భూమిశాయీ భవ రామజితేంద్రియః ౪౭½

1 *ఇత్యుక్త్వా స తథా రామ ముపవాసం యతవ్రతం,
మంత్రవత్కారయామాస వైదేహ్యాసహితం మునిః. ౪౮½
అభ్యనుజ్ఞాప్య కాకుత్స్థం యయౌ రామనివేశనాత్. ౪౯

ఇతీతి:—అనేన రాజ్యాభిషేకా త్పూర్వదినే విహితం కర్మజాతం కారిత మిత్యుక్తం. అతోభిషేకా త్పూర్వదిన కృత్య మాహ బోధాయనః - సూ. "అథాతో రాజ్యాభిషేకవిధిం వ్యాఖ్యాస్యామః : పూర్వపక్షస్య పంచమ్యాం

1. వాల్మీ. రా: స ౫.

౪౩½. కనుకనే నీ సంబంధ మపేక్షించి నీ గురువు ననిపించుకొన్న జాలునను నాసతో గర్వంబైనను నీ వృత్తిని విడనాడనైతిని.

౪౪. రఘునందనా! ఇప్పటికి నామనోరథము సిద్ధించినది.

౪౫. రఘువరా! సర్వలోకైకసమ్మోహిని యగు మహామాయ నీయధీన. నన్ను దానిబారి బడకుండమాత్రము చేయుము.

౪౫½. ప్రసంగవశమున నింతయుం జెప్పవైచితిని. మఱెచ్చటను గాని నే నిటులాడరాదు.

౪౬½, ప్రభో! రేపే యౌవరాజ్యమున నభిషేకింపదలచి నిన్నామంత్రించుటకై దశరథుడు నన్నంపినాడు.

౪౭½. ఇప్పుడు నీవు జానకీసహితుడవై యథావిధిగ నుపవసింపుము. శుచివై నియతమానసుడవై భూశయనంబున బవళింపుము.

౪౮½-౪౯. * ఇట్లంతయు శ్రీరామునకు జెప్పి సీతాసహితంబుగ నియతుండగు నా శ్రీరాముని మంత్రవిధిగ నుపవాసంబు సేయించి, తన్ను సాగనంపవచ్చుచున్న నాతనితో నుండు మనిచెప్పి యాతనిభవనము నుండి వెడలెను.

---

* ఇతి అను శ్లోకవివరణము:—ఈశ్లోకమందు రాజ్యాభిషేకమునకు బూర్వదినంబున జేయవలసిన కర్మకాండ మెల్ల జేయబడెనని చెప్పబడెను. అభిషేకమునకు బూర్వదినంబున గావింపవలసినకృత్యములు బోధాయను లిట్లు చెప్పిరి. 'ఇంతట రాజ్యాభిషేకవిధి వ్యాఖ్యానము సేయుచుంటిమి. శుక్లపక్షంబున బంచమినాడుగాని, త్రయోదశినాడుగాని, పుష్యమీ శ్రవణా నక్షత్రములుగాని మఱి

గతే పురోహితే రాజా స్నాతో నియతమానసః
సహపత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్. ౫౦

త్రయోదశ్యాం ... శ్రోణాయాం వా యాని చాన్యాని శుభనక్షత్రాణి ... పూర్వేద్యు రేవ యుగ్మాన్బ్రాహ్మణాన్ భోజయేత్. ఆశీ... ...చయిత్వా యోనిగోత్రశ్రుతవృత్త సంపన్నం బ్రాహ్మ... పురోహితం వృణీత. "ఆకూత్యై త్వా కామయత్వా ... సమృధే త్వే"తి పురోహితో జపతి. అథాస్తమిత ఆదిత్యే ... ప్రాగ్దక్షిణాంకృతిం మంటపం కృత్వా ఉపకల్పయతే. వ్రీహి ... స్తిలమాషైః పంచగవ్యస్సాముద్రా శ్చాపో నద్యా ... ంబరం భద్రాసనం వ్యాఘ్రచర్మ హేమ కలశై ర్గ... శ్చ సంభృత్య 'సహ సాదయతి యత్సహ సర్వా... ...న పాణీ' త్యేతస్మా ద్బ్రాహ్మణా దుత్తరపూర్వదేశే ...స్య పాకయజ్ఞవిధానేన వ్రీహిభి ర్యవతిలమాషై ... ర్వ్యాహృతిభిః సావిత్ర్యాచ త్ర్యంబకే నాష్టసహస్రం జుహ... దక్షిణాగ్నే శ్రీసూక్తవిధానేన శ్రీదేవీ మారాధ్య ...టం ప్రక్షాళయతి, గాయత్ర్యాగృహ్య గోమూత్రం, గం... ...రా మితిగోమయం, ఆప్యాయస్వేతి క్షీరం, దధిక్రావ్ ... దధి, శుక్రమసీ త్యాజ్యం, దేవస్య త్వేతి కుశోదకం ... ...కుటం ప్రక్షాళ్య ప్రతిసరం బధ్నాతి. 'ప్రత తే అద్య తిష్... ...' రాజానం రాజవాహనం చాభి షించే దేతాం రాత్రి ముపవిశే త్సంవిశేద్వా ఇతి.

౫౦. వశిష్ఠుం డట్లు తనను వీడి చనినతోడనే శ్రీరాముడు స్నాతుండై నిశ్చలచిత్తుండై భార్యాసహితంబుగ విష్ణు నారాధించెను.

---

యితర శుభనక్షత్రంబులుగాని శుభప్రదంబులు. అట్టి నిర్ణీతశుభ దినంబునకు పూర్వదినంబుననే బ్రాహ్మణదంపతులను భోజనం బిడ వలెను. వారియాశిషంబులు గొని సద్యోని గోత్రసంజాతుండును శ్రుత శీలసంపన్నుండును నగు బ్రాహ్మణుని పురోహితునిగ నేర్పఱుచు కొనవలయును. అతడు ఆకూత్యేత్యాది మంత్రంబును జపించవలెను. సూర్యాస్తమయం బైనంతనే పద్మాకారముగ మంటప మొకదానిని రచించి వడ్లు, యవలు, నువ్వులు, మినుములును, గోక్షీరాది పంచ గవ్యంబులును, సువర్ణకలశంబుల సముద్రజలంబులు పుణ్యనదీనద జలంబులును, ఔదుంబరం (మేడికఱ్ఱతో జేయబడినది) బగు భద్రాస నంబును, వ్యాఘ్రచర్మంబును, గోశృంగంబులును సేకరింపవలెను. 'యత్సహసాదయత్' ఇత్యాది బ్రాహ్మణప్రమాణంబునం జేసి గృహంబున కుత్తరపూర్వదేశంబున పాకయజ్ఞవిధానంబుగ వ్రీహి యవ తిల మాషంబులచే సావిత్రిచేతను, త్ర్యంబకముచేతను, నెని మిదివేలయావృత్తులు హోమము సేయవలెను. దక్షిణార్ధ భాగంబున శ్రీ సూక్తవిధానంబున శ్రీదేవి నారాధించి దానిని గ్రహించి, గాయత్రీమంత్రంబుచే గోమూత్రంబునను, గంధద్వారా మను మంత్రంబుచే గోమయంబునను, ఆప్యాయస్వ యను మంత్రం బుచే పాలచేతను, దధిక్రావ్ణ అను మంత్రంబుచే పెరుగుచేతను, శుక్రమసి యనుమంత్రంబుచే నేయిచేతను, దేవస్యత్వ యను మంత్రం బుచే కుశోదకంబుచేతను మకుటంబును గడిగి సరంబులు గట్టి ప్రతతే యను మంత్రంబులచే రాజును, రాజవాహనంబునుగూడ నభిషే కింపవలెను. ఈ రాత్రి యాయభిషేకస్థలమునగాని మఱియొకచోట గాని నివసించి జాగరము సేయవలయును.

1రామోఽపి లక్ష్మణం దృష్ట్వా ప్రహస న్నిద మబ్రవీత్
సౌమిత్రే యౌవరాజ్యే మే శ్వోఽభిషేకో భవిష్యతి. ॥౧
నిమిత్తమాత్రమేవాహం కర్తా భోక్తా త్వమేవ హి
మమ త్వం హి బహిఃప్రాణో నాత్ర కార్యా విచారణా. ॥౨

వశిష్ఠోఽపి నృపం గత్వా కృతం సర్వం న్యవేదయత్. ॥౨౫

2 సుమంత్రోఽపి వశిష్ఠాజ్ఞా త్పురం సర్వ మఘోషయత్. ॥౩
స్వీయాం జరా ముపగతా మవలోక్య రాజా, రామంచ రాజ్య
వహనక్షమ మాకలయ్య, రాజ్యాభిషేకపర మోత్సవమస్య
కర్తుం, వ్యాదిష్టవాన్ పురజనాః కురుత ప్రమోదమ్. ॥౪

తదాఽయోధ్యా పురం సర్వ మేవ మాసీ త్ప్రమోదతః. ॥౪౫
మార్గే మార్గే జాయతే సాధుసంఘ స్సంఘే సంఘే శ్రూ
యతే రామకీర్తిః, కీర్త్యా కీర్త్యా తత్తదాకారవృత్తి ర్వృత్త్యా
వృత్త్యా సచ్చిదానందభావః. ॥॥౫

3రామాభిషేకయుక్తాః కథా శ్చక్రు ర్మిథో జనాః ॥౬
బాలా అపి క్రీడమానా గృహద్వారేషు సంఘశః
రామాభిషవసంయుక్తా శ్చక్రు రేవం మిథః కథాః. ॥౭

---

1 అధ్యా. రా: సర్గ ౨. 2 హను. రా. 3 వాల్మీ. రా: సర్గ ౬.

౫౧. అంతట శ్రీరాముడు లక్ష్మణుని జూచి నగుచు నిట్లనియె. లక్ష్మణా! రేపటిదినమే నా యౌవరాజ్యాభిషేకము.

౫౨. కర్తయును, భోక్తయును నీవ మఱి నేను నిమిత్తమాత్రంబు. నీవు నాబహిఃప్రాణంబవు. దీనికి సందేహము లేదు. విచారింపదగినదియు లేదు.

౫౨½. వశిష్ఠుండును దశరథునొద్దకు బోయి సర్వము నాయత్త మయ్యెనని తెల్పెను.

౫౩. సుమంత్రుండును వశిష్ఠునాజ్ఞఁజేసి పురంబున నిట్లు చాటబంచెను.

౫౪. ఓ పురజనంబులారా! దశరథమహారాజు తనవార్ధకంబును గమనించియు, శ్రీరాముడు సకలరాజ్యభారసంవహనక్షముం డగుట బర్యాలోచించియు నాతనికి యౌవరాజ్యాభిషేకము సేయుటకు నిశ్చయించినాడు. కాన మీ రెల్లరకును సంతోషసమయం బాసన్నమైనది.

౫౪½-౫౫½ అంత నీవార్త వినినతోడనే యయోధ్యాపురవాసుల సంతసమునకు మేర లేదు. ఏ బాటం జూచినను సాధుజనసంఘము లే. ఏ సంఘమున జూచినను శ్రీరామనామసంకీర్తనమే. ఇట్టి సంకీర్తనములఁ దెచ్చట గనినను దన్మయత్వమే. అట్టి తన్మయత్వమం దెక్కడఁబట్టినను సచ్చిదానందభావమే.

౫౬-౫౭. జను లందఱు బరస్పరము శ్రీరాముని పట్టాభిషేక కథలనే చెప్పుకొనుచుండిరి. తమ తమ గేహముల ముంగిళుల బాలురుసైతము తమ యాటపాటలందు నా కథలనే యాడికొనుచు బాడుకొనుచుండిరి. పురజనులు సందుబాజారులసైతము రాత్రివేళ మార్గము

అలంకారం పురస్యైవం కృత్వా తత్పురవాసినః,
పరికాశకరణార్థం చ నిశాగమనశంకయా,
దీపవృక్షాం స్తదా చక్రు రనురథ్యాసు సర్వశః.

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అయోధ్యాకాండే
ద్వితీయ స్సర్గః.

---

## తృతీయ స్సర్గః.

[1]ఏకదా సుఖ మాసీనం రామం స్వాంతః పురా జిరే
సర్వాభరణసంపన్నం రత్నసింహాసనే స్థితం. ౧
నీలోత్పలదళశ్యామం కౌస్తుభాముక్తకంధరం,
సీతయా రత్నదండేన చామరేణాథ వీజితం. ౨

*నారదోఽవతర ద్ద్రష్టు మంబరా ద్యత్ర రాఘవః,
శుద్ధస్ఫటికసంకాశో మహతీవీణయా యుతః 3
అతర్కిత ముపాయాతో నారదో దివ్యదర్శనః. 3½

---

మహతీతి:—సరస్వత్యాః కచ్ఛపీ, నారదస్య మహతీ, తుంబురోస్తు కలావతీ, విశ్వావసో ర్బృహతీతి వీణానామాని. వీణాచ ద్వివిధా శ్రుతివీణా స్వరవీణేతి. అత్ర శ్రుతివీణా ద్వావింశతిశ్రుత్యుపయోగినీ, స్వరవీణాతు సప్తస్వరోపయోగినీ. పునశ్చైకతంత్రీ బ్రహ్మవీణా ద్వితంత్రీ నకులాఖ్యా త్రితంత్రీ జంత్రీనామికా సప్తతంత్రీ చిత్రా నవతంత్రీ విపంచీ,

1. అధ్యా రా:

తన్నగ రోచుటకై యందందు దీపవృక్షంబుల నలంకరించిరి. వారే స్వయముగ పురం బంతయు సింగారించిరి.

ఇది శ్రీరామాయణసారోద్ధారమున అయోధ్యాకాండమునందు ద్వితీయసర్గము.

---

## తృ తీ య స ర్గ ము.

౧-౨. ఒకానొకప్పుడు శ్రీరామచంద్రుడు సమస్తాభరణములను ధరించి యంతఃపురంబున రత్నసింహాసనంబున సుఖంబుండె. నల్లగలువం బోలు మైచాయయు, గౌస్తుభకాంతుల నలరారు పెడదయెడందయు గలిగిన నాతనికి సీతయు సురటిం జేబూని వీచుచుండెను.

3-3౻. * శుద్ధస్ఫటికవిరాజమానదేహుం డగు నారదుండు మహతీవీణాధరుండై శ్రీరాముని జూచునిమిత్తంబున నాకాశంబుననుండి డిగి, దివ్యదర్శనుం డగుట నిరాఘాటముగ శ్రీరాము డున్నచోటికి బోయి నిలిచెను.

---

* మహతి:—సరస్వతీవీణపేరు కచ్ఛపి. అట్లు నారదునివీణ మహతి, తుంబురునివీణ కలావతి, విశ్వావసునివీణ బృహతి, యని యందురు. వీణెలు శ్రుతివీణ యనియు స్వరవీణ యనియు ద్వివిధంబులు. అందు శ్రుతివీణ కిరువదిరెండుసుతులును, స్వరవీణ కేడుస్వరంబులు నుండును. మఱియు నొక్కటే తంత్రియున్నదానిని బ్రహ్మవీణ యనియు, రెండు తంత్రులగలినది నకులం బనియు, మూడుతంత్రు లున్నదానిని జంత్రియనియు, నేడుతంత్రు లున్నదానిని చిత్రయనియు, తొమ్మిది యున్నదానిని విపంచియనియు, పందొమ్మిది

తం దృష్ట్వా సహసోత్థాయ రామః ప్రీత్యా కృతాంజలిః,
ననామ శిరసా భూమౌ సీతయాసహ భక్తిమాన్. ౪౫
ఉవాచ నారదం రామః ప్రీత్యా పరమయా యుతః. ౫

సంసారిణాం మునిశ్రేష్ఠ దుర్లభం తవ దర్శనం,
అస్మాకం విషయాసక్తచేతసాం నితరాం మునే. ౬
అవాప్తం మే పూర్వజన్మకృతపుణ్యమహోదయైః,
సంసారిణాపి హి మునే లభ్యతే సత్సమాగమః. ౭
అతస్త్వద్దర్శనాదేవ కృతార్థోఽస్మి మునీశ్వర. ౭౫
అథ తం నారదోఽప్యాహ రాఘవం భక్తవత్సలం. ౮
కిం మాం మోహయసే రామ వాక్యైర్లోకానుసారిభిః,
సంసార్యహమితి ప్రోక్తం సత్యమేవ త్వయోదితం. ౯
జగతామాదిభూతా యా సా మాయా గృహిణీ తవ,
త్వత్సన్నికర్షాజ్జాయన్తే తస్యాం బ్రహ్మాదయః ప్రజాః. ౧౦
లోకత్రయమహాగేహే గృహస్థస్త్వముదాహృతః. ౧౦౫
త్వం విష్ణుర్జానకీ లక్ష్మీః శివస్త్వం జానకీ శివా,
బ్రహ్మా త్వం జానకీ వాణీ సూర్యస్త్వం జానకీ ప్రభా. ౧౧౫

---

ఏకోన వింశతితంత్రీ మత్తకోకిలా (స్వరమండలా). అన్యచ్చ కిన్నరీ, పరివాదనీ, నిశ్శంకా, ఇత్యాది వీణాభేదాస్సిద్ధాః. తస్మాద్గాయతే న దేయ మితి వాక్యం నిషిద్ధగాయకపర మితి జ్ఞేయం.

౪౫-౭ ఆ ఋషిపుంగవుం గాంచిన తోడనే శ్రీరాముండు ప్రీతియుతుండై లేచి యంజలిపట్టి సీతాసహితుండై వాగిలి మ్రొక్కి నిలిచి సంతోషంబున నిట్లనియె.

౬-౭-౭౫. మునిచంద్రమా! సంసారులకు తమదర్శనము చిక్కుటెంతయో కష్టము. అట్టిచో విషయాసక్తచిత్తుల మగు మాబోంట్లమాట చెప్ప వలెనా? అయినను పూర్వపుణ్యావశంబున సాంసారికులకుగూడ సాధుసమాగము మొక్కొక్కప్పు డొడగూడుచుండును. ఇప్పుడు మీ దర్శనము నాకు లభించినది. ఇక నేం గృతార్థుడ నైతిని.

౮. అంత నారదుండును భక్తవత్సలుండగు నా శ్రీరామునితో నిట్లనెను.

౯-౧౦-౧౦౫. దేవా! ప్రాకృతుండు పలికి నట్లుగ బలికి న న్నేల మోహ పెట్టెదవు? నేను సంసారి నంటివిగదా! అవును. సత్యంబ యాడి తివి. జగంబుల కెల్లను నాదికారణం బగు మాయయే నీగేస్తురాలు. త్వద్యోగంబునంజేసి బ్రహ్మాదిప్రజ లెల్లను నా మెవలన నుపలబ్ధిం జెందుచున్నారు. జగత్త్రయం బను మహాగృహంబునకు నీవ యధి కారివి.

౧౧౫-౧౨౫-౧౩౫-౧౪. నీవు శ్రీమన్నారాయణుండవు, సీత ఆదిలక్ష్మి. నీవు పరమేశ్వరుండవు, ఆమె పరమేశ్వరి. నీవు బ్రహ్మవు, ఆమె

---

యున్నదానిని మత్తకోకిల (స్వరమండల) యనియు నందురు. ఇవి గాక కిన్నరి, పినాకి, పరివాదిని, నిశ్శంక మున్నగు వీణాభేదంబు లెన్నియో కలవు. కాన గాయకుడు దాశార్హుడుగాడను విధివాక్యము నిషిద్ధగాయకపరంబని యెఱుంగునది.

శచీ త్వమేవ పౌలోమీ సీతా స్వాహాఽనలో భవాన్,
రుద్రాణీ జానకీ ప్రోక్తా రుద్ర స్త్వం లోకనాశకృత్, ౧౨

లోకే స్త్రీవాచకం యావ త్తత్సర్వం జానకీ శుభా,
పున్నామవాచకం యావ త్తత్సర్వం త్వం హి రాఘవ. ౧౩½

తస్మా ల్లోకత్రయే దేవ యువాభ్యాం నాస్తి కించన. ౧౪

[1]న తే రూపం న చాకారో నాయుధాని న చాస్పదం,
తథాపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే. ౧౫

ఇషుక్షయా న్నివర్తంతే నాంతరిక్షక్షితిక్షయాత్,
మతిక్షయా న్నివర్తంతే న గోవిందగుణక్షయాత్. ౧౬

[2]త్వత్పాదభక్తియుక్తానాం విజ్ఞానం భవతి క్రమాత్,
తస్మా త్త్వద్భక్తియుక్తా యే ముక్తిభాజ స్త ఏవహి. ౧౭

అహం త్వద్భక్తభక్తానాం తద్భక్తానాం చ కింకరః,
అతో మా మనుగృహ్ణీష్వ మోహయస్వ న మాం ప్రభో. ౧౮

సర్వజ్ఞోఽసి రఘుశ్రేష్ఠ బ్రహ్మణా చోదితోఽస్మ్యహం, ౧౯
శ్రుత్వైత ద్గదితం రామో నారదం ప్రాహ సుస్మితః. ౨౦

---

1 రామోపనిషత్. 2 అధ్యాత్మరా: [illegible]

వాగ్దేవి. నీవు సూర్యుండవు, ఆమె ఛాయాదేవి. నీ విందు్రండవు, ఆమె శచీదేవి. నీ వనలుండవు, ఆమె స్వాహాదేవి. నీవు సర్వ లయకారుండగు రుద్రుండవు, ఆమె రుద్రాణి. ఇంతయేల? లోకం బునం గల్గు స్త్రీవాచకం బంతయు నామె, పురుషవాచకం బంతయు నీవ. కావనే మీకంటె భిన్నంబైనది ముజ్జగంబులను లేదు.

౧౫. శ్రీరామచంద్రా! నీకు రూపంబులేదు. ఆకారంబు మృగ్యంబు. ఆయుధంబు దబ్బఱ, నెలవు పాలిక్కు. అయినను భక్తులకు బురుషా కారంబున గోచరించెదవు.

౧౬. (ధానుష్కులు) బాణములు తగ్గిపోవుటచే వెనుకకు మరలుచుందురు కాని బాణములు ప్రయోగించుట కంతరిక్షావ్యవకాశములేక కాదు. అట్లే లోకమందు జనులు భగవద్గుణవర్ణనవిషయమై బుద్ధికి చాలక వెనుకకుఁ దగ్గవలసినదే కాని గోవిందుని గుణముల యొక్క పర మావధిని చూచికాదు.

౧౭. నీ పాదకమలంబులు గొల్చువారలకు గ్రమంబుగ విజ్ఞానము గల్గును. (అట్టి విజ్ఞాన ముదయింపనిదే ముక్తిలేదు.) కావన నెవరు నీ పాద కంజంబులు సేవింతురో వారే ముక్తినొందువారు.

౧౮-౧౮½. ప్రభూ! నీ భక్తులకు భక్తు లెవరో వారి భక్తులకు గింకరుడను. కావ నన్ను మోహపెట్టక యనుగ్రహింపుము. నీవ సర్వజ్ఞుండవని బ్రహ్మవలన మును వినియుంటిని.

౧౯. ఇది యంతయు విని శ్రీరామచంద్రుడు మందహాసం బొనరించుచు నిట్లనియె.

శృణు నారద మే కించి ద్యద్య తేఽవిదితం క్వచిత్,
ప్రతిజ్ఞాతం చ యత్పూర్వం కరిష్యే త న్న సంశయః, ౧౦
కింతు కాలానురోధేన త త్తత్ప్రారబ్ధసంక్షయాత్,
హరిష్యే సర్వభూభారం క్రమేణాసురమండలం. ౧౧
రావణస్య వినాశార్థం శ్వో గచ్ఛే దండకావనమ్,
చతుర్దశసమా స్తత్ర హ్యుషిత్వా మునివేషధృక్. ౧౨
కిత్రామిషేణ తం దుష్టం సకులం నాశయామ్యహం. ౧౨౫
ఏవం రామే ప్రతిజ్ఞాతే నారదః ప్రముమోద హ,
ప్రదక్షిణత్రయం కృత్వా దండవ త్ప్రణిపత్య తం, ౧౩౫
అనుజ్ఞాతశ్చ రామేణ యయౌ దేవగతిం మునిః. ౧౪
ఏతస్మి న్నంతరే దేవా దైవీం వాణీ మచోదయన్. ౧౪౫
గచ్ఛ దేవి భువో లోకే గురోరాధ్యాయినాం ప్రయత్నతః,
రామాభిషేకవిఘ్నార్థం యతస్వ బ్రహ్మవాక్యతః. ౧౫౫
విఘ్నార్థం నైవ శంకిష్ఠా వాలిరావణయో ర్వధే,
ధామం భవిష్యతి భువ స్సర్వభారామో రఘూద్వహః. ౧౬౫
మంథరాం ప్రవిశస్వాదా కైకేయీం చ తతః పరమ్, ౧౭
విఘ్నే సముత్పన్నే పునరేహి దివం శుభే. ౧౭౫

అధ్యా. రా: స. ౧; ౨. పూర్వ. రా. కా. ౩ అధ్యా. రా: సర్గ

౨౦-౨౧-౨౨-౨౩-౨౪. నారదా! వినుము. నీ వెఱుంగనిది కించిత్తును లేదు. నే నేమమి సేతునని మున్ను వాగ్దానము చేసియుంటినో అయ్యది చేసియే తీరుదును. ఇందులకు సందియము లేదు. కాని దానికి కాలము కలిసిరావలెను. వారి వారి కర్మఫలంబులు పరిపక్వము నొందవలెను. ఎటులను రక్కసగుంపుల జక్కాడి భూభారము నడంచెదను. దశకంఠకంఠవిలుంఠనార్థంబు ఱేపే దండకావనికి బోయెదను. మునివేషధరుండనై పదునాల్గువత్సరంబు లందు గడపెదను. జానకి నెపంబున నాలోకకంటకుని సబాంధవంబుగ నాశమొనరింతును.

౨౫-౨౬. శ్రీరాముం డిట్లు ప్రతిన సేయగానే నారదు డెంతయు సమ్మోద మంది శ్రీరామునికి ముమ్మారు ప్రదక్షిణపూర్వకంబుగ దండప్రణామం బాచరించి యాయనచే ననుజ్ఞాతుండై యాకాశమార్గంబు పట్టి యెటకేని జనియె.

౨౭. ఇంతలో జేజేలు వాగ్దేవి నిట్లు ప్రేరేచిరి.

౨౮-౨౯-౩౦. దేవీ! నీవు భూలోకంబున నయోధ్యకుం బోయి మొదట మంథరను దరువాత గైకేయినిం జెంది బ్రహ్మయాజ్ఞానుసారంబుగ, శ్రీరాముని పట్టాభిషేకంబునకు నీ శక్తికొలందిగ విఘ్నం బాచరింపుము. అట్లాచరించుట పాడియగునా యని శంకింపకుము. శ్రీరాము డడవులకే బోయి వాలిరావణులవధం బొనరించుటచేతనే లోకమున కెక్కుడు మేలు సేకుఱును. పిమ్మట నాతడు సార్వభౌమపదముం గూడ బొందును.

౩౧. అట్లంతరాయం బొనగూడినతోడనే దివికి తిరిగి రమ్ము.

విష్ణునా ప్రేరితో వజ్ర మాదాయాతాడయత్స తాం,
*తేన వజ్రప్రహారేణ కుబ్జాఽభూ న్మంథరా తదా. ౩౫½
విష్ణుకృత్య మిదం జ్ఞాత్వా ప్రతీకార మజానతీ, ౩౬
♦గంధర్వీరూప మాస్థాయ తదా దుందుభినామతః,
బ్రహ్మాణం తోషయిత్వాచ తపసా పరమేణహి. ౩౭
విష్ణు ర్దశరథాపత్యం రామనామ్నా భవిష్యతి,
రామరాజ్యవిఘాతార్థం కైకేయీం ప్రతిబోధ్య చ. ౩౮
ప్రతిక్రియాం కురుష్వైవం విష్ణుం క్రోధపరాయణే. ౩౮½
[1]పాదా గృహీత్వా రామేణ కర్షితా సాఽపరాధతః,
తేన వైరేణ సా రామవనవాసం చ కాంక్షతి. ౩౯½

---

స్వకార్యార్థం కైకేయీం భేదయితుం మంధరా ప్రేషితేతి దేవరహస్యస్య గోప్యతయా తథా నిర్దేశ ఇత్యాహుః.

* తేనేత్యత్ర:—తదేవోక్తం బ్రహ్మాణంప్రతి శ్రీమన్నారాయణేన క్షీరసాగరే పూర్వం:- "గంధర్వీ దుందుభీనామ్నా భూమ్యాం కార్యార్థసిద్ధయే, మంథరాగ్రే భవత్వద్ధా రాజ్యవిఘ్నార్థసిద్ధయే" ఇతి.-ఆనం. రా. సారకాం.సర్గ ౨.

♦ గంధర్వీత్యత్ర:—తదేవ ద్రఢయన్నాహ వాల్మీకి రామాయణే, బాలకాండే - ౨౫ సర్గే, శ్రీరామంప్రతి విశ్వామిత్రః-"శ్రూయతే హి పురా శక్రో విరోచనసుతాంనృప, పృథివీం హంతు మిచ్ఛంతీం మంథరా మభ్యసూదయ" దితి.

---

1 ఆగ్నేయపురాణము: అధ్యా. ౬.

౩౫. కాని విష్ణుప్రేరణముచే సాకుకెంట్రి దమ్మంథరను వజ్రింబుచే త్రియు నది కుబ్జయై పోయెను.

౩౬-౩౭-౩౮-౩౮ ఈకృత్యమువిఘ్ననిదిగానెతింగి ప్రతీకారముయోజించుచు •గంధర్వీరూపంబున దుందుభీనామ్నియై ఘోరతపం బాచరించి బ్రహ్మదేవుని సంతసింపజేసెను. ఆయనయు 'విష్ణువు శ్రీరాముండై దశరథునకు జన్మించును. (అతని సవతితల్లియగు) కైకను బోధజేసి అతని పట్టాభిషేకంబునకు విఘ్న మొనరించి ప్రతిక్రియ చేసికొను మనెను.

౩౯. ఇంతియకాక శ్రీరాముం డామె నొకపుడు శిక్షింపదలచి పాదములు విరుగునట్లు బంతితో కొట్టెనట. ఈ వైర మామెమనంబున నాటి యుండెను. ఇందులకే ఆమె శ్రీరాముని వనవాసం బెప్పుడును కోరుచుండును.

---

నేడ జన్మించినదో తెలియరాదనియు నిర్దేశింపబడినదని రామానుజ వ్యాఖ్యానము.

* ఈవిషయమే శ్రీమన్నారాయణుడు క్షీరసాగరంబున బ్రహ్మతో నిట్లు చెప్పెను:— పట్టాభిషేకవిఘ్నార్థంబును దేవకార్యార్థసిద్ధికొఱకును దుందుభీనామ్నియగు గంధర్వి ముందుగానే భూమిపై దప్పక యవతరించుగాక— ఆనందరా. సారకాం: స ౨

• గంధర్వి యనుచోట:— ఈ విషయమే దృఢీకరించుచు వాల్మీకిరామాయణ బాలకాండములో నిర్వాదియైదవసర్గమం దిట్లు చెప్పబడినది. (విశ్వామిత్రుడు శ్రీరామునితో) 'పూర్వ మింద్రుడు లోకకంటక మగు మంథరానామవిరోచనసుత నుక్కడంచెనని విని యుంటివా.

1పర్యంకస్థాం విశాలాక్షీం కైకేయీ మబ్రవీదిదం ॥౩౯॥
కిం శేషే దుర్భగే మూఢే మహద్భయ ముపస్థితం. ౪౦॥

న జానీషేఽతిసౌందర్యమానినీ మత్తగామిని,
రామస్యానుగ్రహా ద్రాజ్ఞ శ్శ్వోఽభిషేకో భవిష్యతి. ౪౧॥

తచ్ఛ్రుత్వా సహ సోత్థాయ కైకేయీ ప్రియవాదినీ,
తస్యై దివ్యం దదౌ స్వర్ణనూపురం రత్నభూషితం. ౪౨॥

హర్షస్థానే కి మితి మే కథ్యతే భయ మాగతం,
భరతా దధికో రామః ప్రియకృన్మే ప్రియంవదః. ౪౩.
కౌసల్యాం మాం సమం పశ్యన్ సదా శుశ్రూషతే హి మామ్
రామా ద్భయం కి మాపన్నం తవ మూఢే వదస్వ మే. ౪౪॥

2పునర్బ్రవీషి చే జ్జిహ్వాం భిత్వా నిష్కాసయే గృహాత్. ౪౫

తచ్ఛ్రుత్వా విషసాదాథ కుబ్జా కారణవైరిణీ,
సపత్నీకలహే భూయశ్చిత్రకేతో ర్ధ్రువస్య చ. ౪౬
కథా ముదాహృతవతీ కైకేయీప్రత్యయాయ సా. ౪౬॥

3శృణు మద్వచనం దేవి యథార్థం తే మహద్భయం,
త్వాం సదా తోషయన్ రాజా ప్రియవాక్యాని భాషతే. ౪౭॥

1 అధ్యాత్మ రా. సర్గ ౨. 2 మార్క. రా. సారము. 3 అధ్యాత్మ రా. సర్గ ౨.

౪౧౫. శ్రీరాముని పట్టాభిషేకవార్త యుట్లాకుచెవులం బడినతోడనే మంథర కైకేయి యొద్దకేగెను. ఆ యువతియు మృదుతల్పంబున సుఖనిద్ర నందుచుండెను. 'ఓసీ దౌర్భాగ్యురాలా! ఇంకను నిద్రించుచునే యుంటివా? మూఢురాలా! నీ కెంత యాపద వాటిల్లనున్నదో యెఱుగవు.

౪౧౫. నేనే యెంతయో సౌందర్యవతినని - మానవతినని గర్వించుచుందువు. లాభమేమి? దశరథునను గ్రహంబున నేఁపే శ్రీరామునకు నభిషేకము జరుగనున్నది! అది యెఱుగకున్నావు' అనియెను.

౪౨౫. ప్రియవచోనిధానం బగు నా కైకేయియు ద్వరితంబుగ పాన్పు డిగ్గి రతనములు దాపిన కనకంపు టందియ యొకటి యమ్మంథరకు బహుమానం బిచ్చి యిట్లనియెను.

౪౩౫-౪౪౫. మహాసంతోషకరం బగు సమయంబున భయంబని పల్కెదవేలనే మూఢురాలా! భరతునికంటె శ్రీరామునియందే నా కక్కువ మక్కువ. అతం డెప్పుడును నా కప్రియం బొనర్చినదిలేదు. కౌసల్య నొకకంటను నన్నొకకంటను జూచుకొనుచుండును. నాకు శుశ్రూష యొనర్ప నెన్నడును నేమఱడు. అట్టి శ్రీరామునివలన నీ కేమి ముప్పు వాటిల్లినది?

౪౭. ఇట్టిమాటలు మఱి మాటాడితివా నీ నాలుక పీకించి యిల్లు వెడల నడిపించెద.

౪౮-౪౯౫. ఇట్లన మంథరమనస్సు కొంచెము చివుక్కుమనెను. కాని యది సకారణవైర మవలంబించి నా కైకేయికి నమ్మకముగలుగుటకై సవతులకయ్యంబులు జెప్పుచు ధ్రువచిత్రకేతుల కథ లుదాహరించెను.

౪౬౫-౪౭౫. దేవీ! సుంత నావాక్య మాలింపుము. నిజముగానే నీకు గష్ట మాపన్నమైనది. దశరథు డెప్పుడును నీతో దీయగ మాటలాడుచుండును. అందున నీవు మైమరతువు. కాని పనివడినప్పుడుమాత్ర మాత డెప్పుడును గౌసల్యకే కడు గూర్చుచుండును. ఇది మనంబున

కార్యం కరోతి తస్యాస్తు రామమాతుస్సుపుష్కలమ్,
ధన మస్యత స్నిధాయైవ ప్రేషయామాస తే సుతమ్. ౪౭
సుమిత్రాయా స్సమాచీనం భవిష్యతి న సంశయః,
లక్ష్మణో రామ మన్వేతి రాజ్యం సోఽనుభవిష్యతి. ౪౮

భరతో రాఘవస్యాఽగ్రే కింకరో వా భవిష్యతి,
వివాస్యతే వా నగరాత్ప్రేషైర్వా హాస్యతేఽచిరాత్. ౫౦

త్వం తు దాసీవ కౌసల్యాం నిత్యం పరిచరిష్యసి,
తతోపి మరణం శ్రేయో య త్సపత్న్యాః పరాభవః. ౫౧
[1] హృష్టాః ఖలు భవిష్యంతి రామస్య పరమాః స్త్రియః,
అప్రహృష్టా భవిష్యంతి స్నుషా స్తే భరతక్షయే. ౫౨

[2] అతశ్శీఘ్రం యతస్వాద్య భరతస్యాభిషేచనే,
రామస్య వనవాసార్థం వర్షాణి నవపంచ చ. ౫౩
తతో మాతోఽభవేత్పుత్ర స్తవ రాజ్ఞీ భవిష్యసి. ౫౪

ఉపాయం తే ప్రవక్ష్యామి పూర్వ మేవ సునిశ్చితమ్,
స్మృత శ్శ్రుతం మయా పూర్వ మిదానీం స్మృతి మాగతం. ౫౫

---

1 వాల్మీ. రా: సర్గ ౭. 2 అధ్యా. రా: సర్గ ౨.

నిదిరే యిప్పట్టున నీ సుతుని కేకయకు (మేనమామ పట్టణమునకు) బంపినాడు.

౪౯½. సుమిత్రకును గల్గు కొఱత యేమియులేదు. ఏమందువా? లక్ష్మణుం డెప్పుడును శ్రీరాముని కనుగుణంబుగనే వర్తించుచుండును. కాన రాజ్యం బతఁ డనుభవించినట్లే.

౫౦½. మఱి భరతుఁడో! అతఁడు శ్రీరామునకు కింకరుఁడైన నగును, పురంబైన వెడలనడుపబడును – అస లాతని ప్రాణములు తీయకుండ నుండ నిచ్చినచో.

౫౧½. మఱి నీకో? దాసివలె నిత్యము కౌసల్యకు నూడిగము సేయు వ్రాతయే. ఛీ! ఇట్టి సపత్నీపరాభవముకంటె మరణమే మేలు.

౫౨½. శ్రీరాముని బడతిమిన్న (దాసీజనంబు) లంద రిప్పటినుండి కేరింతలు గొట్టుచుండ భరతుని దుస్థితిం గాంచి నీకోడలాదిగా గలవారల మోములు కళావిహీనములై యుండును.

౫౩½-౫౪. కాన పదునాల్గు వత్సరములు శ్రీరాము నడవికి బంపు వెరవు జూడుము. శీఘ్రముగ భరతునికి బట్టాభిషేకమగు ప్రయత్నము చేయుము. అప్పుడు నీకొమరుండు రాజ్యమున స్థిరముగా పాదుకొనిపోవును. నీకుమారుండు రాజ్యమున కధికారి యైనచో నీమాట చెప్పవలసినదే మున్నది? నీవే పాలకురాలవు.

౫౫. దీని కుపాయంబును నేను బూర్వమే యాలోచించి యుంటిని. నీ వెప్పుడో నాతో నొకమాట జెప్పియుంటివి. అది యిప్పుడు నాకు స్మృతికి వచ్చినది.

1 *దత్తం దైవాసురే యుద్ధే రాజ్ఞా దశరథేన వై
వరద్వయం తయో రేకో నవవర్షాణి పంచ చ. ౫౬

జటాధరః ప్రవ్రజనం రామో రాజీవలోచనః,
భరతస్తు ద్వితీయేన యౌవరాజ్యాధిపోఽస్తు తే. ౫౮

*దత్తమితి:— కైకేయీం ప్రతి దశరథవరప్రదాన వివరణముక్తం ఆనందాదిరామాయణేషు. తథాహి: శ్లో॥ దేవానాం దానవానాం చ రాజ్యార్థం విగ్రహోఽభవత్, ఇంద్రేణ యాచితో ధన్వీ సహాయార్థం మహారథః. జగామ సేనయా సార్థం కైకేయ్యా సహ రాఘవః, దిశ మాస్థాయ వై రాజా దక్షిణాం దండకాం ప్రతి. వైజయంత మితిఖ్యాతం పరం యత్ర తిమిధ్వజః, స శంబరఇతిఖ్యాతః శతమాయో మహాసురః. దదౌ శక్రస్య సంగ్రామం దేవసంఘై రనిర్జితః, తత్రాకరో న్మహాయుద్ధం రాజా దశరథ స్తదా. భిన్నాక్షం స్వరథం రాజా నావింద ద్రణసంభ్రమాత్, రాజ్ఞోఽంతికే స్థితా సుభ్రూః కైకేయీ రణకౌతుకం. పశ్యంతీ స్వరథం భిన్నం దదర్శ సమరాంగణే, మహ్యాస్య స్యాతిబాల్యే సా కైకేయీ వామహస్తతః, దండాగ్రకం దదౌ తస్య మునే ర్హాస్తేఽతిభక్తితః. తస్యై దదౌ వరం విప్ర స్తవ వామకరో వరాత్. భవితా వజ్రకఠినః శ్వాపి నాశం న చైష్యతి, కైకేయీ తం వరం స్మృత్వా

1. యాజ్ఞవల్క్య రా.

౫౮-౫౯. పూర్వము దేవదానవుల యుద్ధమందు దశరథుడు నీకు రెండు వరంబు లొసగెను గదా! అం దొకటి, శ్రీరాముడు మునివేషంబున బదునాల్గు వత్సరములు వనవాసముచేయుట, రెండవది నీపుత్త్రుడు యౌవరాజ్యమున కభిషేకింపబడుట.

---

* వరంబు లిచ్చుట:— కైకేయికి దశరథుడు వరప్రదానంబు గావించినవిషయ మానందాదిరామాయణములం దిట్లుచెప్పబడినది:

పూర్వము దేవతలకును రాక్షసులకును రాజ్యము కొఱకై వైరము పొసగెను. ఇంద్రు డంతట దనకు సాయపడు మని దశరథుని కోరెను. అతడును వల్లెయని కైకేయిని వెంట నిడుకొని సేనతో బయలుదేరిపోయెను.

రాక్షసుల కప్పుడు శంబరుం డనువా డధిపుడు. ఈత డనేక మాయల నెఱుంగును. ఈతని యావాసము వైజయంతంబను మహాపట్టణము. అదియు దక్షిణదిశనున్న దండకావనంబున నున్నది. తిమిచిహ్నం బీతని టెక్కెంబున గ్రాలుచుండును.

ఇట్టి యీతడు దేవతల కజయ్యుడై ఇంద్రునితో నెప్పుడు పోటులాడుచుండును. అయ్యింద్రునిచేత నేమియు గాకపోవుటచే దశరథుడు వానితో మిగుల ఘోరముగ బోరుసలిపెను.

ఈ పోరుసందడిలో నాయన యరదపుచీల యూడిపోయినది. ఇట్లూడిపోవుట రా జెఱుగడు. కాని కైకేయి రథం బిట్లు భిన్నమగుట చూచినది. తన బాల్యమందు మహ్యాస్యుండను జన్నిగట్టువసు భక్తి నొసంగువటుల దండాదికము పెడమచేతనే యొసగినదట. అందుల కమ్మౌనియు సంతసించి నీ వామహస్తము వజ్రసమానం బగు ననియు, దీనికి మఱి తిరుగులేదనియు వర మిచ్చియుండెనట. ఈవరము కైకేయికి స్మృతికి వచ్చినది.

1 అ[illegible]ఘం ప్రవిశ్యాద్య క్రోధాగారం రుషాన్వితా,
[illegible]మావేవ శయానా త్వం తూష్ణీ మాతిష్ఠ భామిని. ౫౮
[illegible]యావత్సత్యం ప్రతిజ్ఞాయ రాజాఽభీష్టం కరోతి తే. ౫౮½

శ్రుత్వా త్రివక్రయోక్తం తత్తదా కైకయనందినీ,
తథ్యమేవాఖిలం మేనే దుస్సంగాహితవిభ్రమా. ౫౯½
2 దైవేన వంచితా సాఽపి ప్రారబ్ధాచ్చ స్వయంకృతాత్. ౬౦

3 తా మాహ కైకయీ తుష్టా కుతస్తే బుద్ధి రీదృశీ,
ఏవం త్వాం బుద్ధిసంపన్నాం న జానే వక్రసుందరి. ౬౧
4సంతి దుస్సంస్థితాః కుబ్జా వక్రాః పరమదారుణాః. ౬౧½
త్వం పద్మమివ వాతేన సన్నతా ప్రియదర్శనా
త్వ మాయతాభ్యాం సక్థిభ్యాం మంథరే క్షౌమవాసినీ. ౬౩½

---

సంచకా రాశువ త్కరం. అసురైశ్చ మహారాజ శ్శస్త్రైశ్చ శకలీకృతః, తతోఽపి విక్షత శ్శస్త్రై స్త్వయా సంరక్షితో విభుః. అథ జిత్వా రణే దైత్యాన్ దృష్ట్వా తత్కర్మ పార్థివః, దదౌ వరౌ ద్వౌ తస్యై స న్యాసభూతౌ కృతౌ తయా. యదాఽహం యాచయిష్యామి తదా త్వం దేహి తౌ మమ, తథే త్యుక్త్వా నృపః పత్నీం యయౌ స్వనగరం ప్రతి." ఇతి.

---

1 అధ్యా. రా: సర్గ ౨; 3 అధ్యా. రా: సర్గ ౨.
2 మార్క. రా. 4 వాల్మీ. రా. సర్గ. ౯

౫౮-౫౯. కాన వెంటనే క్రోధాగారంబు జొరుము. కోపముం దాల్చుము. కదలక మెదలక యాయనకు బదులు మాటాడక నేలపై ననే పరుండియుండుము. అతడు 'నీకోర్కె నెరవేర్తునని' ప్రమాణము సేయువఱకు నట్లే యుండుము సుమీ!'

౫౯-౬౦. అప్పుడా కేకయరాజపుత్రి యాత్రివక్ర చెప్పినదంతయు నిజమని నమ్మినది. అవును; ఇట్లామె విశ్వసించుటకు దుస్సంగత్వమే కారణము. అయినను ప్రారబ్ధకర్మంబు దాట నెవరికశక్యము? ప్రారబ్ధకర్మంబును బట్టియే యిట్టి దైవవంచన మా మెకు గల్గినది.

౬౧-౬౧౪-౬౨౪. ఇట్టి మంథరావచనంబులకు సంతసము వెలిబుచ్చుచు కైకేయి యిట్లనియె. 'మంథరా! ఏమే నీబుద్ధివైభవము. నీకంటెను వంగవికారిణులును, దారుణలు నగు కుబ్జ లెందరో యున్నారు. కాని నీవంటి బుద్ధిసంపన్న నెక్కడ జూచి యెఱుంగను. వాయువు వీచునప్పుడు వంగినపద్మమువలెనే, నీవును మా యొద్దక వంగివంగి యే యుందువు. ఆహా! నీపాదుగు తొడలు - నీతెలిపట్టుచీర - చూచుట కెంత ప్రియంబుగ నున్నావు!

---

వెంటనే యామె తన యెడమచేయి నేచీలగా జేసినది. పిమ్మట మహారాజుపై నా కఱకురక్కసు లంపవాన లెన్నియో కురిసిరి. దాన నాత డించుక మూర్ఛిలినను కైకేయి వెంటనే యాతని రక్షించినది.

దశరథుడు ఎట్లో రక్కసుల పీచ మణచెను. కైకేయి చేసిన యుపకారములనెంచి వెంటనే యామెను రెండువరముల గోరికొమ్మనెను. ఆమె వానినప్పుడు కోరలేదు. నేను గోరినప్పు డిత్తురు లెండు, ఇప్పుడేల? అని యనియెను.

రాజును నట్లే రెమ్మని ఆమెం దోడ్కొని స్వపురంబునకు పోయెను.

అగ్రతో మమ గచ్ఛంతీ రాజహంసీవ రాఘవే. ౬౩

అభిషిక్తేచ భరతే రాఘవేచ వనం గతే,
జాత్యేనచ సువర్ణేన సునిష్టప్తేన మంథరే. ౬౪

లబ్ధార్థాచ ప్రతీతాచ లేపయిష్యామి తే స్థగు,
తవేదం స్థగు యద్దీర్ఘం రథఘోణ మివాయతం. ౬౫

మతయః క్షత్రవిద్యాశ్చ మాయాశ్చాత్ర వసంతి తే. ౬౬

[1] ఇత్యుక్త్వా కోపభవనం ప్రవిశ్య సహసా రుషా,
విముచ్య సర్వాభరణం పరికీర్య సమంతతః, ౬౭
భూమౌ శయానా మలినా మలినాంబరధారిణీ. ౬౮

ప్రోవాచ శ్రుణు మే కుబ్జే యావద్రామో వనం వ్రజేత్,
ప్రాణాం స్త్యక్ష్యేఽథవా వక్త్రే శయిష్యే తావదేవహి. ౬౯

నిశ్చయం కురు కల్యాణి కల్యాణం తే భవిష్యతి,
ఇత్యుక్త్వా ప్రయయౌ కుబ్జా గృహం సాపి తథాఽకరోత్ ౭౦

ధీరో ఽత్యంతదయాన్వితోఽపి సుగుణాచారాన్వితోవాఽథవా
నీతిజ్ఞో విధవాద దేశికవరో విద్యావివేకోఽథవా

---

౧ అధ్యా. రా: సర్గ ౨.

౬౩½. కాయగ్రభాగమున నీవు వడుచో సాక్షాత్తుగా రాజహంసివలె నుందువు.

౬౪½-౬౫½-౬౬. మంథరా! శ్రీరాముం డడవికి బోయి భరతుఁడ భిషేకము గానిమ్ము. నే కోరినకోర్కి సఫలమై నాకు ముదంబు నిండార నిమ్ము. నీ స్థగుతలంబునకు (గూనికి), దీర్ఘమై రథఘోణమువలె విశాలమగు నీ స్థగుతలంబునకు - రాజనీతిచతురత, మాయలు కుప్పగూరగ గుప్తపఱచికొన్న నీస్థగుతలమునకు బంగారుపూత పూయించెదను.

౬౭-౬౭½. ఇట్లనుచు కైకేయి తటాలున బోయి కోపాగారము ప్రవేశించినది. మైనున్నయాభరణంబు లన్నియుఁ బూడ్చి చిందఱ వందఱగ జిమ్మివైచినది. మలినవసనంబు దాల్చి, మలినయై నేలపైననే శయనించినది.

౬౮½. అవక్రసుందరిని బిలిచి 'మంథరా! శ్రీరాముడు వనంబున కేగువఱకును నిట్లే పండుకొనియుందును. అత డట్లుపోనినాడో - ప్రాణముల నైన విడుతును' అన్నది.

౬౯½. అందులకు మంథర 'కల్యాణీ! నీకు శుభం బగుగాక. నీ వొనర్చుకొన్న నిశ్చయమునుండి తొలగెదవు సుమా' యనుచు తనగృహంబునకు బోయెను. ఆ కైకేయి యీమంథర చెప్పినదంతయు జేసెను.

౬౩. ధీరుండగుగాక, దయాపరుండగుగాక. సుగుణి యగుగాక, సదాచారుం డగుగాక, నీతిశాస్త్రజ్ఞుం డగుగాక. బ్రహ్మవాదియగుగురుం గల్గియుండుగాక, విద్యలెల్లను దలకిందుగ జదువుగాక. దుష్టస్వభావులతో నెల్లప్పుడు కూడియుండెనేని ఈతనిబుద్ధి వక్రమార్గ మును

దుష్టానా మతిపాపభాషితధియాం సంగం సదా చే ద్భజే-
త్తద్బుద్ధ్యా పరిభావితో వ్రజతి తత్సామ్యం క్రమేణ స్ఫుటమ్.
౭౦౪

అత స్సంగః పరిత్యాజ్యో దుష్టానాం సర్వదైవహి,
దుస్సంగీ చ్యవతే స్వార్థా ద్యథేయం రాజకన్యకా. ౭౧౪

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అయోధ్యాకాండే
తృతీయ స్సర్గః.

---

చతుర్థ స్సర్గః.

[1] తతో దశరథో రాజా రామాభ్యుదయకారణాత్,
ఆదిశ్య మంత్రిప్రకృతీ స్సానందో గృహ మావిశత్. ౧

[2] స కైకేయ్యా గృహం శ్రేష్ఠం ప్రవివేశ మహాయశాః,
పాండురాభ్రనిభాకాశం రాహుయుక్తం నిశాకరః. ౨

త తాం దృష్ట్వా ప్రియాం రాజా కిమేత దితి విహ్వలః,
పప్రచ్ఛ దాసీనికరం కుతో వ స్స్వామినీ శుభా. 3

తా ఊచుః క్రోధభవనం ప్రవిష్టా నైవ విద్మహే,
కారణం తత్ర దేవ త్వం గత్వా నిశ్చేతు మర్హసి. ౪

ఇత్యుక్తో భయసంత్రస్తో రాజా తస్యా స్సమీపగః,
ఉపవిశ్య శనై ర్దేహం స్పృశ న్నైవ పాణినాఽబ్రవీత్. ౫

1 అధ్యా. రా: సర్గ 3. 2 వాల్మీకిరా: సర్గ ౧౦.

సరించుటయేకాక క్రమంబున నాదుష్టుని సామ్యమే ప్రాపించును. ఇది నిశ్చయము.

౨౪. కావున దుస్సాంగత్య మెప్పుడును త్యజింపవలెను. అట్లుసేయక యుండెనా యీరాజకన్యకగతియే పట్టును.

ఇది శ్రీరామాయణసారోద్ధారమున అయోధ్యాకాండమునందు
తృతీయ సర్గము.

---

## చతుర్థసర్గము.

౧. అంతట దశరథుడు శ్రీరామాభిషేకంబునకు వలయు నేర్పాటులు గావింపుడని మంత్రుల కాదేశించెను.

౨. ఆదేశించి, రామాయుక్తంబై, తెలిమబ్బులతోడి యాకసంబును శేవెల్గు జొచ్చినట్లాతడు శ్రేష్ఠంబగు కైకేయీగృహంబు జొచ్చెను.

౩. గృహంబు నలుగెలంకుల నాతడు కలయజూచెను. కైకేయిమాత్రము కనుపడలేదు. ఇదేమని తొఱగుపడి మీ యజమానురా లెక్కడ యని అక్కడి దాసీజనంబు నడిగెను.

౪. 'ప్రభో! ఆమె క్రోధాగారము జొచ్చి యుండినది. ఆ క్రోధంబునకు గారణముమాత్రము మాకు తెలియరాదు; అది యేమో తామే పోయి నిశ్చయింపవలె' నని యా దాసీజనంబు బదులిడిరి.

౫. రా జంత భయవిహ్వలుడై యయ్యాగారంబు జొచ్చి భార్యాసమీపమున గూర్చుండి యామెదేహంబు మెల్లన నివురుచు నిట్లనెను.

కిం శేషే వసుధాపృష్ఠే పర్యంకాదీ న్విహాయచ,
అలంకారం పరిత్యజ్య భూమౌ మలినవాససా. ౬

కిమర్థం బ్రూహి సకలం విధాస్యే తవ వాంఛితం. ౬½

కోవా తవాహితం కర్తా నారీ వా పురుషోపి వా,
స మే దండ్యశ్చ వధ్యశ్చ భవిష్యతి న సంశయః. ౭½

కిమత్ర బహునోక్తేన ప్రాణాన్దాస్యామి తే ప్రియే. ౮

మమ ప్రాణాత్ప్రియతమో రామో రాజీవలోచనః,
తస్యోపరి శపే బ్రూహి యద్ధితం తత్కరోమ్యహం. ౯

ఇతి బ్రువాణం రాజానం శపంతం రాఘవోపరి,
శనై ర్విమృజ్య నేత్రే సా రాజానం ప్రత్యభాషత. ౧౦

యది సత్యప్రతిజ్ఞోఽసి శపథం కురుషే యది,
[1] తచ్ఛృణ్వంతు త్రయస్త్రింశ ద్దేవా స్సాగ్నిపురోగమాః. ౧౧
సఖాచరాణి భూతాని గృహేషు గృహదేవతాః. ౧౧½

యాచ్ఞాం మే సఫలాం కర్తుం శీఘ్రమేవ త్వ మర్హసి. ౧౨
పూర్వం దైవాసురే యుద్ధే మయా త్వం పరిరక్షితః,
తదా వరద్వయం దత్తం త్వయా మే తుష్టచేతసా. ౧౩
తద్ద్వయం న్యాసభూతం మే స్థాపితం త్వయి సువ్రత. ౧౩½

1 వాల్మీ. రా; సర్గ. ౧౧.

౬-౬½. దేవీ! యిదేమి? మాసిన చీరగట్టితివి. మైలోతవ్రు లన్నియు దొలంగితివి. హంసతూలికా తల్పంబులు విడిచి ఈ నేలపై బరుంటివి, కారణం బేమి? నీ వాంఛితం బేమో తెలియ బల్కుము. అదిచేసెదను.

౭½. అటుగాక నీ కెవ్వరే నప్రియంబొనర్చిరా? వార లెవ్వరైనం గానిమ్ము. పురుషులుగాని స్త్రీలేకాని, వారిని దండించెదను - వధించెదను.

౮. పలుమాటలేల? నాయసువులు నీయధీనంబులు.

౯. పద్మలోచనుండగు శ్రీరాముండు నాకు ప్రాణంబుకంటెను బ్రియతముడుగదా! ఆతనిపై నొట్టిడుచుంటిని. నీకోర్కె యేదియో చెప్పుము, చెల్లింతును.

౧౦. ఈ విధంబుగ శ్రీరామునిపై నొట్టుపెట్టుకొని దశరథుడు పల్కుటతోడనే కైకేయి మెల్లమెల్లన కన్నులు తెఱచి యాతనితో నిట్లనెను.

౧౧-౧౧½. మీరు చేసినప్రతిజ్ఞ నెన్నడు మీరరు. అట్టి మీచేసినశపథంబు నగ్నిదేవుండాదిగ ముప్పది మూడుకోట్లదేవతలును విందురుగాక! రాత్రించరములగు భూతంబు లెల్ల వినుగాక, కులదేవతలును విందురుగాక.

౧౨. నే కోరినకోరిక తప్పక తాము సఫలము గావింపవలెను.

౧౩-౧౩½. నిర్బంధమేల యందురేమో? పూర్వము దేవాసురయుద్ధంబున మిమ్ముల నేను గాపాడినపట్టున మీ రెంతయు సంతసించి నాకు రెండు వరంబు లిచ్చితిరిగదా! వాని నే నప్పుడు గోరక మీరు సత్యప్రతిజ్ఞు లగుట మీయొద్దనే భద్రముచేసికొంటిని.

తత్రైకేన వరేణాశు భరతం మే ప్రియం సుతం,
ఏభి స్సంభృతసంభారై ర్యౌవరాజ్యేఽభిషేచయ. ౧౪½

అపరేణ వరేణాశు రామో గచ్ఛతు దండకాన్,
మునివేషధర శ్శ్రీమాన్ జటావల్కలభూషణః. ౧౫½

చతుర్దశసమా స్తత్ర కందమూలఫలాశనః,
పున రాయాతు తస్యాంతే వనే వా తిష్ఠతు స్వయం. ౧౬½

ప్రభాతే గచ్ఛతు వనం రామో రాజీవలోచనః,
యది కించి ద్విలంబేత ప్రాణాం స్త్యక్ష్యే తవాగ్రతః. ౧౭½

భవ సత్యప్రతిజ్ఞ స్త్వ మేత దేవ మమ ప్రియం. ౧౮

శ్రుత్వైత ద్దారుణం వాక్యం కైకేయ్యా రోమహర్షణం,
నిపపాత మహీపాలో వజ్రాహత ఇవాచలః. ౧౯

శనై రున్మీల్య నయనే విమృజ్య పరయా ధియా,
దుస్స్వప్నో వా మయా దృష్టో హ్యథవా చిత్తవిభ్రమః. ౨౦

ఇత్యాలోక్య పునః పత్నీం వ్యాఘ్రీ మివ పురఃస్థితాం. ౨౦½

౧౪½. ఇప్పుడందుల నొకవరంబుచే శ్రీరాముని పట్టాభిషేకమునకై సిద్ధపఱుపబడిన సంభారములచే నా ప్రియసుతు భరతు నభిషేకింపుడు.

౧౫½. మఱి రెండవవరంబున శ్రీరాముడు జటావల్కలములు దాల్చి, మునివేషధరుండై వెంటనే దండకారణ్యంబుం బట్టి పోవలెను.

౧౬½. అక్కడ కందమూలఫలంబు లాహారంబుగా గొనుచు బదునాల్గు వత్సరంబు లుండవలెను. అట్లా వత్సరములు గడచవిన తిరిగి రావచ్చును. అతని కిష్టం బున్నచో నావనంబున నున్నను నుండ వచ్చును.

౧౭½. తెల్లవారినతోడనే అతడు వనంబునకై పయనము సాగింపవలెను. అత డాలసించెనా, మీరు చూచుచుండగనే నా ప్రాణంబులు విడిచెద.

౧౮. మీ రిదెల్ల నొనరించుటయే నా కత్యంతప్రియకరంబు. మొదల మీ రన్నమాట యిప్పుడు తిత్తపోగూడదు.

౧౯. తద్దయు దారుణంబులై రోమంబులను గగుర్పాటొందించు నీ కైకేయీ వాక్యంబులు వినుటతోడనే యామహారాజు వజ్రాహతంబగు ధరణీధరముపగిది భూమిపై బడెను.

౨౦. కొంతతడవున కాతడు మెల్లగ గన్నులు తెఱచెను. 'దుస్స్వప్న మేదైన గంటినా? మఱి చిత్తవిభ్రమంబు గల్గెనా యని యనుకొనుచు గన్నుల నొకసారి తుడుచుకొనెను.

౨౦½. తుడిచికొని చూచునప్పటికి బెబ్బులిపడంతింబోలె నా కైకేయి యెట్టయెదుటనే యుండెను.

కిమిదం భాషసే భద్రే మమ ప్రాణహరం వచః,
రామః కమపరాధం తే కృతవాన్కమలేక్షణః. ౨౧

మమాగ్రే రాఘవగుణాన్ వర్ణయన్త్యనిశం శుభాన్,
కౌసల్యాం మాం సమే పశ్యన్ శుశ్రూషాం కురుతే సదా. ౨౨

ఇతి బ్రువన్తీ త్వం పూర్వ మిదానీం భాషసేఽన్యథా. ౨౩

1 *సత్యేన లోకాన్ జయతి దీనా న్దానేన రాఘవః,
గురూన్ శుశ్రూషయా వీరో ధనుషా యుధి శాత్రవాన్. ౨౪

తస్మిన్నార్జవసంపన్నే దేవి దేవోపమే కథమ్,
పాప మాశంససే రామే మహర్షిసమతేజసి. ౨౫

---

*సత్యేనేత్యత్ర:—చోళమహీపతిః కదాచి త్సన్నిహితం మధ్యమవీరభట్టారకంప్రతి 'ఆత్మానం మానుషం మన్యే' ఇతి వదన్ రామః కథం జటాయుషో మోక్షం దత్తవానితి పప్రచ్ఛ. సోఽపి 'సత్యేన లోకా న్జయతీ' త్యుక్త్వా మహాంతం బహుమతి మవా ప్తవా నిత్యైతిహ్య మత్ర జ్ఞేయం.

---

1 వాల్మీ. రా: సర్గ ౧౨.

౨౧౫. దేవీ! మహాప్రణహారంబులగు నిట్టిమాటలాడుచుంటి విదేమి? రాజీవ లోచనుండగు శ్రీరామచంద్రుడు నీ కే మపకార మొనర్చెను?

౨౨-౨౩. నాయెడల నెప్పుడును నాతని గుణగణంబునే యెన్నుచుం డువే. 'శ్రీరాముని కొరకు భేదంబులేదు. నన్నును, దనతల్లి కౌసల్య ను సమంబుగ జూచుచు నాకును నెల్లప్పుడు సపర్య లొనర్చు చుం డును' అని యెన్నిమారులో పల్కుచుండు వే? అట్టి నీ విప్పు డిట్లాడు టకు గతం బేమో తెలియరాదు.

౨౪. ప్రాణికోటి కొరకు నెప్పుడును హితంబె చేయుటచే స్వర్గాదిలోకం బుల గుప్పిట నుంచుకొన్నాడు. సతత వితరణగుణంబుచే దీను లగు వారికి ప్రాపగుచున్నాడు. అనయంబును సపర్య లొనరించుచు గురులకు దలలోనినాల్క యగుచున్నాడు. ధనుష్టంకారముచేత నే శాత్రవులగుండెలు వ్రీల్పడజేయుచున్నాడు.

౨౫. ఋజుమార్గముననే యెన్నడును బోవువాడు. దేవతలతో దుల్యుడగు వాడు. మహర్షి సమతేజం బెసంగువాడు. అట్టి శ్రీరామునిగూర్చి నీ వింత ఘోరంబుగ నాడుచుంటివి?

---

* చోళభూపాలు డొకనాడు చెంతనున్న మధ్యమభట్టారకుం గాంచి 'శ్రీరాముడు తన్ను మనుజునిగానే భావించుకొనుచుండెనని కదా యున్నది. అట్టిచో జటాయువున కెట్లాతడు మోక్షంబు ప్రసా దించెను?' అని యడుగగా నా భట్టారకుడు 'సత్యముచే లోకము లన్నింటిని జయించెను. (స్వాధీనపఱుచుకొనెను.) అని ప్రమాణ మున్నదిగదా!' యని సమయస్ఫూర్తిగ బదులుసెప్పి యా రాజుచే గొప్పబహుమతి పడసె నని యొక నానుడి కలదు. అది యిప్పట్టున గమనింపదగును.

[1] రాజ్యం గృహాణ పుత్త్రాయ రామ స్తిష్ఠతు మందిరే,
అనుగృహ్ణీష్వ మాం వామే రామా న్నాస్తి భయం తవ. ౨౬

[2] మమ వృద్ధస్య కైకేయి గతాంతస్య తపస్వినః,
దీనం లాలప్యమానస్య కారుణ్యం కర్తు మర్హసి. ౨౭

అంజలిం కుర్మి కైకేయి పాదౌ చాపి స్పృశామి తే
శరణం భవ రామస్య మాఽధర్మో మా మిహ స్పృశేత్. ౨౮

ఇతి దుఃఖాభిసంతప్తం విలపంత మచేతనం,
ఘూర్ణమానం మహారాజం శోకేన సమభిప్లుతం. ౨౯
పారం శోకార్ణవ స్యాశు ప్రార్థయంతం పునఃపునః,
ప్రత్యువా చాథ కైకేయీ రౌద్రా రౌద్రతరం వచః. 30
రాజేంద్ర త్వం కిం భ్రాంతోఽసి ఉక్తం తద్భాష్యసేఽన్యథా
మిథ్యాకరోషి చే త్త్వయం భాషితం నరకో భవేత్. 3౧

[3] వనం న గచ్ఛే ద్యది రామచంద్రః, ప్రభాతకాలేఽజిన
చీరయుక్తః, ఉద్బంధనం వా విషభక్షణం వా కృత్వా
మరిష్యే పురత స్తవాహం. 3౨
ఇత్యుక్తం ప్రియయా దీనో మగ్నో దుఃఖార్ణవే నృపః
మూర్ఛితః పతితో భూమౌ విసంజ్ఞో మృతకో యథా. 33

1 అధ్యా. రా: సర్గ 3; 2 వాల్మీ. రా: సర్గ ౧౨. 3 అధ్యా. రా: సర్గ 3.

౨౬. కైకేయీ! నీ కుమారునకై రాజ్యంబు గైకొమ్ము. శ్రీరామునింట మాత్రముండనిమ్ము. సుందరీ! అతనివలన నీ కింతయు భయంబు లేదు. నన్ననుగ్రహింపుము.

౨౭. కైకేయీ! అతివృద్ధుండనై కాటికి కాలుచాచుకొనియున్నాడను. దుఃఖము పైకొని దీనముగా నేడ్చుచున్న నాపై సుంత కరుణింపుము.

౨౮. దేవీ! నీ కంజలించెదను. నీ పాదములనైన బట్టెదను. శ్రీరామునకు శరణంబు గమ్ము. నన్ను ధర్మమార్గమున ద్రోయకుము. (శ్రీరామునికి యౌవరాజ్యాభిషేకము చేతునని మాటయిచ్చితిని. దానికి భంగము కలిగింపకుమని భావము.)

౨౯-30. ఇట్లుగ మిగుల దుఃఖపరితప్తుడై పెద్దపెట్టున నేడ్చుచు తెలివి దప్పి తిరుగుడువడుచు, ఈ మహాదుఃఖసముద్రమును దరించు తెఱవు గానక మాటిమాటికి వేడుకొనుచున్న యా దశరథుం గాంచి ఆ కైకేయి మఱియు దారుణంబుగ నిట్లనెను.

3౧. రాజా! నీ వేమైన విభ్రాంతుడవైతివా? ఆడినమాటను ద్రిప్పివేయ దలచుచుంటివా? అట్లు త్రిప్పదలపకుమీ - నరకకూపంబున బడియెదవు.

3౨. రాజా! వేకువనే లేచి జటావల్కలంబులు దాల్చి శ్రీరాముడడవికి పోక పోయెనో, ఉరినైనగాని, విసంబునైనగాని నీ యెదుటనే ప్రాణంబులు విడిచెదను.

33. తన ప్రియురాలిట్లు పలుకగనే దశరథుడు, దుఃఖసముద్రమునకు దరిగానక మూర్ఛపోయి మృతునింబోలె విసంజ్ఞుడై పడియుండెను.

[1]ప్రతిలభ్య చిరా త్సంజ్ఞాం కైకేయీవాక్యతాడితః,
అనంవృతాయా మాసీనో జగత్యాం దీర్ఘముచ్ఛ్వసన్. 34
కైకేయీ మబ్రవీ త్క్రుద్ధః ప్రదహన్నివ చక్షుషా. 34½

నహి ప్రవ్రాజితే రామే దేవి జీవితు ముత్సహే,
సా నూనం విధవా రాజ్యం సపుత్త్రా కారయిష్యసి. 35½

ప్రియం చే ద్భరత స్యైత ద్రామప్రవ్రాజనం భవేత్,
మాస్మ మే భరతః కార్షీ త్ప్రేతకృత్యం గతాయుషః. 36½

ధి గస్తు యోషితో నామ శఠా స్స్వార్థపరా స్సదా,
న బ్రవీమి స్త్రియ స్సర్వా భరతస్యైవ మాతరం. 37½

[2] * య స్తే మంత్రకృతః పాణి రగ్నౌ పాపే మయా ధృతః,
తం త్యజామి స్వయం వాపి తవ పుత్త్రం సహ త్వయా. 38½

---

* య స్త ఇతి. అనేన దుష్టచారిత్రా స్త్రీ పరిత్యాజ్యేతి సూచితం భవతి. తథాచ మాధవీయే పురాణవచనం: 'ధర్మవిఘ్నకరీం భార్యా మసతీం చాతికోపనాం, త్యజే

---

1. వాల్మీ. రా: సర్గ ౧౨. 2 వాల్మీ. రా: సర్గ ౧౪.

౩౪-౩౪౪. ఇట్లు కైకేయీవాక్యాహతుండైన దశరథుని కట్టకేలకు తెలివి వచ్చినది. అతిదీర్ఘంబుగ నిశ్వాసము పుచ్చుచు, గటికినేలపైననే కూర్చుండి వీక్షణమాత్రంబున నామెను నీఱు సేయువానింబలె క్రుద్ధుండై యిట్లనెను.

౩౫౪. కైకేయీ! శ్రీరాముం డరణ్యమునకే పోయిన నా ప్రాణవాయువు లెటులను నాలో నుండవు. అప్పుడు నీవు విధవవై పుత్రునితోఁగూడి రాజ్య మేలుకొందువు కాఁబోలు!

౩౬౪. కానిమ్ము. శ్రీరాముం డరణ్యంబులకు బోవుట భరతుని కిష్టంబ యేని నా. మరణానంతర మాతడు నాకు ప్రేతకర్మంబు సేయ వలను పడదు.

౩౭౪. ఛీ! ఛీ! ఈ స్త్రీజనంబు లెప్పుడును బైకి బ్రియంబుగ బల్కుచు లోన నెప్పుడును నప్రియంబే తలచుచుందురు. వీరి హృదయంబుల స్వార్థమునకుందక్క మతితరవిషయంబులకు దావులేదు. ఓహో! స్త్రీసామాన్యంబునే యిట్లు నిందించుచుంటిం గాబోలు. కాదు- భరతుని తల్లి యొక్కర్తుకయే యిట్టిది.

౩౮౪* ఓసీ! పాపాత్మురాలా! మంత్రపురస్సరంబుగ - నగ్నిసాక్షిగ - నిన్ను వివాహం బాడితిని. అట్టి నిన్ను నీ పుత్రునితోఁగూడ వదలి వేయుచున్నాను. పొమ్ము — నీయిచ్చవచ్చినచోఁ ప్పునకు.

---

*ఓసీ అనుచోట:—ఇట్లు చెప్పుటచే దుష్టచారిత్రయగు స్త్రీని వదలివేయవలెనని సూచిత మగుచున్నది. ఈ విషయము మాధవీయము నందును నిట్లు చెప్పబడినది:— 'ధర్మంబున కంతరాయం బొనరించు నదియును, నసతియును (పతివ్రతకానిది), మిగుల కోపస్వభావముం గలినదియును, నెల్లపుడు నప్రియంబుగ బల్కునదియును నైన భార్యను ధర్మరక్షణార్థమై విడిచివేయవలెను.'

[1] ఏవం రాత్రి ర్గతా తస్య దుఃఖా త్సంవత్సరోపమా 35
అరుణోదయకాలే తు వందినో గాయకా జగుః,

ద్ధర్మస్య రక్షార్థం సదైవా ప్రియవాదినీ' మితి. నను 'ఉదాహృతవచనావగతపరిత్యాగహేతూనాం చతుర్ణాం మధ్యే ఏకస్యా ప్యభావాత్, 'అదుష్టాం వనితాం భార్యాం యావనే యః పరిత్యజేత్, సప్తజన్మ భవే స్త్రీత్వం వైధవ్యం చ పునః పునః.' ఇతి భార్యాపరిత్యాగే దోషశ్రవణాచ్చ కైకేయీపరిత్యాగో నోపపద్యతే; నచ కైకేయ్యా దుష్టత్వాదికం సిద్ధ మితి వాచ్యం, 'నహి కించి దయుక్తం వా విప్రియం వా పురా మమ, అకరో స్త్వం విశాలాక్షి కేన న శ్రద్దధా మ్యహం' ఇత్యాది దశరథవచనేన అదుష్టత్వావినీతత్వయోః ఇతిచే దుచ్యతే. రామప్రవ్రాజనరూపవరయాచనవిరమణార్థవిభీషికాపర- మేవ, న పరిత్యాగపర మితివా; ధర్మవిఘ్నకరీ త్యాదికారణాదేవ భర్తృనిర్బంధనాదిరూపాసన్మార్గప్రవృత్త్యా అసతీత్వ మప్యస్తి, అతఏవ రాజర్షి ర్దశరథః అసతీ త్యుక్తవాన్; భరద్వాజంప్రతి భరతవచనేన 'క్రోధనా మకృతప్రజ్ఞాం దృప్తాం సుభగమానినీం, మమ తాం మాతరం విద్ధి నృశంసాం పాపనిశ్చయాం' ఇతి పరిత్యాగహేతుభూతకోపనాత్వ మప్యస్తి. తథా దశరథం ప్రతి కైకేయీవచనే 'సత్యం ధర్మం పరిత్యజ్య రామం రాజ్యేఽభిషిచ్య చ, సహ కౌసల్యయా నిత్యం రంతు మిచ్ఛసి

1 అధ్యా - రా: సర్గ 3

౨౬౪. అమ్మా! నన్ను వనంబున కేఁగి జీవయాత్ర చేయు మంటివి. మఱి నీపుత్త్రుని శిరంబునకే బాలుడనియైన సెంచక చతురంభోధిపరీత విశ్వంభరాకలయ మహారాజ్యపాలనాభారం బిడితివి. ఇట్టిచో జెల్లఁన కార్యం బెవ్వరిది? నాదేకదా? ఏమమ్మా, నీ దయార్ద్ర హృదయము! నిక్కముగ నాపక్షంబే పూనితివమ్మా!

౨౭౪. తల్లీ! యీ భూభారమును వహించుటకు భరతుడు భయమందెనా, పరమపావనం బగు దండకారణ్యమునకు బోవుట కే జడితినా? సగర కులాంభోధిచంద్రు లీజనకపాదు లేల దుఃఖించెదరు? పావన దివ్య గంగాజలంబులతోడి తిలోదకదానంబు కంటెను లఘుతరంబగు నిక్కార్యమే యొనర్పకున్న నాయనకు మమ్ముల గన్న ఫలమేమి? ఆయన పుత్త్రవంతుం డెట్లగును? [భగీరథాదులగు మనపూర్వులు పితృదేవతలను దరింపజేయుకొఱకు గంగానయనాది దుస్తరకార్యం బు లెన్నేనొనర్చిరి. అట్టియెడ తండ్రి చెప్పిన (భరతుడు రాజ్య మేలుట, నే నరణ్యంబునకు బోవుటయను) యీ స్వల్పకార్యము లే మేము చేయకున్న "జీవతో ర్వాక్యకరణా త్ప్రత్యబ్దం భూరిభోజనాత్, గయాయాం పిండదానాచ్చ త్రిభిః పుత్త్రస్య పుత్రతా" (తలిదండ్రులు జీవించి యున్నప్పుడు వారు చెప్పినచొప్పున జేయుటచేతను. మరణిం చినవెనుక ప్రతివత్సరంబును ఆబ్దికంబున భూరిభోజనదానంబుచేతను, గయలో పిండదానంబుచేతను పుత్రునికి పుత్త్రత్వ మేర్పడుచున్నది. అని చెప్పిన చొప్పున మాకు పుత్త్రత్వ మేర్పడి నాయన పుత్త్ర వంతు డెట్లగునని భావము.]

౨౮౪. తన యెట్టయెదుట నుండి యిట్లుగ బల్కుచున్న యా శ్రీరామ చంద్రుని గాంచి దశరథుడు దుఃఖితుడై యిట్లనెను.

స్త్రీజితం భ్రాంతహృదయ మున్మార్గపరివర్తినం,
నిగృహ్య మాం గృహాణేదం రాజ్యం పాపం న తద్భవేత్. ౨౯

హా రామ హా జగన్నాథ హా మమ ప్రాణవల్లభ,
మాం విసృజ్య కథం ఘోరం విపినం గంతు మర్హసి. ౩౦

1 కే వా నో భువి గౌరవం విదధతే భార్యాజితోఽయం జనః
ధర్మస్నేహ మపాకరోతి మదనాధీనోఽతిదీన స్త్వితి,
సౌఖ్యం దూర ముపైతి జీవితమతి స్పందేహడోలాగతిః
కష్టాత్కష్టతరం హి ధూర్తవనితాసంసారబంధః పతేః. ౩౧

2 ఇతి స రామం సమాలింగ్య ముక్తకంఠో రురోద హ. ౩౨

విమృజ్య నయనే రామః పితు స్సజలపాణినా,
ఆశ్వాసయామాస నృపం శనై స్స నయకోవిదః. ౩౩

కి మర్తి దుఃఖేన విభో రాజ్యం శాసతు మేఽనుజః,
అహం ప్రతిజ్ఞాం నిస్తీర్య పున ర్యాస్యామి తే పురం. ౩౪

రాజ్యా త్కోటిగుణం సౌఖ్యం మమ రాజ న్వనే సతః. ౩౫

1 రామాయణచంపు. 2 అధ్యా. రా: సర్గ 3.

౨౯½. శ్రీరామా! నేను భార్యావిజితుండ నైతిని. నాహృదయ మెంతయు కలగుండువడినది. దానికోరిక నిలుకడ లేదు. ఇట్లుగ సత్పథమును వీడినట్టి నన్ను నిగ్రహించి నీవే కైవసము చేసికొమ్మా సమస్తరాజ్యమును. దాన నీకు బొరయు కిల్బిషం బించుకంతయు లేదు.

3౦½. హారామా! జగన్నాథా! నన్ను విడిచి ఆ ఘోరారణ్యంబుల కెట్లు పోమవోయి, తండ్రీ.

3౧½. దుష్టురాలగు భార్యతో గాపురము సేయువానిపాట్లేమి చెప్పవలెను? పెండ్లాముమాట కెదురాడలేని వ్యర్థుండని యెవరును లెక్క సేయరు. చెఱకువిల్కాని కెల్లపుడును వశంవదుడగు దీనుండని ధర్మము వీడిపోవును. జీవిత మెప్పుడును సందేహములచే డోలాయమానం బగుటజేసి సౌఖ్య మెంతయు దవ్వైపోవును. కష్టములలోని కెల్ల కష్టంబగు నిట్టి ధూర్తవనితతోడిసంసారం బెవ్వరికిని వలదు. వలదు - ముమ్మాటికిని వలదు.

3౨. ఇట్లనుచు శ్రీరాముని గాగిలించుకొని ముక్తకంఠుడై యా దశరథుండు తద్దయు దుఃఖించెను.

33. అంత నా శ్రీరాముడు శీతలజలంబున నాయనకండ్లు తుడిచి మెల మెల్లన నాతనికి దుఃఖోపశమనంబుగ నిట్లనియె.

3౪-3౪½. తండ్రీ! మీరు దుఃఖించుటకు గారణ మేమో నాకు గానరాదయ్యె. నాతమ్ముడేగదా రాజ్య మేలును? ఏలనిండు. నేను సమయమును సక్రమముగ నిర్వర్తించి యీపురంబునకు మరల విచ్చేయుదును. ఈ రాజ్యపాలనంబుకంటె వనంబున నుంటయే నాకు గోటిమడుంగు లెక్కుడు సౌఖ్యము.

[1]తటాకదశదానేన శతవాపీకృతే స్తథా,
దశకన్యాప్రదానేన దశయజ్ఞేన య త్ఫలం, 37½
తత్ఫలం లభతే నూనం పుణ్యవా౯ సత్యపాలనాత్.
నహి సత్యా త్పరో ధర్మో నానృతా త్పాతకం పరం. 36½

వనవాసం కరిష్యామి సత్యసంపాలనాయ తే. 39

[2]ఇత్యుక్త్వా తు పరిక్రమ్య మాతరం ద్రష్టు మాయయౌ,
కౌసల్యాపి హరేః పూజాం కురుతే రామకారణాత్. 40
[3]*సా క్షౌమవసనా హృష్టా నిత్యం వ్రతపరాయణా,

* నేతి:—న న్వత్ర కౌసల్యయా దేవతాధ్యానాదికం కృత మిత్యవగమ్యతే, త న్న సంఘటతే, స్త్రీణాం పతిశుశ్రూషణ మేవ ధర్మః, తస్మా దేవ సర్వఫలావాప్తిః, ఇతరధర్మానుష్ఠానే స్వస్య భర్తు ర్వాంఛితం, స్వస్య పాతిత్యం చ. అత్రైవ కౌసల్యాం ప్రతి రామవచనం, "భర్తృశుశ్రూషయా నారీ లభతే స్వర్గ ముత్తమం, అపి యా నిర్నమస్కారా నివృత్తా దేవపూజనాత్, ఏష ధర్మః పురా దృష్టో లోకే వేదే శ్రుతి స్మృతః" ఇతి. మనురపి 'నాస్తి స్త్రీణాం పృథ గ్ధర్మో న వ్రతం నా ప్యుపోషణం, పతిం శుశ్రూషతే యా తు తేన స్వర్గే మహీయతే'. ఏవం శంఖలిఖితస్కాందవచనేష్వపి. అత్ర

1 బ్ర వై. కృ. జ. ఖం; అ ౬౦. 2. అధ్యా. రా: సర్గ. 8.
3 వాల్మీకి సర్గ. ౨౦

3౫౪-3౬౪. తటాకదశక దానఫలంబుకంటెను, వాపీశతక దానఫల
కంటెను, కన్యాదాన దశకఫలంబుకంటెను, యజ్ఞదశకఫల
కంటెను, నొక్క సత్యంబున నెక్కుడు ఫల మున్న దందురు. సత్యంబు
కంటె నితరంబగు ధర్మంబును, ననృతంబుకంటె ఘోరతరంబగు పా
పంబును లేవుగదా!

3౭. కాన నట్టి సత్యంబునకే నీవు బద్ధుండ వను యశస్సంపాదనకై నేను
వనవాసమే చేసెదను.

3౮. ఇట్లని యా శ్రీరాముడు మాతృదర్శనార్థమై యేగెను. ఆమెయు
శ్రీరామునికి శుభంబు గలుగవలెనని విష్ణు నారాధించుచుండెను.

3౯. * ముదితురాలును, నెల్లప్పుడు శ్రీరామునికి మేలు గలుగవలెనని వ్రత
ముల నాచరించునదియు నగు నా కౌసల్య, తెలిపట్టుచీరను ధరించి

---

*కౌసల్య వ్రతముల నాచరించు విషయము:—ఈ శ్లోకమునందు
గౌసల్యాదేవి దేవతాధ్యానాదికం బొనరించినట్లు చూపట్టుచున్నది.
పడతుల కెల్లప్పుడును పతిశుశ్రూషణమే కావింపదగినది. కాన నిట్లు
ధ్యానాదికంబు సేయుట పాడిగాదు. భర్తృశుశ్రూషణము చేతనే
సర్వఫలంబులును సిద్ధించును. అయ్యదియకాక మరొండుధర్మం బాచ
రించినచో దనకు బతనమును బతి కనిష్టమును గలుగును. ఈ విషయము
శ్రీరామచంద్రుడే కౌసల్యతో 'జనని! ఏ స్త్రీయైనను బెద్దలను సేవిం
పకపోయినపోవుగాక, దేవతాపూజాదికం బొనరింపకపోయినను
పోవుగాక. ఆమె తనభర్తకు శుశ్రూషచేసిన జాలును-ఉత్తమస్వర్గం
బామెకు లభింపగలదు. ఈ ధర్మము క్రొత్తదిగాదు. పురాతనంబుగ
లోకంబున వచ్చుచున్నదే. శ్రుతిస్మృతిప్రసిద్ధంబే' యనిపల్కెను.
మనువును, 'స్త్రీలకు బతిశుశ్రూషకంటె వేరుధర్మంబు లేదు, వ్రతం
బు లేదు, ఉపవాసంబును లేదు. భర్తృశుశ్రూషచేతనే యామె యు
త్తమ గతు లందుచున్న' దని చెప్పెను. శంఖలిఖితస్కాందవచనంబు

♦ అగ్నిం జుహోతి స్మ తదా మంత్రవత్కృతమంగళా. ౩౫

రపి 'న వ్రతే నోపవాసేన ధర్మేణ వివిధేన చ, నారీ స్వర్గ మవాప్నోతి ప్రాప్నోతి పతిపూజనాత్'. పరాశరోఽపి 'పత్యౌ జీవతి యా నారీ ఉపోష్య వ్రతచారిణీ, ఆయుష్యం హరతే భర్తుస్సా నారీ నరకం వ్రజేత్.' ఇతి. కిం బహునా అవశ్య కర్తవ్యాతిథిపూజనా దపి స్త్రీణాం భర్తృశుశ్రూషణమేవ శ్రైష్ఠ్య మిత్యుక్తం శ్రీమహాభారతే ఆరణ్యపర్వణి కౌశిక కథాప్రస్తావనే. అతః స్త్రియాః భర్తృశుశ్రూషణవ్యతిరిక్త ధర్మేషు కుత్రా ప్యనధికారా త్కథం కౌసల్యయా దేవతా రాధనం కృత మితి చేన్న, భర్త్రనుజ్ఞయా ధర్మాచరణే పూర్వోక్తదోషాభావాత్. తథా చ శంఖలిఖితౌ, 'వా: కామంతు భర్తు రనుజ్ఞయా వ్రతోపవాసనియమాదీనా మభ్యాసః'. స్త్రీధర్మే కాత్యాయనోఽపి 'భార్యా భర్తు ర్మతే నైవ వ్రతాదీ నాచరే త్సతీ.' ఇతి. ఆదిత్యపురాణే 'నారీ ఖ ల్వననుజ్ఞాతా భర్త్రా వాపి సుతేనవా, విఫలం తద్భవే త్తస్యా' ఇతి. కాత్యాయనః 'భార్యా పత్యు ర్మతేనైవ వ్రతాదీ నాచరే త్సదా.' అతః దశరథానుజ్ఞయైవ పతి శుశ్రూషణానురోధేన కౌసల్యా ధ్యానాదిధర్మాచరణం కృత వతీతి న కించి దనుపపన్నం.

♦ అగ్ని మిత్యత్ర జుహోతి, హావయతి బ్రాహ్మణేనేతి వేదితవ్యం. అతఏవ హావయంతీ మితి వక్ష్యతి, అనంతరశ్లోకే.

మంగళకార్యంబులు సలిపి మంత్రపూర్వకంబుగ అగ్నియందు హోమంబు సేయుచుండెను.

---

లందును నిట్లే చెప్పబడెను. అత్రిమహర్షియు 'ఉపవాసంబులు చేయుటచేగాని వివిధధర్మంబు లాచరించుటచేగాని నాతికి స్వర్గంబు లేదు. అయ్యది పతిసేవనమువలననే లభించును.' అని చెప్పెను. పరాశరుండును 'పతి జీవించియుండగ సతి యుపవసించి వ్రతంబు లాచరించెనేని, ఆమె భర్తయాయుస్సు కుంగిపోవును. తనకును నరకప్రాప్తియే కల్గును' అని చెప్పెను. ఇంతయేల? అవశ్యకర్తవ్యంబులగు నతిథిపూజనాదులకంటెను భర్తృసేవనమే శ్రేష్ఠతరం బని మహాభారతంబున ధర్మవ్యాధోపాఖ్యానంబున జెప్పబడినదికదా. కావ స్త్రీలకు భర్తృశుశ్రూషణకంటె వేరుధర్మమునందు బ్రవర్తించుట కధికారము లేదని పర్యవసితము. ఇట్లయ్యు గౌసల్య దేవతారాధనాదికం బెట్లు సేయుచుండె నని పూర్వపక్షము సేయరాదు.

భర్తయనుమతిచే నాయాయి ధర్మకార్యంబులు చేసినచో బూర్వోక్తదోషం బాపాదింపబడదు. ఇట్లుగ శంఖలిఖితులు చెప్పిరి: 'భర్తయనుమతిచే భార్య వ్రతోపవాసనియమాదు లనరళముగ జేయవచ్చును.' స్త్రీధర్మంబునందు గాత్యాయనుడును 'భర్తయాజ్ఞ నొంది భార్య వ్రతాదులు చేయవలయును.' అని చెప్పెను ఆదిత్యపురాణమునందు, 'భర్తచేతగాని సుతునిచేతగాని యనుమతింపబడకుండ స్త్రీయే వ్రతాదికం బొనర్చినను నది నిష్ఫలమే' యనియు, 'పతియానతి నొంది వ్రతాదు లొనరింపవలె' నని కాత్యాయనునిచేతను జెప్పబడెను. కావ భర్తృశుశ్రూషణమున కేమియు నాటంకము లేకుండ నాతనియనుజ్ఞ గైకొనియే కౌసల్య, దేవతాధ్యానాదికం బొనర్చుచున్నకతంబున నిందసందర్భం బేమియు లేదు.

♦ అగ్నియనుచోట:— జుహోతి - (హోమము సేయుచున్నది) అనగా బ్రాహ్మణునిచే హోమంబు సేయించుచున్నదని తెలియవలెను. కనుకనే తరువాతిశ్లోకంబున 'హావయంతీం - హోమమును చేయించుచున్న కౌసల్యను' అని చెప్పబడెను.

ప్రవిశ్య చ తదా రామో మాతు రంతఃపురం శుభం,
దదర్శ మాతరం తత్ర హావయంతీం హుతాశనమ్. ౪౦
[1]రామం దృష్ట్వా విశాలాక్షీ మాలింగ్యాంకే న్యవేశయత్,
మూర్ధ్న్యవఘ్రాయ పస్పర్శ గాత్రం నీలోత్పలచ్ఛవి. ౪౧
భుంక్ష్వ పుత్రేతి చ ప్రాహ మృష్ట మన్నం క్షుధార్దితః. ౪౧½

రామః ప్రాహ న మే మాతర్భోజనావసరః కృతః,
దండకాగమనే శీఘ్రం మమ కాలోఽద్య నిశ్చితః. ౪౨½
కైకేయీవరదానేన సత్యసంధః పితా మమ,
భరతాయ దదౌ రాజ్యం మమాప్యారణ్య ముత్తమం. ౪౩½

*[2]చతుర్దశహి వర్షాణి వత్స్యామి విజనే వనే
మధుమూలఫలై ర్జీవన్ హిత్వా మునివ దామిషం. ౪౪½

సా నికృత్తేవ సాలస్య యష్టిః పరశునా వనే,
పపాత సహసా దేవీ దేవతేవ దివి చ్యుతా. ౪౫½

---

*చతుర్దశేతి:—మునివ ద్వత్స్యామీతి సంబంధః. అత్రామిషశబ్దేన సూపాద్యై స్సంస్కృతం మాంస ముచ్యతే, 'ఇదం మేధ్య మిదం స్వాదు నిష్టప్త మిద మగ్నినా' ఇతి కేవలమాంసస్వీకార స్యోత్తరత్ర వక్ష్యమాణత్వాత్.

---

1 అధ్యా. రా: సర్గ 4. 2 వాల్మీ. రా: సర్గ. ౨౦.

౪౦. శ్రీరాముం డంతట తల్లియంతిపురంబు జొచ్చి యట నగ్నికుండం బున హోమంబు సేయించుచున్న మాతం గాంచెను.

౪౧-౪౨౹. ఆమెయు శ్రీరాముని జూచినతోడనే యాతని నాలింగనము చేసికొని, యొడిలో జేర్చికొని మూర్ధం బాఘ్రాణించి నీలోత్పల సమానవర్ణం బగు నాతని మేను నిమిరి 'నాయనా! అకట గడు డస్సి యున్నట్లు తోచుచున్నావు. ఈ మృష్టాన్నము భుజింపు' మనియెను.

౪౨౹. శ్రీరాముడు 'అమ్మా! నా కిప్పుడు భోజన మవసరము లేదు. దండ కాటవులకు నే నిప్పుడే పోవలెనని యేర్పాటాయెను.

౪౩౹. సత్యసంధుం డగు నాజనకుడు కైకేయీమాత కిచ్చినమాటంజేసి భరతునికి రాజ్యప్రదానంబును నాకు నుత్తమం బగు వరణ్యావాసంబును గల్గినది.

౪౪౹. * నేనును, మాంసభక్షణంబు సేయక స్వాదుఫలభక్షణంబున జీవ యాత్ర గడపుచు బదునాల్గువత్సరంబులును, విజనంబగు వనంబున మౌనులవలె, నివసింపబోవుచుంటిని,

౪౫౹. అని యనగానే యాకౌసల్య మహాపరశునికృత్త వనసాలమహీరుహ శాఖంబోలె, ద్యుచ్యుతదేవకన్యం బోలె భూమిపై బ్రాలెను.

---

* పదునాల్గను చోట:—మునివోలె నివసించె నని యన్వయము. ఇట మాంసం బన యాచకులచే వండబడిన మాంసం బనియర్థము. 'ఇది పరిశుద్ధమైనది, ఇది స్వాదుతైనది, ఇది అగ్నియందుంచబడినది' అని కేవలమాంసమును స్వీకరించినటుల మున్ముందుజెప్పబడుచుగావ.

తా మదుఃఖోచితాం దృష్ట్వా పతితాం కదలీ మివ,
రామ స్తూత్థాపయామాస మాతరం గతచేతసం. ४६५

సా రాఘవ ముపాసీన మసుఖార్తా సుఖోచితా,
ఉవాచ పురుషవ్యాఘ్రము ముపశృణ్వతి లక్ష్మణే. ४८५

యది పుత్త్ర నజాయేథా మమ శోకాయ రాఘవ,
న స్మ దుఃఖ మతో భూయః పశ్యేయ మహ మప్రజాః. ४७५

ఏక ఏవహి వంధ్యాయాః శ్శోకో భవతి మానసః,
అప్రజాస్మీతి సంతాపో హ్యన్యః పుత్త్ర న విద్యతే. ४८५

* దశ సప్త చ వర్షాణి తవ జాతస్య రాఘవ,
ఆసితాని ప్రకాంక్షంత్యా మయా దుఃఖపరిక్షయం. ५०५

---

* ౧శేతి. తవ జాతస్య త్వయి జాతేసతి దశసప్తచ వర్షాణి దుఃఖపరిక్షయం ప్రకాంక్షంత్యా-తవ యౌవరాజ్యేనేతి భావః - మయా సుఖ మాసితాని, ఆస్థితాని. నను 'ఊనషోడశవర్షో మే రామో రాజీవలోచనః' ఇతి విశ్వామిత్ర ముద్దిశ్య దశరథేనోక్తత్వాత్, వివాహానంతరం 'ఉషిత్వా ద్వాదశసమా ఇక్ష్వాకూణాం నివేశనే' ఇత్యుపరి సీతయా అనసూయాంప్రతి వక్ష్యమాణత్వాచ్చ, రామ స్యాష్టావింశతి వర్షాణి వర్తంతే, తత్కథం సప్తదశవర్షాణీత్యుచ్యత ఇతిచేత్, నైష దోషః. అత్ర జాతస్యేత్యుక్తిః గర్భైకాదశేషు రాజన్య మిత్యుక్తోపనయనప్రాప్తద్వితీయజన్మవివక్షయా, నతు ప్రథమ జన్మతః. ఉపనయనకర్మణా ద్విజానాం ద్వితీయజన్మ

౪౬. దుఃఖంబున కనర్హురాలును, నరటిచెట్టుంబలె భూమిపై బడియున్నదియు, మూర్ఛ నొందియున్నదియు నగు నా కౌసల్యను శ్రీరాముడు పట్టి లేవనెత్తెను.

౪౭. సుఖము నందుటకు నుచితయైన యాకౌసల్య, దుఃఖార్తయై చెంతనున్న ఆ పురుషపుంగవుని గాంచి లక్ష్మణుడు వినుచుండగనే యిట్లనియె.

౪౮. నాయనా! శ్రీరామచంద్రా! నీవు నాకు జన్మింపకయేయుండిన నిట్టిదుఃఖ ముండియుండకపోవునుగదోయి.

౪౯. గొడ్రాలున కొక్కటేదుఃఖము - పుత్త్రులు లేరని. మఱి యితర సంతాప మేదియు నామె కుండదు.

౫౦. నేను బడుకడగండ్ల కంతముండు ననుసంతసంబున నీవు జన్మించిన దాదిగ నీపదునేడేండ్లును *నెట్టులో ప్రొద్దుపుచ్చుచుంటిని.

---

* పదునేడేడు లనుచోట:—నీవు పుట్టినతర్వాత, నీకు యౌవరాజ్యము లభించుటచే నా కష్టములు గట్టెక్కునని ఈ పదునేడువత్సరములు (కైకేయ్యాదులు పెట్టు)బాధలు సరకుసేయకుంటినని భావము. 'పదునారువత్సరములైనను నిండని ఈ సుకుమారుం డాలంబెట్లు సేయగలడా యని నాకు దోచుటలేదు.' అని విశ్వామిత్రునితో, నాతని యజ్ఞసంరక్షణార్థమై పంపుమని యడుగుటకు వచ్చినపుడు, దశరథుడును, 'వివాహంబైన తరువాత పండ్రెండు వత్సరములు ఇక్ష్వాకుగృహంబున గడపి...'యని యనసూయా మహాదేవితో సీతయు వచించుటం జేసియు, శ్రీరామున కిర్వదెన్మిదివత్సరముల ప్రాయ ముండ, బదునేడని ఈశ్లోకంబున నెట్లు చెప్పబడిన దని ప్రశ్నచేయరాదు. ఇట్లు చెప్పు టసంగతముకాదు. ఏలయన నీశ్లోకంబున 'నీవు పుట్టిన దాదిగ' యనుమాట 'గర్భైకాదశ వత్సరంబుల రాజన్యుల కుపనయనంబు గావింపవలయును' అను విధిచొప్పున నుపనయనప్రాప్త

1పితా గురు ర్యథా రామ తవాహ మధికా తతః,
పితా౽౽జ్ఞప్తో వనం గంతుం వారయేయ మహం సుతం. ౫౧౪

---

త్వం యాజ్ఞ్యవల్క్యేనోక్తం. 'మాత ర్యగ్రే ప్రజాయంతే ద్వితీయం మౌంజిబంధనాత్, అత్రాస్య మాతా సావిత్రీ పితా త్వాచార్య ఉచ్యతే బ్రాహ్మణక్షత్రియవిశ స్తస్మా దేతే ద్విజాతయ' ఇతి. ఉపనయనంతు గర్భైకాదశేషు రాజన్య మితిసూత్రవ్యాఖ్యానే గర్భైకాదశేష్వితి బహువచనేన గర్భనవమ గర్భదశమ గర్భైకాదశాని గృహీతాని. రాజవర్యస్య రఘునాథస్యతు గర్భనవమే శుద్ధాష్టమే వర్షే ఉపనయనంకృతం. అతః ఉపనయనానన్తరంసప్తదశవర్షాణి జాతాని. అత్ర వివాహాత్పూర్వం ద్వాదశ వివాహానన్తరం ద్వాదశ-పంచవింశే వనప్రవేశ ఇతివివేకః కుత ఏవం సంఖ్యానిర్ణయ ఇతిచేత్ - రావణసన్న్యాసినం ప్రతి సీతయా 'ఉషిత్వా ద్వాదశసమా ఇక్ష్వాకూణాం నివేశనే' ఇత్యుక్తత్వాత్, 'తత్ర త్రయోదశే వర్షే రాజా మంత్రీ యతః ప్రభుః' ఇతి తయైవోక్తత్వాచ్చ, వనవాసారంభసమయ మభిప్రేత్య 'మమ భర్తా మహాతేజా, వయసా పంచవింశకః' ఇత్యుక్తత్వాచ్చ శ్రీరామస్య వనప్రవేశః పంచవింశ ఇతిసిద్ధం. పునశ్చ విశ్వామిత్రంప్రతి దశరథేన 'ఊనషోడశవర్షో మే

---

1 అధ్యా. రా : సర్గ

౨౧౪. కుమారా! తల్లి - తండ్రి - గురువు అనిరి. తండ్రియాజ్ఞచే నీవు వనంబునకు బోదొరకొంటివి. పోవద్దని (యధికతరనగు) నేను ని న్నాజ్ఞాపించుచున్నాను.

---

ద్వితీయజన్మంబును బురస్కరించుకొని చెప్పబడినదేకాని, యథావత్ప్రథమజన్మంబును బట్టి కాదు. ఉపనయనంబునం జేసి ద్విజులకు ద్వితీయజన్మప్రాప్తి కల్గునని యాజ్ఞవల్క్యులు:— 'మొదటిజన్మంబు మాతగర్భంబున గలుగును. మఱి మౌంజీబంధనముచే ద్వితీయజన్మంబు గలుగును. ఇట్లు జన్మించునపుడు గాయత్రియే మాతయగును; ఆచార్యుడే పిత యగును. ఇందుచేతనే బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యులు ద్విజు లనబరగుచున్నారు.

ఉపనయనము:—'గర్భైకాదశంబులందు రాజన్యున కుపనయనంబు సేయవలయును' అనుసూత్రమును వ్యాఖ్యానించుపట్టున 'గర్భైకాదశంబులు' అను బహువచనసామర్థ్యంబునం జేసి గర్భనవమ గర్భదశమ గర్భైకాదశ వర్షంబులే గ్రాహ్యంబులు. మఱి రాజన్యతిలకుండగు రఘురామునికి గర్భనవమవత్సరంబున - జన్మాదష్టమవర్షమం దుపనయనము సేయబడెను. అట్లుపనయనం బైనతరువాత పదునేడు వత్సరములు సెల్లెను. వివాహమునకుబూర్వము పండ్రెండును తదనంతరము పండ్రెండును గడచిన నిరువదియైదవవత్సరంబున నడవికి బోయెను. ఇట్లుగ వివేచనము సేయుటొప్పును. వనంబునకు బయనమగుసరికి నాతని కిరువదియైదు వత్సరంబు లని యాతని వయోనిర్ణయ మెట్లు సేయు రందురా? యట్లడుగుడు. రావణుడు సన్న్యాసిరూపంబున దన యొద్దకు వచ్చినపుడు సందర్భవశంబున సీతపల్కిన వచనంబు లివిగో! '(వివాహానంతరము) ఇక్ష్వాకుడు స్వగృహంబున బండ్రెండు వత్సరంబులు గడపి...' యనియు, 'పదుమూడవవత్సరంబున రాజును మంత్రియును ప్రభువును...' అనియు, వనవాసారంభసమయంబును మనంబున నుంచుకొని 'మహాతేజస్వియగు నాపతి పంచవింశతి వత్సరప్రాయము వాడు' అను ప్రమాణంబునుబట్టియు శ్రీరామునికి వనవిర్గమనకాలంబునకు నిర్వదియైదువత్సరము లనియే సిద్ధము.

యది గచ్ఛసి మద్వాక్య ముల్లంఘ్య నృపవాక్యతః,
తదా ప్రాణా& పరిత్యజ్య గచ్ఛామి యమసాదనం. ॥ ౨౪

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అయోధ్యాకాండే
పంచమ స్సర్గః.

---

షష్ఠ స్సర్గః.

[1]లక్ష్మణోఽపి తత శ్శ్రుత్వా కౌసల్యావచనం రుషా,
ఉవాచ రాఘవం వీక్ష్య దహన్నివ జగత్త్రియమ్. ౧

పితరం భ్రాంతహృదయం కైకేయీవశవర్తినం,
బద్ధ్వా నిహన్మి భరతం తద్బంధూ న్మాతులా నపి. ౨
అద్య పశ్యంతు మే శౌర్యం లోకా న్ప్రదహత స్సురాః. ౨౪

రామ త్వ మభిషేకాయ కురు యత్న మరిందమ,
ధనుష్పాణి రహం తత్ర నిహన్యాం విఘ్నకారిణః. ౩౪

---

రామో రాజీవలోచనః' ఇత్యుక్తస్య ఊనషోడశవర్షత్వస్య ద్వాదశవర్షే పర్యవసానాత్. కుతః? 'బాలో ద్వాదశవర్షోయ మకృతాస్త్రశ్చ రాఘవః' ఇతి తదనురూపేణ రావణం ప్రతి మారీచే నోక్తత్వాత్. వచనాంతరవిరోధపరిహారాదికం బాలకాండ ఏవ కృతఇతి శం.

---

1 అధ్యాత్మ స. 4.

౫౭౪. అట్లు నాయాజ్ఞను వమ్ముచేసి రాజాజ్ఞపైననే వనంబునకు బోదువో, నేనుగూడ యీసువుల విడిచి యమసదనంబునకు బోయెదను.

ఇది శ్రీరామాయణసారోద్ధారమున అయోధ్యాకాండమునందు పంచమసర్గము.

---

## ఆఱవ సర్గము.

౧. అట్లు పల్కిన కౌసల్యావచనంబులు లక్ష్మణుడు విని రోషకషాయిత నేత్రుడై నేత్రాగ్నిజ్వాలల ముల్లోకంబులను బొరివుచ్చువానిం బోలె శ్రీరాముని జూచి యిట్లనియె.

౨-౩౪. కైకేయీవశుడై విభ్రాంతచేతస్కుండగు నీ దశరథుని గట్టిపడవైచెదను. భరతుని, నాతని మాతులుం డాదిగా గల బంధుగుల నందఱను మృత్యువువాతం బడనేసెదను. దీనికెల్ల దేవతలు సాక్షులై కనుచుందురుగాక.

౩౪. రామచంద్రా! నీవిక పట్టాభిషేకమునకు గావలసిన యత్నం బొనరింపుము. ఈధనువు నాచేత నున్నంతవరకు నెవ్వరిట విఘ్నం బాచరింప నెంతురో చూచెదను.

---

మఱియు విశ్వామిత్రునితో 'బహువాసవత్సరంబులైనను సరిగ నిండని నా శ్రీరామచంద్రుని...' అని దశరథు డాడిన ...ఊనషోడశవర్షత్వమునకు బండ్రెండువత్సరము లనియే పర్యవసానము.

ఏల యన 'ద్వాదశవర్షప్రాయంబు గల్గి యస్త్రాదికంబులం దాఱితేరకమున్నే యాబాలుడు...' ఇత్యాదిగ బ్రభువగు రావణునితో మారీచుడు మొఱపెట్టికొనెను. దీనిని గూర్చిన వచనాంతరవిరోధంబు లన్నియు మాబాలకాండంబుననే పరిష్కరింపబడినవి గాన నింతటితో నిట విరమింపబడెను.

[1]గురో రప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః,
ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనమ్. ౪½

న తం పశ్యా మ్యహం లోకే పరోక్షమపి యో నరః,
స్వమితోఽపి నిరస్తోఽపి యోఽస్య దోష ముదాహరేత్. ౫½

దేవకల్ప మృజుం దాంతం రిపూణా మపి వత్సలం
అవేక్షమాణః కో ధర్మం త్యజేత్ పుత్ర మకారణాత్. ౬½

అనురక్తోఽస్మి భావేన భ్రాతరం దేవి తత్త్వతః. ౭

సత్యేన ధనుషా చైవ దత్తే నేష్టేన తే శపే,
దీప్త మగ్ని మరణ్యం వా యది రామః ప్రవేక్ష్యతి, ౮
ప్రవిష్టం తత్ర మాం దేవి త్వం పూర్వ మవధారయ. ౮½
[2]న శోభార్థా విమౌ బాహూ న ధను ర్భూషణాయ మే,
నాసి రాబంధనార్థాయ న శరా స్స్తంభహేతవః, ౯½
అమిత్రదమనార్థం మే సర్వ మేత చ్చతుష్టయం. ౧౦
[3]ఇతి బ్రువంతం సౌమిత్రి మాలింగ్య రఘునందనః. ౧౦½

1 వాల్మీ. రా: సర్గ, ౨౧. 2 వాల్మీ. రా: సర్గ ౨౩.
3 అధ్యా. రా: సర్గ ౪.

౪౪. కృత్యాకృత్యము లెఱుంగక న్యాయమార్గదూరుడై మిట్టిపడుచుండు గురువొనర్చిన కార్యంబైనను శాసనార్హంబగును. (కావున మన తండ్రియొనర్చిన యికార్యము దండనార్హంబ యని భావము.)

౫౪. బలవత్తర శత్రువునైనను, అపరాధం బొనర్చి దండితుండైనను, పరోక్షమందు గూడ శ్రీరామునిపై దోసమెన్ను మనుజుని నే నెంచును గాంచలేదు.

౬౪. అట్టి పరిశుద్ధుని, దేవసముని, అట్టి దాంతుని, (కైకేయ్యాదులగు) శత్రువుల పేరిమంగూడ జూఅగొనువానిని, అట్టి ధర్మాత్ముండగు ని పుత్త్రుని నకారణంబుగ ద్యజించుట కీతనికి జేయుటులాడెనో తెలియరాదు.

౭. అమ్మా! కౌసల్యాదేవీ! శ్రీరామునియెడ నాకు హృదయపూర్వకంబగు ప్రీతి కలదు.

౮-౯౪. ఇదిగో! యీ నా యాయుధంబుపై జేయివైచి చెప్పుచున్నాను-సత్యేష్టాపూర్తదత్తముల పేరిట బల్కుచున్నాను. అరణ్యమేకాదు, బగబగమండు మహాగ్నియైనను శ్రీరాముండు ప్రవేశించునెడల, వానికంటె ముందుగనే లక్ష్మణుం డం దుఱికె నని వినగలవు.

౯-౧౦. ఈ బాహువులు శోభకొఱకుగాదు - ఈ ధను వలంకారముకొఱకుగాదు - ఈ కత్తి యొరలో నిదురవోవుటకు కాదు - ఈ బాణమ్ములమ్ముల పొదులలో తుప్పువట్టుటకుగాదు. నా కివన్నియు శత్రువుల నుగ్గునూచంబుగ నుఱుమాడుటకే.

౧౦౪. ఇట్లుగ బల్కుచున్న యాసౌమిత్రిం గవుంగిలించి శ్రీరాము డిట్లనియె.

శూరోఽసి రఘుశార్దూల మమాత్యంతహితే రతః,
జానామి సర్వం తే సత్యం కింతు తత్సమయో నహి. ౧౧౪

*తదేనాం విసృజానార్యాం క్షత్రధర్మాశ్రితాం మతిం,
ధర్మమాశ్రయ మా తైక్ష్ణ్యం మద్బుద్ధి రనుగమ్యతాం.౧౨౪

---

* వ్యా :—తదితి. అనార్యాం దుష్టాం, పితర మపి హత్వా రాజ్యం కుర్యా మిత్యేవంరూపాం క్షత్రధర్మాశ్రితాం కేవలశూరధర్మాశ్రితాం రాజ్యశాఠ్యసహితక్షత్రధర్మాశ్రితా మితి వాఽర్థః. క్షత్రధర్మస్య తథాత్వం ప్రతిపాదితం మహాభారతే రాజధర్మే "క్షత్రధర్మో మహారౌద్ర శ్శఠకృత్య ఇతి స్మృతః" ఇతి, తాదృశీం మతిం విసృజ. ధర్మమపాశ్రయస్వ,మా తైక్ష్ణ్యం, ఇతఃపరమపి క్రౌర్యం మాశ్రయ, మద్బుద్ధిః మమబుద్ధిః, అనుగమ్యతాం, అనువర్త్యతాం లోకాయతమతకేవలరాజనీతి ర్నాశ్రయణీయా, కింతు ధర్మమాశ్రితా నీతిరిత్యర్థః. అస్మిన్ హి శాస్త్రే ధర్మస్థాపన ముచ్యతే. స్థాపనంచ ధర్మమంతరేణ కేవలనీతిరేవార్థసాధన మితిలోకాయతమతనిరాసేన ప్రవర్తనం. తేన తత్ర తత్ర లక్ష్మణముఖేన లోకాయతం పరివర్తితే ఉపన్యస్తే తన్నిరాసేన రామేణ ధర్మః స్థాపిత ఇతి రహస్య మితి.

---

* వాల్మీ. రాః సర్గ ౨౧.

౧౧౫. ఓయీ, రఘుసింహమా! నీ వంతటివాడ వని యే నెఱుంగుదు. నా కత్యంతంబు గూర్చువాడ వనియు నెఱుంగుదు. నీవు పల్కినదియెల్ల సత్యంబనియును నెఱుంగుదు. కాని యట్టిపని కిది యదనుగాదు.

౧౨౫. * అసలంత కఱకుదనము నేల పూనవలెనో నాకు దెలియవచ్చుటలేదు. (తండ్రిని మడియించి రాజ్యంబు గైకొందు మను) అనార్యబుద్ధిని విడనాడుము, అది కేవలము క్షత్రధర్మము. కొంచెము ధర్మంబుపైగూడ కనుపెట్టియుండుము. నాబుద్ధి రవంత గైకొనుము.

---

* అనార్యబుద్ధి.— తండ్రినిగూడ వధించి రాజ్యపరిపాలనము సేయుదు నను ననార్యబుద్ధి - అనగా కేవల శూరధర్మాశ్రితం బని కాని, రౌద్రకార్య సహితక్షత్త్రధర్మాశ్రితబుద్ధి యనికాని భావము. భారతంబునగూడ క్షత్త్రధర్మము రౌద్రమును కార్యసహితమును నని చెప్పబడినది. కాన నట్టి రౌద్రకార్య సహితంబగు నీ క్షత్త్రబుద్ధిని విడనాడు మనియు, నేను (శ్రీరాముడు) చెప్పినచొప్పున నీవు (లక్ష్మణుడు) వర్తింపుమనియు పైశ్లోకమున కర్థము. లోకాయతమతంబగు కేవల రాజనీతిని నాశ్రయింప గూడదనియు ధర్మంబునే యాశ్రయింపవలె ననియు భావము.

ఇచ్చట ధర్మస్థాపనమే తెలుపబడుచున్నది. ధర్మము నాశ్రయింపకుండ కేవలనీతివలననే కార్యసాధనం బగునను లోకాయత (లోకప్రసిద్ధము) మతములను నిరసించి ప్రవర్తించుటయే ఆ ధర్మస్థాపనము. లక్ష్మణుడు కేవలలోకాయతమత మాశ్రయింపదగిన దనునప్పుడు కాదని యట్టినీతిని నిరసించుచు, శ్రీరాముడు ధర్మోపన్యాసములను గావింపుచు ధర్మమును స్థాపించుచుండె నను నదియే యిందలి రహస్యమని యెఱుంగదగును.

[1] న వై న శక్నోమి పితుః ప్రతిజ్ఞా, మిమా మకర్తుం సక
లాం యథావత్, న హ్యేవయో స్తాత గురుర్నియోగే,
దేవ్యాశ్చ భర్తా న గతి స్స ధర్మః. ౧౩౫

[2] సోఽభిషేకనివృత్త్యర్థైః ప్రవాసార్థైశ్చ దుర్వచైః,
ఉగ్రైర్వాక్యై రహంతస్యా నాన్య ద్దైవా త్సమర్థయే. ౧౪౫

కథం ప్రకృతిసంపన్నా రాజపుత్రీ తథాగుణా,
బ్రూయా త్సా ప్రాకృతేవ స్త్రీ మత్పీడాం భర్తృసన్నిధౌ.
౧౫౫

సుఖదుఃఖే భయక్రోధౌ లాభాలాభౌ భవాభవౌ,
యచ్చ కించి త్తథాభూతం నను దైవస్య కర్మ తత్. ౧౬౫

ఋషయోఽప్యుగ్రతపసో దైవే నాభిప్రపీడితాః,
ఉత్సృజ్య నియమాం స్తీవ్రాన్ భ్రశ్యంతే కామమన్యుభిః.
౧౭౫

అసంకల్పిత మేవేహ య దకస్మా త్ప్రవర్తతే,
నివ ర్త్యారంభ మారబ్ధం నను దైవస్య కర్మ తత్. ౧౮౫

1 వాల్మీ. అ: సర్గ ౨౧  2 వాల్మీ. అ: సర్గ ౨౨.

౧౩౪. నాయనా, లక్ష్మణా! యింతయేకాదు. భరతునకును నాకునుం గూడ తండ్రి మాననీయుడు. అతడేపనికైనను మమ్ముల నియోగించుటకు కర్త. అట్టిచో నీ ప్రతిజ్ఞను నే నెట్లు యథాప్రకారముగ నెరవేర్పకుండగలనో నీవే చెప్పుము. ఇంతటితో బోలేమసుమా- కౌసల్యాదేవికి గూడ (భర్త యగుటచే) నాతడే నియంత - గతి. అతడే సకలధర్మము.

౧౪౪. తమ్ముడా! నీ తలంపు లవి యొకవిధముగా నున్నవి. కాని నా పట్టాభిషేకంబున కంతరాయంబు గల్గించి వన్నరణ్యముల పాల్సేయుటకు కైకేయి యాడిన మహాదారుణవాక్యంబుల కెల్ల దైవమే కారణము. ఇదిగాక మఱెట్లు సమర్థించుటకును నాకు తెలివు గన్పట్టుట లేదు.

౧౫౪. కానిచో సత్స్వభావసంపన్నయై, మహారాజవంశసంభూతయై, దయాదిసద్గుణంబులకెల్ల గనియై పరగు కైకేయి, ప్రాకృతస్త్రీవలె, తన భర్తతో నిట్టి పరుషభాషణంబు లాడి నాకిట్టి యిక్కట్టులు గల్పింప నెంచునా?

౧౬౪. సుఖదుఃఖములును భయక్రోధంబులును, లాభాలాభంబులును, జననమరణంబులును దైవకార్యంబు లనియే యెఱుంగుము.

౧౭౪-౧౮౪. ఓయీ! ప్రాకృతుల లెక్కయేమి? మహాద్భుతనియమబద్ధులై ఘోరతపంబు లాచరించు విశ్వామిత్రాదిమహాఋషులే దైవ[illegible]ంచితులై కామక్రోధాములవశం జిక్కి తమ నియమంబుల బో[illegible]ని భ్రష్టు లగుచున్నారు. ఎంతయో దృఢసంకల్పముతో [illegible]రంభించిన యొకకార్యమునకు విఘ్నము లుప్పతిల్లి య[illegible] మ[illegible]నే మటుమాయమగుచుండును. ఎన్నడును గల[illegible]గనివిని[illegible]యుంగని మఱొక కార్య మకస్మాత్తుగ ఫలసిద్ధిం బ్రొందుచుండును. ఇట్టి వీని కెల్ల దైవంబు మూలంబుగాక మ[illegible]వు?

[1]ఇతి బ్రువతి రామే తు లక్ష్మణోఽవాక్శిరా ముహుః,
అగ్రాహ్యా దీక్షమాణస్తు తిర్యగ్భ్రాతర మబ్రవీత్. ౧౯౫
కథం హ్యేత దసంభ్రాంత స్త్వద్విధో వక్తు మర్హతి. ౨౦
యథా దైవ మశౌండీరం శౌండీర క్షత్రియర్షభ,
కిం నామ కృపణం దైవ మశక్త మభిశంససి. ౨౧

విక్లబో వీర్యహీనో యః స దైవ మనువర్తతే,
వీరా స్సంభావితాత్మానో న దైవం పర్యుపాసతే. ౨౨

అద్య మత్పౌరుషహతం దైవం ద్రక్ష్యంతి వై జనాః. ౨౨౫

*లోకపాలా స్సమస్తా స్తే నాద్య రామాభిషేచనం,
నచ కృత్స్నా స్త్రయో లోకా విహన్యుః కింపునః పితా.
౨౩౫

*వ్యా:—లోకపాలా ఇతి:—'తదేనా' మిత్యారభ్య 'నను దైవస్య కర్మ తత్' ఇత్యంతేన శ్రీరామవచనేన పురుష కారాపేక్షయా దైవమేవ ప్రబల మితి ద్యోత్యతే. పునశ్చ కథం హ్యేత దిత్యారభ్య కింపునః పితేత్యాది లక్ష్మణ వాక్యై ర్దైవాపేక్షయా పురుషకార ఏవ ప్రబల ఇతి ప్రతీయతే.

1 వాల్మీ. రా: స్గ ౨౩.

౧౯½. ఇట్లుగ నా శ్రీరామచంద్రుడు పల్కుటతోడనే లక్ష్మణుడు తల వంచుకొని యోరచూపులు జూచుచు నన్నతో నిట్లనెను.

౨౦-౨౧. అన్నా! నీ వేపనిజేయుటకును సమర్థుండవు - అందును క్షత్రియపుంగవుండవు. అట్టి నీవు, ఏపని యొనరించుటకును శక్తిచాలని యసమర్థంబగు నాదైవమే ప్రధానమని యా దీనదైవమునే వందివలె బొగడుచున్నావు. నీవలె భ్రాంతినొందనివా డెవ్వడును నిట్లుపలుకడు. (దైవ మల్ప మనిభావము).

౨౨. పిరికిపందయు బరాక్రమహీనుండును నాదైవము ననుసరించిన ననుసరించుగాక - వీరులకు ధీరులకుమాత్ర మాక్లిష్టదైవముజోలి యక్కఱలేదు.

౨౨½. దైవబలముచేతనే నీపట్టాభిషేకమునకు విఘ్నము కల్గెనని జను లనుకొనుచుండిరికాబోలు. ఓహో! అట్టిదైవము నాపౌరుషమునెదుట గడ్డిపోచయైనను గాదని యా భ్రాంతిమతులకు జూపెదను.

౨౩½. * ఇంద్రాద్యష్ట దిక్పాలురును స్వర్గమర్త్య పాతాళ లోకంబులును గూడ నేకమై వచ్చినను నీ పట్టాభిషేకంబునకు విఘ్న మొనరింప లేరు. ఇక నీ ముదుసలి లెక్కయేమి ?

---

* దిక్పాలురనుచోట:—'తండ్రినిగూడ వధించి' ఇత్యాద్యర్థమిచ్చు శ్లోకము మొదలుగాని 'ఇట్టివానికెల్ల దైవంబే మూలంబు' అని యర్థమిచ్చు శ్లోకాంతమువఱకు శ్రీరాముం డాడిన మాటలచే దైవమే ప్రబల మని చూపట్టును. 'ఈ దైవము లెక్కయే' మనుచు 'తండ్రి లెక్కయే' మనుచు లక్ష్మణుం డాడినవాక్యములచే పౌరుషమే (పురుషప్రయత్నమే) ప్రధాన మనితోచును. దైవ పౌరుషంబులలో నేది ప్రబలతరము? దేనికైన నొకదానికే ప్రాబల్య ముండవలెను గాని రెంటికింగూడ నుండుట సంగతము కాదుగదా? దైవము-

త మువాచ రఘుశ్రేష్ఠో లక్ష్మణం క్రోధమూర్ఛితం. ౨౮

ఏవంచ పరస్పర విరుద్ధత్వాత్, ఉభయో ర్బల్య మసంగత మితిచే త్సత్యం. దైవబలమేవ బల్య మితిలోకే ప్రసిద్ధం. పౌరుష విషయే మహాభారతే "ప్రాప్యతే కర్మణా సర్వం న దైవా దకృతాత్మనా, తథా స్వర్గశ్చ భోగశ్చ నిష్ఠా యాచ మనీషితా. సర్వం పురుషకారేణ కృతే నేహోపలభ్యతే, జ్యోతీంషి త్రిదశా నాగా యక్షా శ్చంద్రార్కమారుతాః, సర్వే పురుష కారేణ మానుషా దేవతాంగతాః." ఇత్యాది వచనార్థ పర్యాలోచనయా పౌరుష మేవ ప్రాధాన్య మితి జ్ఞాయతే. తత్ర కథం వా సిద్ధాంత ఇతిచే దుచ్యతే. దైవం పురుషకారేణ వినా న కార్యక్షమం, పురుషకారోఽపి దైవం వినా న కార్యక్షమః. అతః కార్యాయ ఉభయము ప్యవశ్యాపేక్షణీయ మితి. ఏతదభిప్రాయక ముభయప్రాబల్యవచనం. తథాచ మహాభారతే:— "నాబీజం జాయతే కించి న్న బీజేన వినా ఫలం, బీజా ద్బీజం ప్రభవతి బీజాదేవ ఫలం స్మృతం. యథా బీజంవినా క్షేత్ర ముప్తం భవతి నిష్ఫలం, తథా పురుష కారేణ వినా దైవం న సిద్ధ్యతి. క్షేత్రం పురుషకారస్తు దైవం బీజ ముదాహృతం, క్షేత్రబీజసమాయోగా త్తత స్సస్యం సముద్యతే. కృతః పురుషకారస్తు దైవ మేవానువర్తతే, న దైవ మకృతే కించి త్కస్యచి ద్దాతు మర్హతి. యథాఽగ్నిః పవనో

౨౪. ఇట్లుగ మహాక్రోధసమన్వితుండై పల్కుచున్న లక్ష్మణుని గాంచి శ్రీరామచంద్రుం డిట్లనియె.

---

బలీయ మని లోకంబున వాకొనబడుచుండును. పౌరుషమునకే ప్రాధాన్య మిచ్చి మహాభారతంబున నీక్రిందివిధంబున జెప్పబడెను:— 'తా నొనర్చిన కార్యంబునుబట్టియే సర్వంబును సిద్ధించుచుండును. అంతియేకాని పౌరుషము జూపని వ్యక్తునకు దైవ మేమియు సాయ పడదు. అట్లుగనే స్వర్గాదిభోగంబులును, విద్యయు, బుద్ధిమత్త్వాది కంబునుగూడ పురుషప్రయత్నము లేనిదే లభింపనేరవు. నక్షత్రాది కంబులును, యక్షనాగాదిసురనికరంబులును, వాయ్వాదులునుంగూడ నిట్లే మనుజత్వమునుండి దేవత్వముం బొందినవే. ఇట్టిచో సిద్ధాంత మేమి యను ప్రశ్నమునకు సమాధాన మీ క్రిందివిధమున చెప్పబడు చున్నది.

పురుషప్రయత్నము లేక దైవముచేత నేమియు గాజాలదు. మ ఱెంత పౌరుషము జూపినను దైవసాహాయ్యము లేక యయ్యది ఫల కారి కానేరదు. కాని కార్యానుకూల్యము గావలెనన్న దైవపౌరు షములు రెండును గూడ నావశ్యకములే, రెంటికిని ప్రాబల్య మున్నది. ఈ యభిప్రాయంబునే మహాభారతమందలి యీ క్రింది శ్లోకంబులు ధ్రువపఱచుచున్నవి. "వితనము లేని దేదియు నుద్భ వింపదు, ఇక నా వి తనంబు లేక ఫలంబును సిద్ధింపదు గదా. కాన నట్టి బీజమున కేదియో బీజ ముండియే తీరవలెను, అట్టి బీజము నుండియే ఫలమును ఫలింపవలెను... బీజములు లేకుండ పొలములో నెంత వితినను ఫలమేమియు నుండదు అట్లు దైవము లేకుండ బురు షకారముచేత నేమియు గానేకాదు. ఇట క్షేత్రమే పురుషకారము బీజమే దైవము. అట్టి క్షేత్రబీజసంయోగంబునం జేసి సస్య ముద్భ విల్లుచుండును,......పురుషప్రయత్నము లోపము లేకుండ జేసినచొ దైవము మన కనుకూలుడుగ నుండును. అంతియే కాని పురుషప్ర యత్నమే చేయనివానికి దైవ మిసుమంతయు జేయజాలదు...... స్వల్పుండైన యగ్నియు, వాయువు సహాకారి యైనప్పుడు మహో

[1] య దిదం దృశ్యతే సర్వం రాజ్యం దేహాదికంచ యత్,
యది సత్యం భవేత్తత్ర ఆయాస స్సఫలశ్చ తే. ౨౪
భోగా మేఘవితానస్థవిద్యుల్లేఖేవ చంచలాః. ౨౫

ఆయు రప్యగ్నిసంతప్తలోహస్థ జలబిందువత్. ౨౬

యథా వ్యాలగలస్థోపి భేకో దంశా నపేక్షతే,
తథా కాలాహినా గ్రస్తో లోకో భోగా నశాశ్వతాన్. ౨౭

కరోతి దుఃఖేన హి కర్మతంత్రం, శరీరభోగార్థమహ
ర్నిశం నరః, దేహస్తు భిన్నః పురుషా త్సమీహ్యతే,
కో వాఽత్ర భోగః పురుషేణ భుజ్యతే? ౨౮

---

ద్యూతే సూనక్తోఽపి సుమహా ద్భవేత్, తథా కర్మసమాయుక్తం దైవం సాధు వివర్ధతే." ఏవ ముభయో రావశ్యకత్వే శ్రీరామేణ లక్ష్మణోక్తపురుషకారః కిమితి పరిత్యక్త ఇతిచే దుచ్యతే. లక్ష్మణోక్త పురుషకారస్య పితృవచనపరిపాలనరూపధర్మవిరుద్ధతయా పరిత్యాగసంభవా దల మతి విస్తరేణ.

---

1 అధ్యా. రా: సర్గ ౪.

౨౪-౨౫. ఓయీ! ఈరాజ్యంబును, ఈభోగంబులును, ఈ కప్పట్టు సర్వంబును సత్యంబైనచో నా పట్టాభిషేకంబునకు విఘ్నంబు వొరయకుండ నీ పడుశ్రమయంతయు సఫలము కాగలదు. కాని యివన్నియు నసత్యములు - మేఘంబులలోని మెఱపుదీవెలు. వీని కొకనిలుకడ లేదు.

౨౬. ఆయుఃపరిమాణము గూడ నెట్టి దనుకొనుచుంటివో?— కాలిన యినుముపై జలబిందువు.

౨౭. మహాసర్పంబుచే బట్టువడిన మండూకము, తనస్థితి నెఱుంగక, తన దవ్వుల నెగురుచుండినదోమలకై నాల్క జాచుచుండును. ఇట్లే కాలసర్పముచే బట్టువడియు నశాశ్వతములగు భోగంబు లనుభవించుటకే లోకు లువ్విళ్లూరుచుందురు.

౨౮. అహోరాత్రంబులం గూడ శరీరభోగార్థమే బహుప్రయాసంపడి, జనంబులు, కర్మతంత్రం బాచరించుచుందురు. ఇట్లెంత కష్టపడినను పురుషునికంటె నీదేహము భిన్న మగుటంజేసి యీ భోగములను బురుషు డేమియు ననుభవింపడు. మఱి యీ దేహమునకై వీ రేల యింత ప్రాకులాడవలెనో తెలియరాదు.

---

న్నతుం డగునటుల బౌరుషయుతంబగు దైవంబును విజృంభించుచుండును. (పురుషకారము లెస్సగ నున్న కార్యంబునకు దైవము మిక్కిలి యనుకూలుడుగ నుండునని భావము.)

ఇట్లు దైవపౌరుషంబులకు రెంటికిం గూడ బ్రాముఖ్య మియ్యబడు నప్పుడు లక్ష్మణుడు నొక్కి చెప్పుచున్న పురుషకారము త్యాజ్యం బని శ్రీరాముం డేల చెప్పవలె నను ప్రశ్న యొకటి కలుగకపోదు. దీనికి లక్ష్మణోక్తపురుషకారము పితృవాక్యపరిపాలనమునకు భంగము కల్గించునదిగాన నది పరిత్యాజ్య మనునదియే సమాధానము.

యావ ద్దేహేంద్రియప్రాణై ర్భిన్నత్వం నాత్మనో విదుః,
తావ త్సంసారదుఃఖౌఘైః పీడ్యంతే మృత్యుసంయుతాః. ౨౯

భుంజన్ ప్రారబ్ధ మఖిలం సుఖం వా దుఃఖ మేవ వా,
ప్రవాహపతితః కార్యం కుర్వ న్నపి న లిప్యసే. ౩౦

బాహ్యే సర్వత్ర కర్తృత్వ మావహన్నపి రాఘవ,
అంతశ్శుద్ధస్వభావ స్త్వం లిప్యసే న చ కర్మభిః. ౩౧

ఏతన్మయోదితం కృత్స్నం హృది భావయ సర్వదా,
సంసారదుఃఖై రఖిలై ర్బాధ్యసే న కదాచన. ౩౨

త్వ మప్యంబ మయాదిష్టం హృది భావయ నిత్యథా,
సమాగమం ప్రతీక్షస్వ న దుఃఖైః పీడ్యసే చిరం. ౩౩

1 యావజ్జీవతి కాకుత్స్థః పితా మే జగతీపతిః,
శుశ్రూషా క్రియతాం తావ త్సహి ధర్మ స్సనాతనః. ౩౪

మయా చైవ భవత్యా చ కర్తవ్యం వచనం పితుః,
రాజా భర్తా గురు శ్శ్రేష్ఠ స్సర్వేషా మీశ్వరః ప్రభుః. ౩౫

భరత శ్చాపి ధర్మాత్మా సర్వభూతప్రియంవదః,
భవతీ మనువర్తేత స హి ధర్మరత స్సదా. ౩౬

---

1 వాల్మీ. రా : సర్గ ౨౪.

౨౯. దేహేంద్రియాదులకంటె నాత్మ భిన్నుండని తెలిసికొనకపోయిరా?- అట్లు తెలియనంతకాలము వారు దుఃఖములబారి బడుచునేయుం దురు.

౩౦. సుఖము కానిమ్ము, దుఃఖము కానిమ్ము. ప్రారబ్ధమని యనుభవింపు చున్నచో, సంసారకూపంబున బడియును, నెట్టికార్యమును నీ వా చరింపుచున్నను, అపంకంబు నంటి యంటకయే యుందురు.

౩౧. లక్ష్మణా! బాహిరముగ సర్వకార్యకర్తృత్వంబును నీవే యారో పించుకొని నీ ప్రయోజకత్వమే యని యనుకొనినను, నాంతరంగిక ముగ స్వచ్ఛస్వభావుడ వైనచో గర్మపంకం బేమియు నిన్నంటదు.

౩౨. కాన నీ విషయంబు లన్నియు హృదయంబున బదిలపఱుపుము. వీని నెల్లప్పుడును మననము సేయుచుండుము. అప్పుడు సంసారబాధలు నీ దరికైనను రావు.

౩౩. తల్లీ! యీ వాక్యంబులే నీహృదయంబుననుగూడ భావింపుచుండు ము. అస్మత్పునరాగమనంబును నిరీక్షింపుచుండుము. ఈ దుఃఖము చిర కాల ముండదు లెమ్ము.

౩౪. లోకనాథుండగు మాతండ్రి జీవించియున్నంతకాలము నాతనిశుశ్రూష సేయుటకుము. ఇదియే సనాతనధర్మము.

౩౫. నీవే యట్లనేల? నీవును నేనునుం గూడ తండ్రి చెప్పినచొప్పున జేయవలసియున్నాము. అతడే మనలను బోషించువాడు - మనకు గురువు - సర్వజనశాస్త.

౩౬. భరతుడును మహాధర్మాత్ముడు; సర్వభూతంబులకును బ్రియంబు గనె యెల్లప్పుడు పల్కువాడు. అతడు నీ కెప్పుడును ననుగుణం బుగనె నడుచుకొనును లెమ్ము.

* శాపితాఽసి మమ ప్రాణైః కురు స్వస్త్యయనస్య మే. ౩౬-౪

---

* వ్యా : శాపితాసీతి:—నన్వత్ర మాత్రా కౌసల్యయాఽఽజ్ఞప్తోఽపి ధర్మజ్ఞః శ్రీరామభద్రః తద్వచన మకుర్వన్ పితృవాక్యానురోధేన వనగమన మేవ కృతవాన్. తదనుపపన్నం, పితృవచనవ న్మాతృవచనస్యాపి పరిపాలనీయత్వాత్. తథా చానుశాసనికే "మాతుః పితృగురూణాంచ కార్యమేవానుశాసనం, హితం వాప్యహితం వాఽపి న విచార్యం నరర్షభ" ఇతి. తథైవ వనపర్వణ్యపి ప్రతిపాదితం. మనుధర్మశాస్త్రేతు ప్రత్యుత పిత్రపేక్షయా మాతు ర్గరీయ స్త్వేన తద్వచనపరిపాలన స్యైవావశ్యకర్తవ్య మితి ప్రతిపాదితం. తథాహి "ఉపాధ్యాయా న్దశాచార్యా ఆచార్యాణాం శతం పితా, సహస్రంతు పితు ర్మాతా గౌరవేణాతిరిచ్యతే." తథైవోక్తం గౌతమేనాపి. తథాచాపస్తంబః—"పతితా గురవ స్త్యాజ్యా నతు మాతా కథంచన, గర్భధారణపోషాభ్యాం తేన మాతా గరీయసీ" ఇతి. తస్మా దుక్తప్రకారేణ మాతు ర్గరీయస్త్వాత్ తద్వచనానాదరోఽయుక్త ఇతిచే త్సత్యం, శ్రీరామవచనేన సర్వగుర్వపేక్షయా పితురపి గరీయస్త్వావగమాత్. తథాచ విష్ణుపురాణే - "మాన్యః పితా సమస్తానాం గురూణాం పరమో గురుః"; పురాణసముచ్చయేఽపి "తయో రపి పితా శ్రేయాన్ బీజప్రాధాన్యదర్శనాత్". తథైవ భారతే మోక్షధర్మేచ. న చైతావతా మాతృవచనాకరణే కి మాగత మితివాచ్యం, ఉభయో ర్గురుత్వే విశేషేపి "పితా

౩౬౫. * కాన నాశీర్వాదపూర్వకంబుగ న న్నంపుము. ఇంమలకు దప్పి
తివా - నా ప్రాణములతోడు.

---

వ్యా:—అంపుమనుచోట: తల్లియగు కౌసల్యచే బైవిధంబుగ నరణ్యంబులకు బోవదని యాజ్ఞాపితుం డైనను, శ్రీరాముం డామె యాజ్ఞాప్రకారము చేయక తండ్రియానతి ననుసరించి వనంబునకే పోవ నిశ్చితు డయ్యెను. తండ్రియాజ్ఞను బోలె మాతాజ్ఞను గూడ మన్నించియే తీరవలెను గాని శ్రీరాముం డిటులుసేయుట పాడి గాదు. మన్నింపవలెననుటకు భారతానుశాసనికపర్వంబున: "తల్లి యాజ్ఞయు పితృగురువులయాజ్ఞలే యనుశాసనంబులు. దానికి దల యొగ్గి లోబడుటయే కాని హితాహితవిచారణలో నిమిత్తము లేదు" ఇట్లారణ్యపర్వంబునను జెప్పబడినది. మఱి మను వింకొకయడుగు ముందునకే పోయి తండ్రికంటె దల్లియే యధికురా లగుట నామె వచనం బవశ్యకర్తవ్యం బని యీక్రిందివిధంబుగ శాసించెను. "ఉపాధ్యాయునికంటె నాచార్యుడు గౌరవంబున బదిరెట్లెక్కుడు (ఉపాధ్యాయుడు, విద్యోపదేష్ట; ఆచార్యుడు, జ్ఞానోపదేష్ట). అట్టి యాచార్యునికంటె దండ్రి నూఱురెట్లు, ఆతండ్రికంటె దల్లి వేయిరెట్లును నధికము." ఇట్లే గౌతముడును జెప్పెను. దీని కనుగుణంబుగనే ఆపస్తంబులును "పతితులగు గురువులైనను త్యజింపదగినవారుగాని తల్లిని మాత్ర మట్లుసేయజనదు. ఆమె కనిపెంచి పెద్దజేసినది." అని వచించెను. ఇటుల నింతమంది తల్లియే యధికురాలని చెప్పినను, నామె యాధిక్యముం ద్రోసిరాజనుట శ్రీరామునకు దగునా యని పూర్వపక్షము సేయరాదు.

శ్రీరామచంద్రుని వాక్యములం బట్టి చూచినచో దండ్రియే సర్వాధికుం డని తేలుచున్నది. విష్ణుపురాణంబు 'సకలగురువులలోను బరమగురువగు తండ్రి మాన్యుడు' అనియు, పురాణసముచ్చయమందు 'వారలలో (తల్లిదండ్రులలో) బీజప్రధానుం డగుటచే దండ్రియే యధికు డనియు జెప్పబడినది. భారతమందు మోక్షధర్మంబునగూడ నిట్లే యున్నది.

1 ఇత్యుక్త్వా దండవ న్మాతుః పాదయో రపత చ్చిరం. ౩౭

2 నిషసా దాథ కౌసల్యా రామస్య స్థితిహానయోః,
* గృహీత్వా గిరికాం సర్పో భక్షణత్యాగయో రివ. ౩౮

---

రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే. పుత్రస్తు స్థావిరే భావే న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" ఇతిమనువచనపర్యాలోచనయా అస్వతంత్రాయా మాతు రాజ్ఞాకరణే సామర్థ్యాభావేన భర్తృవిరుద్ధాజ్ఞాకరణం దూరాపేతం. అతస్తద్వచన పరిపాలన మప్రసక్త మేవ. నచైవం మాతృగౌరవప్రతిపాదకవచనానాం కాగతి రితివాచ్యం, సర్వప్రకారేణ మాతా పోషణీయే త్యభిప్రాయకత్వాత్. తథాచ మహాభారతే "మాతు ర్భరణమాత్రేణ ప్రీతి స్స్నేహః పితుః ప్రజాః, పితు రాజ్ఞా పరో ధర్మః స్వధర్మో మాతృరక్షణం." ఇతి. పితా తు స్వతంత్రత్వాత్ ఆజ్ఞాకరణే సమర్థ ఏవేతి తద్వచన మేవ పరిపాలనీయ మితి సిద్ధ్యతి. ఏవంచ పూర్వోదాహృత మానవాదివచనజాతేన పితు ర్గౌరవాగమేపి శుశ్రూషా విషయే

---

* 'గిరికా బాలమూషికా' ఇతి నిఘంటుః. (చుంచెలుక)

---

1 అధ్యా. రా: సర్గ. ౪. 2 మార్కం. రా. సారం.

౩౪. ఇట్లుగ బల్కుచు నా శ్రీరామచంద్రుడు కౌసల్యాపాదంబులపై బడి దండప్రణామంబు సేయసాగెను.

౩౫. ఆయమకును నేమియు దోపలేదు. ఆమెస్థితి * చుంచెలుకను బట్టుకొనిన సర్పముభాతి యయ్యెను. శ్రీరాము నామె విడువను లేదు, ఉండు మనలేదు. (చుంచును బట్టుకొనిన పామునకు, దానిని విడిచినను భక్షించినను గూడ చావు తప్పదు. ఎటులైనను విసమెక్కును. అటులనే కౌసల్యకు గూడ, పుత్రప్రేమచే శ్రీరాముని బొమ్మనుటకును, ధర్మహాని యను భయముచే నుండు మనుటకును గూడ నోరాడ లేదని భావము.)

---

కాని యీ ప్రమాణంబులవలన ద్రవ్వియెత్తినదేమి? వీనిలో దల్లియాజ్ఞ మన్నింపనవసరము లేదని యెచ్చట నున్నదని ప్రశ్నింపరాదు. తలిదండ్రు లిద్దరు మాననీయులే యైనను "బాల్యమందు దండ్రియు, యౌవనంబున భర్తయు, వార్ధకంబున బుత్రుడును రక్షింతురే కాని స్త్రీమాత్ర మెన్నడు స్వాతంత్ర్యార్హ కాదు' అని చెప్పు మనువచనంబునం జేసి అస్వతంత్ర యగు మాతయాజ్ఞను నున్నింప సామర్థ్యమే లేదని పర్యవసితమగుచున్నది. ఇట్టిచో దండ్రియాజ్ఞకు విరుద్ధముగా నీమెయాజ్ఞను మన్నింపవలె ననుదాని కథోగతియే. కాన నామెయానతి చేసితీరవలె నను విషయమునకే ప్రసక్తి లేదు.

మఱి పై మాతృగౌరవవచనంబుల కేగతి యని ప్రశ్నింపరాదు. సర్వప్రకారంబుల నామె పోషణీయ యనియే వానిభావము. అట్లే భారతంబునగూడ "మాతను బోషించుటచేతనే (కొమరునిపై) దండ్రికి బ్రీతియు మక్కువయు గల్గును. తండ్రియాజ్ఞ పరధ

---

* పై ౩౫ వ శ్లోకములో 'గిరికా' యనుపదమునకు చుంచెలుక యని యర్థము.

[1]సాఽపనీయ త మాయాస ముపస్పృశ్య జలం శుచి,
చకార మాతా రామస్య మంగళాని మనస్వినీ. ౩౯

సర్వలోకప్రభు ర్బ్రహ్మా భూతభర్తా తథర్షయః,
యే చ శేషా స్సురా స్తే త్వాం రక్షంతు వనవాసినం. ౪౦

త్రీన్ విక్రమా న్ప్రక్రమతో విష్ణో రమితతేజసః,
య దాసీ న్మంగళం రామ తత్తే భవతు మంగళం. ౪౧

ఇతి పుత్రస్య శేషాంశ్చ కృత్వా శిరసి భామినీ,
ఓషధీం చాపి సిద్ధార్థాం విశల్యకరణీం శుభాం, ౪౨

చకార రక్షాం కౌసల్యా మంత్రై రభిజజాప చ. ౪౨½

*మయార్చితా దేవగణా శ్శివాదయో, మహర్షయో భూత మహాసురోరగాః, అభిప్రయాతస్య వనం చిరాయ తే హితాని కాంక్షంతు దిశశ్చ రాఘవ! ౪౩½

---

మాతుః ప్రాబల్యం, ఆజ్ఞావిషయేతు పితుః ప్రాబల్య మిత్యేవ గమ్యతే. తస్మా న్మాతుః కౌసల్యాయా వచన మనాదృత్య శ్రీరామేణ పితు ర్దశరథస్య వచన మనతిక్రమణీయ మిత్యుక్తం యుక్తమేవ.

*వ్యా : మయేతి:—లింగపురాణే ౬౫ అధ్యాయే ;

---

1 వాల్మీ. రా : సర్గ ౨౫.

౩౯. చివర కిటులో యాపె మనము తెంపుజేసికొని, దుఃఖము దిగ మ్రింగి, శుభ్రజలంబుల నాచమనము గావించి, నిండుమనంబున నా శ్రీరామునకు మంగళాశీర్వచనంబు లిచ్చుచు నిట్లనెను.

౪౦. శ్రీరామచంద్రా! సర్వలోకప్రభుండగు బ్రహ్మయు సర్వభూతాధి నాథుం డగు రుద్రుండును, సకలదేవతలును వనవాసి వగు నిన్ను రక్షింతురుగాక. బ్రహ్మజ్ఞులగు మహర్షులును నిన్ను గరుణ గాంతురు గాక.

౪౧. మూడడుగులచే ముల్లోకములను నాక్రమించు నవక్రపరాక్రముం డగు నాత్రివిక్రమున కైన మంగళమే నీకును నగుగాక.

౪౨-౪౨½. ఇట్లుగ నాశీర్వదింపుచు, మంగళాచరణంబులను జేసి, యాతని శిరముపై నేసలిడి యాకౌసల్య, సకలార్థసంధాయిని యగు విశల్యకరణిని గొమరునకు రక్షగా గట్టి మంత్రములు గూడ జపించెను.

౪౩½. జపించి యా శ్రీరామచంద్రునితో నిట్లనెను. 'శ్రీరామా * శివాది దేవగణంబులను, భూతంబులను, నసురులను, నురగులను, దిక్కులను, మహర్షులను గూడ నేనారాధించితిని. కాన వనంబునకై పోవుచున్న నీహితంబునే వారు లెస్సగా గాంక్షింతురు గాక.

---

ర్మంబు, మాతృరక్షణము స్వధర్మ' మని చెప్పబడినది. తండ్రి స్వతంత్రుడగుటవలన నేమి యాజ్ఞాపించుటకును సమర్థుండనియు, నాతని వచనమే పరిపాలనీయ మనియు సిద్ధంబగుచున్నది. కాని పై జెప్పబడిన మన్వాదులవచనంబులం జేసి పితృవచనంబునకే యెక్కుడు గౌరవ మున్నను శుశ్రూషావిషయంబున దల్లికిని, ఆజ్ఞావిషయంబున దండ్రికిని బ్రాబల్య మని తెలియునది. కాన దల్లియైన కౌసల్య మాటను ద్రోసిపుచ్చి దశరథునివచనమే యతిక్రమింప దగదని శ్రీరాముం డాడినమాటలు యుక్తములే.

* లింగపురాణంబున నరువదియైదవ యధ్యాయంబున సూర్యవర్ణనా సందర్భమున "నవరణ్యువను బృహదశ్వుండు జన్మించెను.

[1]సర్వే దేవా స్సగంధర్వా బ్రహ్మవిష్ణుశివాదయః,
రక్షంతు త్వాం సదా యాంతం తిష్ఠంతం నిద్రయా యుతం.
౪౪౫

ఇతి ప్రస్థాపయామాస సమాలింగ్య పునఃపునః,
తత స్సీతాగృహం రామో యయౌ సౌమిత్రిణాసహ. ౪౫౫

ఆగతం పతి మాలోక్య సీతా సుస్మితభాషిణీ,
స్వర్ణపాత్రస్థసలిలైః పాదౌ ప్రక్షాళ్య భక్తితః. ౪౬౫
పప్రచ్ఛ పతి మాలోక్య దేవ! కిం సేనయా వినా,
ఆగతోఽసి గజః కుత్ర శ్వేతచ్ఛత్రంచ తే కుతః. ౪౭౫
వాదిత్రాణి న వాద్యంతే కిరీటాదివివర్జితః,
సామంతరాజసహిత స్సంభ్రమా న్నాగతోఽసి కిం. ౪౮౫

సూర్యవర్ణనే "బృహదశ్వోఽరణ్యస్య హర్యశ్వ స్తస్య చాత్మజః, హర్యశ్వస్తు వృషద్వత్యాం జజ్ఞే వసుమనా నృపః. తస్య పుత్రోఽభవ ద్రాజా త్రిధన్వా భవభావితః, ప్రసాదా ద్బ్రహ్మసూనో ర్వై తండినం ప్రాప్య శిష్యతాం. అశ్వమేధసహస్రస్య ఫలం ప్రాప్య తదాజ్ఞయా, గణేశ్వర మనుప్రాప్తో భవభక్తః ప్రతాపవాన్" ఇతి స్మరణాత్ సూర్యవంశేపి శివభక్తిర స్తీత్యుక్తం భవతి. కూర్మపురాణేఽప్యేవం.

1 అధ్యా. రా: సర్గ ౪.

౪౪౫. బ్రహ్మాదులకు త్రిమూర్తులును గంధర్వాదులగు దేవతలును, నడచు చున్నను గూర్చుండియున్నను నిదురబోవుచున్నను నిన్ను రక్షింతురు గాక.

౪౫౫. ఇట్లనుచు నమ్మహాదేవి యాతని నాలింగనంబు చేసికొని విడువలేక విడువలేక పయనంబున కనుమతించెను. అంత నా శ్రీరాముండును లక్ష్మణుడు వెంట రాగా సీతాగృహంబునకు బోయెను.

౪౬౫-౪౭౫-౪౮౫. సీతయు చిఱునగవు మొలకలు మెఱుగుదేర గలకల లాడు నెమ్మొగంబుతో బతి కెదురేగి సువర్ణపాత్రంబున జలంబుల దెచ్చి యాతని పాదంబుల గడిగి తోడితెచ్చి యాతనితో నిట్లనెను. 'దేవా యిదేమి? ఇట్లు మీ రొక్కరే వచ్చుచుండిరేల? సేన లేమై పోయినవి? తమ పట్టంపుటేను గెక్కడ? ఛత్రం బేడనున్నది? వాది త్రంబుల మ్రోతలు వినబడవేల? కిరీటం బేమయ్యెను? సామంత రాజుల నెటనుండ నియోగించితిరి?

---

అతనికి హర్యశ్వుడును, నతనికి వృషదశ్వతియందు వసుమనస్సనువా డును, నాతనికి త్రిధన్వుండును వరుసగా జన్మించిరి. ఆ త్రిధన్వుండు బ్రహ్మపుత్రునికరుణచే తండిమహర్షిని గురువుగా బొంది యాతని యాజ్ఞచే నశ్వమేధంబు లనేకంబులు చేసి శివభక్తుండై యాతని నారాధించుచుండెను.'' ఇట్లు చెప్పుటచే సూర్యవంశంబున శివా రాధనంబు కలదని యగుపడుచున్నది. కూర్మపురాణంబునను నిట్లే కలదు.

సీతయా పృష్టో రామ స్సస్మిత మబ్రవీత్. ౪౯
మే దండకారణ్యే రాజ్యం దత్తం శుభేఽఖిలం,
త్పాలనార్థాయ శీఘ్రం యాస్యామి భామిని. ౫౦
యాస్యామి వనం త్వం తు శ్వశ్రూసమీపగా,
ం కురు మే మాతు ర్న మిథ్యావాదినో వయం. ౫౧
శ హి వర్షాణి వస్తవ్యం దండకే మయా,
మే భరతశ్చాపి యౌవరాజ్యే నియోజితః. ౫౨
మయి కల్యాణి వనం మునినిషేవితం,
వాసపరయా భవితవ్యం త్వయాఽనఘే. ౫౩
త్రిసమా చాపి ద్రష్టవ్యా చ విశేషతః,
భరతశత్రుఘ్నౌ ప్రాణైః ప్రియతరా మమ. ౫౪
నచ కర్తవ్యం భరతస్య కదాచన,
జా ప్రభుశ్చైవ దేశస్యచ పురస్యచ. ౫౫
శ్రీరామాయణసారోద్ధారే అయోధ్యాకాండే,
షష్ఠ స్సర్గః.

---

వాల్మీ. రా: సర్గ ౨౬

౪౯. ఇట్టి సీతాప్రశ్నపరంపర కారాముడు మందహాసం బొప్ప నిట్లనియె.

౫౦-౫౧. దేవీ! నీ వింతను వినలేదుకాబోలు, రాచకీవులు కొలిపుటకై దండకారణ్యరాజ్యం బంతయు మాతండ్రి నా కిచ్చివేసినాడు. తత్పరిపాలనార్థంబై యిప్పుడే యక్కడికి కేగుచున్నాను. అడితప్పుట మా వంశంబున నెన్నండును వినంబడదు. నీ వింట నేయుండి యత్తమామలకు భక్తిమై బరిచర్యసేయుచుండుము.

౫౨. మాతండ్రి యౌవరాజ్యంబున భరతుని నియోగించినాడు. మఱినేను దండకారణ్యంబున బదునాల్గువత్సరంబు లుండవలెను.

౫౩. కల్యాణీ! మునిసంసేవితం బగుట బరమపావనంబగు వనంబునకై నే బోయినప్పుడు నీ వింట వ్రతోపవాసంబుల బ్రొద్దుపుచ్చుచుండుము.

౫౪. నాప్రాణంబులకంటెను బ్రియతరులగు భరతశత్రుఘ్నులను నీ సోదరుల వలెను - నీ పుత్త్రులవలెను జూచుచుండుము.

౫౫. భరతుని కెన్నడును నప్రియం బాచరింపకుము. ఈ పట్టణంబునకును, ఈదేశంబునకును నాతండె ప్రభువని - నియంత యని యెఱుంగుము.

ఇది శ్రీ రామాయణసారోద్ధారంబున నయోధ్యాకాండంబునం దాఱవసర్గము.

---

## సప్తమస్సర్గః

సా రామవచనం శ్రుత్వా భర్తార మిద మబ్రవీత్. ౧

భర్తు ర్భాగ్యం తు భార్యైకా ప్రాప్నోతి పురుషర్షభ. ౨

[1]యది త్వం ప్రస్థితో దుర్గం వన మద్యైవ రాఘవ,
అగ్రత స్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్. ౩

ప్రాసాదాగ్రై ర్విమానై ర్వా వైహాయసగతేన వా,
సర్వావస్థా గతా భర్తుః పాదచ్ఛాయా విశిష్యతే. ౩

అనుశిష్టాఽస్మి మాత్రా చ పిత్రా చ వివిధాశ్రయం,
నాస్మి సంప్రతి వక్తవ్యా వర్తితవ్యం యథా మయా. ౮

[1]తా మాహ రాఘవః ప్రీతః స్వప్రియాం ప్రియవాదినీమ్. ౮౧

కథం వనం త్వాం నేష్యేఽహం బహువ్యాఘ్రసమాకులం,
రక్షసా ఘోరరూపాశ్చ సంతి మానుషభోజినః. ౭౧

సింహవ్యాఘ్రవరాహాశ్చ సంచరంతి సమంతతః,
రాక్షసాదీన్ వనే దృష్ట్వా జీవితం హాస్యసేఽచిరాత్. ౨౧

1 వాల్మీ. రా: సర్గ ౨౯. 1 అధ్యా. రా: సర్గ ౪.

## సప్తమ సర్గము.

౧. ఇట్లు పల్కుచున్న యా రామునివాక్యంబులు విని, జానకి భర్తతో నిట్లనెను.

౨. దేవా! నీవు చెప్పినదంతయు వినుచునేయుంటిని. కాని భర్తయొక్క భాగ్యము భార్య యొక్కతెయే పడయునుగదా!

౨. అరణ్యమునకై నీ విప్పుడు పయనమగుచుంటివి కాబోలు. అది దుర్గమముగాన నీ త్రోవనుండు కుశకంటకంబుల నెల్ల నణగద్రొక్కుటకై యిదిగో నీకంటె ముందుగనే నేనును బయనమగుచున్నాను.

3. ఎట్టి మహాసౌధంబుల నున్నను, విమానంబులపై నెక్కియే స్వర్గాది లోకసుఖంబులు చూఱగొనుచున్నను, యోగమహిమంబుచే గాని తపోమహిమచే గాని యాకాశమార్గంబున సంచరించుచున్నను భర్తృపాదసేవనంబునకు వేవియు సాటిగావు.

౪. అట్టి సేవావిధులను నా తలిదండ్రులు నాకు లెస్సగానే బోధించిరి. ఆవిధుల నిప్పుడు నేను క్రొంగ్రొత్తగా నేర్వవలసినదియు లేదు. వాని నాచరించుటయే యిక నాకు బరిశిష్టకార్యము.

౪౧. ఇట్లెంతయో ప్రియంబుగ బలుకుచున్న యాదేవిం గాంచి శ్రీరాముం డిట్లనియె.

౫౧-౬౧. అబలా! సింహవ్యాఘ్రాది భయంకర మృగంబుల కిరవై, మనుజాశనులగు ఘోరరాక్షసుల కెల్ల నిలయమై పరగు నా యరణ్యంబుల కేమని నిన్ను గొంపోవుదును? సరే కొంపోదును. ఆ ఘోరరూపంబు లెప్పుడైన నీకంటబడెనా, అప్పుడే నీ పైప్రాణంబులు పైననే యెగసిపోవును.

తస్మా ద్భద్రే గృహే తిష్ఠ శీఘ్రం ద్రక్ష్యసి మాం పునః. ౭

రామస్య వచనం శ్రుత్వా సీతా దుఃఖసమన్వితా,
ప్రత్యువాచ స్ఫురద్వక్త్రా కించి త్కోపసమన్వితా. ౮
కథం మా మిచ్ఛసే త్యక్తుం ధర్మపత్నీం పతివ్రతాం
త్వదనన్యా మదోషాం మాం ధర్మజ్ఞోఽసి దయాపరః. ౯

త్వత్సమీపే స్థితాం రామ కో వా మాం ధర్షయే ద్వనే. ౯½

అహం త్వాం క్లేశయే నైవ భవేయం కార్యసాధినీ. ౧౦

1 కారణా న్యత్ర వై త్రీణి సంతి తాని వదామ్యహం,
బాలత్వే కరరేఖాం మే దృష్ట్వా కశ్చి ద్ద్విజాగ్రణీః. ౧౧
వనప్రయాణం మా మాహ భర్త్రాతే సత్యవా గ్ద్విజః. ౧౧½

అన్య త్స్వయంవరే పూర్వం సురానపి మయోదితం,
యదా చాపాంతికం ప్రాప్త స్సజ్జితుం త్వం సభాంగణే. ౧౨½

2 అన్యత్కించి త్ప్రవక్ష్యామి శ్రుత్వా మాం నయ కాననం,
రామాయణాని బహుశః శ్రుతాని బహుభి ర్ద్విజైః. ౧౩½

1 ఆనందరా: సర్గ ౪. 2 అధ్యా. రా: సర్గ ౪.

౭. కాన నీ వింటనే యుండుము- నన్నుచిరకాలంబుననే మఱల జూడ గలవు లెమ్మ!

౮. ఈమాటలు వినుటతోడనే సీతకు దుఃఖము పైకొనివచ్చినది. స్వల్ప కోపముచే ముఖ మెఱ్ఱబాఱగా నామె యిట్లనియె.

౯. శ్రీరామా! నీవు సమస్తధర్మంబుల నెఱుంగుదువు. నీ కర్ధాంగినై ధర్మపత్నినై నీవే దిక్కనియున్న నన్నిట విడిచిపోయెద ననుట నీకు వాడియా?

౯½. మనుజభోజనులగు ఘోరరాక్షసులవలనను సింహాదిభయంకరసత్వంబులవలనను నాకేమైన నెగ్గు వాటిల్లునేమో యంటివి. నరసింహంబవు నీవు నాదండనుండ నన్నెవడు కన్నెత్తి తేఱి పాఱజూడ గలడు?

౧౦. ప్రియా! నీతో నడవికి వచ్చినచో నీ కార్యసాధనినే యగుదునుగాని నీకే క్లేశమును బుట్టిపెట్టనులెమ్ము.

౧౧-౧౧½. అడవికి వత్తునని యిట్లు నిన్నింతగ వేడుటకు గారణములును గలవు. నాబాల్యమందె యొక విప్రుడు నాహస్తరేఖలను జూచి 'నీకు భర్తతో గూడ నటవీప్రయాణం బున్న'దని చెప్పినాడు. ఆ భూమీసురుండు చెప్పిన దెన్నడును బొల్లువోదట.

౧౨½. రెండవకారణంబును నేను మున్నె, స్వయంవరసమయంబులో, సభాంగణంబున నున్న రుద్రచాపంబును నీవు మోపెట్టుటకై తటియ కొచ్చుతఱి భర్తతో వనవాసము చేసెదనని సురలతో జెప్పుకొంటిని.

౧౩½-౧౮. ఇంతియకాక మహర్షిప్రోక్తములైన యెన్నెన్నియో రామాయణంబు లెందరో బ్రాహ్మణులు చెప్పుచుండగ వినియుంటిని.

సీతాం వినా వనం రామో గతః కిం కుతశ్చిద్వద. ౧౪

అహం త్వయా గమిష్యామి సర్వదా త్వత్సహాయినీ. ౧౪½

అథచాపి మహాప్రాజ్ఞ బ్రాహ్మణానాం మయా శ్రుతం,
పురా పితృగృహే సత్యం వస్తవ్యం కిల మే వనే. ౧౫½

కన్యయా చ పితుర్గేహే వనవాస శ్రుతో మయా,
భిక్షిణ్యా స్సాధువృత్తాయా మమ మాతు రిహాగ్రతః. ౧౬½

ప్రసాదితశ్చ వై పూర్వం త్వం వై బహువిధం ప్రభో,
గమనం వనవాసస్య కాంక్షితం హి సహ త్వయా. ౧౭½

శ్రుతిర్హి శ్రూయతే పుణ్యా బ్రాహ్మణానాం యశస్వినాం. ౧౮
* ఇహలోకే చ పితృభి ర్యా స్త్రీ యస్య మహామతే,

అద్భి ర్దత్తా స్వధర్మేణ ప్రేత్యభావేఽపి తస్య సా. ౧౯

---

* వ్యా : ఇహేత్యనేన స్త్రీణాం పునర్వ్వివాహో నాస్తీత్యుక్తం భవతి:— మహాభారతే సావిత్ర్యుపాఖ్యానే “సకృదంశో నిపతతి సకృత్కన్యా ప్రదీయతే, సకృదాహ దదానీతి త్రీణ్యేతాని సకృత్సకృత్” ఇతి కన్యాప్రదాన మేక పర్యాయ మేవ.

---

1 వాల్మీ. రా: సర్గ ౨౯.

ఏ రామాయణంబునందైన సీతను దోడగొంపోకుండ రాము డొక్కడే యడవి కేగినట్లు నీవు చెప్పగలవా ?

౧౪౫. కాన నన్ను నీతోగూడ గొనిపొమ్ము - నీకు సాహాయ్యముగా నుం దును.

౧౫౫. పూర్వము మాతండ్రి గృహంబున నున్నపుడు 'నీ వరణ్యావాసము సేయవలసియుండు'నని బ్రాహ్మణు లెందఱో నాకు జెప్పిరి.

౧౬౫. నేను కన్నెగా నుండునపుడును నొక భిక్షుకురాలు, నాకు వనవాసము కల్గునని మాతల్లిసమక్షమందున జెప్పినది.

౧౭౫. ఇంతియకాక వనవాసము చేయవలెనని నిన్ననేకమారులు కోరియుంటిని. దానికి నీ వంగీకరించియు నుంటివి.

౧౮-౧౯. తలిదండ్రు * లే స్త్రీని నెవ్వనికి నుదకపూర్వకముగా దానంబు సేతురో యామె గతించియును నాతనికే మఱల భార్య యగును. ఇట్లుగ జెప్పు కీర్తిమంతులగు బ్రాహ్మణుల శ్రుతియును మనము వినుచుంటిమి.

---

వ్యా : ఏ స్త్రీని... యనుచోట: — స్త్రీలకు పునర్వివాహము లేదని చెప్పబడినది. మహాభారతంబున సావిత్ర్యుపాఖ్యానంబున "పుత్రాదుల విభాగ మొక్కసారియే యగుచున్నది. కన్య యొక్కసారియే దానము సేయబడుచున్నది. అట్లు దాన మొనరించుచున్నానని యొవడును నొక్కసారి మాత్రమే చెప్పును. కాన నీ మూడుకార్యములును నొక్కొకసారి మాత్రమే జరుగును" అని చెప్పంబడుటచేసి కన్యాప్రదానం బొక్కసారియే యని తెలియవలెను.

[1] సాంత్వ్యమానాతు రామేణ మైథిలీ జనకాత్మజా,
వనవాసనిమిత్తాయ భర్తార మిద మబ్రవీత్. ౨౦
సా త ముత్తమసంవిగ్నా సీతా విపులవక్షసం,
ప్రణయా చ్చాభిమానా చ్చ పరచిక్షేప రాఘవం. ౨౧
*కిం త్వాఽమన్యత వై దేహః పితా మే మిథిలాధిపః,

---

*వ్యా : కింత్వేతి:—మాం త్యక్త్వా వనంగతం త్వాం యది మే పితా శృణుయాత్ తదా త్వాం స్త్రీరేవ కాచిత్ పురుషవేషం ధృత్వా మత్కన్యా ముపయేమే ఇతి మన్యేతై వేత్యర్థః. హేరామ సౌందర్యమాత్రపరిభ్రామక వైదేహః విదేహవంశ్యః "కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః" ఇతి కర్మప్రధానతయా కదాచిదపి పత్నీవిరహ మసహమాన ఇత్యర్థః. మిథిలాధిపః జనపదస్య సమ్యగ్రక్షకః మే పితా త్వాం మా మేకాం రక్షితు మశక్త్యా మాం పత్నీం త్యక్త్వా గతం ప్రాప్య జ్ఞాత్వా స్త్రీయం అతః స్త్రీస్వభావం పురుషవిగ్రహం బహిః పురుషవేషం జామాతరం న మన్యతే కిం? అవశ్య మిత్థం మన్యేతై వేత్యర్థః. యద్వా స్త్రీయం త్రిపురసుందరీం నమన్యతే కిం? స్త్రీయం పురుషవిగ్రహ మితి పురుషత్వేపి మోహినీరూపభ్రమకృత్యం పూర్వకృతం సూచయతీతి ప్రాహుః. యద్వా హే రామ! త్వాం మే పితా త్వద్యథార్థరూపం పార్వతీతి న మన్యతే కిం? ఇత్యపి భావః.

---

1. వాల్మీ. రా: సర్గ ౩౦.

౨౦-౨౧. ఇట్లుగ నా శ్రీరాముం డా జనకజ నట్లో సమాధానపరుప జూచెను. కాని యామె భర్తతో బాటు వనవాసమే చేయవలెనను నౌత్సుక్యంబున, నొడలు గంపింప బ్రణయంబుచేతను నభిమానంబుచేతను నా శ్రీరాము నిట్టు లాక్షేపింపదొడంగను.

౨౨.* శ్రీరామా? నన్ను విడిచి నీ వొక్కఁడవే యడవి కేగినచో నిన్నల్లునిగా బొందిన కర్మప్రధానుండగు నాతండ్రి బాహిరంగంబుగ బురుష

---

*నన్ను విడిచియనుచోట:—నన్ను విడిచి నీ వడవికి బోయిన సంగతి మాతండ్రి విన్నచో బురుషవేషంబు బూనిన స్త్రీ యొవ్వతెయో నా పుత్రికను వివాహం బాడెనని తలంచును. ఇట రామా యనుటచే సౌందర్యమాత్రముననే భ్రాంతిని గలుగజేయువాఁడా యనియు, "జనకాదులు కర్మాచరణంబుచేతనే మోక్షసంసిద్ధి నొందిరి." ఇట్లుగా మాతండ్రి గర్మప్రధానుండగుట నెప్పుడును ధర్మపత్నిని విడనాడి యుండఁ డనియు పై పదముల సారస్యము. మిథిలాధిపతి యనుటచే మిథిలాధివాసుల నెందఱనో రక్షించు నాతండ్రి నన్నొక్కదానినైనను గాపాడుటకు శక్తిచాలని నిన్నెఱింగి లోపల స్త్రీస్వభావమును బైకిమాత్రము పురుషవేషమున నున్న యీతడు నా కల్లుఁ డయ్యెనని యనుకొనునుగాబోలు. అవశ్యముగా నిట్లే యనుకొను ననిభావము. లేక స్త్రీయం - త్రిపురసుందరిగా నెంచియుండెనా? 'పురుషరూపంబున నున్న స్త్రీనిగా నెంచియుండెనా యనుటచే బురుషత్వంబుండియు మోహినీరూపంబున జేసిన పూర్వకృత్యంబును జ్ఞప్తికి దెచ్చుచున్నదనికూడ గొందఱు చెప్పుదురు. లేక ఓరామా! నీ యథార్థరూపంబు పార్వతియని మాతండ్రి యనుకొనుచుండలేదా యనిభావము. లేక ఓరామా! ఆకారమాత్రంబున బురుషుఁడయి స్త్రీగానుండు నిన్నల్లునిగా బొంది యాతఁడేమి తెలిసికొనును? తత్త్వం

రామ! జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహం.
౨౨

అన్వయ చ్చ హే రామ! త్వాం పురుషవిగ్రహం ఆకార మాత్రేణ పురుషం స్త్రియ మేవ సంతం జామాతరం ప్రాప్య కి మమన్యత? తత్త్వం న జ్ఞాతవా నిత్యర్థః. యది జానాతి తర్హి మాం తుభ్యం న ప్రయచ్ఛే దిత్యాక్షేప శేషః. యద్వా, "స ఏవ వాసుదేవోఽయం సాక్షా త్పురుష ఉచ్యతే, స్త్రీప్రాయ మేవ తత్సర్వం జగ ద్బ్రహ్మపురస్సరం." ఇతి విష్ణుపురాణోక్తేః వైదేహో మే పితా త్వాం జామాతరం ప్రాప్య లోకే త్వద్వ్యతిరిక్తం పురుషవిగ్రహం పురుషాకృతిం సర్వమపి స్త్రియ మమన్యతకిం? కిమర్థ మమన్యత? ఏతాదృశ కాతరం త్వాం తథా మన్వానో భ్రాంత ఇత్యర్థః. యద్వా కింత్వితి. రామజ! అమాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహం ఇతి ఛేదః. హే రామజ = రమయితుం జాత అవతీర్ణేతి- హేపురుష = క్రీడార్థ మవతీర్ణః పరమపురుష ఇత్యర్థః. అమాతరం స్త్రియం = మాతృవ్యతిరిక్తాం- సపత్నీమాతరం కైకేయీం; ప్రాప్య = ఉద్దిశ్య; వైదేహో = మేపితా; విగ్రహం కలహం; అమన్యతకిం? = నామన్యతైవ - కైకేయ్యా సహ ఏతాదృశకలహ ఆయాస్యతీతి నజ్ఞాతవా నిత్యర్థః. తథాపి నమాం విహాయ త్వయా వనం నగంతవ్య మితిభావః. యద్వా రామజామాతర మిత్యేకపదం - పురుషవిగ్రహం - పురుషాన్ = భర్తౄన్; విశేషేణ గృహ్ణాతీతి స్వవశీకరోతీతి. తదా రామ జామాతరం='రమంతే యోగినోఽనంత' ఇతిశ్రుతేః, ఆనంద

రూపంబున నుండియు నాంతరంగికముగ మాత్రము స్త్రీవని నిన్ను భావించును గాబోలు.

---

టేమియు నెఱుంగ డాయెను. ఎఱింగినచో నన్ను నీ కిచ్చియేయుండడని మిగిలిన యాక్షేపము సమానముగానే యుండును. లేక "వాసుదేవు డే సాక్షాత్తుగా బురుషుడని చెప్పబడుచున్నాడు. బ్రహ్మాది స్తంబపర్యంతంబగు విశ్వంబంతయు స్త్రీప్రాయంబగు ప్రకృతి యనఁబరగుచున్నది." అని చెప్పు విష్ణుపురాణోక్తవచనంబునం జేసి విదేహరాజగు నాతండ్రి నిన్నల్లునిగా బొంది లోకంబునంగల్గు త్వద్వ్యతిరిక్తంబగు పురుషాకృతినంతయు స్త్రీగానే భావించెనా ? ఇట్లెంచుటకు దలచెను? సిబోటిభయశీలుని పురుషవిగ్రహ స్త్రీనిగా భావించి యితరపురుషవిగ్రహములవిషయములో గూడ నట్లే భ్రాంతు డాయె నని భావము. లేక 'రామ జామాతరం' (యీమాట శ్లోకములోనిది) అనునప్పుడు రామజ + అమాతరం అని పదచ్ఛేదము చేసి, రామజ యను పదమునకు రమింపజేయుటకై పుట్టినటువంటి - అనగా నవతరించి నటువంటి; పురుష = పరమపురుషా - క్రీడార్థ మవతరించిన యో పరమపురుషా! అమాతరం స్త్రియం = మాతృవ్యతిరిక్తయైన కైకేయి అనగా సవతితల్లియైన కైకేయిని; ప్రాప్య = ఉద్దేశించి; వైదేహః = వాతండ్రి; విగ్రహం = కలహము (వచ్చునని) అమన్యత కిం? = తలంచెనా? తలంపలేదని యర్థము. అయినను నన్నిట్లు విడిచి నీ వొక్కడవే వనంబునకు బోవుట తగదని భావము. లేక రామజామాతరం అనుదాని నొక్కపదముగానే గ్రహించి పురుషవిగ్రహం పురుషాన్ - భక్తులను; విగ్రహం = విశేషముగా గ్రహించునట్టి - తన వశము చేసికొనునట్టి; రామ జామాతరం = 'రమంతే యోగినోనంత' ఇత్యాది శ్రుతివలన ఆనందరూపుండగు నిన్నల్లునిగా బొంది;

*అనృతం బత లోకోఽయ మజ్ఞానా ద్యద్ధి వక్ష్యతి,
తేజో నాస్తి పరం రామే తపతీవ దివాకరే. ౧౩

కిం హి కృత్వా విషణ్ణ స్త్వం కుతో వా భయ మస్తి తే,
యస్త్వం పరిత్యక్తుకామోఽసి మా మనన్యపరాయణాం. ౧౪

ద్యుమత్సేనసుతం వీరం సత్యవంత మనువ్రతాం,
సావిత్రీ మివ మాం విద్ధి త్వ మాత్మవశవర్తినీం. ౧౫
ఇదం హి సహితుం శోకం ముహూర్త మపి నోత్సహే,
కింపున ర్దశవర్షాణి త్రీణి చైకం చ దుఃఖితా. ౧౬

---

రూపజామాతరం త్వాం ప్రాప్య; స్త్రైయం = స్వస్త్రియా [స్త్రైయ మిత్యుపలక్షణం] పుత్రమిత్రకళత్రాదిక మాముష్మికం చ సత్య మమన్యత కిం? కింతు సర్వం తుచ్ఛ మితి జ్ఞాత్వా పరమానందపూర్ణోఽభూత్. ఏతాదృశ సర్వానందకర స్త్వం మాం కథం వ్యథయసీతి భావః.

* వ్యా: అనృతమితి:—అజ్ఞానా దాక్షేప మకరవ మితి భీత్యా లోక ఏవం వదిష్యతీతి న్యాపరాధం పరిహరతి- అనృతమితి. యన్మా మనాదాయ గచ్ఛసీతి శ్లోకాదా వధ్యాహృత్య యోజనీయః.

౨౩ * తపింపజేయుచున్న సూర్యునియందువలె శ్రీరాముని యందు విశేషతేజము లేదని యీలోకు లజ్ఞానమువలన జెప్పుకొనుచున్నారు. దానిని విని నేను సహింపలేను.

౨౪. శ్రీరామా! నీ వెందుల కిట్టి విష్ణభావము నొందితివి? ఈ పిటికితనము నీ కెవరు కలిపిరి? నీతోడిదే లోక మనియున్న నన్నెందుల కిచ్చట విడువగోరుచున్నావు?

౨౫. ద్యుమత్సేనసుతుం డగు సత్యవంతుని సావిత్రిమహాదేవి యెట్లనుసరించినదో యట్లే నేనును నిన్ననుసరింతును - నీ వశవర్తినిని.

౨౬. ప్రభో! రామచంద్రా! నిన్ను బిడిచియుండి నీ యెడబాటువలన నైన దుఃఖమును క్షణకాలమైనను సైపలేను. ఇట్టిచో (పదియు, మూడును, నొకటియు మొత్తము.) బదునాల్గువర్షములు! వియోగము!! సైపలేను - సైపలేను.

---

స్త్రీయం = (ఇది యుపలక్షణము) పుత్త్రమిత్త్రకళత్రాదికమును నాముష్మికమును గూడ నిత్యమని తలచెనా? సర్వంబును దుచ్ఛమనియే యనిత్యం బనియే నమ్మి పరమానందపరిపూర్ణుం డయ్యె నని భావము.

ఇట్టి పరమానందకరుండ వగు నీవు నన్ను వ్యధబెట్టుదువా యని యాశయము.

వెంటనే ప్రణయాతిశయముచే శ్రీరామచంద్రు నిట్లాక్షేపించితి నను భీతిచే లోకు లిట్లందురని తన యుపరాధము నీ శ్లోకముచే పరిహరించుకొనుచున్నది.

నీవు న న్నరణ్యమునకు తీసికొనిపోవలకుండిన లోకు లజ్ఞానముచే నీ విధముగ ననుకొందురని తాత్పర్యము.

ఈ భావమే నన్ను తోడగొంపోకుండ నీవు పోగూడ దని తాత్పర్యమిచ్చు శ్లోకముం గాంచినచో స్ఫురింపగలదు.

తాం పరిష్వజ్య బాహుభ్యాం విసంజ్ఞా మివ దుఃఖితాం,
ఉవాచ వచనం రామః పరివిశ్వాసయం స్తదా. ౨౭

న దేవి తవ దుఃఖేన స్వర్గమ ప్యభిరోచయే,
నహి మేఽస్తి భయం కించి త్స్వయంభో రివ సర్వతః. ౨౮

యత్సృష్టాఽసి మయా సార్ధం వనవాసాయ మైథిలి,
న విహాతుం మయా శక్యా కీర్తి రాత్మవతా యథా. ౨౯

ఆరభస్వ శుభశ్రోణి వనవాసక్షమాః క్రియాః. ౨౯½

1 అరుంధత్యై ప్రయచ్ఛాశు సర్వా న్యాభరణానిచ,
బ్రాహ్మణేభ్యో ధనం సర్వం దత్త్వా గచ్ఛామహే వనం. ౩౦½

1 ఏవం శ్రుత్వా తు సంవాదం లక్ష్మణః పూర్వ మాగతః,
బాష్పపర్యాకులముఖ శ్శోకం సోఢు మశక్నువన్. ౩౧½

స భ్రాతు శ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః,
సీతా మువా చాతియశాః రాఘవం చ మహావ్రతం. ౩౨½

యది గంతుం కృతా బుద్ధి ర్వనం మృగగజాయుతం,
అహం త్వాఽనుగమిష్యామి వన మగ్రే ధనుర్ధరః. ౩౩½

న దేవలోకాక్రమణం నామరత్వ మహం వృణే,
ఐశ్వర్యం వాపి లోకానాం కామయే న త్వయావినా. ౩౪½

1 అధ్యా. రా: సర్గ ౪. 1 వాల్మీ. రా: సర్గ ౩౧.

౨౬. ఇట్లుగ విసంజ్ఞురాలివలె దుఃఖంబున నడలుచున్న యాసీత నాలింగనంబు చేసికొని యామె కాస లీరికలెత్తగా శ్రీరాముం డిట్లనెను.

౨౭. దేవీ! నీకు దుఃఖమును గలిగించు స్వర్గంబైనను నా కక్కఱలేదు. ఆ క్రూరరాక్షసులకు భయంపడి నిన్ను గొంపోకుంటి ననుకొంటివి. స్వయంభువునకు వలె నాకును నేడను భయము లేదు.

౨౮. జానకీ! నాతోడ నరణ్యవాసంబు సేయుటకై నీవు సృష్టింపబడితివి. అట్టి నిన్ను, మానవంతుడు కీర్తిని విడనాడ లేనట్లు, నేనును విడనాడ లేను.

౨౯½. ప్రియసీ! మనము వనవాసంబు చేయుచున్నప్పుడు శుభము లొదవుటకై యాచరింపవలసిన కార్యంబులన్నియు నిప్పుడు నిర్వర్తింపుము.

౩౦½. అరుంధతీదేవికి మన యాభరణంబు లన్నియు నిచ్చివైచి, మన కున్న సర్వస్వము బ్రాహ్మణులకు దానం బొనరించి వనంబునకై పయనమగుదము.

౩౧½-౩౨½. లక్ష్మణుడు ముందుగనే వచ్చి యీ సంవాదం బంతయు వినుచు, కన్నీటి కాల్వలు ముఖంబున వెల్లువలై పాఱ దుఃఖంబును సైపలేక శ్రీరాముని పాదంబులు వట్టికొని యొత్తుచు, సీతను జూచుచు శ్రీరామునితోడ నిట్లు పల్కెను.

౩౩½. శ్రీరామా! గజాది మృగసంకులంబగు వనంబునకే పోవ నీవు నిశ్చయించుకొన్నట్లున్నావు. ధనుర్ధారినై నేనును నీతోడ వచ్చెదను.

౩౪½. దేవా! నీవు లేని స్వర్గలోకప్రభుత్వమును నాకు వలదు, అమరత్వంబును నా కక్కఱలేదు. త్రిలోకాధిపత్యంబును నేను వాంఛింపను.

* అనుజ్ఞాతశ్చ భవతా పూర్వమేవ య దస్మ్యహం. ౩౫

తతోఽబ్రవీ న్మహాతేజా రామో లక్ష్మణ మగ్రతః. ౩౫½

సుమిత్రాయా స్సహ సౌమిత్రే త్వయి గచ్ఛతి సద్వనం,
కో ద్రక్ష్యతి కౌసల్యాం సుమిత్రాం వా యశస్వినీం. ౩౬½

ఏవ ముక్తస్తు రామేణ లక్ష్మణో వాక్య మబ్రవీత్. ౩౭

కౌసల్యా బిభృయా దార్యా సహస్ర మపి మద్విధాన్.
యస్యా స్సహస్రం గ్రామాణాం సంప్రాప్త ముపజీవినామ్. ౩౮
తథాత్మభరణేచైవ మమ మాతు స్తథైవచ. ౩౮½

ధను రాదాయ సశరం ఖనిత్ర పిటకాధరః, ౩౯

అగ్రత స్తే గమిష్యామి పంథాన మనుదర్శయన్,
అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపతశ్చ తే. ౪౦

---

* వ్యా: అనుజ్ఞాత ఇతి:—అనుజ్ఞాత ఏవ, "ప్రతిసం హార[illegible]వ్యం మా భిషేచనకీః క్రియాః, తస్మా దపరితా పస్య [illegible] వ్యనువిధాయమామ్" ఇత్యాదా అపరత్రచ సీతాం ప్రతి "భ్రాతృ పుత్రసమౌ చాపి ద్రష్టవ్యౌ చ విశే షతః, త్వయా భరతశత్రుఘ్నౌ ప్రాణైః ప్రియతరా మమ" ఇతి [illegible]ఘ్న యోరనుసరణీయత్వోక్తే రనుజ్ఞాసిద్ధా.

౩౫. * నీతోడ వనంబునకు వచ్చుటకును నా కిదివఱకే యనుజ్ఞ నిచ్చియుంటివి కదా?

౩౫½. లక్ష్మణు డిట్లు పలుకుట విని శ్రీరామచంద్రుం డాతనితో నిట్లనెను.

౩౬½. తమ్ముడా! నీవు నాతోగూడ వనంబునకు వత్తు ననుచుంటివి. అట్లు వచ్చినచో కౌసల్యాసుమిత్రలగతి విచారించువా రెవరు?

౩౭. ఇట్లుగ శ్రీరాముండు పల్కగానే లక్ష్మణుం డిటులు బదులు సెప్పెను.

౩౮-౩౮½. అన్నా! కౌసల్యాదేవికి వేయిగ్రామము లున్నవి. పరిచర్య సేయుటకు సేవకజనంబును బహుళంబుగ నున్నది. ఆమె నాబోంట్ల నెంతో మందిని సంరక్షింపగలదు. నాతల్లి సుమిత్రకును భరణ మెక్కుడుగానే యున్నది.

౩౯-౪౦. కాన నేను ధనువును పారను గంపనుబూని నీకు మార్గమును జూపుచు నీముందు నడచెదను. నీవు నిద్రించియున్న పుడును మేల్కొని యుండునపుడును సర్వవిధోపచారములను జేయుచుండును.

---

వ్యా: అనుజ్ఞ యనుచోట :— "నా యభిషేకంబునకై నీ వొనరించు యత్నంబు విరమింపుము. నీ హృదయతాపము జల్లార్చి కొని నే జేసినట్లు చేయుము." ఇత్యాదియందును; శ్రీరాముడు సీతతో నింటనే యుండుమని చెప్పుచు నామెతో "నా ప్రాణంబుల కంటెను బ్రియతరులగు భరతశత్రుఘ్నులను, నీ సోదరుల వలెను నీ పుత్రులవలెను జూచుచుండుము" అని భరత శత్రుఘ్నులనుగూర్చి మాత్రమే చెప్పినందువలనను తనవెంట లక్ష్మణుడు వచ్చుటకు శ్రీరాము డనుమతించినట్లుగానే యెంచుకొనవలెను

రామ స్త్వనేన వాక్యేన సుప్రీతః ప్రత్యువాచ తం
ప్రజా ఆపృచ్ఛ సౌమిత్రే సర్వ మేవ సుహృజ్జనమ్. ౪౧

*యేచ రాజ్ఞో దదౌ దివ్యే మహాత్మా వరుణ స్స్వయం,
జనకస్య మహాయజ్ఞే ధనుషీ రౌద్రదర్శనే. ౪౨

---

* వ్యా : యే చేత్యాది:— జనకస్య రాజ్ఞో మహాయజ్ఞే మహాత్మా వరుణ స్స్వయమేవ మహ్యం యద్ధనురాదికం దదౌ, ఆచార్యసద్మని -ఆచార్యస్య గృహే పూజార్థం నిహితం తదేత త్సర్వ మాయుధ మాదాయ, సః ఆపృష్టసుహృజ్జనః త్వం క్షిప్ర మావ్రజే త్యన్వయః. అత్ర ధనురాదిషు సర్వత్ర ద్వివచనా దావయో ర్దదా వితి సిద్ధం, బాలకాండేఽనుక్తోఽప్యయం వృత్తాంతోఽనువాదా త్సిద్ధః, యథా సుందరకాండేఽభిహితం మణిబంధనవృత్తాంతం "మణిబంధన మిదం దత్తం వైదేహ్యా శ్శ్వశురేణ మే, వధూకాలే తథా బద్ధ మధికం మూర్ధ్ని శోభతే" ఇతి. యథా చాయోధ్యాకాండే ఽనభిహితోఽపి వాయసవృత్తాంత స్సుందరకాండేఽనూద్యతే "స పిత్రా చ పరిత్యక్త స్సురైశ్చ సమహర్షిభిః, త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః" ఇతి. ఆచార్యో వసిష్ఠో "ఇక్ష్వాకుగురు మాగమ్య" ఇత్యుత్తరత్రానువాదాత్; నహీక్ష్వాకుకులగురు ర్వశిష్ఠా దన్యోఽస్తి.

౪౧. ఇట్లుగ లక్ష్మణుండు పలుకుట విని శ్రీరాముండును బ్రీతుండై నాత నితో తమ్ముఁడా! నీవు పోయి నీస్నేహితులతోడను బ్రజలతోడను నీవిషయము జెప్పిరమ్ము అనెను

౪౨-౪౩-౪౫ *జనకుండు చేసిన మహాయజ్ఞంబున మహాత్ముండగు వరుణుండు మన తండ్రిగారి కిచ్చినధనువులు రెండును, నభేద్య

వ్యా: జనకుం డనుచోట:—జనకుండు చేసిన మహాయజ్ఞంబున మహాత్ముండగు వరుణుండు మన తండ్రిగారి కిచ్చిన ధనురాదికంబును నాచార్యుల గృహమందు బూజార్థమై యుంచబడెను. నీవు పోయి నీ మిత్రులందఱకిని జెప్పి యా యాయుధంబు లన్నియు గొనిరమ్మని భావము. ఇట ధనువు మొదలైనవానిని గూర్చి చెప్పునపుడు శ్లోకములో ద్వివచనము ప్రయోగింపబడుటంజేసి యా ధనుస్తూణీరాదికంబును శ్రీరామునకును లక్ష్మణునకును నియ్యబడెనని తెలిసికొనవలెను.

ఈ విషయ మెచ్చట జెప్పబడినదని యాశంకించుకొనగూడదు. ఈ విషయము బాలకాండమునందు జెప్పబడకపోయినను ననువాద వశంబున సిద్ధించుచున్నది. "ఈ మణిబంధము వివాహకాలమందు జనకునిచే నివ్వబడి యామె (సీత) శిరంబునం దలంకరింపబడి యెంతయో ముద్దులు మూటగట్టుచున్నది" అను నీ విషయ మనువాద వశంబున సుందరకాండమున జెప్పబడినదేకాని బాలకాండమున జెప్పబడలేదు. ఇట్లుగ నయోధ్యాకాండమందు జెప్పబడవలసిన వాయస వృత్తాంతము: *ఇట్లావాయసము తండ్రియగు నింద్రునిచే తను మహర్షులచేతను దేవతలచేతను రక్షింపబడక ముల్లోకములందును దిమ్మరుచు నెక్కడను దిక్కులేక తుద కాతనినే శరణము జొచ్చెను" ఇత్యాదిగ సుందరకాండమునం దనువాదవశంబున జెప్పబడెను. ఇట్లుగనే యిక్ష్వాకుకులగురువని ముందుశ్లోకమున జెప్పబడును. వసిష్ఠుడుదక్క మఱెవ్వరు నా సూర్యవంశమువారికి గురువు లేనందున నవ్వసిష్ఠు డనియేకదా యర్థము.

అభేద్యకవచే దివ్యే తూణీ చాక్షయసాయకౌ,
ఆదిత్యవిమలౌ చోభౌ ఖడ్గౌ హేమపరిష్కృతౌ. ౪౩
సత్కృత్య నిహితం సర్వ మేత దాచార్యసద్మని. ౪౩½
స త్వ మాయుధ మాదాయ క్షిప్ర మావ్రజ లక్ష్మణ. ౪౪

స సుహృజ్జన మామంత్ర్య వనవాసాయ నిశ్చితః,
ఇక్ష్వాకుగురు మాగమ్య జగ్రాహాయుధ ముత్తమం, ౪౫
రామాయ సర్వ మాచష్ట సౌమిత్రి స్సర్వ మాయుధం. ౪౫½

రామోఽపి లక్ష్మణే నాశు ద్విజా నాహూయ భక్తితః. ౪౬

1 * దదౌ గవాం బృందశతం ధనాని, వస్త్రాణి దివ్యాని విభూషణాని, కుటుంబవద్భ్యః శ్రుతశీలవద్భ్యో, ముదా ద్విజేభ్యో రఘువంశకేతుః. ౪౭

రామో మాతు స్సేవకేభ్యో దదౌ ధన మనేకధా,
స్వాంతఃపురవాసిభ్య స్సేవకేభ్య స్తథైవ చ. ౪౮
పౌరజానపదేభ్యశ్చ బ్రాహ్మణేభ్య స్సహస్రశః. ౪౮½

---

* వ్యా: దదావితి:—"కృతే యుగే బలి ర్దాతా త్రేతాయాం రఘునందనః, ద్వాపరే సూర్యపుత్రశ్చ...." ఇత్యుక్తత్వాత్.

---

1 అధ్యా. రా: సర్గ ౪.

కవచంబులు రెండును, నక్షయతూణీరంబులు రెండును సువర్ణ పరిష్కృతంబులును సూర్యప్రకాశంబులును నగు ఖడ్గంబులు రెండును యథావిధిగా బూజించి యాచార్యులగృహంబున నిడితిని.

౪౪. నీ మిత్రులందఱకును జెప్పిన మీదట నీ యాయుధంబు లన్నియు సత్వరముగ గొనిరమ్ము. పొమ్ము.

౪౫-౪౫౹. ఇట్లని రాముడు చెప్పగానే లక్ష్మణు డాతనితో నడవికి బోవుటకే నిశ్చయించుకొని పోయి యీ విషయము తన స్నేహితు లందఱికిని జెప్పి వారల వీడ్కొని యాచార్యుండగు వసిష్ఠునొద్దకు వచ్చి యాయుధంబులు గొనిపోయి రామునకు జూపించెను.

౪౬-౪౭. అంత నా శ్రీరాముండు కుటుంబవంతులును శ్రుతశీలసంపన్నులు నగు బ్రాహ్మణులను లక్ష్మణు నంపి పిలిపించి వారలకు *గోశతంబులును దివ్యంబులగు వస్త్రాభరణంబులును నవ్వారిగా నిచ్చెను.

౪౮-౪౯౹. అతడు తనతల్లిగారి సేవకులకుగూడ రొక్కములు మిక్కిలిగా నిచ్చెను. అట్లుగ దనయంతఃపురవాసులగు సేవకజనంబులకును బ్రాహ్మణులకును బౌరులకును జానపదులకును భూరిధనంబు లొసంగెను.

---

* వ్యా: దానమిచ్చెనుచోట:—కృతయుగంబున బలిచక్రవర్తియు త్రేతాయుగంబున శ్రీరామచంద్రుడును, ద్వాపరయుగంబున గర్ణుండును దానవంతులలో వాసికెక్కిన వారని ప్రమాణముగలదు.

అరుంధత్యై దదౌ సీతా ముఖ్యాన్యాభరణాని చ. ౪౯
రామ స్సీతా లక్ష్మణ శ్చ జగ్ము స్సర్వే నృపాలయం. ౪౯½

[1] ఆయాంతం నాగరా దృష్ట్వా మార్గే రామం సజానకిం. ౫౦
లక్ష్మణేన సమం వీక్ష్య ఊచు స్సర్వే పరస్పరం,
కైకేయ్యా వరదానాది శ్రుత్వా దుఃఖసమావృతాః. ౫౧

హే జనా నాత్ర వ స్తవ్యం గచ్ఛామోఽద్యైవ కాననం
యత్ర రామ స్సభార్యశ్చ సానుజో గంతు మిచ్ఛతి. ౫౨

[2] పశ్యంతు జానకీం సర్వే పాదచారేణ గచ్ఛతీమ్,
పుంభిః కదాచిద్దృష్టా వా జానకీ లోకసుందరీ. ౫౩

రాక్షసీ కైకయీనామ్నా జాతా సర్వవినాశినీ. ౫౩½

[3] పీడయా పీడితం సర్వం జగ దస్య జగత్పతేః. ౫౪
మూలస్యైవోపఘాతేన వృక్షః పుష్పఫలోపగః,
ఇతి దుఃఖాకులా భూత్వా వివిశుః ప్రభుమందిరం. ౫౫
శ్రీరామ స్సహ సీతయా నృపపథే గచ్ఛన్ శనై స్సానుజః,
పౌరాన్ జానపదాన్ కుతూహలదృశ స్సానంద ముద్వీక్షయన్,

---

1 అధ్యా. రా: సర్గ ౫. 2 అధ్యా. రా: సర్గ ౫.
3 వాల్మీ. రా: సర్గ. 33.

౪౯-౪౯½. సీతయు నరుంధతీదేవికి దనముఖ్యాభరణంబు లన్నియు నిచ్చి
వైచెను. ఇట్లు దానాదికంబు లొనర్చి యాసీతారామలక్ష్మణులు
నృపమందిరంబునకై పోవుచుండిరి.

౫౦-౫౧. అటుల బోవుచున్న యాముగ్గురను యాయూరివారలు చూచి
యాకైకేయి కియ్యబడిన వరదానాదికంబు నప్పుడు విని దాన నింత
చేటుమూడగావలయు నని దుఃఖాంబుధి మునుంగుచు దమలో దా
మిట్లను కొనుచుండిరి.

౫౨. ఓ యయోధ్యాజనంబులారా! సీతారామచంద్రులును లక్ష్మణు
డును. నడవికి బోవుచున్నారు. ఇక మన కిక్కడ నేమి పనియున్నది?
మనమును బోవుదము పదుండు.

౫౩. సర్వలోకసుందరియై వఱలు నీ జానకి పాదచారిణియై వీథులవెంట
బోవుచున్నది. అసూర్యంపశ్యయగు నీమె పురుషులకంట నెప్పుడైన
బడెనా? ఆహా యెంత కాలవైపరీత్యము.

౫౩½. ఈ కైకేయీరాక్షసి యిట్లు సర్వనాశం బొనరించుటకే జన్మించి
నది కాబోలు.

౫౪-౫౫. మొదలు తప్పింపబడినప్పుడు వృక్షమున నుండు నాకులు పువ్వులు
కాయలు నెండిపోయినటు లా శ్రీరామునికి గల్గినకష్టంబునకై నానా
జనంబులును దుఃఖపరవశులై దశరథునిమందిరంబు జొచ్చిరి.

౫౬. శ్రీరాముండును శ్యామసుందరశరీరం బొప్పార సీతతోడను దమ్ము
నితోడను రాచబాటంబోవుచు, దమ్ముగని యిదేమిరా వీ రిట్లు
పాదచారులై పోవుచున్నారని తెలతెలపోవు పౌరులను జానపదు

శ్యామః కామసహస్రసుందరవపుః కాంత్యా దిశో భాసయన్,
పాదన్యాసపవిత్రితాఖిలజగత్సంప్రాపాలయం తత్ప్రభుః. ౯౬

ఇతి శ్రీరామాయణ సారోద్ధారే అయోధ్యాకాండే
సప్తమస్సర్గః.

---

అష్టమస్సర్గః.

తతో రామ స్సమావిశ్య పితృగేహ మవారితః,
సానుజ స్సీతయా గత్వా కైకేయీ మిద మబ్రవీత్ ౧
ఆగతాస్స్మ వనం మాత స్త్వయా స్తే సమ్మతం వనం. ౧½
ఏతస్మి న్నంతరే తత్ర రాజదారా స్సమాగతాః. ౨
1 అర్ధసప్తశతా స్తత్ర ప్రమదా స్తామ్రలోచనాః,
కౌసల్యాం పరివార్యాథ శనై ర్జగ్ము ర్ధృతవ్రతాః. ౩
స రాజా పుత్ర మాయాంతం దృష్ట్వా దూరాత్ కృతాంజలిం,
ఉత్పపా తాసనా త్తూర్ణ మార్తః స్త్రీజనసంవృతః. ౪
త మసంప్రాప్య దుఃఖార్తః పపాత భువి మూర్ఛితః. ౪½

స్త్రీసహస్రనినాదశ్చ సంజజ్ఞే రాజవేశ్మని. ౫

తం పరిష్వజ్య బాహుభ్యాం తా వుభౌ రామలక్ష్మణౌ
పర్యంకే సీతయా సార్ధం రుదంత స్సమవేశయన్. ౬

1 వాల్మీ. రా॥ సర్గ ౩౪.

లను సాదరంబున జూచుచు, దన పాదన్యాసంబుచే భూతలంబు పవిత్రితంబై యుప్పార తండ్రి మందిరం బల్లనల్లన డాసెను.

ఇది శ్రీరామాయణ సారోద్ధారమున నయోధ్యాకాండమునందు
సప్తమ సర్గము.

---

## ఎనిమిదవ సర్గము.

౧-౧౫. అంతట శ్రీరాముడు నిరాటంకముగ లోనికి బోయి కైకేయిని జూచి 'అమ్మా! మేము మువ్వురమును నడవికిబోవ నీ యనుజ్ఞ వేడవచ్చితిమి' అనెను.

౨-౩. ఇంతలో మూడువందల యేబది సంఖ్యాపరిమితి గల రాజభార్యలందఱు, నెఱ్ఱవాఱిన కనుదమ్ములతో, గౌసల్యను మధ్య నిడుకొని యా దశరథు డున్నచోటికి వచ్చి చేరిరి.

౪-౪౫. దశరథుడును శ్రీరాముడు కృతాంజలియై వచ్చుచుంట దూరమునుండియేకాంచి స్త్రీజనంబులతోగూడ దత్తరపాటొందుచు నారుడై లేచి యాతని జేరబోవుచు మధ్యలోనే మూర్ఛితుడై క్రిందబడిపోయెను.

౫. అంత నా రాజభవనంబున నున్న స్త్రీజనంబు లందఱు నొకపెట్టున గొల్లుమని యేడువసాగిరి.

౬. తోడనే రామలక్ష్మణులును సీతయు బోయి యా రాజును భుజములు పట్టి లేవనెత్తి, యేడ్చుచు, నాతని నట నున్న యొకపాన్పుపై జేర్చిరి.

అథ రామో ముహూర్తేన లబ్ధసంజ్ఞం మహీపతిం,
ఉవాచ ప్రాంజలి ర్భూత్వా శోకార్ణవపరిప్లుతం. ౭
ఆపృచ్ఛే త్వాం మహారాజ సర్వేషా మీశ్వరోఽసి నః,
ప్రస్థితం దండకారణ్యం పశ్య త్వం కుశలేన మాం. ౮

లక్ష్మణం చానుజానీహి సీతా చాన్వేతి మాం వనం,
ఖనిత్రపిటకే చోభే సమానయత మానద. ౯

ఉవాచ రాజా సంప్రేక్ష్య వనవాసాయ రాఘవం. ౯½
* అహం రాఘవ కైకేయ్యా వరదానేన మోహితః,
అయోధ్యాయాం త్వ మేవాద్య భవ రాజా నిగృహ్య మాం.
౧౦½

వ్యా: అహమిత్యత్ర:—యద్యపి భవ రాజా నిగృహ్య మా మితివచనావగతం తన్నిగ్రహపూర్వకం స్వస్య రాజ్యేఽభిషేచనమపి పిత్రాజ్ఞాప్త మితి వనగమనవ త్తదపి అవశ్యం కర్తవ్య మితి ప్రతీయతే. తథాపి వనే గచ్ఛతః పుత్రస్య భూయా న్క్లేశో భవిష్యతీతి విచింత్య స్నేహావశా త్తథోక్తవాన్, న తాత్పర్యేణ. అత ఏవ సమనంతరమేవ దశరథ వచనం: 'సహి సత్యాత్మన' ఇత్యాదినా స్పష్టం భవిష్యతి.

౭. క్షణకాలంబునకే యా దశరథునికి దెలివి రాగా నాతనిం జూచి ప్రాంజలియై శ్రీరాముం డిట్లనియె.

౮. తండ్రీ! నీవు మా కందఱకు ప్రభుడవై యున్నావు. అందుచే ని న్నొకటి యడుగబోవుచున్నాను. దండకకు బయనమైయున్న నన్ను శీతల దృష్టిం గాంచుము. ఇంతియే నా మనవి.

౯. లక్ష్మణుడును సీతయునుగూడ వలదని నే నెంత వారించుచున్నను, నాతోడ వనమునకే పయన మగుచున్నారు. లక్ష్మణునకు త్రివ్వ కోలయును గంపయును గావలెనట. వాని నతనికి దెప్పింపుము.

౯½. శ్రీరాముం డిట్లు పలుకుట దశరథుండు విని యాతనితో నిట్లనెను.

౧౦½. *శ్రీరామచంద్రా! నేను కైకేయి కిచ్చిన వరదానంబునంజేసి యిట్లు మోహితుడ నైతిని. కాన నన్ను నిగ్రహించి యిప్పట్టాణంబునకు నీవిప్పుడే రాజవు కమ్ము.

---

*'నన్ను నిగ్రహించి' యనుచోట:— ఇట దశరథుడు 'నన్ను నిగ్రహించి యీ రాజ్యమును నీవే కైకొని పట్టాభిషిక్తుడవు క'మ్మని చెప్పుటచే వనంబునకు బోవుటవలె నిదియును నవశ్యకర్తవ్యంబు కాదా యను శంక కలుగవచ్చును. వనంబున శ్రీరాముడు కష్టపడిపోవును గదాయని పుత్త్రవాత్సల్యముచే నా దశరథుం డిట్లాడెను గాని నిజముగా నాయన కట్టి తాత్పర్యము లేదు. కనుకనే యనంతర శ్లోకమందు 'నీ బుద్ధి యెప్పుడును సత్యాధీనమైయుండును......' ఇత్యాదిగ బల్కెను.

నహి సత్యాత్మన స్తాత ధర్మాభిమనన స్తవ
వినివర్తయితుం బుద్ధి శ్శక్యతే రఘునందన. ౧౧౪

కైకేయ్యా చోద్యమానస్తు మిథో రాజా త మబ్రవీత్. ౧౨

శ్రియసే వృద్ధయే తాత పున రాగమనాయచ,
గచ్ఛ స్వారిష్ట మవ్యగ్రః పంథాన మకుతోభయం. ౧౩

ఏవం స రాజా వ్యసనాభిపన్న శ్శోకేనదుఃఖేనచ తామ్యమానః,
ఆలింగ్య పుత్రం సువినష్టసంజ్ఞో మోహంగతో నైవ విచేష్ట కించిత్. ౧౪

దేవ్య స్తత స్సంరురుదు స్సమేతా స్తాం వర్జయిత్వా. నరదేవ పత్నీం, రుదన్ సుమంత్రోఽపి జగామ మూర్ఛాం హాహా కృతం తత్ర బభూవ సర్వం. ౧౫

1 తతో నిర్ధూయ సహసా శిరో నిశ్శ్వస్య చాసకృత్,
పాణౌ పాణిం వినిష్పిష్య దంతాన్ కటకటాప్యచ, ౧౬
కైకేయ్యా స్సర్వమర్మాణి సుమంత్రః ప్రత్యభాషత. ౧౬౪
పతిఘ్నీం త్వాం మహం మన్యే కులఘ్నీ మపి చాంతతః ౧౭

1 వాల్మీ: రా: సర్గ. 35

౧౧½. [ఇట్లుగా బల్కియు, నాత డెప్పుడును సత్యవశుం డనియు నిట్టి పని కెప్పుడును నాతం డొడంబడ డనియు నెఱింగి మఱల నిట్లనుచున్నాడు.]

నాయనా! నే నెన్ని చెప్పినను నీ మనముమాత్రము సత్యమార్గము నెన్నడును దప్పదు. దానిని ద్రిప్పుట కెవరికిని దరము కాదు.

౧౨. కైకేయీ చోద్యమానుడై యా రాజు శ్రీరామునితో మఱియు నిట్లనెను.

౧౩. నాయనా, శ్రీరామా! పరలోకంబున గీర్తియు నీ లోకమున వృద్ధియు గలుగునటుల నరణ్యమునకు క్షేమముగ బోయిరమ్ము.

౧౪. ఇట్లుగ బలికి యా దశరథమహారాజు వ్యసనము జెందుచు శోకదుఃఖములచే వాడువడి ప్రజ్ఞారహితుడై పుత్త్రు నాలింగనము చేసికొని చేష్టలు దక్కి మూర్ఛవోయెను.

౧౫. అంత నచ్చట జేరిన రాజదార లందరు మిక్కిలిగ వాపోవుచు నేడ్చిరి. సుమంత్రుడును దుఃఖాతిశయముచే మూర్ఛజెందెను. పరిచారికాజను లందరును హాహాకారములు సేయదొడంగిరి. పాప మా కైకమ్మమాత్రము యథాప్రకారముగానే యుండెను.

౧౬-౧౬½. కొంతసేపటికి సుమంత్రుడు లేచి తల నటు నిటు త్రిప్పుచు జేతులు విశేషముగా బిసిగికొనుచు, పండ్లు పట పట కొఱుకుచు కైకేయి నిట్లు మర్మంబు లన్నియు నొవ్వనాడెను.

౧౭-౧౮½. మహాసముద్రమువలె నుండు నీ భర్తను నీకార్యంబులచే నెంత గగ్గోలుపెట్టుచుంటివి? నీవు నిజముగా భర్తృహంతకురాలవును గులహంతకురాలవును గానోపుదువు. నీకు భర్తయును వరమండును, నీకోర్కె లన్నిటిని జెల్లించువాడునునగు నీ దశరథుని నిట్టవమానిం

మహోదధి మివాక్షోభ్యం సంతాపయసి కర్మభిః.
మాఽవమంస్థా దశరథం భర్తారం వరదం పతిం, ౧౮
భర్తురిచ్ఛా హి నారీణాం పుత్రకోట్యా విశిష్యతే. ౧౮½
అభిజాతం హి తే మన్యే యథా మాతు స్తథైవ చ,
న హి నింబాత్ స్రవేత్ క్షౌద్రం లోకే నిగదితం వచః. ౧౯½
* తవ మాతు రసద్గ్రాహం విద్మః పూర్వం యథాశ్రుతం,
తథా త్వమపి రాజానం దుర్జనాచరితే పథి. ౨౦½

---

* వ్యా: తవేతి:—ఆనందరామాయణాదిసారం. శ్లో॥ "సర్వభూతరుతజ్ఞాతా కేకయేశః పురా వరాత్. సతు జృంభస్య వచనాద్భావజ్ఞో బహుధాహసత్. తద్భార్యా చ త మాపృచ్ఛ త్కారణం కిమితి స్వయం, తా మువాచ నృపో దేవి శంసనే మరణం మమ, శంస మే జీవ వా మా వా ఇతి సా పునరబ్రవీత్. తచ్ఛ్రుత్వా స నృపః కోపా త్తాం నిరస్య సపుత్రికాం, కైకేయీం పుత్రికాం కుర్వే నృపశీలాదిసంయుతాం, ఇతి నిశ్చిత్య తాం కన్యాం మునిసేవాం న్యయోజయత్, పితౄన్ సమనుజాయంతే నరా మాతర మంగనాః, ఇతి న్యాయేన సా చర్షిం వామహస్తేన సేవతే. సమాధిస్థ మృషిం జ్ఞాత్వా మషీ మాస్యే వ్యలేపయత్. మషాన్య ఇతి తం ప్రాహు ర్లోకా సోఽపి శమాన్వితః, జ్ఞాత్వా చ తూష్ణీం స్థితవా న్కంచిత్కాలం నృపాలయే, గంతు ముద్యుక్త ఇతి తం జ్ఞాత్వా పవేరి వరి సతీ, తా మువాచ ముని స్త్వంతు చక్రవర్తి వరిష్యత, తవ వామకరో వజ్రాంకితో

పక్షము. కోటిమంది కొడుకుల ననుసరించియుండుట కంటెను భర్త యనుమతిప్రకార ముండుటయే స్త్రీలకు గొప్పవిశేషము.

౧౯౪. కైకేయీ! నీతల్లి ప్రవృత్తియే నీకును వచ్చినది. అవును. వేపచెట్టు నుండి మధురస మెన్నడైన స్రవించునా!

౨౦౪-౨౧నీ తల్లి పాపకార్యములలో నందవేసిన చేయియనియు భర్తచేవిడువ బడినదనియు నేను బాగుగా నెరుంగుదును. ఇప్పుడు నీతల్లివలెనే నీవు.

---

*వ్యా: ఈ విషయ మానందాదిరామాయణములలో నిటుల జెప్ప బడినది. *కేకయ రాజు వరమహిమంజేసి సర్వజంతువుల ధ్వనులును నెఱుంగును. అత డొకనాడు క్రింద జరుగుచున్న కీటక సంభాష ణము విని బకపక నవ్వసాగెను. ఇది యాతనిభార్య చూచి కారణ మడిగెను. 'అతడు దేవీ! యీవిషయ మితరులతో జెప్పినచో నాకు మరణము సంభవించు'ననెను. కాని యా కఠినాత్మురాలు 'నీవు జీవింపుము లేక మరణింపుము. నాకు నిమిత్తములేదు. నీ వెందుల కట్లు నవ్వితివో చెప్పితీరు' మనెను. రాజది విని కినుక జెంది యామెను సపుత్త్రికముగా విడనాడపైచి పుత్త్రికయగు కైకేయిని మాత్రము దగ్గఱ నుంచుకొని తల్లి గుణములే యక్కుమారికి నున్న వనుకొని యామెను మునిజనసేవకు నియోగించెను. 'కుమారులకు దండ్రిచాలును, గుమారికలకు దల్లిచాలును వచ్చు' ననెడి న్యాయము చొప్పున నాకైకేయి యామునికడమచేతనే యుపచారాదికము లొనర్చుచుండెను. ఒకదినమున నామహర్షి సమాధిలో నుండగా జూచి యాతని ముఖము నిండుగ మసిబూసెను. (దీనిచేత నాతడు మష్యాస్యుం డనబరగెను.) కాని యమ్మహర్షి బహుళశమాన్వితుం డగుట నాసంగతి తెల్పియు నూరకుండెను.

అసద్గ్రాహ మిమం మోహాత్ కురుషే పాపదర్శిని. ౨౧

ఇతి సాంత్వైశ్చ తీక్ష్ణైశ్చ కైకేయీం రాజసంసది,
సుమంత్రః క్షోభయామాస భూయ ఏవ కృతాంజలిః ౨౨

నైవ సా క్షుభ్యతే దేవీ నచ స్మ పరిదూయతే,
న చాస్యా ముఖవర్ణస్య విక్రియా లక్ష్యతే తదా. ౨౩

[1]అథ చీరాణి కైకేయీ స్వయ మాహృత్య రాఘవం,
ఉవాచ పరిధత్స్వేతి జనౌఘే నిరపత్రపా, ౨౪

తథైవ లక్ష్మణాయాథ సీతాయై చ దదౌ స్వయం. ౨౪½

[2]రామస్తు వస్త్రాణ్యుత్సృజ్య వన్యచీరాణి పర్యధాత్,
లక్ష్మణోఽపి తథా చక్రే సీతా త న్నవిజానతీ, ౨౫½

హస్తే గృహీత్వా రామస్య లజ్జయా ముఖ మైక్షత. ౨౬

---

మృదులో భవేత్. కిం త్వకీర్తి స్సమాయాస్య తాన్యే మషివిలేపనాత్. ఇత్యుక్త్వా తు గతో మానీ తస్మాత్ కైకా పరిదూషితా.

---

1 వాల్మీ. రా: సర్గ 37 : ౨ అధ్యా. రా: సర్గ ౫.

పాపమార్గమున బోవుచు మోహావశుండగు నిమ్మహారాజునుగూడ నాత్రోవకే పట్టించుచున్నావు.

౨౨. ఇట్లు సుమంత్రుడు సభామధ్యంబున నిల్చి తీక్ష్ణాతితీక్ష్ణంబులును మృదులంబులును నగు నిప్పులుకులచే నా కైకేయి మర్మంబులెల్ల గాడ నాడెను. మధ్య మధ్య మాత్రము నమస్కరించుచు వేడుకొను చుండెను.

౨౩. కాని యా కైకేయి యీసుమంతయు జలింపలేదు, సంకటపడలేదు. ఆమె ముఖవైఖరియు భంగమందలేదు.

౨౪-౨౫. ఇట్లామె నిర్లజ్జయై యా జనసమూహము లందరిముందఱను నించుకైన గొంకు కొసరులేక నారచీరలు దెచ్చి ధరింపుమని శ్రీరామునకును లక్ష్మణునకును సీతకును నిచ్చెను.

౨౫-౨౬. రామలక్ష్మణు లిద్దరును దమతమ దుస్తులను విడిచి యా వన్య వస్త్రంబులనే ధరించిరి. ఆవిదేహరాజసుతమాత్రము నావస్త్ర మెట్లు ధరింపవలయునో యెఱుంగక యా చీరలను బుచ్చుకొని లజ్జతో సాభిప్రాయముగా శ్రీరామునిముఖమువంక జూచెను.

---

ఇట్లు నృపమందిరంబున గొంతకాలము గడపి యమ్మునీంద్రుడు పోవసమకట్టుడు, నా కైకేయి యమ్మునిని వరం బొకటి వేడెను. ఆ ఋషియు 'నీ వామహస్తము వజ్రకఠినంబును మృదులంబును గూడ నగును. మఱి నా ముఖముపై మసిబూసినందులకు మాత్రము నీ కొకయపకీర్తి కలుగు'నని చెప్పి యమ్మౌని యథేచ్ఛం జనెను.

ఇందులకే యా కైకేయి యింత యపకీర్తిపాలైనది.

రామో గృహీత్వా తచ్చీర మంశుకే పర్యవేష్టయత్. ౨౭½
తద్దృష్ట్వా రురుదు స్సర్వే రాజదారా స్సమంతతః. ౨౭

వశిష్ఠ స్తు తదాకర్ణ్య రుదితాన్ భర్త్సయన్ రుషా. ౨౭½
కై కేయీం ప్రాహ దుర్వృత్తే రామ ఏవ త్వయా వృతః,
వనవాసాయ దుష్టే త్వం సీతాయై కిం ప్రయచ్ఛసి? ౨౮½
యది రామం సమన్వేతి సీతా భక్త్యా పతివ్రతా,
దివ్యాంబరధరా నిత్యం సర్వాభరణభూషితా. ౨౯½
రమయ త్వనిశం రామం వనదుఃఖనివారిణీ. 30

1 వనవాసం హి సంఖ్యాయ వాసాం స్యాభరణాని చ, 30½
భర్తార మనుగచ్ఛంత్యై సీతాయై శ్వశురో దదౌ,
తథైవాయుధజాలాని భ్రాతృభ్యాం కవచానిచ. 3౧½

1 అథ రామశ్చ సీతాచ లక్ష్మణశ్చ కృతాంజలిః,
ఉపసంగృహ్య రాజానం చక్రు ర్దీనాః ప్రదక్షిణమ్. 3౨½

తం చాపి సమనుజ్ఞాప్య ధర్మజ్ఞ స్సహ సీతయా,
రాఘవ శ్శోకసమ్మూఢో జననీ మభ్యవాదయత్. 33½
అన్వక్షం లక్ష్మణో భ్రాతుః కౌసల్యా మభ్యవాదయత్
అథ మాతు స్సుమిత్రాయా జగ్రాహ చరణౌ పునః. 3౪½

తం వందమానం రుదతీ మాతా సౌమిత్రి మబ్రవీత్. 3౫

---

1 వాల్మీ. రా: సర్గ 3౯. 1 వాల్మీ రా: సర్గ ౪౦.

౨౬౼౫. శ్రీరాముం డాచీరంబు బుచ్చుకొని అదివరకు సీతధరించిన చీరపైన నిదన్యవస్త్రంబు స్వయముగా గట్టెను.

౨౭. దీని నంతయు గనుచుండిన యంతఃపుర స్త్రీ లందఱు మిగుల దుఃఖించిరి.

౨౮౼౨౯౼౫. వశిష్ఠుం డిది విని యచ్చటికి వచ్చి యా యేడ్చుచున్న వారల వారించి కైకేయిం జూచి కోపముతో "దుర్మార్గురాలా! శ్రీరాము నొక్కని నేకదా యడవికి బొమ్మని నీవు కోరినది? మరి యెత కేంనులకు వన్యచీరంబు లిచ్చుచుంటివి?

౨౯౼౫-30. సీత శ్రీరామునితోఁబాటుగ నడవికే పోయినచో నామె దివ్యాంబరధారిణియై సర్వాభరణభూషితయై యా రామునకు వనవాస దుఃఖోపశమనంబు గావింపుచు నాతని మనంబును రంజింప బడయుచుండు" నసెను.

30౼౫-3౧౼౫. అనంతర మా దశరథుడు పదునాల్గువత్సరంబులకును సరిపడునట్లుగ దివ్యాంబరాభరణంబు లెన్నియో యా జానకి కిచ్చెను. అట్లుగ శ్రీరామలక్ష్మణులకును సకలాయుధంబు లొసంగెను.

3౨౼౫. అంత నాసీతారామలక్ష్మణులు వికాసము దప్పిన మోములతో నా దశరథునకు బ్రదక్షిణ మాచరించిరి.

33౼౫-3౪౼౫. ధర్మజ్ఞుం డగు నాశ్రీరాముం డంతట సీతతోఁగూడ మిగుల దుఃఖించుచు దనతల్లికిగూడ నట్టే నమస్కరించెను. ఇటులుసేయ నంతకు బూర్వమే యాజ్ఞాపింపబడి,లక్ష్మణుడును నట్టే యాకౌసల్యకు నమస్కరించి యంత దనతల్లియగు సుమిత్రాదేవి పాదంబులు పట్టుకొనెను.

3౫. అమ్మహాదేవియు నట్లు నమస్కరింపుచున్న తనయుం జూచి యిట్లనెను.

సృష్ట స్త్వం వనవాసాయ స్వనురక్త స్సుహృజ్జనే,
రామే ప్రమాదం మాకార్షీః పుత్ర! భ్రాతరి గచ్ఛతి. 3౬

వ్యసనీ వా సమృద్ధో వా గతిరేష తవానఘ. 3౬-౫

* రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్,

---

* వ్యా: రామమితి:—వనవాసే పితృమాతృనగర స్మరణేన మనశ్చాంచల్యం భవిష్యతీతి ధయాత త్రైవ ప్రతి విధిం కల్పయతి - రామ మితి. యథాసుఖం గచ్ఛేత్యస్య అబ్రవీ దితి పూర్వేణ సంబంధః, రామం దశరథం విద్ధి - పితర మవగచ్ఛేత్యర్థః. జనకాత్మజాం మాం విద్ధి - మాతరం విద్ధీత్యర్థః. అటవీ మయోధ్యాం విద్ధి తద్వద్భోగస్థానం విద్ధి. గచ్ఛ తాత యథాసుఖం తదనువర్తనమేవ ఉచితం సుఖ మిత్యర్థః యద్వా రామం దశరథం విద్ధి - 'దశః పక్షీ విహంగమః' ఇతి హలాయుధః - దశః పక్షీ రథో యస్య తం దశరథం విష్ణుం విద్ధీత్యర్థః. జనకాత్మజాం మాం లక్ష్మీం విద్ధీత్యర్థః. అటవీ మయోధ్యాం యోద్ధు మశక్యాం విష్ణు పురీం విద్ధి, 'దేవానాం పూ రయోధ్యా' ఇతిశ్రుతేః. యద్వా రామం దశరథంచ విద్ధి - ఉభయో స్తారతమ్యం పశ్యేత్యర్థః. మాం జనకాత్మజాం చ విద్ధి, గుణతః ఆలోచయ. మదపేక్షయా

౩౬. కుమారా! వనవాసము చేయుటకే దైవము నిన్ను సృష్టించెగాబోలు. సకలప్రాణి దయాపరుండగు నారామునియెడ ననురక్తుఁడవై మెలంగుము - ప్రమాదం బెన్నఁడును నాచరింపకుము.

౩౬౫. రాజ్యభ్రష్టుండై దుఃఖించుచున్నను సకలసంపదలచే దులదూగుచున్నను నా శ్రీరామచంద్రుఁడే నీకు గతి యగువాఁడు.

౩౮౪. * శ్రీరాముఁడే నీతండ్రియగు దశరథుఁ డనుకొనుము. జానకిని, నీ తల్లియగు నన్నుగా దలంపుము.

---

* వ్యా: శ్రీరాముఁడే నీతండ్రిగా...యనుచోట:—వనవాసము చేయుచున్నపుడు తలిదండ్రులయొక్కయు స్వనగరంబుయొక్కయు స్మరణంబు గలిగినచో మనంబు సంచరించు ననుభావమున నా సీతారాములను నయ్యడవినే మాతాపితృస్వనగరంబులప్రతినిధులుగ జూచికొమ్మని సుమిత్ర యిట్లు చెప్పుచున్నది.

ఈ శ్లోకమున నీ క్రిందివిధములుగ నానార్థములు చెప్పబడుచున్నవి:— రామం = శ్రీరాముని, దశరథం = నీతండ్రియైన దశరథునిగా; విద్ధి = తెలిసికొనుము; జనకాత్మజాం = సీతను; మాం = తల్లియైన నన్నుగా; విద్ధి = తెలిసికొనుము; అటవీం = అడవిని; అయోధ్యాం = అయోధ్యనుగా; విద్ధి = తెలిసికొనుము. అనగా నా శ్రీరాముఁడే తండ్రియనియు సీతయే తల్లియనియు నయ్యడవియే యయోధ్యయనియు భావించుకొనుమని యర్థము. లేక రామం = శ్రీరాముని; దశరథం = 'దశః పక్షీ విహంగమః' ఇట్లుగ దశ మనగా బక్కియని హలాయుధనిఘంటువులో జెప్పబడుటచే దశరథుఁడు = పక్షిని రథముగా - వాహనముగా గలవాఁడు - శ్రీవిష్ణువునిగా; విద్ధి = తెలిసికొనుము; శ్రీరాముని శ్రీవిష్ణువునిగా దెలియుంగు మనిభావము. జనకాత్మజాం = సీతను; మాం = లక్ష్మీదేవినిగా; విద్ధి = తెలిసికొనుము. అటవీం = అడవిని; అయోధ్యాం = యుద్ధమొనరించుటకు శక్యముగాని విష్ణుపురిగా ('దేవానాం పూరయోధ్యా = దేవతల పట్టణ మాక్రమింపరానిది' ఇత్యాది శ్రుతి ప్రమాణంబునం జేసి వైకుంఠ మయోధ్యయగుచున్నది) విద్ధి = తెలిసికొనుము. లేక రామం =

అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖమ్. ౩౭౪

---

సీతైవ తవహితపరేతి భావః. అయోధ్యా మటవీం చ విద్ధి- ఏత న్నగరాపేక్షయా వనమేవ తవ శైంకర్యైకాంతస్థానతయా ఉత్కృష్ట మిత్యర్థః. యద్వా దశరథం రామం=ఉపరతం విద్ధి, భర్తృభావా న్మాం జనకస్య పితుః ఆత్మజాం పితృగృహవర్తి నీం విద్ధి - రామేణసహ సర్వేషాం నిర్గమాత్ అయోధ్యా మట వీం విద్ధి. యద్వా రామం దశరథం విద్ధి సోపాధికపితరి దశరథే అతిస్నేహం విహాయ నిరుపాధికపితరి రామే ప్రీతిం కుర్విత్య ర్థః. శేష మీదృశం, యద్వా రామం దశరథం దశరథసదృశ గుణం విద్ధి 'గుణై ర్దశరథోపమః' ఇత్యుక్తేః. మాం విద్ధి జనకాత్మ జాం - గుణవతీం సీతాం మా మివ సేవ్యాం విద్ధి. రమణీయ వస్తుసంపన్నతయా అటవీ మయోధ్యావ ద్భోగ్యతమాం విద్ధి. యద్వా రామం దశరథం విద్ధి- దశరథమివ స్త్రీపరవశం విద్ధి. తచ్చ మృగానుసారిత్వాదిషు వక్ష్యతే. మాం విద్ధి జనకా త్మజాం - అహం యథా రామ మనుగచ్ఛేతి వదామి ఏవమేవ వదిష్యతి. తచ్చ తత్రైవ స్పష్టం. అటవీ మయోధ్యాం విద్ధి అటవీ మపి విహాయాన్యత్ర గచ్ఛేత్, అటసంచలనే ఇతి

అయ్యరణ్యమునే యయోధ్యగా నెంచుకొనుము. నాయనా! పోయి రమ్ము - యథాసుఖముగా బోయిరమ్ము.

---

శ్రీరాముని; దశరథం = దశరథుని; విద్ధి = తెలిసికొనుము - ఇద్దఱ తారతమ్యంబు లెఱుంగుమని భావము: మాం = నన్నును; జనకాత్మజాం = సీతను; విద్ధి = గుణముల తారతమ్య మెఱుంగుము - నాకంటె సీతయే నీ కెక్కుడు హితం బాచరించునది యని భావము. అయోధ్యాం = అయోధ్యను, అటవీం = అరణ్యమును; విద్ధి = తెలిసికొనుము - అల్లకల్లోలముగ నుండు నిప్పట్టణంబుకంటె శాంతి సమన్వితం బగు నయ్యరణ్యంబె మిక్కిలి యనుకూలించునని భావము. లేక దశరథం = దశరథుని; రామునియందు లీనునిగా; విద్ధి = తెలిసికొనుము; (నీ వరణ్యమునకు బోయినతోడనే నాథ౯ర చనిపోవును గాన) మాం = నన్ను; జనక = తండ్రియొక్క; ఆత్మజాం = కూతునిగా - తండ్రి యింట నున్నదానినిగా; విద్ధి = తెలిసికొనుము. (శ్రీరామునితోగూడ నయోధ్యాపురవాసులందఱుబోవుటచే) అయోధ్యాం = అయోధ్యను; అటవీం అడవినిగా; విద్ధి = తెలిసికొనుము. లేక 'రామునే దశరథునిగా నెఱుంగుము' - సోపాధికపితయగు దశరథునిపై మక్కువ విడనాడి నిరుపాధికపితయగు శ్రీరాముని యందు బ్రీతిగలిగి యుండుము. మిగిలిన భాగమునకుగూడ నీవిధము గానే చూచుకొనవలయును. లేక 'రాముడు, గుణముల నా దశరథుని బోలువాడు' అనిచెప్పబడుటచే రామం = శ్రీరాముని; దశరథం = దశరథునిగా - దశరథుం డెట్టిగుణములు గలవాడో యట్టి గుణములు గలవానినిగా; విద్ధి = తెలిసికొనుము. జనకాత్మజాం=గుణవతియగు సీతను; మాం = నన్నుంబోలె నీకు సేవ్యురాలినిగా; విద్ధి= తెలిసికొనుము; సుందరవస్తుసహితం బగుటంజేసి అటవీం= అడవిని; అయోధ్యాం = అయోధ్యనుబోలె భోగంబుల కాలవాలం బైన దానినిగా; వి = తెలిసికొనుము.

1రాజా దశరథోఽప్యాహ సుమంత్రి రథ మానయ, 3౮

---

ధాంతోః. అత్రి సావధానో భవేతి తాత్పర్యం. యద్వా రామం దశరథ మివాతిశూరం విద్ధి. దేవాసురయుద్ధే దశరథస్య శౌర్యం ప్రసిద్ధం. అహం యథా భర్తృవిజయే అభినందామి జనకాత్మజాప్యేవ మభినందిష్యతి తచ్చ 'తం దృష్ట్వా శత్రుహంతార' మిత్యత్ర స్పష్టీభవిష్యతి. అయోధ్యా మటవీం విద్ధి - రామవిశ్లేషేణాయోధ్యా యథా ;అపభ్రష్ట మనుష్యా చేత్యాద్యవస్థాం ప్రాప్తా తథా అటవ్యపి 'అపి వృక్షాః పరిమ్లానా' ఇత్యాద్యవస్థాం ప్రాప్స్యతి. యద్వా రామం దశరథం విద్ధి- దశరథో యథా సమ్రా డ్బభూవ తథా రామోఽపి సమ్రా డ్భవిష్యతి. మాం విద్ధి జనకాత్మజాం - అహం యథా సమ్రాజ్ఞ్మహిషీ తథా సమ్రాజ్ఞ్మహిషీ తథా సీతాపి భవిష్యతి. అయోధ్యా మటవీం విద్ధి - అటవీం అయోధ్యావ త్సమృద్ధపుష్పఫలా భవిష్యతి. యద్వా రామం పదాతి రితి మాఽవమంస్థాః. దశరథం - పుష్పకాదిబహురథ సంచారిణం విద్ధి. దశ రథాః యస్య దశసు దిశా స్వప్రతిహత రథో యస్యేతి చ విగ్రహః. మాం విద్ధి జనకాత్మజాం - దేవాసురాది యుద్ధేషు దశరథేన సహ యథాఽహం సంచరామి

---

1 అధ్యా. రా: సర్గ[illegible];

౩౮-౩౯. దశరథుం డిటులు వీరు మువ్వురును నరణ్యంబునకు బయనం బగుట చూచి, 'రథం బొకండు సరగున గొని రమ్ము. అం దధిష్ఠిం

---

ఇటనుండి సీతాపహరణ ప్రకరణమున కనుకూలంబుగ గొన్ని యర్థములు ధ్వనిచే నూహించి చెప్పబడుచున్నవి.

రామం = శ్రీరాముని; దశరథం = దశరథుని బోలె స్త్రీపరవశునిగా: విద్ధి = తెలిసికొనుము - (ఇయ్యది సీత చెప్పినంతనే మాయామృగము వెంట బడిపోవుటలో గాననగును.) 'నన్నుగానే సీతనుగూడ నెఱుంగుము' — నిన్నిపుడు శ్రీరామునితోగూడ నడవికి బొమ్మని నే నెట్లు చెప్పుచుంటినో యట్లే మాయలేడివెంట బొమ్మని యా శ్రీరామునితో నీమె చెప్పగలదని భావము. అటవీం = అడవిని; అయోధ్యాం = అయోధ్యనుబోలె స్థిరావాసముగ; విద్ధి = తెలిసికొనుము. శ్రీరాము డడవినిగూడ విడిచి మాయామృగమునకై పోయినప్పుడు నీ వాపర్ణశాలయొద్దనే యయోధ్యలో నున్నట్లుగా దిరముగా నుండుమని భావము. లేక 'రాముని దశరథునిగా నెఱుంగుము' - దశరథునిం బోలె మహాపరాక్రమవంతునిగా దెలిసికొనుము. (దశరథుని పరాక్రమము దేవాసురయుద్ధములందు బ్రకటితమేకదా!); 'సీతను నన్నుగా నెఱుంగుము' - నాభర్తకు విజయము ప్రాప్తించినపుడు నే నెట్లభినందించితినో యట్లే యా సీతయు నభినందింపగలదని భావము. ఇది 'శత్రుసంహారకుండగు భర్తను గాంచి ...సీత యాతని కౌగిలించెను...' ఇత్యాద్యర్థమిచ్చు శ్లోకమునం గాననగును. 'అయోధ్య నటవిగా దెలిసికొనుము' శ్రీరాము డడవికి పోవుటచే నక్కడి జను లందఱు నాతనితో బాటుగ నడవికే పోవుట వలన నా యయోధ్య పాడుపడినదై యెటుల గన్పట్టునో యట్లుగానే యయ్యరణ్యమును (సీత యపహరింపబడిన వెనుక) వృక్షలతాదు లన్నియు వాడిపోయి యందవిహీన మగునని తెలిసికొనుమని భావము. లేక 'రాముని దశరథునిగా దెలిసికొనుము.' దశరథుం డెటులు రాజాధిరా జయ్యెనో అట్లే శ్రీరాముండును కాగలడని తెలిసికొనుము. 'నన్ను సీతగా నెఱుంగుము' - నే నెటుల నారాజాధిరాజునకు

రథ మారుహ్య గచ్ఛంతు వనం వనచరప్రియాః. 35

తదా సీతా రామేణ సంచరిష్యతి. అయోధ్యా మటవీం విద్ధి- ఇదానీ మటవ్యాం యథా నిత్యసంచార స్తథా అయోధ్యాయాం నిత్యసంచారో భవిష్యతి. ఏవం బహువిధగుణ లాభా త్తాత్కాలికదుఃఖానుసంధానం న కర్తవ్య మిత్యాహ- గచ్ఛేతి. రామో యేన యేన పథా గచ్ఛతి తేన తేన పథా 'కామరూప్యనుసంచర' న్నిత్యా ద్యుక్తరీత్యా కైంకర్యం కర్తుం గచ్ఛ. రామ మనుస్మృత్యానుస్మృత్య కైంకర్యం కురు. తాత భగవత్కైంకర్యాన్వయ బహుమానబుద్ధ్యా తా తేత్యుక్తిః తవ మాతాఽహం కైకేయీ వాపకీర్తిం యథా న గచ్ఛామి తథా మాం తారయ. యథా సుఖం- రామస్య యథా సుఖం భవతి తథా. యద్వా అయోధ్యాయాం యథా సుఖం తథా వనేచ 'కామయే న త్వయా వినేత్యుక్త రామసంశ్లేష సుఖం ఖలు త్వయాఽపేక్షితం? యథా సుఖం గచ్ఛేత్యస్య అబ్రవీదితి పూర్వేణ సంబంధః.

చిరయే వీరు కాననములకు బోదు'రని సుమంతుని నాజ్ఞాపించెను.

బట్టపుదేవేరి నైతినో యట్లే యీ సీతకూడ నొక్క మహాసామ్రాజ్యాధిపతికి, శ్రీరామునకు బట్టంపురాణి కాగలదని యెఱుంగుము. 'అయోధ్య నడవిగా దెలిసికొనుము' - అరణ్యంబును బోలె నయోధ్యనుగూడ నానావిధతరుకుసుమఫలసమృద్ధం బగుదానినిగా నెఱుంగుము.' లేక 'శ్రీరాముని దశరథునిగా నెఱుంగుము' - శ్రీరాముని బదాతిగా బరిగణింపక పుష్పకాది బహువాహన సంచారిగా నెఱుంగుము. (ఈయర్థమును జెప్పుకొనునప్పుడు దశరథు డనుపదంబునకు దశదిశలందును నప్రతిహతరథసంచారము గలవాడని వ్యుత్పత్త్యర్థముం జెప్పుకొనవలెను.) 'నన్ను సీతనుగా నెఱుంగుము' - దేవాసురాదియుద్ధంబులందు దశరథునితోగూడ నే నెట్లుగ సంచరించియుంటినో యట్లే యీ సీతయు సంచరించు నని యెఱుంగుము. 'అయోధ్య నడవిగా నెఱుంగుము' - అడవిలో నెట్లు సంచరింతురో యట్లే యయోధ్యలోగూడ నొకరియడ్డంకులు లేక నిరాఘాటముగ దిరుగు రోజులు మీకు రాగలవని భావము.

ఇక శ్లోకములో నున్న గచ్ఛ = (వెళ్లుము) ఇత్యాది పదంబులకు వివరణము తెల్పబడుచున్నది. 'వెళ్లుము'- ఇట్టి యుత్కృష్టగుణంబులు కలదగుటచే నితాత్కాలికదుఃఖంబునకు గొంకక యడవికే వెళ్లుము. లేక 'వెళ్ళుము'- శ్రీరాముం డే యే మార్గంబున బోవునో యయ్యేమార్గంబుననే నీవుకూడ నాతని సేవచేయుటకు బొమ్ము. 'తాత! నాయనా!' - (భగవంతునకు గైంకర్యము సేయబోవుచున్నాడను బహుమానబుద్ధిచే నీ పదప్రయోగము సేయబడినది.) కైకేయివలె నపకీర్తిని బొందకుండ నన్ను దరింపజేయు మను భావమున కిది ద్యోతకము. 'యథాసుఖముగ' - రామునకు సౌఖ్య మెట్టులు గలుగునో యట్లుగ బోయిరమ్ము. లేక 'నీవు లేని స్వర్గాదిభోగంబులైనను నాకక్కరలేదనుచు రాము నెడబాయకుండు సుఖమునే కదా నీవు కోరుచుందువు? ఆ సుఖ మయోధ్యలోవలెనే యిప్పు డడవిలోగూడ చిక్కును. సుఖముగ బోయిరమ్ము' అని భావము.

ఇత్యుక్త్వా రామ మాలోక్య సీతాం చైవ సలక్ష్మణం,
దుఃఖా న్నిపతితో భూమౌ రురో దాశ్రుపరిప్లుతః. ౩౯॥

[1]తత స్సుమన్త్రః కాకుత్స్థం ప్రాంజలి ర్వాక్య మబ్రవీత్. ౪౦

రథ మారోహ భద్రం తే రాజపుత్త్రి! మహాయశః,
క్షిప్రం త్వాం ప్రాపయిష్యామి యత్ర మాం రామ వక్ష్యసి ౪౧
తం రథం సూర్యసంకాశం సీతా హృష్టేన చేతసా,
ఆరురోహ వరారోహా కృత్వాలంకార మాత్మనః. ౪౨
త మారురుహతు స్తూర్ణం భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౪౨॥
[2] లక్ష్మణః ఖడ్గయుగలం ధనుస్తూణీయుగే తథా,
గృహీత్వా రథ మారుహ్య నోదయామాస సారథిం. ౪౩॥

తిష్ఠ తిష్ఠ సుమంత్రేతి రాజా దశరథోఽబ్రవీత్,
గచ్ఛ గచ్ఛేతి రామేణ నోదితోఽచోదయ ద్రథం. ౪౪॥

[3] పరిత్యాగార మివాయాన్తీ వత్సలా వత్సకారణాత్,
బద్ధవత్సా యథా ధేనూ రామమాతాఽభ్యధావత. ౪౫॥
[4] పౌరాస్తు బాలవృద్ధాశ్చ వృద్ధా బ్రాహ్మణసత్తమాః,
తిష్ఠ తిష్ఠేతి రామేతి క్రోశంతో రథ మన్వయుః ౪౬

1 వాల్మీ. రా: సర్గ ౪౦. 2 అధ్యా. రా: సర్గ ౫;
3 వాల్మీ. రా: సర్గ ౪౦. 4 అధ్యా. రా: సర్గ ౫

౩౯½ ఇట్లాజ్ఞాపించి సీతారామలక్ష్మణులవంక జూచుచు దుఃఖాతిశయంబున భూమిపైబడి బాష్పపర్యాకులలోచనుండై యాదశరథుండేడువ సాగెను.

౪౦. సుమంత్రుండును రథంబు గైకొనివచ్చి ప్రాంజలియై యా శ్రీరామునితో నిట్లనెను.

౪౧. రాకుమారా! యిదిగో రథ మధిరోహింపుము. నీ వెక్కడకు గొంపొమ్మందువో యక్కడకు గొంపోవుట కిదె సిద్ధముగ నున్నాను.

౪౨. అంత సర్వాభరణభూషితయై సంతుష్టచేతస్కయై యా సీతాదేవి సూర్యప్రతిమానంబగు నారథం బధిరోహించెను.

౪౨½. శ్రీరాముండును జాగుసేయక రథం బెక్కెను.

౪౩½. లక్ష్మణుడు తమతమ ఖడ్గంబులును, ధనువులును, తూణయుగళంబును, సీతాదేవి కియ్యంబడిన వస్త్రాభరణంబులు గల వెదురు గంపయును గొనివచ్చి రథం బెక్కి తోలుమని సారథిని ద్వరపెట్టసాగెను.

౪౪½. 'సుమంత్రా! రథం బాపు మాపు' మని యా దశరథుం డనుచుండగా, 'బోనిమ్ము పోని'మ్మని శ్రీరాముడు వేగిరపెట్టుటచే నా సుమంత్రుడు రథమును దోలుచుండెను.

౪౫½. వత్సం బింటియొద్ద నుండుటచే పొలమునుండి యింటికై వేగముగా మరలివచ్చు గోమాతంబోలె నా శ్రీరామమాతయు రాముని జూచుటకై మిగుల ద్వరితంబుగ బరుగిడుచుండెను.

౪౬½. బ్రాహ్మణు లాదిగాగల పౌరు లందరు బాలవృద్ధభేదంబు లేక యాగు డాగు డని యరచుచు నా రథమును వెన్నాడుచుండిరి.

1 ఆర్తశబ్దోథ సంజజ్ఞే స్త్రీణా మంతఃపురే మహాన్, ౪౭
స త మంతఃపురే ఘోర మార్తశబ్దం మహీపతిః,
పుత్రశోకాభిసంతప్త స్స్మృత్వా చాసీ త్సుదుఃఖితః. ౪౮
నాగ్నిహోత్రా ణ్యహూయంత నాపచన్ గృహమేధినః,
న్యస్సృజన్ కబలా న్నాగా గావో వత్సా న్న పాయయన్. ౪౯

త్రిశంకు ర్లోహితాంగశ్చ బృహస్పతిబుధావపి,
దారుణా స్సోమ మభ్యేత్య గ్రహాః స్సర్వే వ్యవస్థితాః. ౫౦
విశాఖా స్తు సధూమాశ్చ నభసి ప్రచకాశిరే,
న గ్రహా నాపి నక్షత్రం ప్రచకాశే న కించన. ౫౧

అనర్థిన స్సుతా స్త్రీణాం భర్తారో భ్రాతర స్తథా,
సర్వే సర్వం పరిత్యజ్య రామ మేవానుచింతయన్. ౫౨

తత స్త్వయోధ్యా రహితా మహాత్మనా, పురందరేణేవ మహీ సపర్వతా, చచాల ఘోరం భయశోకపీడితా, సనాగ యోధాశ్వగణా ననాద చ. ౫౩

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అయోధ్యాకాండే
అష్టమ స్సర్గః.

---

1 వాల్మీ. రా: సర్గ ౪౧

౮౭. అంత నంతఃపురములో స్త్రీల మహా ర్తధ్వని యొక్కటి వినవచ్చెను.

౮౮. ఇట్టి ఘోరా ర్తశబ్ద మంతఃపురములో గలుగుట దశరథుండు విని పుత్రశోకాంతరేకంబున మరియు దుఃఖితు డయ్యెను.

౮౯, ఆనాడాయూరం గల శ్రోత్రియు లగ్నులయందు హోమము సేయ లేదు. ఏ గృహస్థుని యింటిలోపలనుగూడ పాకప్రయత్నమే లేదు. ఏనుగు లాహారంబు గొనలేదు. గోవులు సయితము తమ లేగలకు బా లివ్వలేదు.

౯౦. త్రిశంకుడును, నంగారకుడును, బృహస్పతి బుధులును మహాక్రూరులై చంద్రుని సమీపములో సంచరింపసాగిరి.

౯౧. విశాఖానక్షత్రము ధూమసహితంబై యాకాశములో బ్రకాశించుచుండెను. మరితరగ్రహములుగాని, నక్షత్రంబులుగాని యాకాశంబున వెలుగొందుటలేదు.

౯౨. శిశువులు పాలకై మాతల నర్థించుచుండుటలేదు. భర్తలు తమ భార్యల నపేక్షించుట లేదు. సోదరుల నొకరి నొకరు గోరుటలేదు. ఇట్లు సకలజనులును సర్వస్వంబును బరిత్యజించి రామునిగూర్చియే చింతించుచుండిరి.

౯౩. పర్వతసహితంబగు భూమండలము,తన్ను గాపాడుట కింద్రుడు లేనిచో మిగుల భయంపడినభాతిగ దుష్టశాసకుండగు శ్రీరాముం డడవికి బోయియుంటచే గరితురగభటాదియుతంబగు నయోధ్యయు భయసంత్రస్తయై చలింపసాగెను.

ఇది శ్రీరామాయణసారోద్ధారంబున నయోధ్యాకాండంబునం
దెనిమిదవసర్గము సంపూర్ణము.

---

ఓం

శ్రీసీతారామచంద్రపరబ్రహ్మణే నమః.

శ్రీ

# రామాయణసారోద్ధారే అయోధ్యాకాండే

సప్తమస్సర్గః.

శ్లో.

యావత్తు నిర్యతి స్తస్య రజోరూప మదృశ్యత,
నైవేక్ష్వాకువర స్తావ త్సంజహా రాత్మచక్షుషీ. ౧

నివృత్త్యేవ నివృత్త్యేవ సీదతో రథవర్త్మను,
విలలాపచ దుఃఖార్త్తః ప్రియాం పుత్త్ర మనుస్మరన్. ౨

నగరాంత మనుప్రాప్తం బుద్ధ్వా పుత్ర మథాబ్రవీత్. ౨౺

య స్సుఖే షూపధానేషు శేతే చందనరూషితః,
వీజ్యమానో మహార్హాభిః స్త్రీభి ర్మమ సుతోత్తమః. ౩౺
స నూనం క్వచి దేవాద్య వృక్షమూల ముపాశ్రితః,
కాష్ఠం వా యది వాశ్మాన ముపధాయ శయిష్యతే. ౪౺

ద్రక్ష్యంతి నూనం పురుషా దీర్ఘబాహుం వనేచరాః,
రామ ముత్థాయ గచ్ఛంతం లోకనాథ మనాథవత్. ౫౺

ఓం

శ్రీసీతారామచంద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీ రా మా య ణ సా రో ద్ధా ర ము

## తొ మ్మి ద వ స ర్గ ము.

### తాత్పర్యము.

౧. ఇట్లుగ సీతారామలక్ష్మణులు రథం బెక్కి పోవుచుండగ నా రథగమ నంబున నైన ధూళి యెంతవఱకు గన్పట్టుచుండెనో పాప మా దశర థుం డంతవఱకును నా దిక్కునకే పారజూచుచుండెను.

౨. రథంబులు పోవుచున్న మార్గంబుల జూచుచు, నా శ్రీరాముని స్మ రించుచు నాతడు దుఃఖంబున బొగులుచునే యుండెను.

౨౪. అంత తన కుమారుడు పట్టణము దాటిపోయినసంగతి నెఱింగి యా దశరథుం డిట్లనియె.

౩౪-౪౪. చందనాదిచర్చితుడై యుత్తమదాసీజనంబులు వింజామర లిడు చుండ మృదుతల్పముల శయనించు నా పుత్త్రు డిప్పు డే వృక్షమూ లము నాశ్రయించి శయనించునో! ఏరాలు రప్పలు తలాడగా నిదు కొనునో కదా.

౫౪. ఆజానుబాహుండగు నా శ్రీరామచంద్రు డిట్లుగ నేరానేలనో యనాథునివలె బరుండి లేచిపోవుచుండుట నయ్యారణ్యాకు లందరు చూచుచుందురు కాబోలు.

సకామా భవ కైకేయి విధవా రాజ్య మావస,
నహి తం పురుషవ్యాఘ్రం వినా జీవితు ముత్సహే. ౬౪

కైకేయి మా మమాంగాని స్ప్రాక్షీ స్త్వం దుష్టచారిణీ, ౭
నహి త్వాం ద్రష్టు మిచ్ఛామి న భార్యా నచ బాంధవీ,
యేచ త్వా మను జీవంతి నాహం తేషాం న తే మమ. ౮

కేవలార్థపరాం హి, త్వాం త్యక్తధర్మాం త్యజా మ్యహం. ౮4

కౌసల్యాయా గృహం శీఘ్రం రామమాతు ర్నయంతు మాం.
౯

ఇతి బ్రువంతం రాజాన మనయన్ ద్వారదర్శినః,
కౌసల్యాయా గృహం తత్ర వ్యవేశ్యత వినీతవత్. ౧౦

ఆర్తతాల్యం ప్రపన్నాయాం కాళరాత్ర్యా మివాత్మనః,
ఆర్ధరాత్రే దశరథః కౌసల్యా మిద మబ్రవీత్. ౧౧
* రామం మేఽనుగతా దృష్టి రద్యాపి న నివర్తతే,

---

* వ్యా:—పంచేంద్రియాణాం ప్రత్యేక మననార్హా శ్లేషత్వ ముచ్యతే--రామ మితి. రామం—గుణసాగరం... న నివర్తతే-సముద్రగృహీతం పున రాయాతికిం? 'సముద్ర ఇవ గాంభీర్యే' 'గుణానా మాకరో మహాన్' ఇతి సముద్రస్థానత్వ ముక్తం. యద్వా 'రామం మేఽనుగతా దృష్టిః'—రామం రమయతాం వర మితి చేతనాచేతన విభాగానాద

౬½. ఓసీ! కైకేయి! నీకోర్కి యిపుడు నెఱవేరినది. నా శ్రీరామచంద్రమూర్తి వారియొద్ద లేకుండ జీవించుటకే నుత్సహింపను. ఇక విధవవై యీ రాజ్యంబంతయు నీ తలపైననే కట్టికొమ్ము.

౭-౮. దుష్టురాలా! నా దరికి రాకుము. నన్నంటకుము ఛీ! నీ మొగము చూడగూడను. నీవు నా భార్యవు గావు. నీకును నాకును నేనాటి బంధుత్వమును లేదు. నీ సేవకులకును నాకును నే సంబంధము లేదు. వా రెవ్వరో, నే నెవ్వడనో

౮½. కేవల మర్థపరురాలును నధర్మపరురాలును నగు నిన్ను త్యజించి వైచుచున్నాను.

౯. ఓయీ ద్వారపాలకులారా! కౌసల్యా గృహంబునకు నన్ను శీఘ్రమే కొనిపొండు.

౧౦. ఇట్లుగ బల్కుచున్న యీ వృద్ధరాజును ద్వారపాలకు లందఱు గొనిపోయి యీ కౌసల్యాగృహంబున డించివైచిరి.

౧౧. అంత నాతనికి సంహారరాత్రివలె నుండు రాత్రి సమీపింపగ నర్ధరాత్రమున గౌసల్యతో నాతం డిట్లనెను.

౧౨. *కౌసల్యా! నాదృష్టి శ్రీరామునితోడనే పోయినది. ఇప్పటికిని నది,

---

* వ్యాఖ్యా:—ఈశ్లోకంబున బంచేంద్రియంబులకును బ్రత్యేక మననార్హత్వము చెప్పబడుచున్నది. "గాంభీర్యంబున సముద్రుం డైనవాడు", "గుణరత్నంబుల కాకరంబైనవాడు" ఇత్యాది ప్రమాణంబులచే శ్రీరామునికి సముద్రస్థానత్వం బారోపింపబడినది. కావున సముద్రగృహీతం బగునదెద్దియు నెట్లు తిరిగి రాదో యట్లే శ్రీరామగృహీతంబగు దశరథదృష్టియు మఱలిరాదు. లేక 'నాదృష్టి శ్రీరామునితోడనే పోయినది'- రమింపకేయు వానిలో శేషంబె చేత

న త్వాం పశ్యామి కౌసల్యే సాధు మాం పాణినా స్పృశ.౧౨

రేణ రమయిత్రృత్వగుణ స్స ఖలు. సర్వత్ర చక్షుః ఖలు రూప గ్రాహకం? అత్రతు రామేణ రూపం చక్షుర్గ్రాహకం-అనుగతి పదార్థదర్శనసమర్థం. చక్షు రధునా సంచారక్షమం జాతం 'కామ రూపా ప్యనుసంచర' న్నిత్యుక్త్యా చేతనకృత్య మచేతనం కరోతి. దేశవిశేషే పరమపదే క్రియమాణ మనుసంచరణం సంసారచక్రే రామంప్రతి క్రియతే. యద్వా దృష్టి రామ మనుగతా, 'చక్షు ర్దేవానా ముతమర్త్యానా' మితి దేవమను ష్యాదిదృష్టిభూతో రామః పురతో గచ్ఛతి. అహం తిష్ఠామి వేత్యనుగతా దృష్టిః 'దృశిర్ ప్రేక్షణే' ఇతి నిష్పన్నా. సారా సారవివేకశాలినీ విశేషగ్రహణశక్తా రామ మనుగతా మమ హితకారిణీ స్వహితం న కరోతికిం? అస్వతంత్రా మే దృష్టిః కథ మేవం స్వాతంత్ర్యం కృతవతీ? యద్వా మే దృష్టిః రామ మనుగతా - మమ చిరపరిచితా మాం విహాయ రామ మనుగతే త్యభిసారికాసమాధిః. యద్వా మే దృష్టిః కైకే యీమంథరాదిదృష్టిశ్చే దేవం న కరోత్యేవ. 'నందామి పశ్య న్నపిదర్శనేన' ఇత్యేవం చిరపరిచయం సంపాదితవా నహం ఖలు. యద్వా మే దృష్టిః - సర్వత్ర విషయేషు చ చపలస్య.మమ దృష్టిః కథం చాపల్యం నగచ్ఛతి? విహా

మరలిరాలేను. కాన నిన్ను నే జూడలేకున్నాను. నన్ను నీచేతితో బాగుగ నొకమారు దాకుము.

---

నాచేతనవిభేద మెంతమాత్రము లేని రమయితృత్వగుణమే యాతడు గదా? లేక రూపమును గ్రహించునది, యెప్పుడును నేత్రమే కదా! కానియిట శ్రీరామునివిషయములో నాతనిరూపమే చక్షువును గ్రహించికొని పోయినది- అనుగతంబగు పదార్థదర్శన సమర్థం బైనది. చక్షు విప్పుడు సంచరించుటకు శక్తి గలదై 'కామరూపియై సంచరించుచు' అనునట్లు చేతనం బొనరుపదగినకార్యం బచేతనమగు నిదియే యొనర్చుచున్నది. లేక దేశవిశేషంబునగాని పరమపదంబునగాని, యీరామానుగమనక్రియ చేయబడవలయును. కాని యీ సంసారచక్రంబుననే యయ్యది జరుగుచున్నది. లేక 'దృష్టి రాము ననుగమించి పోయినది' 'చక్షుర్దేవానా ముత మర్త్యానాం= దేవతలకును మనుష్యులకును నేత్రంబగువాడు' ఇత్యాది ప్రమాణంబునం జేసి దేవతలకును మనుజులకును గూడ దృష్టిభూతుం డగు నా శ్రీరాముడు ముందు బోవుచుండ నే నెట్లు వెనుక బడియుండగల నని దృష్టి యాతని తోడనే పోయినది. లేక సారాసారంబు లెఱింగినదియు విశేషం బెక్కడ నున్నను గ్రహింప సమర్థం బైనదియు నగు నాదృష్టి శ్రీరాము ననుగమించిపోయి నాకు హితం బొనర్చునది కదా? అట్టిచో దనకు దానే మేలొనగూర్చుకొనలేకుండునా? అస్వతంత్రయగు నా దృష్టి యీ స్వాతంత్ర్యం బె ట్లవలంబించినది? లేక 'నా దృష్టి రామునితోడనే పోయినది'- నాకు జిరపరిచితయగు నా దృష్టి శ్రీ రామునితోడ బోయినది. ఇది యభిసారికయా? లేక నా దృష్టి కైకేయీమంథరల దృష్టివంటిదే యైనచో నిట్లు శ్రీరాము ననుగమించిపోనేలేదు. కారణము: వారిదృష్టికి శ్రీరామునితో నత్యంత పరిచయమ్ము కలుగలేదు. నే నన్ననో 'శ్రీరాము నేప్రొద్దును జూచుచుండియును గూడ నాతని దర్శనం బైనచో నే నెంతయు నానందించుచుందును' ఇత్యాదిగ జిరకాలార్జితపరిచయంబు గలిగియుంటిని గదా? లేక 'నాదృష్టి...' సర్వవిషయంబులందును జపలుండను

తం రామ మేవానువిచింతయంతం, సమీక్ష్య దేవీ శయనే

యగతా మపి మే దృష్టి రిత్యాహ మనురక్తిం కరోమి, మాతరం విహాయ పతి మనుసృతాం కన్యాం ముమేయ మిత్యభిమానవత్. మమేంద్రియం చే న్మా మనుసృశ్య తిష్ఠేత్, కథ మన్య మనుసరేత్? స్వవిషయానుసరణం న దోషఇతి చే త్తత్రాహ - 'అద్యాపి న నివర్తతే'. 'అతిక్రాంతేపి రాఘవే' ఇతి స్వగోచరాతిక్రమేపి న నివర్తతే. కైకేయీముఖనిరీక్షణవ్రీడయా కిం? యద్వా 'నచ పునరావర్తతి' ఇత్యుక్త్యా పునరావృత్తిం న ప్రాప్తా కిం? తద్దర్శనాభావేపి తన్మాతృత్వద్దర్శనం కర్తు ముచితే కాలేపి న నివర్తతే. అనివర్తనే యుక్తి మాహ-న త్వాం పశ్యామీతి. పున రాగతా చేత్తవ దర్శనం మమ కథం నస్యాత్? 'త్వాం న పశ్యామి'- స్వరేణ త్వామితి పురోవస్థితాం నిర్దిశామి. 'న చక్షుషా పశ్య'తీతి శ్రుత్యా తన్ముఖదర్శనాలాభేపి తన్మాతు స్తవముఖం వా పశ్యామీత్యభిలషితం, తచ్చ న లబ్ధం. రామ మనుగతా దృష్టిః, న త్వాం పశ్యామి - రామే నిమగ్నా దృష్టిః అన్యం స్పృశతి కిం? చక్షురింద్రియనాశేపి వాగింద్రియేణ ప్రాణిమిత్యాశయే నాహ 'కౌసల్యే' ఇతి. 'ఏష మే జీవితస్యాంతో రామో యద్యభిషిచ్యతే' ఇతి వ్యతిరేకకాష్ఠభూతాయాః కైకేయ్యాః, 'కిం పునః ప్రోషితే తాత

౧౩. ఇట్లుగ । శ్రీరాముని సంస్మరింపుచు మంచముపై బరుండియున్న యా

---

గదా నేను. అట్టిచో నాదృష్టిమాత్రము చాపల్యము నొందకుండు నా? తల్లిని విడిచి భర్త ననుసరించిపోయిన కొమరితయం దెట్లు నా కుమారి కదా యనునభిమాన ముండునో, యట్లే యీ నా దృష్టి నన్ను వీడిచనినను 'నా' యను నభిమానము నా కింక ను నశింపలేదు. ఈ చక్షురింద్రియము నాది యైయుండిన నన్ను వీడి మఱొకని వెంట బోవునా యని భావము. నివారి వెంటబోవుటలో దోష మేమున్నదను నాకాంక్ష పొడమునని 'ఇప్పటికిని నది మఱలి రాలే' దనుదాని సారస్యము. 'ఇప్పటికిని నని మఱలి రాలేదు'- 'రాఘవుడు గడచిపోయినను' ఇత్యాదిప్రమాణంబుచే శ్రీరాముండు తన దృష్టిపథమును గడచిపోయినను నీతని దృష్టి మఱలిరాలేదు. కారణ మేమైయుండును? కైకేయి ముఖము జూచుటకు దనికి మొగము చెల్లకయా? లేక 'నచ పునరావర్తతే' ఇత్యాదింజేసి దీనికి బున రావృత్తిరాహిత్యంబు గలిగెనా? ఆ శ్రీరాముని జూడలేకపోయి నను నాతని తల్లియగు నిన్ను జూచు సమయంబున కైనను నాదృష్టి మఱలిరాలేమకదా! అట్లు మఱలిరాకుండు టెట్లు నిరూపింప నగు నని నీవు నాకు గన్పట్టుటలేదని యుక్తి చెప్పబడుచున్నది. నిజముగ నది మఱలివచ్చియే యుండిన నిన్ను జూడలేకపోవు టెట్లు పొస గును? 'నిన్ను నే జూడలేకున్నాను.'—నా కిప్పుడు చూపు లేకపో వుటచే గంఠస్వరమును బట్టి నీ వని తెలిసికొంటిని. 'చర్మచక్షువు లతో నా భగవంతుని గానలేడు' ఇత్యాద్యర్థ మిచ్చు శ్రుతింజేసి యాతని గనుంగొనలేకపోయినను నాతని మాతవగు నీ ముఖంబై నను జూడ నభిలషించితిని. కాని నాదృష్టి శ్రీరాము ననుసరించి పోవుటచే నిదియు నాకు దటస్థింపదయ్యెను. 'నీవు నాకు గన్పట్టుట లేదు.'—అవును శ్రీరామచంద్రునియందు లీనంబైనదృష్టి మఱొ క్కనిపై నెట్లు ప్రసరించును?

చక్షురింద్రియము తనశక్తిని గోల్పోయినను వాగింద్రియము సరిగనే యున్నదని తెలియజేయు నిమిత్తము 'కౌసల్యా' యని సంబో

నరేంద్రం, *ఉపోపవిశ్యాధిక మార్తరూపా వినిశ్వసంతీ

ధ్రువం మరణ మేవ మే' ఇత్యన్వయకాష్ఠభూతా ఖలు త్వం? 'కౌసల్యే'—'కౌసల్యా లోకభర్తారం సుషువే యం మనస్వినీ' తి చిరకాలప్రార్థనయా లోకరక్షణార్థం సంపాదనం కృతం, త దిదానీం తవ దుఃఖాయ జాతః ఖలు! యద్వా 'కౌసల్యే త్వాం న పశ్యామి'—అనర్థకరకైకేయీం పశ్యచ్చక్షు స్తద్దుఃఖనివారణాయ త్వాం నపశ్యతి కిం? యద్వా రామదర్శనం వినా కైకేయీముఖదర్శనపాపనివృత్తయే త్వన్ముఖం ద్రష్టు ముత్సుకోఽస్మి; తదపి న లబ్ధం. రామవిశ్లేషాసహానేన సీదంత్యాః దశరథవిశ్లేషోపి భవతీతి భీత్యా నికట మాగతాం కౌసల్యా మాహ — సాధ్వితి. మమ కృత్స్నక్లేశనివారణాయ పాణినా మాం సమ్మృజ్య శ్వాసయ. తవాదర్శనేన చక్షురింద్రియం గత మితిసశ్చినోమి. తవ వాక్యశ్రవణేన శ్రోత్రేంద్రియం తిష్ఠతీతి జానామి. కౌసల్యే ఇత్యుక్త్వా వాగింద్రియ మపి తిష్ఠతీతి నిశ్చినోమి. గంధగ్రహణాభావేన రామమూర్ధోపాఘ్రాణాయ ఘ్రాణేంద్రియం గత మితి నిశ్చినోమి. మహావిషయలాభేన తదితరవిషయస్యాతితుచ్ఛత్వా త్స్పర్శేంద్రియం గతం వా తిష్ఠతివా నిశ్చే

* వ్యా:— ఉపోపవిశ్యేతి:— శయన సమీపే ఉపవిశ్యేత్యర్థః.

దశరథుం గాంచి కౌసల్యయు *నాతని శయనంబునకు బ్రక్కనే

---

ధించినాడు. "శ్రీరాముండు యౌవరాజ్యమున నభిషేకింపబడుచో నా ప్రాణము లప్పుడే వదలెదను" ఇట్లుగ శ్రీరాముని రాజ్యాభిషేకంబునకు వ్యతిరేకాభిప్రాయయై, కైకేయి మోఱకురాలై యున్నది. మఱి నీవో! 'తండ్రీ! నన్ను విడిచి నీ వరణ్యంబునకు బోయినచో నాకు మరణము గల్గుట నిక్కవ' మని యెంత యనురోధంబుగ బల్కితివి! 'కౌసల్యా' - 'లోకనాథుండగు శ్రీరామచంద్రుని నా కౌసల్యాదేవి ప్రసవించెను' అనునట్లు బహుకాలము తపంబులు చేసి లోకరక్షణార్థం బాతని గంటివి. అట్టియాతడు నీ కంతయో దుఃఖకారకు డయ్యెనుగదా! లేక 'కౌసల్యా! నీవు నాకు గన్పట్టుట లేదు' ఇట్టి యనర్థం బాచరించిన కైకేయిని జూచు నా నేత్రము, ఆ దుఃఖనివారణార్థమై నిన్ను గనలేకున్నదేమి? లేక శ్రీరామచంద్రుని ముఖదర్శనంబు లేకయే కైకేయీముఖదర్శనంబున నైనపాతకంబును దొలగుటకై నీముఖసందర్శనమైన జేయ నెంచితిని. ఎంత దురదృష్టము! అదియును సమకూడలేదు. (శ్రీరాముడు తన్ను విడిచి పోవుటచేతనే యా కౌసల్య కడు గుమారిలిపోవుచుండెను. గోరుచుట్టుపై రోకటిపోటుగ నీదశరథవియోగముకూడ కల్గునేమో యను భీతి పుట్టి సమీపమున కేతెంచిన యాకౌసల్యను 'బాగుగా' స్పృశింపుమని కోరుచున్నాడు.) 'నన్ను బాగుగా దాకుము' - కౌసల్యా! నన్ను జేతితో బాగుగా దాకి నా బాధ నపనయింపుము - నన్నాశ్వాసింపుము.

నీవు గన్పట్టకపోవుటచే నాచక్షురింద్రియము పోయెనని నిశ్చయము చేసికొంటిని. మఱి నీ వాడినపలుకు లన్నియు వినవచ్చుటం జేసి శ్రోత్రేంద్రియం బున్నదని తెలిసితిని. కౌసల్యా యని నిన్ను

---

*పదమూడవ శ్లోకంబున నున్న 'ఉపోపవిశ్య' యను పదంబునకు శయనసమీపంబున గూర్చుండి యని యర్థము.

...లాప కృచ్ఛ్రిం. ౧౩

... చోరో గృహం ప్రవిశ్య, కానిచిద్వస్తూని గృహీత్వా ...ంతరం యజమానోఽంధకారే కిం కిం గత మితి ...స్తు స్పృశన్ పత్న్యాదీన్ పృచ్ఛతి. తత్రమాధి ...చ్యతే. 'సాధు స్పృశ'—ప్రకృతిసంబంధకృతం ...మిదం స్థిరం నభవతి. అతః అజుగుప్సనేన స్పృశ. ... స్పృశ'—అగ్నిసాక్షికం ప్రీతిపూర్వకం యథా ...ం తథా స్పృశ, రామసంస్పర్శాన్వయవ్యతిరేకాను ...నజీవనం మాం తత్ప్రీతినిధితయా తన్మాతా త్వం ... భగవత స్స్పర్శాలాభే తత్సంబంధిస్పర్శేనాపి జీవితుం ... "వాహి వాతయతః కాంతే తేతివత్". జన్మాంతర సుకృత ... శ్రీరామే అతీవ పరత్వజ్ఞాన మస్తివా, దశరథస్య కౌస ...శ్చ కథ ముభయో రామపరత్వానుసంధానపూర్వ ...సంభాషణ మిత్యుక్త్వా ఋషి రేవ దశరథాదివచనరీత్యా ...వః పరత్వానుసంధానం కరోతీతి సాంప్రదాయః.

కూర్చుండి నిట్టూర్పులు పుచ్చుచు మిగుల దుఃఖించుచుండెను.

---

సంబోధింప గల్గితిని గాన వాగింద్రియము యథారీతిగా నున్నదని దృఢము చేసికొంటిని. శ్రీరామచంద్రుని మూర్ధంబు మూర్కొనుటకై నాఘ్రాణేంద్రియం బాతనితోడన పోయియుండునని. యిపుడు గంధం బాఘ్రాణింపజాలమి, దెలిసికొనుచున్నాను. ఇక నవ్వల గొప్పలాభం బున్నపు డితరతుచ్ఛవిషయంబులు విసర్జించి వైచి త్వగింద్రియంబుకూడ నారామునితోడనే పోయినదో మఱి నాకడనే యున్నదో తెలియవలెను. అంగులకై నన్ను దాకుము. దొంగవా డింటిలోపల జొచ్చి వాని చేజిక్కిన వస్తుజాలం బంతయు గొనిపోయినయనంతర మాయింటి యజమాని మేల్కొని యేమేమి పోయినదో యేమేమున్నదో యని యయ్యంధకారములో నాయా వస్తువుల దడవుకొనుచు భార్యమున్నగువారి నడుగుచుండునుగదా! అట్లే యీ దశరథుండును జేయుచున్నాడు. 'బాగుగా దాకుము'- ప్రకృతి సంబంధయగు నిది యంతయు గలుషయుతం బని యేవగించుకొనక బాగుగా దాకుము. 'చేతితో దాకుము' - అగ్నిసాక్షికంబుగ బెండ్లాడినప్పు డెట్లు నన్ను దాకియుంటివో యిప్పుడును నట్లే ప్రీతిపూర్వకంబుగ దాకుము. శ్రీరామసంస్పర్శంబు లేకుండ జీవములు నిల్పలేను గాన నాతనిమాత వగు నీవే యాతనికి బ్రతినిధివై నన్ను దాకుము. సాక్షాత్తుగా భగవంతుని సంస్పర్శించు నదృష్టము లేకపోయినను నాభగవత్సంబంధము గలవారల స్పర్శచేనైనను జీవింపవచ్చునుగదా!

కౌసల్యాదశరథు లిద్దరు నీ విధముగ శ్రీరాముడు పరతత్త్వంబను ద్యోతకము గలునటుల నెట్లు సంభాషణము సేయుచుండిరి? వీరల కీపరతత్త్వజ్ఞాన మేజన్మాంతరసుకృతంబువలన గల్గెనను ప్రశ్న యొకటి యుదయించుచున్నది. దీనికి సమాధానము, వాల్మీకి మహర్షియే యాయా సందర్భముల కనుగుణంబుగ, శ్రీరాముడు పరతత్త్వంబని దశరథాదులనోట జెప్పించుచున్నాడని సాంప్రదాయము.

1*విలపంతీం తదా తాంతు కౌసల్యాం ప్రమదోత్తమాం,
ఇదంధర్మే స్థితా ధర్మ్యం సుమిత్రా వాక్య మబ్రవీత్. ౧౪

తవార్యే సద్గుణై ర్యుక్తః పుత్త్ర స్స పురుషోత్తమః,
రామో ధర్మే స్థిత శ్శ్రేష్ఠో న స శోచ్యః కదాచన. ౧౫

వర్తతే చోత్తమాం వృత్తిం లక్ష్మణోస్మి న్సదానఘః,
దయావా న్సర్వభూతేషు లాభ స్తస్య మహాత్మనః. ౧౬

అరణ్యవాసే యద్దుఃఖం జానతీ వై సుఖోచితా,
అనుగచ్ఛతి వైదేహీ ధర్మాత్మానం తవాత్మజం. ౧౭

దదా వస్త్రాణి దివ్యాని తస్మై బ్రహ్మా మహౌజసే,
దానవేంద్రం హతం దృష్ట్వా తిమిధ్వజసుతం రణే. ౧౮

స శూరః పురుషవ్యాఘ్ర స్స్వబాహుబల మాశ్రితః,
అసంత్రస్తో ప్యరణ్యస్థో వేశ్మనీవ నివత్స్యతి. ౧౯

---

* వ్యా:— విలపంతీ మిత్యాది:— ఇదం వక్ష్యమాణం జన్మాంతరసుకృతవశేన తారామండోదర్యోరివ సుమిత్రాయాః పరతత్త్వజ్ఞాన మస్తీతి సాంప్రదాయః, వక్తృవైలక్షణ్యాచ్ఛ ధ్వనిభేదః, స చాలంకారికై రంగీకృతః.

---

1 వాల్మీ. రా: సర్గ ౪౪.

౧౪. *దుఃఖించుచున్న యా కౌసల్యం గాంచి పుణ్యవంతురాలగు నా సుమిత్ర ధర్మార్థసహితంబుగ నిట్లాడదొడంగెను.

౧౫. దేవీ! నీకొమరుండు సద్గుణంబుల కెల్ల నాటపట్టైనవాడు. ధర్మమార్గం బెన్నడును దప్పి యెఱుఁగనివాడు. అట్టి యా పురుషోత్తముని గూర్చి నీ వెంమలకు దుఃఖింపవలెనో నాకు గోచరించుటలేదు.

౧౬. అనఘుం డగు లక్ష్మణుండును సమస్తభూతంబులందును దయచే నెసంగువాడు. పరమోత్తమ వృత్తియగు శ్రీరామకైంకర్యమే యెల్లపుడు సేయువాడు. అట్లు కైంకర్యంబుసేయుటే యాతనిపరమావధి.

౧౭. ఇంక జానకియును నరణ్యవాసంబునం గల్గు కష్టంబు లన్నియు దెలిసియు, స్త్రీలకు భర్తయే దైవతం బను నార్యోక్తిని బురస్కరించుకొని ధర్మాత్ముండగు నీపుత్త్రు ననుసరించిపోవుచున్నది.

౧౮-౧౯. కౌసల్యా! శ్రీరామునిగూర్చి నీ కిసుమంతయు భయము లేదు. దానవులలో కెల్ల దలమానికంబగు నాతిమిధ్వజసుతునిం బరిమార్చిన పట్టున మన శ్రీరాముని బ్రహ్మదేవుం డెంతయు మెచ్చి యాతని కన్నియో దివ్యాస్త్రంబు లిచ్చియుండెనే! ఇట్టి యసహాయశూరుం డగు నాపురుషసింహం బరణ్యంబున నున్న నేమి? ఇంట నున్నట్లే భయవిరహితంబుగ వెలయంగలడు.

---

* దుఃఖించుననుచోట:—జన్మాంతర సుకృతంబుచే తారామండోదరులకుంబోలె సుమిత్రకును బరతత్త్వజ్ఞాన మున్నదని సాంప్రదాయము. వక్తృవైలక్షణ్యంబుచే నైన యీధ్వనిభేదము నాలంకారికు లంగీకరించినదే.

* సూర్యస్యాపి భవే త్సూర్యో హ్యగ్ని రగ్నేః ప్రభోః ప్రభుః
శ్రియ శ్శ్రీశ్చ భవే దగ్ర్యా కీర్తిః కీర్త్యాః క్షమాక్షమా. ౧౦

నివృత్తారణ్యవాస స్స త్వం క్షిప్రం రాజ్య మవాప్స్యసి. ౧౦౫

---

* వ్యా : సూర్యస్యేతి:—‘న తత్రే’ తి శ్రుత్యర్థ ముపపాదయతి. సూర్యస్య సకలలోకప్రకాశకస్యాపి ప్రకాశకః, సవితృమండలాంతర్వర్తిసన్ స్ఫటికముకురాంతస్థితదీపన్యాయేన ప్రకాశయతీతి పరమార్థః. అగ్నే రగ్నిః - అగ్నే ర్వస్తుపరిపాకదాహకత్వాదికం తత్సంకల్పాధీన మిత్యర్థః, ‘అహం వైశ్వానరో భూత్వే’ త్యాదిశ్రవణాత్. ప్రభోః ప్రభుః - బ్రహ్మరుద్రాదేః సృష్ట్యాదిసామర్థ్యప్రదానేన నిర్వాహకః. శ్రియః శ్రీః - బ్రహ్మాదీనాం యత్కటాక్షలేశాయత్త మైశ్వర్యం, నారాయణస్యాపి యదపాంగభూయస్త్వనిబంధనం సుజ్జయత్వం తస్యా అపి యదాశ్రయణా చ్ఛ్రీత్వం సిద్ధ్యతీతి. లక్ష్మ్యా అపి స్వరూపనిర్వాహక ఇత్యర్థః. కీర్త్యాః కీర్తిః- యస్య నామ మహద్యశ ఇతి యత్సంబంధా న్మహత్త్వ మనితరసాధారణ మితి కృత్వా కీర్త్యా అపి కీర్త్యావహః. క్షమా క్షమా- సర్వాధారభూతాయా భూమే రప్యాధార ఇత్యర్థః.

౨౦. * సర్వలోకప్రకాశకుండగు సూర్యున కీతడే వెల్గు నిచ్చువాడు. సర్వ వస్తుసంహారకుండగు నగ్నిదేవున కీతనివలననే దాహకత్వాదికం బబ్బుచున్నది. సత్యాదిలోకంబుల కధిపతులగు బ్రహ్మాదు లీతని వలననే యా యా పదవు లందుచున్నారు. సర్వసంపత్కారిణియగు లక్ష్మికి నీతడే సంపత్కారకు డగుచున్నాడు. సకలభూతసంవహన క్షమయగు భూదేవి కీతడ యాధారభూతుండు. అనితరసాధారణంబగు కీర్తి కీతండ మూలకందం బగువాడు.

౨౦౪. అట్టి యీతడు శీఘ్రముగానే యరణ్యంబునుండి మఱలివచ్చును. వచ్చి రాజ్యభారంబును వహించును.

---

*సూర్యున కను-చో-ట:—'న తత్ర' ఇత్యాది శ్రుత్యర్థం బీశ్లోకమున నుపపాదింప బడుచున్నది. సూర్యుడు సకలలోకములను వెలుగొంద జేయువాడైనను నాతని ప్రకాశశక్తి యీతనివలననే కల్గుచున్నదని భావము. సూర్యమండలాంతర్వర్తియై స్ఫటికాదికంబులో నున్న దీపమువోలె సకలంబును బ్రకాశింపజేయువాడని భావము. అట్లే యగ్నిదేవునికి దాహకత్వాదిగుణంబులును 'నే నగ్నిదేవుండనై' ఇత్యాది గీతాప్రమాణంబులంజేసి యీతనివలననే కల్గుచున్నవి. బ్రహ్మాదులకును సృష్ట్యాదిసామర్థ్యం బీతనివలననే కల్గుచున్నది. బ్రహ్మాదులకేదేవీకటాక్షంబుచే సృష్టిసంపద యబ్బెనో, నారాయణునకు సర్వజ్ఞత్వం బేదేవి కడగంటిచూడ్కిచే నివ్వటిల్లెనో, అట్టి యాశ్రీదేవికి సైత మీతని నాశ్రయించియుండుటచేతనే శ్రీత్వము కల్గుచున్నది. (అనగా లక్ష్మీదేవికినిగూడ స్వరూపనిర్వాహకు డని భావము) ఎవని సంబంధముచేతనసాధారణంబగు కీర్తి కల్గునో యట్టికీర్తికి మూలకందం బగువా డని, సర్వాధారభూతయగు భూదేవికి నాధారభూతుండనియు పైవాక్యములకు భావము.

నిశమ్య తల్లక్ష్మణమాతృవాక్యం రామస్యమాతు ర్నరదేవ పత్న్యాః, సద్య శ్శరీరే విననాశ శోక శ్శరద్గతో మేఘ ఇవాల్పతోయః. ౨౧

[1] అనురక్తా మహాత్మానం రామం సత్యపరాక్రమం,
అనుజగ్ముః ప్రయాంతం తం వనవాసాయ మానవాః. ౨౨

ఉవాచ రామ స్స్నేహేన తాః ప్రజా స్స్వాః ప్రజాఇవ. ౨౩

యా ప్రీతి ర్బహుమానశ్చ మయ్యయోధ్యానివాసినాం,
మత్ప్రియార్థం విశేషేణ భరతే సా నివేశ్యతాం. ౨౪

సహి కల్యాణచారిత్రః కైకేయ్యానందవర్ధనః,
కరిష్యతి యథావ ద్వః ప్రియాణిచ హితానిచ. ౨౫

యథా యథా దాశరథి ర్ధర్మ ఏ వాస్థితోఽభవత్,
తథా తథా ప్రకృతయో రామం పతి మకామయన్. ౨౬

ఏవ మూ ర్తప్రలాపాం స్తాన్ వృద్ధాన్ ప్రలపతో ద్విజాన్,
అవేక్ష్య సహసా రామో రథా దవతతార హ. ౨౭

1 వాల్మీ. రా: సర్గ ౪౫.

౨౧౫. ఇటుల సుమిత్రాదేవి తన్నూర్కాచింపగా, శరత్కాలం బాసన్న మైనప్పుడు మేఘంబులో నున్న కొంచెముజలమును నిశ్శేషముగా నంతరించినట్లు కౌసల్యకును దుఃఖము లేకపోయెను.

(ఇటనుండి శ్రీరాముం డరణ్యంబునకు బోయిన తెఱం గిద్దియా తెలుపబడుచున్నది.)

౨౨. సత్యపరాక్రముం డగు నా శ్రీరామచంద్రుం డరణ్యంబునకు బోవు చుండుట జూచి యాతనిపై ననురక్తి గల్గువా రెల్లరును నాతనితో డనే పోయిరి.

౨౩. అట్లు వచ్చుచున్న యాప్రజలం గాంచి, కన్నబిడ్డలతో బోలె, వారలతో నా శ్రీరాము డిట్లనియె.

౨౪. ప్రజలారా! అయోధ్యావాసులగు మీ కెల్లరకును నాయం దెట్టి ప్రీతియును బహుమానంబును నున్నవో అట్టి ప్రీతియే యికముందు భరతునియందునుగూడ మీరు కన్పఱుపవలయును. ఇది నా కెక్కుడు ప్రీతికరంబు.

౨౫. అతడును సదాచారసంపన్నుడు, శుభచారిత్రుడు. అకైకేయీనంద నుండు మీకు బ్రియంబును హితంబును నిజముగ నాచరించును.

౨౬. ధర్మమార్గం బిసుకంతైనను వీడక యా శ్రీరాముం డీవిధముగ బల్కుచున్న కొలందియు నాతనినే తమకు రక్షకునిగా గోరుచు జను లందఱు నాతని వెంట బడి ప్రలపించుచుండిరి.

౨౭. ఇట్లు ప్రలపించుచు వచ్చుచున్న యా వృద్ధబ్రాహ్మణాదిప్రజలం జూచి శ్రీరాముండు వెన్వెంటనే రథంబు డిగ్గి సీతాలక్ష్మణసమేత ముగ పాదచారియై పోబొచ్చెను.

గచ్ఛంత మేవం తం దృష్ట్వా రామం సంభ్రాంతచేతసః,
ఊచుః పరమసంతప్తా రామం వాక్య మిదం ద్విజాః. ౨౮

బ్రాహ్మణ్యం సర్వమేత త్త్వాం బ్రహ్మణ్య మనుగచ్ఛతి,
ద్విజస్కంధాధిరూఢా స్త్వా మగ్నయోఽప్యనుయాంత్యమీ. ౨౯

వాజపేయసముత్థాని ఛత్రాణ్యేతాని పశ్య నః,
అనవాప్తాతపత్రస్య రశ్మిసంతాపితస్య తే. 30
ఏభి శ్ఛాయాం కరిష్యామ స్స్వచ్ఛత్త్రై ర్వాజపేయికైః. 30½

యాచితో నో నివర్తస్వ హంసశుక్లశిరోరుహైః,
శిరోభి ర్నిభృతాచార మహీపతనపాంసులైః. 31½

ఏవం విక్రోశతాం తేషాం ద్విజాతీనాం నివర్తనే,
*దదర్శ తమసా తత్ర వారయంతీవ రాఘవం. 32½

రామస్తు తమసాతీరం గత్వా తత్రావస త్సుఖీ,
జలం ప్రాశ్య నిరాహారో వృక్షమూలేఽస్వప ద్విభుః. 33½

* వ్యా:—తమసేతి:— సాంప్రతం లోకే తమసాం టాన్సు (Tons) ఇతి ప్రవదంతి. ఘోఘ్రానద్యా ఉపనదీయం.

౨౭. నడచిపోవుచున్న యాతనిం జూచి, మనంబులు కలతసెంది వృద్ధ బ్రాహ్మణు లాతనితో నిట్లనిరి.

౨౯. శ్రీరామా! యీ బ్రాహ్మణ్య మంతయు బ్రహ్మణ్యుండ వగు ని న్ననుసరించివచ్చుచున్నది. ఈ బ్రాహ్మణుల భుజస్కంధములపై నరణులలో నుండు నగ్నులును నీతోడనే వచ్చుచున్నవి.

30-30½. రామా! వాజపేయయాగంబు లొనరించినందులకు జిహ్నం బులుగా ధరించిన యీ మా ఛత్రంబుల జూడుము! ఇవి యెండ లలో యెఱుంగునవా? సూర్యకిరణసందీప్తసంతాపితుండ వగు నీ కిదుటకే!

3౧½. ప్రభో! మాతల లన్నియు నరసిపోయినవి. ఇంతవయసు జెల్లిన మా బోటి ముసలుల మాటలు కొంచెము పాటించి అయోధ్యకు మఱలి రమ్ము. అట్లు మఱలి రమ్మని మీరథము వెంటబడి వచ్చుటచే హంసవర్ణంబులగు మాశిరోరుహంబు లన్నియు నేటుల ధూళిధూస రితంబు లైనవో చూడుము.

3౨½. ఇవ్విధంబుగ దుఃఖించుచు నాపౌరజ లందఱు వెంట వచ్చుచుండగ, శ్రీరాము నికముందునకు సాగిపోకుండ వారజూచి యాటంకపఱచునది వోలెనున్న *తమసానది యట బొడకట్టెను.

33½-38½. శ్రీరాముండును దమసాతీరంబు జేర, యాహారం బేమియు గొనక, జలంబుమాత్రము త్రావి, యొకవృక్షమూలంబున నియమిత

---

* వ్యా:—తమసానది—ఈతమసానదిని నిప్పు డాంగ్లేయ భాషలో 'టాన్సు' (Tons) అని వ్యవహరించుచున్నారు. ఇది ఘోఘ్రీనదికి నుపనదియై యున్నది.

సీతయా సహ ధర్మాత్మా ధనుష్పాణిస్తు లక్ష్మణః,
పాలయామాస ధర్మజ్ఞ స్సుమంత్రేణ సమన్వితః. ౩౪

[1]పౌరా స్సర్వే సమాగత్య స్థితా స్తస్యావిదూరతః,
శిలాః కాష్ఠా శ్చోపధాయ శిరసోఽధో నినిద్రిరే. ౩౫

[2]ఉత్థాయచ మహా తేజాః ప్రకృతీ స్తా నిశమ్యచ,
అబ్రవీ ద్భ్రాతరం రామో లక్ష్మణం పుణ్యలక్షణం. ౩౬

అస్మద్వ్యపేక్షాం సౌమిత్రే నిరపేక్షాం గృహేష్వపి,
వృక్షమూలేషు సంసుప్తాః పశ్య లక్ష్మణ సాంప్రతమ్. ౩౭

యావదేవతు సంసుప్తా స్తావదేవ వయం లఘు,
రథ మారుహ్య గచ్ఛామః పంథాన మకుతోభయం. ౩౮

పౌరా హ్యాత్మకృతా ద్దుఃఖా ద్విప్రమోక్ష్యా నృపాత్మజైః. ౩౯

ఇయ మద్య నిశా పూర్వా సౌమిత్రే ప్రహితా వనం,
వనవాసస్య భద్రం తే స నోత్కంఠితు మర్హసి. ౪౦

ఏవ ముక్త్వాతు సౌమిత్రిం సుమంత్ర మపి రాఘవః,
తం స్యందన మధిష్ఠాయ రాఘవ స్సపరిచ్ఛదః. ౪౧

---

1 యాజ్ఞవల్క్యరా. 2 వాల్మీ. రా: సర్గ ౪౬.

మానవుండై పవ్వళించెను. సీతయు నందే పన్నుండెను. సుమిత్రా నందనుడు మాత్రము ధనుష్పాణియై యా సీతారాముల గాపాడు చుండెను. సుమంత్రుడును లక్ష్మణునకు తోడుగా నుండెను.

౩౫. శ్రీరాముని వెనువెంటవచ్చిన పౌరు లందఱును శిలలను గొయ్యలను తలాడలుగా జేసికొని యావృక్షంబున కనతి దూరంబుననే నిదురించిరి.

౩౬. మహాతేజస్వి యగునా శ్రీరాముం డంతట మేల్కాంచి నిదురవోవు చున్న యాప్రజ లందఱిం గనుంగొని లక్ష్మణునితో నిట్లనెను.

౩౭. తమ్ముడా! తమతమ గృహంబులాదిగా గలవాని నన్నిటిని విడిచి తమయాస లన్నియు మనపై బెట్టుకొనివచ్చి పురజను లందఱు నీవృక్ష మూలంబుల నెట్లు నిదురించుచున్నారో కంటివా?

౩౮. కనుక వీ రందఱును మేల్కాంచి మరల మనవెంట బడకముందే వీరి కనుగప్పి మెల మెల్లగ రథం బెక్కిపోవుదము.

౩౯. వారివారిదోషంబులచేత నే ప్రజల కేదైన నిక్కట్టు వాటిల్లిన దానిని వారింపవలసినవిధి ప్రభువులపై నున్నది. అట్టియెడ మనవలన వీరి కేకడగండ్లును రాగూడదుకదా ?

౪౦. లక్ష్మణా! మనవనవాసంబున కీ రాత్రియే మొట్ట మొదటిదిగా నున్నది. ఇది కడచిపోవుచున్నది. కాన దీనికై నీవు చింతింపవలసిన యగత్యము లేదు.

౪౧-౪౨-౪౩. ఇట్లుగ లక్ష్మణునితోడను సుమంత్రునితోడను బల్కి తమ తమ ధనుఃకవచాదికంబులు గైకొని యారథం బధిరోహించి తనవెం బడి రాకుండ పౌరు లందఱు వెఱతోవ బట్టిపోవుటకై రంథబు.

మోహనార్థంతు పౌరాణాం సూతం రామోఽబ్రవీ ద్వచః,
ఉదఙ్ముఖః ప్రయాహి త్వం రథ మాస్థాయ సారథే. ४२
ముహూర్తం త్వరితం గత్వా నివర్తయ రథం పునః,
యథా న విద్యుః పౌరా మాం తథా కురు సమాహితః. ४३
రామస్య వచనం శ్రుత్వా తథా చక్రే స సారథిః. ४३५
శీఘ్రగా మాకులావర్తాం తమసా మతర న్నదీం. ४४

1ప్రభాతాయాంతు శర్వర్యాం పౌరా స్తే రాఘవం వినా,
శోకోపహతనిశ్చేష్టా బభూవు ర్హతచేతసః. ४६
కృపణాః కరుణా వాచో వదంతి స్మ మనస్వినః. ४६५
ధిగస్తు ఖలు నిద్రాం తాం యయాపహృతచేతసః,
నాద్య పశ్యామహే రామం పృథూరస్కం మహాభుజం. ४७५

ఇతీవ బహుధా వాచో బాహుముఖ్యమ్యుతే జనాః,
రథనేమిగతం మార్గం పశ్యంత స్తే పురం యయుః. ४८५
తే తాని వేశ్మాని మహాధనాని, దుఃఖేన దుఃఖోప
హతా విశంతిః, నైవ ప్రజజ్ఞు స్స్వజనం జనంవా
నిరీక్షమాణాః ప్రవినష్టహర్షాః. ४७५

1 వాల్మీ. రా: సర్గ ४६.

నుత్తరాభిముఖంబుగ గొంతదూరము పోనిచ్చి మఱల ద్రిప్పుకొని రమ్మని శ్రీరాముడు సుమంత్రునితో జెప్పెను.

౪౩½. ఆతడును నట్లే యొనర్చెను.

౪౪. వారంత శీఘ్రగామినియు బహుళావర్త కల్లోలినియునగు నా తమసానదిని దాటి ప్రయాణమైపోయిరి.

౪౫-౪౫½. తెల్లవాఱగానే పౌరు లందరును లేచి యా శ్రీరామచంద్రు డేడను గాన్పింపనందున హతాశులై మిగుల వగనొందుచు నొకరితో నొకరు దీనముగా నిట్లనుకొనుచుండిరి.

౪౬½. అయ్యో! మన కీ నిదుర పెద్దమ్మ యెక్కడనుండి దాపురించెను? దీనికి లోబడిపోయితిమి. మహోరస్కుండగు నా శ్రీరాము నిప్పు డెట జూడగలము!

౪౭½. ఇట్లుగ నాప్రజ లందఱును శ్రీరామునికై పనవి పనవి రథంబు పోయిన మార్గమును జూచుకొనుచు బురంబునకు మఱలిపోయిరి.

౪౮½. దుఃఖోపహతులగు నీ పురజను లందఱు ధనధాన్యసమృద్ధంబు లగు తమ తమ యిండ్ల కట్టులో తిరిగిపోయిరే కాని యక్కడ వారి కేమియు దోపలేదు. తమ బంధుగులను నితరులను జూచియు వారు గుఱుతింపలేకపోయిరి. (వారిదుఃఖ మంత యధికముగా నుండెనని భావము.)

[1]నచాహృష్యన్ నచామోద న్వణిజో న ప్రసారయన్,
న చాశోభంత పణ్యాని నాపచన్ గృహమేధినః. ౪౯½

నష్టం దృష్ట్వా నాభ్యనందన్ విపులం వా ధనాగమం,
పుత్రం ప్రథమజం లబ్ధ్వా జననీ నాభ్యనందత. ౫౦½

గృహే గృహే రుదంత్యశ్చ భర్తారం గృహ మాగతం,
వ్యగర్హయంత దుఃఖార్తా వాగ్భి స్తోత్త్రై రివ ద్విపాన్. ౫౧½

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అయోధ్యాకాండే
నవమ స్సర్గః.

---

## దశమ స్సర్గః.

[2]రామోపి రాత్రిశేషేణ తేనైవ మహదంతరం,
జగామ పురుషవ్యాఘ్రః పితురాజ్ఞా మనుస్మరన్. ౧

తతో వేదశ్రుతిం నామ శివవారివహాం నదీం,
ఉత్తీర్యాభిముఖః ప్రాయా దగస్త్యాధ్యుషితాం దిశం. ౨

గోమతీం గోయుతానూపా మతర త్సాగరంగమాం,
మయూరహంసాభిరుతాం తతార స్యందికాం నదీం. ౩

---

1 వాల్మీ రా: సర్గ ౪౮; 2 వాల్మీ. రా: సర్గ ౪౯.

౪౯-౫౦-౫౧. స్నేహితులాదిగా గలవా రెవ్వరు కన్పట్టినను వారికి సంతసం బేమియు గల్గలేదు. వర్తకజనంబు లెవ్వరును దమతమ యంగళ్లు తెఱువలేదు. పుణ్యకార్యంబు లెవ్వియు ప్రకాశింపలేదు. గృహస్థు లెవ్వరును వంటలు చేసికొనలేదు. పోయినవస్తువు మఱల లభించినను నెవ్వరు సంతసింపలేదు. ఎంత ధనలాభంబు కలిగినను నెవ్వరికి హర్షం బొదవలేదు. ప్రథమమున గలిగిన కుమారుని జూచియు నేతల్లియు ముదంబొందలేదు. ప్రతియింటను దుఃఖించుచున్న యయోధ్యాపురస్త్రీ లందరు తమతమ భర్తలింటికి మఱలిరాగనే వారల నీసడించివైచుచు, నేనుంగుల నంకుశంబులతో బోలె, దమ వాగంకుశంబులచే మిగుల నొప్పించిరి. (తమ భర్తలు శ్రీరాముని దిరిగి తీసుకొని రాలేకపోయిరికదా యని కోపపడి రనిభావము.)

ఇది శ్రీరామాయణసారోద్ధారంబున నయోధ్యాకాండంబునందు
దొమ్మిదవ సర్గము

---

## పదవ సర్గము.

౧. శ్రీరాముం డిట్లు పురజనుల నందఱిని విడిచిపెట్టిపోయిన యారాత్రియే తండ్రియాజ్ఞను దలచుకొనుచు బహుదూరం బేగెను.

౨-3. మార్గంబున మంగళకరప్రవాహిని యగు వేదశ్రుతి యనునదిని దాటి యగస్త్యమహర్షి కావాసంబగు దక్షిణదిక్కునకై పోయెను. తరువాత నాలమందలతో నిండియుండు గోమతియను నదిని, మయూరహంసాదిరుతయుతంబగు స్యందికానదిని దాటెను.

[1]స్ఫీతా ఞ్జనపదా న్దృశ్య న్రామ స్సీతాసమన్వితః,
గంగాతీరం సమాగచ్ఛ చ్ఛృంగిబేరావిదూరతః. ౪

గంగాం దృష్ట్వా నమస్కృత్య స్నాత్వా సానందమానసః,
ఇంగుదీవృక్షమూలేచ నిషసాద రఘూత్తమః. ౫

*తతో గుహో జనై శ్శ్రుత్వా రామాగమమహోత్సవం,
సఖాయం స్వామినం ద్రష్టుం హర్షా త్తూర్ణం సమాపతత్. ౬

*వ్యా:—అస్మి న్సర్గే 'తతో గుహో జనై శ్శ్రుత్వా' ఇత్యారభ్య కథితో గుహః క ఇతి విచార్యమాణే అధ్యాత్మాదిరామాయణోక్త్యా సీతాస్వయంవరార్థం గంగానదీం తారయితుం సమాగత ఏవేతి సిద్ధ్యతి. పున ర్దండకారణ్యగమనవేళాయాం గంగాతీరే శృంగిబేరపురే సంప్రాప్తో గుహ ఇతి రామాయణే ష్వభిహితః. ఏష గుహః సఏ వాన్యోవేతిచే న్నేకఏవే త్యుచ్యతే. తథాహి వాల్మీకిరామాయణే అయోధ్యాకాండే ౫౧ సర్గే లక్ష్మణం ప్రతి గుహవచనం: "నహి రామా త్ప్రియతమో మమాస్తి నహి కశ్చన, బ్రవీమ్యేత దహం సత్యం సత్యేనైవచ తే శపే. అస్య ప్రసాదా దాశంసే లోకేస్మిన్ సుమహద్యశః, ధర్మావాప్తిం చ విపులా మర్థావాప్తించ కేవలా" మిత్యుక్త్యా; తత్రైవ ౮౪ సర్గే "నిషాద రాజో దృష్ట్వైవ జ్ఞాతీన్ సంత్వరితోఽబ్రవీత్, భర్తాచైవ సఖాచైవ రామో దాశరథి ర్మమ" ఇత్యుక్త్యాచ; పునశ్చ ౮౬ సర్గే భరతంప్రతి గుహః "నహి రామాత్ప్రియతమ" ఇతి

1 అధ్యా. రా: సర్గ ౫.

౪-౫. పిమ్మట నాతడు సీతాసమేతుడై జనపదంబు లన్నియు జూచుచు శృంగిబేరపురంబున కనతిదూరంబున గంగాతీరంబు జేరి యా త్రిలోక పావనిం గాంచి నమస్కరించి యందు స్నానం బాడి సానందుడై యొక యడవిగారచెట్టు మొదల నివసించెను.

౬-౭. అంత గుహుండు, శ్రీరాముం డిట్లు సీతా లక్ష్మణసమేతుడై యరణ్యావాసంబు సేయబోవుట విని ప్రభువును సఖుండును నగు నాతని

---

వ్యా—ఈ సర్గమందు గుహుని వృత్తాంత మొకటి విశేషముగా జెప్పబడియున్నది; అధ్యాత్మాది రామాయణంబులను బట్టిచూచి నచో, శ్రీరాముడు సీతాస్వయంవరార్థమై పోవునప్పు డాతనిని గంగానదిని దాటించిన గుహుం డొకడు కన్పట్టును. మఱి సీతారామ లక్ష్మణులు దండకారణ్యమునకు బోవుచో, శృంగిబేరపురంబున మఱొకగుహుడు మనకు దోచుచున్నాడు కదా! ఆతడును నీత డును నొక్కరేనా. వేర్వేరా! యనినచో నొక్కరేయని తెలియ వలెను ఇందులకు ప్రమాణంబులును:- వాల్మీకి రామాయణము నందు అయోధ్యాకాండమున నేబదియొకటవ సర్గములో లక్ష్మణు నితో గుహునివచనము—“శ్రీరామునికంటె బ్రియతముండు నా కెవ్వడును లేడు. సత్యముం జెప్పుచున్నాను. ఈతని కరుణావిశేషం బున ధర్మార్థంబులును భూరియశంబును బొందగోరుచున్నాను.” అని పల్కినట్లును; ఎనుబదినాల్గవ సర్గమునందు - “నిషాదరాజగు గుహుండు తన దాయాదులం గని శ్రీరాముండు నాకు సఖుండును నధిపుండును” నని పల్కెను. ఎనుబదియారవసర్గమందును నిట్లే యున్నది. భరతునితో గుహుడు—“రామునికంటె బ్రియతముండు నా కెవ్వడును లేడు” అనెను. ఈప్రమాణంబులంబట్టి శ్రీరామునకును గుహునకును నింతకుమును పే సంబంధ మున్నదని ద్యోతనం బగుచున్నది. ఇంతకు మించి గుహునకును శ్రీరామునకును గల సంబంధమును దెలుపునట్టి ప్రమాణం బేమియు వాల్మీకీయంబున గానరాదు.

జూచుటకై స్వాదుఫలాదికంబులు గైకొని భక్తిసంయుతుఁడై యే తెంచి, తా దెచ్చిన ఫలంబులు శ్రీరామునియెదుట నుంచి దండ ప్రణామంబు జేసెను.

---

కాని గంగానదిలో నోడగడపుచు, కేవలనావికుఁడుగా నున్న గుహుఁడు, శ్రీరాముఁడు సతాస్వయంవరార్థమై పోవునప్పు డాతని పాదంబులు గడిగి యందుచే లబ్ధవైభవుం డయ్యె నను విషయ మధ్యాత్మాదిరామాయణంబుల స్పష్టముగానే చెప్పబడియున్నది. అయినను వాల్మీకిరామాయణంబున మాత్రము ధర్మావాప్తియు నర్థావాప్తియు నొందినాఁడని మాత్రమే సూచింపబడినది. కాన వీని నన్నిటిని బట్టి పూర్వము వచ్చిన గుహుఁడే యీత డని నిర్ధారణగా దెలియవలెను.

శ్రీరాముఁడు దండకారణ్యమునకు బోవునప్పుడు గుహుం డీతని పాదంబులు గడిగెనని మఱియొకగాథ చూపట్టుచున్నది. ఇది యంత సంగతంబైనది కాదు. ఏలయన నీసందర్భములో జెప్పబడిన గుహుఁడు కేవలనాకాజీవి కాఁడు. రాజ్యాదిసకలవైభవసంపూర్ణుఁ డని యాక్రింద జెప్పిన యా యా సందర్భంబుల శ్లోకంబుల గాంచినచో విశదం బగును. వాల్మీకిరామాయణంబున నయోధ్యాకాండంబునందు నేబది యవ సర్గములో 'రామునికి బ్రియసఖుండగు గుహుం డనురాజు' అనియు "వారలం జూచి మిగుల నార్తుఁడై, శ్రీరాముని గౌఁగిలించు కొని యాతనితో శ్రీరామా! నీ కయోధ్యాపురం బెట్ల యట్ల యీ శృంగిబేరపురంబును. ఇదే నీకు స్వాగతము. నీ కేమి సేయవలయునో సెలవిమ్ము. ఈసకలధారణియు నీదియై యున్నది. నీవు ప్రభుండవు మేము నీయధీనులము - నీపంపుసేయువారము. ఈమారాజ్యంబు గైకొని మమ్ము బాలింపుము!'' అని శ్రీరామునితో గుహుఁ డనినట్లును; నేఁబదియొక్కటవ సర్గమందును గుహుఁడు లక్ష్మణునితో "రాకుమారా! ఈ వనంబున మా కెఱుంగరాని దేదియు లేదు. చతురంగబల సమేతంబగు మహాసైన్యమును సైతము దీన మే మెదిరింపగల'' మని యట్లును; నేఁబదిరెండవ సర్గమునందును గుహునితో శ్రీరాముఁడు

**గుహా ముక్త్వా తం తూర్ణం రాఘవః పరిషస్వజే.** 25

ప్రతి గుహః "నహి మేఽవిదితం కించి ద్వనేస్మిం చరత స్సదా, చతురంగం హ్యపిబలం సుమహ త్ప్రసహేమహి." ఇతి; 52 సర్గే గుహంప్రతి శ్రీరామః "అప్రమత్తో బలే కోశే దుర్గే జనపదే తథా, భవేథా గుహ రాజ్యం హి దురారక్షతమం మతం." ఇత్యుక్తవాన్. పునశ్చ వాల్మీకిరామాయణే అయోధ్యాకాండే 84 సర్గే చతురంగబలోపేతం భరతం యోద్ధుమ ప్యుద్యుక్త ఇతిజ్ఞాయతే. తథాహి: "నిషాదరాజో దృష్ట్వైవ జ్ఞాతీన్ సంత్వరితోఽబ్రవీత్, మహతీయ మితస్సేనా సాగరాభా ప్రదృశ్యతే, నాస్యాంత మధిగచ్ఛామి మనసాపి విచింతయన్. యదాతు ఖలు దుర్బుద్ధి ర్భరత స్స్వయ మాగతః, తిష్ఠంతు సర్వే దాశాశ్చ గంగా మన్వాశ్రితాం నదీం, నావాం శతానాం పంచానాం కైవర్తానాం శతం శతం, సన్నద్ధానాం తథా యూనాం తిష్ఠంత్వి త్యభ్యయోజయత్, యదా తుష్టస్తు భరతో రామస్యేహ భవిష్యతి, సేయం స్వస్తిమతీ సేనా గంగా మద్య తరిష్యతి" ఇత్యాదినాభిహితం. నౌకావైలక్షణ్యమపి వర్ణితంవాల్మీకిరామాయణే అయోధ్యాకాండే 89 సర్గే "పంచ నావాం శతా న్యాశు సమానిన్యు స్సమంతతః, శోభమానాః పతాకాభి ర్యుక్తవాతా స్సుసంహతాః, తత స్స్వస్తికవిజ్ఞేయాం పాండుకంబలసంవృతాం, ససందిఘోషాం కల్యాణీం గుహో నావ ముపాహరత్, తా మారురోహ భరత శ్శత్రుఘ్నశ్చ మహాబలః" ఇత్యుక్త

౪౫. శ్రీరాముండును వాతని వెంటనే లేవనెత్తి కౌఁగిలించుకొనెను.

---

మిత్రమా! చతురంగబలములు, కోశాగారము, దుర్గము, దేశము – వీని విషయములో జాగరూకుఁడవై మెలంగుము. రాజ్యాధికారము కావలెనని యుబలాటపడవచ్చునేకాని దానిని సమర్పించుకొనుట మాత్రము మిగుల గష్టంబని పెద్దలు నుడువుచుందురు." అని యనినట్లును, ప్రమాణము లున్నవి. ఎనుబదినాల్గవ సర్గమందు జతురంగబలసమేతుఁడై వచ్చు భరతునిగూడ నెదుర్కొనుటకు సన్నద్ధుండయ్యెనని యీక్రింది ప్రమాణంబుల జూపట్టును: "గుహుండు తన వారలం జూచి ససంభ్రమంబుగ నిట్లనెను. ఓహో! యెక్కడి దీ మహాసేన! సముద్రంబుంబోలె నపారంబుగ జూపట్టుచున్నది. కంటితో జూడలేక పోయినమానె – దీనియంతమును మనంబుచేనైనను నూహింపలేకున్నాను. సరిసరి తెలిసినది. దుర్బుద్ధియగు భరతుఁడు స్వయముగా వచ్చియున్నాఁడు. ఓయీ! దాశజనంబులారా! యీగంగానదిరేవు లన్నింటిని నప్రమత్తులై కాపాడుచుండుఁడు. యుద్ధనావల నైదువందల నాయత్తములు చేసి యొక్కొక్కదానిలో నూర్గుర చొప్పున గిరాతయోధు లుండుఁడు. ఈ భరతునకు మిత్రభావం బున్నచో నీతనిసేన యంతయు సేమంబుగా నావలియొడ్డున జేరంగల" దని గుహుండు పలికిన ట్లున్నది. ఎనుబది తొమ్మిదవ సర్గమందు "గుహుండిట్లాజ్ఞాపింపగనే యాతని పరివారజనంబులు పోయి పతాకలచే నటునిటు కలత జెందుచున్నవియు, ననుకూల వాయువుం గలిగినవియు నగు నేనూరు నావలను దెచ్చిరి. తరువాత తెల్లని కంబళి పఱుపబడినదియు శుభలక్షణంబులు గల్గినదియు చిఱుగంటలు మ్రోగుచున్నదియు నగు స్వస్తికంబను నావను గుహుఁడు అగా భరతశత్రుఘ్ను లం దధిష్ఠించిరి." ఇట్టి ప్రమాణంబులచే వర్ణింపబడిన సకలవైభవోపేతుం డగు గుహుండు "రామచంద్రా! నీపాదంబులు గడుగనిమ్ము. ఇదివఱకు నీపాదరజంబు సోకి చట్రాయియే యొక చెలదిగా వెలసెనని వింటిమి. ఆనీపాదరజంబే సోకి నానావ కూడ నొక సుందరిగా మారినా నా జీవనాధారము పోయి నా

సంపృష్టకుశలో రామం గుహః ప్రాంజలి రబ్రవీత్. ౮

[1]నీలాంబుదశ్యామలకోమలాంగం, సీతాసమారోపితవామ
భాగం, పాణౌ మహాసాయకచారురూపం, నమామి
రామం రఘువీరనాథం. ౯

---

రాజ్యాదివైభవోపేతో గుహః కథం శ్రీరామంప్రతి “నోచేత్త్రీ సద్యృవతీ మలేన స్యాచ్చే ద్విభో విద్ధి కుటుంబహాని” రితి కథం బ్రూయాత్ ? తస్మాద్దండకారణ్యగమనవేళాయాం పాదప్రక్షాళనం న సంగచ్ఛతే. అథవా నేదం వాల్మీక్యాది రామాయణ కథానుకూల మితి, తత్ కల్పాంతరీయ రామ కథా సందర్భ మితి కంఠోక్త్యా వక్తుం శక్యతే.

నను ‘హీనప్రేష్యం హీనసఖ్యం హీనగేహనిషేవణ’ మిత్యుపపాతకపరిగణితం హీనజాతిసఖ్యం మహాకులప్రసూతస్య శ్రీరామచంద్రస్య కథ ముపపద్యత ఇతిచే త్సత్యం. “నిషాదస్థపతిం యాజయే” దితి నిషాదాధిపతే ర్యజ్ఞసంబంధ శ్రవణాత్ బాలకాండోక్తరీత్యా మహోదయాఖ్య బ్రహ్మర్షిరేవాయం వ్యాధఇతి స్మరణా దత్యంతానుచితం న భవతీత్యవగంతవ్యం; రామస్యాపి హీనసఖ్యం చాత్ర నిరస్తం భవతి.

---

1 యాజ్ఞవల్క్యరా.

౮. ఒండొరులు కుశలప్రశ్నంబులు చేసికొనినతరువాత గుహుండు శ్రీరామునితో నిట్లనెను.

౯. నీలమేఘశ్యామశరీరుండవును సీతాసమారోపిత వామభాగుండవును మహాధనుర్ధారివియునైన శ్రీరామచంద్రమూర్తీ! నమస్కారము.

---

నోటను నాపిల్లల నోటను గడ్డపడు" నని యిట్లు మహాదీనముగ గుహుండు పలికె ననుట యేమైన సొంపుగ గన్పట్టునా? కాన సీతారామలక్ష్మణులు దండకారణ్యంబునకు బోవునపుడు గుహుండు శ్రీరాముని పాదప్రక్షాళనంబు చేయులే దని యనుకొనుటే సంగతముగా నున్నది. లేక దీనిని గట్టిగా సమర్థించిరేని తీరవలె నను పట్టుదల యున్నచో నిది వాల్మీక్యాదిరామాయణాను సారంబు గాదనియు గల్పాంతరీయ రామకథాసందర్భ మనియు గంఠోక్తిగా జెప్పనొప్పును.

అట్లైన హీనుని సేవయు హీనసఖ్యమును హీనుని గృహంబున నుండుటయు నుపపాతకంబు లని చెప్పబడెనుగదా! అట్టిచో హీనకులజుండగు గుహునిసఖ్యము శ్రీరాముని కెట్లు సెల్లెనని ప్రశ్నింపరాదు. 'నిషాదస్థపతిం యాజయేత్' ఇత్యాదిగ నీతనికి యజ్ఞసంబంధమున్నట్లు గన్పట్టుటచేతను మాబాలకాండమున జెప్పబడినరీతిగ నీతడు నిషాదకులజుం డయినను మహోదయుం డనుబ్రహ్మర్షియే యగుటచేతను నిది యంత యెన్నదగిన యనుచితంబు గాదని తెలియవలెను. ఈతడు బ్రహ్మర్షి యగుటచే శ్రీరాముడు హీనసఖ్యము చేసినాడను దానికిని నవకాశము లేకపోవుచున్నది.

[1]ధన్యోఽహ మద్య మే జన్మనైషాదం లోకపావన,
నైషాదరాజ్య మేతత్తే కింకరస్య రఘూత్తమ. ౧౦
త్వదధీనం వసన్నత్ర పాలయాస్మా న్రఘూత్తమ. ౧౦½
[2]త్వత్పాదకమలా త్పూర్వ మధునా లబ్ధవైభవః,
బభూవాహం తత స్త్వంతు రాజ్యం పాలయ మామకం. ౧౧½

గృహాణ ఫలమూలాని త్వదర్థం సంచితాని మే. ౧౨

రామ స్తమాహ సుప్రీతో వచనం శృణు మే సఖే. ౧౨½

నవేక్ష్యామి గృహం గ్రామం నవవర్షాణి పంచచ. ౧౩

[3]అర్చితా శ్చైవ హృష్టాశ్చ భవతా సర్వథా వయం,
అశ్వానాం ఖాదనే నాహ మర్థీ నాన్యేన కేనచిత్. ౧౪

తత శ్చీరోత్తరాసంగ స్సంధ్యా మన్వాస్య పశ్చిమాం,
జల మే వాదదే భోజ్యం లక్ష్మణేనాహృతం స్వయం. ౧౫

1 అధ్యా రా: సర్గ ౫. 2. యాజ్ఞవల్క్యరా.
3. వాల్మీ. రా: సర్గ ౫౦.

౧౦-౧౧½. ప్రభో! యిప్పుడు ధన్యమైనది నాకిరాతజన్మము. నీకింకరుండ నగుటచే నా యీ సమస్తనిషాదరాజ్యంబును నీయధీనంబు. దీనిం గైకొని మమ్ము బాలింపుము.

౧౧½. పూర్వము (సీతాస్వయంవరమునకై పోవునప్పుడు) నీపాదములు గడుగుటచేతనే యిప్పుడీవైభవం బంతయు నాకబ్బినది. కాన నారాజ్యంబును నీవే కైవసము చేసికొనుము.

౧౨. శ్రీరామా! నీకై యేర్చికూర్చి తెచ్చిన యీస్వాదుఫలంబులు పుచ్చుకొమ్ము.

౧౨½. ఇట్లుగ బల్కుచున్న యాగుహునిం గాంచి శ్రీరాముండు సాదరంబుగ నిట్లనెను.

౧౩. ఓయీ! నీవు చెప్పినది లెస్సగా వింటిని. కాని యరణ్యవాసంబు నేయవలసిన పదునాల్గు వత్సరంబులును నేనే గృహంబునను నే గ్రామంబునను నుండరాదు.

౧౪. నీ వొనర్చిన పూజాదరణంబులచే మా మనంబు లెంతయు సంతసించినవి. కాని నీ రాజ్యాదికం బేమియు నాకక్కఱలేదు. గుఱ్ఱములకు గావలసిన యాహార మిప్పించిన జాలును. ఇంతకు మించి నినేమియు నర్థింపను. (దీనిచే శ్రీరాముం డొరుల కిచ్చువాడే కాని యొరుల నర్థించువాడు కాడని ద్యోతనం బగుచున్నది.)

౧౫. ఇట్లుగ గుహునితో బల్కి శ్రీరాముడు నారవస్త్రం బొకదాని నుత్తరీయంబుగ ధరించికొని సాయంసంధ్యావందనం బాచరించి లక్ష్మణుండు స్వయముగా గొనివచ్చిన శుభ్రజలంబును మాత్ర మాహారించెను.

[1]ఆస్తృతం కుశపర్ణాద్యై శ్శయనం లక్ష్మణేన వై,
సుష్వాప తత్ర వైదేహ్యా పర్యంక ఇవ సంస్కృతే. ౧౬

ఉవాస తత్ర నగరప్రాసాదాగ్రే యథా పురా. ౧౬½

తతో౽విదూరే పరిగృహ్య చాపం, సబాణతూణీర
ధనుస్స లక్ష్మణః, రరక్ష రామం పరితో విపశ్య,
స్గుహేన సార్ధం సశరాసనేన. ౧౭½

[2]తం జాగ్రత మదంభేన భ్రాతు రర్థాయ లక్ష్మణం,
గుహ స్సంతాపసంతప్తో రాఘవం వాక్య మబ్రవీత్. ౧౮½

ఇయం తాత సుఖా శయ్యా త్వదర్థ ముపకల్పితా,
ప్రత్యాశ్వసి హి సాధ్వస్యాం రాజపుత్ర యథాసుఖమ్. ౧౯½

గుప్త్యర్థం జాగరిష్యామః కాకుత్స్థస్య వయం నిశాం. ౨౦

నహి రామా త్ప్రియతమో మమాస్తి భువి కశ్చన,
బ్రవీ మ్యేత దహం సత్యం సత్యే నైవచ తే శపే. ౨౧

అస్య ప్రసాదా దాశంసే లోకేస్మిన్ సుమహద్యశః,
ధర్మావాప్తిం చ విపులా మర్థావాప్తించ కేవలాం. ౨౨
నహి మే౽పదితం కించి ద్వనే౽స్మిన్ చరత స్సదా
చతురంగం హ్యపిబలం సుమహ త్ప్రసహేమహి. ౨౩

---

1 అధ్యా. రా: సర్గ ౫. 2 వాల్మీ. రా: సర్గ ౫౧

౧౬. లక్ష్మణుఁ డంతట దర్భలు నాకులు మున్నగువానిచే సెజ్జ నొకదానిని సిద్ధపఱుప మున్ను సీత యమర్చినశయ్యయందుబలెనే యం దాశ్రీరాముండు జానకీసహితంబుగ సుఖనిద్రం జెందెను.

౧౬½. తన నగరంబున రాజప్రాసాదంబుపై నున్నపు డెటు లుండునో యటులనే యిక్కడను శ్రీరాము డుండెను.

౧౭½. లక్ష్మణుండును ధనుస్తూణీరంబులు తాల్చి సీతారాముల కనతిదూరంబుననే యుండి, గుహద్వితీయుండై వారల గాంచుచుండెను.

౧౮½. ఇట్లన్నకొఱకై గస్తుతిరుగుచున్న యాలక్ష్మణుని జూచి చింతాక్రాంతహృదయుండై గుహుం డాతనితో నిట్లనెను.

౧౯½-౨౦. అయ్యా! మీ కేల యింతశ్రమ? ఇదిగో, మీకొఱకై యీ మృదులశయ్య రచింపబడినది. దీనిపై మీరును యథాసుఖముగా బవ్వళింపుడు. మఱి శ్రీరాముని బరిరక్షించు భారము మేమే వహించి జాగరణము సేయుదుము.

౨౧. సత్యముగా జెప్పుచున్నాను - సత్యముపై నొట్టిడి చెప్పుచున్నాను. ఈసమస్తవిశ్వంభరావలయంబునందును నాకు శ్రీరామునికంటె ప్రియతముండు లేడు.

౨౨. ఈతని ప్రసాదంబుచేతనే భూరియశంబు సముపార్జించెదను. ఈతని ప్రసాదంబుననే బహుళధర్మార్థంబులు వడసెదను.

౨౩. ఈవనంబున మా కెఱుగరాని దేదియు లేదు. చతురంగ సహితమగు మహాసైన్యమును సయితము దీన మే మెదిరింపగల

లక్ష్మణ స్తం తథోవాచ రక్ష్యమాణా స్త్వయానఘ. ౧౩౼
కథం దాశరథౌ భూమౌ శయానే సహ సీతయా,
శక్యా నిద్రా మయా లబ్ధుం జీవితంవా సుఖానివా. ౧౪౼

[1]అలం హర్ష విషాదాభ్యాం శుభాశుభ ఫలోదయే,
విధాత్రా లిఖితం య ద్య త్తదలంఘ్యం సురాసురైః. ౧౫౼

గుహలక్ష్మణయో రేవం భాషతో ర్విమలం నభః. ౧౬

బభూవ రామ స్సలిలం స్పృష్ట్వా ప్రాత స్సమాహితః,
ఉవాచ శీఘ్రం సుదృఢాం నావ మానయ మే సఖే. ౧౭
[2]జటానాం ధారణార్థంతు వటక్షీరం సమానయ. ౧౭౼
తచ్ఛ్రుత్వా రామవాక్యంతు గుహః ప్రాంజలి సాదరం
వటక్షీరం దృఢాం నావ మానయచ్చ సులక్షణాం. ౧౮౼
దధార లక్ష్మణేనాథ జటామకుట మాదరాత్. ౧౯
తత స్స ప్రాంజలి ర్భూత్వా గుహో రాఘవ మబ్రవీత్. ౧౯౼
[3]స్వామి న్నారుహ్యతాం నౌకాం సీతయా లక్ష్మణేనచ
వాహయే జ్ఞాతిభి స్సార్థ మహమేవ సమాహితః. ౩౦౼

---

1 అధ్యా. రా: సర్గ ౬. 2. కవి. 3 అధ్యా. రా: సర్గ ౬;

౨౩½. ఇట్లుగ గుహుండాడుట విని లక్ష్మణుండాతనితో నిట్లనెను.

౨౪½. మిత్రమా! సుఖోచితులగు నీ సీతారాములిటులు గటికినేలపై బరుండియుండ నా కంటికెటుల కూర్కు రాగలదోయీ! నే నెటుల సుఖముల బొందగలను?

౨౫½. సరే! అయినదేమో యయినది. శుభాశుభఫలంబులు గల్గునప్పుడు సంతోషవిషాదంబు లందుట ధీరులలక్షణము కాదు. మూడుపంక్తుల బ్రహ్మదేవుం డేది వ్రాసెనో యది సురాసురులకును ననుల్లంఘనీయంబు.

౨౬. గుహుండును లక్ష్మణుండును నిట్లు సంభాషించుచుండగానే తెల్లవారజొచ్చెను.

౨౭-౨౭½. శ్రీరాముండును ప్రాతఃకాల్యంబులు తీర్చి గుహునితో నావను సిద్ధము చేయుమని చెప్పి జటాబంధనార్థము మఱ్ఱిపాలు కూడ దెమ్మని యాజ్ఞాపించెను.

౨౮½-౨౯. ఆ నిషాదనాయకుండును నట్లే నావను సిద్ధముచేసి మఱ్ఱిపాలు తేగా శ్రీరామలక్ష్మణులు జడలను దాల్చిరి.

౨౯½. గుహుండును ప్రాంజలియై శ్రీరామునితో నిట్లనెను.

౩౦½. స్వామీ! మీ రందరును నావ నెక్కుడు. మా వారందఱితోడ గలిసి తమ్ముల సురక్షితముగా నావలియొడ్డు జేర్చెదను.

తథేతి రాఘవ స్సీతా మారోప్య శుభలక్షణాం,
గుహస్య హస్తా వాలంబ్య స్వయం చారుహ దచ్యుతః. 3౧
ఆయుధాదీ న్సమారోప్య లక్ష్మణో ప్యారురోహచ. 3౨
[1] కిమహం కరవాణీతి సూతః ప్రాంజలి రబ్రవీత్,
రామస్తు మధురం వాక్యం పునఃపున రువాచ తం. 33

ఇక్ష్వాకూణాం త్వయా తుల్యం సుహృదం నోపలక్షయే,
యథా దశరథో రాజా మాం నశోచే త్తథా కురు. 3౪
ఆరోగ్యం బ్రూహి కౌసల్యా మథ పాదాభివందనం,
అన్యాశ్చ దేవీ స్సహితాః కైకేయీం చ పునపునః. 3౫

భరత శ్చాపి వక్తవ్యో యథా రాజని వర్తసే,
తథా మాతృషు వర్తేథా స్సర్వా స్వేవావిశేషతః. 3౬

నివర్త్యమానో రామేణ సుమంత్రః శోకకర్శితః,
తత్సర్వం వచనం శ్రుత్వా స్నేహా త్కాకుత్స్థ మబ్రవీత్. 3౭
* త్వత్కృతేన మయావాప్తం రథచర్యాకృతం సుఖం,
ఆశంసే త్వత్కృతే నాహం వనవాసకృతం సుఖం. 3౮

* వ్యా: త్వత్కృతేనేతి:—త్వయా కృతానుగ్రహేణ రథచర్యాకృతం రథప్రేరణకృతం సుఖ మవాప్తం. వనవాస

1 వాల్మీ. రా. సర్గ ౫౨.

౩౧½. ఇట్లుగ గుహుం డనుటతోడనే శ్రీరాముడు సీతను ముందుగ నావ నెక్కించి గుహునిచేతు లాలంబనముగ గొని తానును నెక్కెను.

౩౨. ఆయుధంబు లన్నియు నావలో భద్రపఱచి లక్ష్మణుండును నెక్కెను.

౩౩. అంత సుమంత్రుడు 'ప్రభూ! నే నిప్పు డేమిసేయవలయును! సెల విచ్చెదరా?' యని ప్రాంజలియై నిలువ శ్రీరాముడు మధురంబుగ నాతనితో నిట్లనెను.

౩౪-౩౫. సుమంత్రా! ఇక్ష్వాకులకు నీ వంటి స్నేహితుని నే నెందును జూడలేదు. నీ వెల్లప్పుడును మా క్షేమమును గోరుచుందువు. ఇట్టి నీకు జెప్పవలసినదేమి? వృద్ధుండగు మాతండ్రి నాకై దుఃఖింపకుండ జూడుము. నాతల్లియగు గౌసల్య నడిగితి ననుము. ఆమెపాదంబులకు మ్రొక్కితి ననుము. ఇతర దేవేరులకును వందనంబనుము. మఱి కైకేయీ మాతకు బునఃపునఃప్రణామంబు లనుము.

౩౬. రాజు విషయములో దా నెట్లు ప్రవర్తించునో అట్లే తల్లులందఱి విషయములోను గూడ సమముగా వర్తింపుమని భరతునితో నామాటగా జెప్పుము.

౩౭. ఇట్లు రామునిచే ననుజ్ఞాతుండై, దుఃఖము పైకొని రాగా స్నేహవశంబున సుమంత్రుడు శ్రీరామునితో నిట్లనెను.

౩౮-౩౮½. *నీదయావిశేషంబుచే నీకు రథచోదకుండనై తత్సుఖమును గంటిని. ఇంక నీతోడ వనవాసంబును జేయు సుఖముంగూడ గరుణిం

---

*వ్యా:—'నీయనుగ్రహంబుచే నీ రథంబును గడపుట యను సుఖం బందితిని. ఇక నీతో వనవాసము సేయగోరుచున్నాను.' దీని భావ మేమన - భగవంతుండ వగు నీవు రఘువంశమున జన్మించితి వని

తవ శుశ్రూషణం మూర్ధ్నా కరిష్యామి వనే వసన్. ३०५
* భక్తం భృత్యం స్థితం స్థిత్యాం త్వం న మాం హాతుమర్హసి, ३८

కృతసుఖ మాశంసే. అస్యాయం భావః. త్వ మస్మిన్ కులేఽవతరిష్యసీతి జ్ఞాత్వైవ మంత్రిపదేనాప్యహం త్వదర్థచర్యాసేవాభాగ్యం మమ భవిష్యతీతి నింద్యమపి సూతకృత్యం మయాఽంగీకృతం. తేన భాగ్యవశా త్త్వత్సేవాసుఖం ప్రాప్తమేవ. ఇతఃపరం వనవాసకృతం సుఖం వనవాసేపి త్వత్సేవాకృతం సుఖ మాశంసే ప్రార్థయేఇతి.

* వ్యాః భక్తమితిః—అనేన భక్తో భృత్యః స్వామినా న పరిత్యాజ్య ఇతి సూచితం. తథా చానుశాసనికే ఛత్రత్యాగ్రేత్వ నూర్ధ్యంపరీతి జమదగ్నివచనం: "భక్తంచ భజమానంచ తవాస్మీతిచవాదినం, త్రీనేతా న్శరణప్రాప్తా న్విషమేప్యపి న త్యజే" దితి. మార్కండేయోపి: శ్లో "బ్రహ్మహత్యా గురోర్ఘాతో గోవధ స్త్రీవధ స్తథా, తుల్యమేభి ర్మహాపాపం భక్తత్యాగాదుదాహృతం." ఏవం సతి దశరథమంత్రిత్వాత్తదాజ్ఞాం వినా స్వేన నేతు మశక్యత్వాత్ త్వం దేశస్య తన్ముఖేన ప్రేషణీయత్వాచ్చ త్యక్త ఇతి న కశ్చిద్విరోధః.

ప్రము. వనంబున నీపరిచర్యను శిరముతో జేయుచున్నాను.

౩౮. *నీకు భక్తుండను, నీ సేవకుండను, యుక్తమార్గం బెన్నడును వీడిన వాడను గాను. ఇట్టి నన్ను నీతో గొంపోకుండ విడిచిపోవుట న్యాయము కాదు.

---

రొటింగి, నీవు రథంబును గడపుట యను మహాభాగ్యం బందుదును గదాయని ప్రధానమంత్రి నైయుండియు నింద్యంబైనను నీ సూత కృత్యంబునకొడంబడితిని - నీ సేవాసుఖంబును గంటిని. ఇంక నీతోడ వనవాసంబును గూడ జేసి యాలాగునగూడ నిన్ను సేవించి యాసుఖమును గూడ గనగోరుచున్నాను.

* వ్యా: నీకు భక్తుండ ననుచోట:—ఈవాక్యములచే దనకు భక్తుండైనవానిని దనసేవకుని విడువరాదని సూచింపబడుచున్నది. ఇట్లే యానుశాసనికపర్వమందు సూర్యునితో జమదగ్నివచనము: "తనకు భక్తుండైనవానికి, దన్నొల్లప్పుడు భజించువానికి, నీవాడనే యనుచు దన్నే నమ్మియుండువానికిని నేదైన గష్టము కలినచో - దానెంత విషమస్థితిలో బడియున్నను వారలను బరిత్యజింపరాదు. మార్కండేయుడును నట్లే: "బ్రహ్మహత్యవలనను గురుహాతంబునను. గో స్త్రీ హత్యవలనను నెట్టిపాపంబు సంభవించునో తనకు భక్తుండైనవానిని బరిత్యజించినచో నట్టి ఘోరపాతకంబు సంభవించు" నని చెప్పెను.

ఇట్టి ప్రమాణంబు లుండగ దనకు భక్తుండును దన్ను సేవించువాడు నగు సుమంత్రుని శ్రీరాముం డెట్లు వదలిపెట్టెనని యనరాదు. సుమంత్రుడు దశరథునికి మంత్రి యగుటవలన నాతనియాజ్ఞ లేకుండ నెచటికి బోవుటకును వీలులేదుకదా! ఇట్టిచో శ్రీరామునితో నెట్లరణ్యమునకు బోగలడు? ఇంతియకాదు. దశరథాములకు శ్రీరాముం డిచ్చిన సందేశములనుగూడ నీతడే కొనిపోవలసియుండెను. కాన దీన నేమియు బ్రమాదంబు లేదు.

ఏవం బహువిధం దీనం యాచమానం పునః పునః,
అనుజ్ఞాప్య సుమంత్రించ సబలం చైవ తం గుహం. ౮౦
ఆస్థాయ నావం రామస్తు చోదయామాస నావికాన్,
♦ రాఘవోపి మహాతేజా నావ మారుహ్య తాం తతః ౮౧
బ్రహ్మవ త్క్షత్రవచ్చైవ జజాప హిత మాత్మనః. ౮౧½
మధ్యంతు సమనుప్రాప్య భాగీరథ్యా స్త్వనిందితా,
వైదేహీ ప్రాంజలి ర్భూత్వా ప్రార్థయామాస తాం నదీం. ౮౨½
* స లోకపాలప్రతిమప్రభావవాం స్తీర్త్వా మహాత్మా వరదో

---

♦ వ్యా: రాఘవ ఇతి:—అనేన మహానదీ సంతరణే బ్రహ్మక్షత్రశబ్దయుక్తం మంత్రజపం కర్తవ్యమితి సూచితం. తథా చాశ్వలాయనః—"సుత్రామాణ మృచా నావ మరోహేదప ఉత్తరే" దితి. సచమంత్రః 'సుత్రామాణ' మిత్యాదిః. తత్ర హ్యరిష్టనేమిః పృతనాజిదితి బ్రహ్మక్షత్రశబ్దా శ్రుతా.

* ఇతి:— వత్సాన్—వత్సదేశాన్. గంగాయమునయో ర్మధ్యే ప్రయాగప్రదేశో వత్సదేశః, తతః పశ్చిమభాగే పాంచాలః (పంజాబ్) యమునా దక్షిణతీరే శూరసేనదేశః, తస్మా త్పశ్చిమతో మత్స్యదేశః (రాజపుత్రస్థానం). ఇత్థం హి దేశవ్యవస్థా దృశ్యతే.

౮౦-౮౧-౮౧½. ఇట్లనేకవిధముల బతిమాలుచున్న సుమంత్రుని వీడ్కొలిపి, సపరివారముగ గుహుని నివర్తింపజేసి, నావలోని కెక్కి, నావికులతో నావను దొందరగా బోనిమ్మని చెప్పి యాత్మక్షేమార్థమై ♦ బ్రహ్మక్షత్త్రయుక్తంబులగు మంత్రంబుల జపించెను.

౮౨½. నావ నదీమధ్యంబునకు బోగానే యవ్వైదేహరాజకుమారియు నా శ్రీరామునకు సమస్తశుభంబు లొదవగావలె నని యాగంగాదేవిని బ్రార్థించెను.

౮౩½. *లోకపాలోపముండగు నా శ్రీరామచంద్రమూర్తి యిట్లుగంగా

---

♦ వ్యా : బ్రహ్మక్షత్త్రశబ్దంబు లనుచోట:—ఇట్లు సెప్పుటచే మహానదిని దాటునప్పుడు బ్రహ్మక్షత్త్ర శబ్దయుక్తంబులగు మంత్రంబులు జపింపవలెనని సూచిత మగుచున్నది. ఇట్లే యాశ్వలాయనుడును "సుత్రామాణం - అను ఋక్కును జెప్పుచు నావ నెక్కి జలంబులు దాటవలెను." అనిచెప్పెను. ఈసుత్రామాణ మను ఋక్కులోనే "వ్యాగ్నిష్టనేమిః పృతనాజిత్" ఇత్యాదిగ బ్రహ్మక్షత్త్రశబ్దంబులు వినవచ్చును.

*వ్యా: వత్సదేశము:—గంగాయమునానదుల మధ్యనున్న ప్రదేశము వత్సదేశము; దీనికి బడమరగా బాంచాలదేశము (పంజాబ్) నున్నది. యమునానదికి దక్షిణతీరంబున శూరసేనదేశంబును దీనికి బశ్చిమముగా మత్స్యదేశంబును నున్నవి. ఈ మత్స్యదేశము నిప్పుడు రాజపుత్రస్థాన మందుము.

మహానదీం, తత స్సమృద్ధా న్శుభసస్య మాలినః క్రమేణ వత్సా న్ముదితా నుపాగమత్. ౪౩౫

♦తౌ తత్ర హత్వా చతురో మహామృగాన్ వరాహ మృశ్యం పృషతం మహారురుం, ఆదాయ మేధ్యం త్వరితం బుభుక్షితౌ వాసాయ కాలే యయతు ర్వనస్పతిం. ౪౪౫

[1] సతం వృక్షం సమాసాద్య సంధ్యా మన్వాస్య పశ్చిమాం, రామో రమయతాం శ్రేష్ఠ ఇతి హోవాచ లక్ష్మణం. ౪౫౫

ఇదం వ్యసన మాలోక్య రాజ్ఞశ్చ మతివిభ్రమః
కామ ఏవార్థధర్మాభ్యాం గరీయానితి మే మతిః. ౪౬౫

* కో హ్యవిద్వా నపిపుమాన్ ప్రమదాయాః కృతే త్యజేత్, ఛందానువర్తినం పుత్రం తాతో మా మివ లక్ష్మణ. ౪౭౫

♦ వ్యా: తౌ వితి:—ఋశ్యాదయో మృగభేదాః.

* వ్యా: కోహీతి:—నన్వత్ర కైకేయ్యాసక్తహృదయో రాజా ధర్మార్థా వనవేక్ష్య కామవశాదేవ పుత్రం పరిత్యక్తవానితి రామేణోక్త మిత్యవగమ్యతే ఇతి కేషాంచి దాశయః. త దనుపపన్నం, 'ధర్మపాశేన బద్ధోస్మీ'తి దశరథవచనపర్యాలోచనయా 'పితరం సత్య మిచ్ఛామి' ఇతి శ్రీరామవచన

1 వాల్మీ. రా: సర్గ ౫౩.

నదిని దరించి సకలసస్యవిరాజమానంబులగు వత్సదేశంబుల సమీపించెను.

౪౪౫. ♦వా రక్కడ వరాహంబు ఋశ్యము మున్నగు నాల్గు మృగములను గొట్టి యా యాహారమును గొని సకాలమున నొకవృక్షంబుకడ జేరిరి.

౪౫౫. అక్కడ సాయంసంధ్యావందనం బాచరించి శ్రీరాముడు లక్ష్మణునితో నిట్లనెను.

౪౬౫. మన యీదుఃఖమును జూచియు ఇక్ష్వాకువంశోద్భవు డగు మన తండ్రిగారి బుద్ధివిభ్రమమును జూచియు ధర్మార్థంబులకంటె గామమే బలీయం బని నాకు దోచుచున్నది.

౪౭౫ *కానినా డెంత మందబుద్ధియైనను, మనతండ్రి నన్ను వలెనే, తన కనుకూలంబుగ నడచుకొను పుత్త్రు నిట్లొక స్త్రీనిమిత్తంబుగ విడనాడునా?

---

♦వ్యా: పైనలుబది నాల్గవశ్లోకమందు ఋశ్యము పృషతము రురువు- ఇత్యాదులు పేర్కొనబడినవి. ఇవి యన్నియు లేళ్ళజాతిలో గల భేదంబులుగా దెలియవలెను.

*విడిచిపెట్టుననుచోట:— కైకేయియందలి ప్రేమచే ధర్మంబును నర్థంబును నుపేక్షించి మఱి తృతీయపురుషార్థంబగు కామమునందే లంపటుడై దశరథుడు తన్నిట్లు విడనాడెనని శ్రీరాముని తాత్పర్యం బని కొందఱ యాశయము. కాని యది పొసగని దని తెలియవలెను: 'ధర్మపాశంబునకు గట్టువడితి'నని దశరథుం డాడినదానిచేతను, 'నా తండ్రి సత్యసంపాలకుం డగుటయే నే గోరున' దని శ్రీరాముండు చెప్పినదానిచేతను, కైకేయి కిచ్చిన వరంబులు నిర్వహించుట యను ధర్మపరిపాలనార్థమే దశరథుడు తనపుత్త్రుని త్యజించెనుగాని కామ

అయోధ్యా మితఏవ త్వం కాలే ప్రవిశ లక్ష్మణ,
అహ మేకో గమిష్యామి సీతయాసహ దండకాన్. ౪౮౪

మాస్మ సీమంతినీ కాచి జ్జనయే త్పుత్ర మీదృశం,
సౌమిత్రే యోఽహ మంబాయా దద్మి శోక మనంతకం. ౪౯౪

మన్యే ప్రీతివిశిష్టా సా మత్తో లక్ష్మణ శారికా,
యస్యా స్తచ్ఛ్రూయతే వాక్యం శుక పాద మరేర్దశ. ౫౦౪

ఏకోఽహమ ప్యయోధ్యాం చ పృథివీం చాపి లక్ష్మణ,
తరేయ మిషుభిః క్రుద్ధో నను వీర్య మకారణం. ౫౧౪

అధర్మభయభీతశ్చ పరలోకస్య చానఘ,
తేన లక్ష్మణ నాద్యాహ మాత్మాన మభిషేచయే. ౫౨౪

ఏత దన్యచ్చ కరుణం విలప్య విజనే వనే,
అశ్రుపూర్ణముఖో రామో నిశి తూష్ణీ ముపావిశత్. ౫౩౪
త మువాచ స సౌమిత్రి స్సమాశ్వాస్యచ రాఘవం. ౫౪

---

పర్యాలోచనయా చ పూర్వప్రదత్త వరనిర్వాహణరూప ధర్మార్థ మేవేతి ద్యోతనాత్. కిం త్వత్ర కామదూషణ మేవ రామవాక్యే తాత్పర్య మితిజ్ఞేయం.

౪౮౫. తమ్ముడా! నీవు తిరిగి యయోధ్యకు బొమ్ము. ఈ వనవాసక్లేశం బంతయు నీ కేల? సీతంగూడి నే నొక్కడనే యడవికి బోయెదను.

౪౯౫. అయ్యో! ననుగని పెంచిన మాయమ్మ కౌసల్యాదేవి కెంత దుఃఖముం గూర్చుచున్నాను. నాబోటి కుమారుని గని యేతల్లియు నిట్టి వంత నొందకుండుగాక.

౫౦౫. తమ్ముడా! మన భవనంబున నున్న గోరువంక 'చిలుకా! మనశత్రువు, కాలు బట్టి కరువు' మని సతతంబును బలుకుచు గౌసల్యామాత కెంతయో ముదంబు గూర్చుచుండును. నే నాపాటియైన జేయలేక పోతిని. కనుకనే యీశారిక నాకంటెను ధన్యం బైనది.

౫౧౫. లక్ష్మణా! అయోధ్యను, నీ సమస్తభూతలంబును గూడ సంపవాన ముంచి యెత్తుట కే నొక్కడన చాలుదును. కాని నావీర్యప్రకటనంబు సేయు నిమిత్తం బేమియు నా కిప్పుడు పొడకట్టుట లేదు.

౫౨౫. అధర్మంబునకు భయపడుచున్నాను. న్యాయాన్యాయంబులు ధర్మాధర్మంబులు విచారించు పరలోకంబునకు భీతిల్లుచున్నాను. కనుకనే యిప్పుడు యౌవరాజ్యాభిషేకంబును జేసికొన కూరకుంటిని.

౫౩౫. ఇట్లుగ నారాము డవ్విజనవనంబున బొగిలి పొగిలి బాష్పపూర్ణముఖుండై యారాత్రి మాటాడ కూరకుండెను.

౫౪. సౌమిత్రియు నాతని నాశ్వాసించుచు నిట్లనెను.

---

వశుడై కాదు. కాన "ఎంతటి మందబుద్ధియైనను నిట్లు పుత్త్రుని విడనాడునా?" యని శ్రీరాముం డాడుటలో గామమును గర్హించుటే యాతని తాత్పర్యము కాని వేఱేమియుకాదని గ్రహింపవలయును.

నచ సీతా త్వయాహీనా నచాహ మపి రాఘవ,
ముహూర్త మపి జీవావో జలా న్మత్స్యా వివోద్ధృతౌ. ౫౫

1 తే తు తస్మి న్మహావృక్షే ముషిత్వా రజనీం శివాం,
విమలేఽభ్యుదితే సూర్యే తస్మా ద్దేశా త్ప్రతస్థిరే. ౫౬

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అయోధ్యాకాండే
దశమ స్సర్గః.

---

## ఏకాదశ స్సర్గః.

2 తతో రామస్తు వైదేహ్యా లక్ష్మణేన సమన్వితః,
* భరద్వాజాశ్రమపదం గత్వా బహి రుపస్థితః. ౧

తచ్ఛ్రుత్వా సహసోత్థాయ భరద్వాజో మునీశ్వరః,
గృహీత్వార్ఘ్యంచ పాద్యంచ రామసామీప్య మాయయౌ. ౨

* వ్యా: భరద్వాజశబ్దార్థః:—ఋగ్వేదారణ్యకే—"ఏష ఏవ బిభ్ర ద్వాజః- ప్రజా వై వాజః -తా ఏషా బిభర్తి యద్బిభర్తి - తస్మాద్భరద్వాజ ఇత్యాచక్షతే." ఇతి వాజః రేతః. వాజీకరణ మిత్యాదౌ వాజశబ్దో రేత ఇత్యర్థః. స్ఖలనం వినా రేతో భరణాత్ భరద్వాజః - అస్ఖలిత బ్రహ్మచారీత్యర్థః. శ్రుతిః - 'భరద్వాజోహ వై త్రిభి రాయుర్భి ర్బ్రహ్మచర్య మువాస' ఇతి.

1 వాల్మీ. రా: సర్గ ౫౪. 2 అధ్యా. రా: సర్గ ౬.

౫౫. శ్రీరామా! సీతగాని నేనుగాని నిన్ను విడిచి క్షణకాలమైనను జీవింపజాలము. అట్లు జీవించితిమా - మాజీవితంబులు నీటింబాసిన మీనంబుల జీవితంబులు వోలె క్షణికంబులై యుండును.

౫౬. అట్లామువ్వురును నాచెట్టుక్రింద నారాత్రి గడపి సూర్యోదయంబు కాగానే యచ్చటినుండి బయలుదేరిరి.

ఇది శ్రీరామాయణ సారోద్ధారంబున నయోధ్యాకాండంబున
బదియవ సర్గము.

---

## పదునొకండవ సర్గము.

౧. అట్లు బయలుదేరి యా సీతారామలక్ష్మణులు * భరద్వాజాశ్రమంబు జేరిరి.

౨-౩. ఇట్లు సీతారామలక్ష్మణులు వచ్చుట విని యమ్మహర్షి యు నర్ఘ్య పాద్యంబులు కొని వారలం జేరనరిగి యథాన్యాయంబుగ బూజించి

---

* భరద్వాజ శబ్దార్థము బుగ్వేదారణ్యకమం దిట్లు చెప్పబడినది. 'ప్రజా జననకారణం బగు రేతస్సు నీతడు పదిలముగా భరించినందున భరద్వాజుం డని చెప్పబడుచున్నాడు.' 'వాజీకరణము' మున్నగుశబ్దంబులం జూపట్టినరీతిగా వాజ మనగా వీర్యము. ఈతడు స్ఖలనము లేకుండ వీర్యమును గుప్తపఱచికొనినందున భరద్వాజుం డనబఱగుచున్నాడు. అనగా నీత డస్ఖలితబ్రహ్మచారి యని భావము. 'భరద్వాజో హ వై త్రిభి రాయుర్భి ర్బ్రహ్మచర్య మువాస' యను శ్రుతియు నిట్లే యీత డస్ఖలితబ్రహ్మచారి యని తెల్పుచున్నది.

దృష్ట్వా రామం యథాన్యాయం పూజయిత్వా సలక్షణం,
భక్త్యా పునః పూజయిత్వా చకారాతిథ్య ముత్తమం. 3

అద్యాహం తమసః పారం గతోఽస్మి తవ సంగమాత్,
♦ జ్ఞాతం రామ తవోదంతం భూతం చాగామికంచ యత్. ౪

జానామి త్వాం పరాత్మానం మాయయా కార్యమానుషం,
యదర్థ మవతీర్ణోసి ప్రార్థితో బ్రహ్మణా పురా. ౫

యదర్థం వనవాస స్తే యత్కరిష్యసి వై పునః. ౫౪

1 ప్రత్యువాచ శుభం వాక్యం రామ స్సర్వహితే గతః,
ఏకాంతే పశ్య భగవ న్నాశ్రమస్థాన ముత్తమం. ౬౪

---

♦ వ్యా: జ్ఞాత మితి:—మను: "ఋషయ స్సంయతాత్మానః ఫలమూలానిలాశనాః, తపసైవ ప్రపశ్యంతి త్రైలోక్యం సచరాచరమ్." ఇతి. ఉత్తరరామచరితే "లౌకికానాం హి సాధూనా మర్థం వా గనువర్తతే, ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి." ఇతి.

---

1 అధ్యా. రా: సర్గ ౬.

మేలగు వాల్మీక్య మెసగి శ్రీరామునితో నిట్లనెను.

౪-౫-౫౪. ప్రభో! నీ సందర్శనమువలన నజ్ఞానాంధకారము నిప్పుడు గడచి తిని. నీయుదంతం బంతయు - జరిగినది జరుగబోవునది ♦ యెఱుంగు దును. నీవు సాక్షాత్పరమాత్ముండ వయ్యును, నొకనిమిత్తముగ మాయాబలంబునంజేసి యీమనుజత్వముం గంటివి. బ్రహ్మాదిదేవ తలు నిన్ను బ్రార్థించుటచేత నేకదా నీ విట్లవతరించినది?. నీ కీవనవాస మెందులకో నీ వేమేమి సేయనుంటివో యంతయు నెఱుంగుదును.

౬౪. ఇట్లుగ బల్కుచున్న భరద్వాజుని జూచి మా కాశ్రమ మేర్పరచుకొను టకై యేకాంతస్థలమును జూచిపెట్టు డని శ్రీరాముం డనెను. (అనగా తా నెక్కడ నున్నది యెఱింగినవారైన ప్రజ లందఱు మరల వచ్చి తాను పొమ్మన్నను బోక తనతోబాటుగ నరణ్యావాసక్లేశము నొందు దురు. వా రట్లు క్లేశపడుట శ్రీరాముని కిష్టములేదు. కనుక నేకాంత స్థలమును గోరెను.)

♦ వ్యా: ఎఱుంగుదు ననుచోట:— "నియమితాత్ములైన ఋషి పుంగవులు కందమూలఫలంబులు మాత్ర మాహారించువారై సచ రాచరం బగు లోకంబునం గలు విశేషంబు లన్నియు దమ తపః ప్రభావంబుచే దెలిసికొందురు" అని మను ధర్మశాస్త్రంబునందును; "సాధువులగు ప్రాకృతుల వాక్కు లర్థము ననుసరించును. మఱి సనాతనులగు ఋషులవిషయములో మాత్ర మర్థమే వాక్కు ననుస రించును." (అనగా సామాన్యమానవు లాలోచించి స్ఫురణను మనసునం దుంచుకొని మాటలాడుదురు. ఋషు లట్లుగాక మాటాడినదే యాల స్యముగ వారి వాక్కులవలన గలుగవలసిన పని జరిగిపోవు నని భావము) అని యుత్తరరామచరితమందును జెప్పబడినది. కాన భర ద్వాజుండు భూతభవిష్యత్తులను దెలిసికొన్నాడని భావము.

ఏత చ్ఛ్రుత్వా శుభం వాక్యం భరద్వాజో మహామునిః,
రాఘవస్య తతో వాక్య మర్థగ్రాహక మబ్రవీత్. ౭½

దశక్రోశ ఇత స్తాత గిరి ర్యత్ర నివత్స్యసి,
చిత్రకూట ఇతిఖ్యాతో గంధమాదనసన్నిభః, ౮½
పవివిక్త మహం మన్యే తం వాసం భవత స్సుఖమ్. ౯

తస్య ప్రయాగే రామస్య తం మహర్షి ముపేయుషః,
ప్రపన్నా రజనీ పుణ్యా చిత్రాః కథయతః కథాః. ౧౦

రాత్ర్యాం తు తస్యాం వ్యుష్టాయాం భరద్వాజోఽబ్రవీ దిదం. ౧౦½

[1] గంగాయమునయో స్సంధి మాసాద్య మనుజర్షభౌ,
కాళిందీ మనుగచ్ఛేతాం నదీం పశ్చాన్ముఖాశ్రితాం. ౧౧½
తత్ర యూయం ప్లవం కృత్వా తర తాంశుమతీం నదీం. ౧౨

తతో న్యగ్రోధ మాసాద్య మహాంతం హరితచ్ఛదమ్,
తస్మై సీతాంజలిం కృత్వా ప్రయుంజీ తాశిష శ్శివాః. ౧౩

ఇతి పంథాన మావేద్య మహర్షి స్స న్యవర్తత. ౧౩½

సీతా మేవాగ్రతః కృత్వా కాళిందీం జగ్మతు ర్నదీం. ౧౪

---

1. వాల్మీ. రా: సర్గ ౫౫.

౭½. అర్థగంభీరం బగు నా శ్రీరామునివాక్యము విని భరద్వాజుం డాతని తో నిట్లనియె.

౮½-౯. నాయనా! ఇచ్చటికి బది క్రోశంబుల దూరంబుననే చిత్రకూటం బను మహాపర్వతం బున్నది. అయ్యది విడిగా నుంటచే మీ యేకాంతవాసంబున కనుకూలం బని తలంచెద.

౧౦. ఇట్లు ప్రయాగయందు శ్రీరామచంద్రమూర్తియు, భరద్వాజ మహర్షియు, జిత్ర విచిత్రములగు కథలు ముచ్చటించుకొనుచుండగనే పొద్దు గ్రుంకెను.

౧౦½. ఇట్లారాత్రి గడచిపోగా భరద్వాజుండు వారలతో నిట్లనెను.

౧౧½. శ్రీరామా! మీ రిప్పుడు గంగా యమునా నదులు సంగమించిన ప్రదేశంబు జేరి యటనుండి పశ్చిమముగా నానదియొద్దననే చనుడు.

౧౨. అట్లు కొంతదూర మేగి యట నొక తెప్పను గట్టికొని యయ్యమునా నదిని దాటుడు,

౧౩. ఆపిమ్మట, బసపుటాకులు గల్గి వానిగాంచియున్న మహావటవృక్షంబు జేరి, సీతాదేవి యావృక్షరాజంబునకు మ్రొక్కులిడి, దానివలన నాశీర్వచనంబులు గొనవలయును.

౧౩½. వారల కీవిధముగ మార్గం బెఱుకపఱచి యమ్మహర్షి సత్తముడు వెనుకకు మఱలెను.

౧౪. వారును సీతను ముం దిడుకొని యమునాతీరంబును జేరిరి.

తే కాష్ఠసంఘాట మథో చక్రిరే సుమహాప్లవం,
శుష్కై ర్వంశై స్సమా స్తీర్ణ ముశీరైశ్చ సమావృతం. ౧౫
తత శ్శ్రియ మివాచింత్యాం రామో దాశరథిః ప్రియాం,
ఈషత్సంలజ్జమానాం తా మధ్యారోపయత ప్లవం. ౧౬
పార్శ్వే చ తత్ర వైదేహ్యా వసనే భూషణాని చ,
ప్లవే కఠినకాజంచ రామ శ్చక్రే సహాయుధైః ౧౭
* తతః ప్రతేరతు ర్యత్తౌ వీరౌ దశరథాత్మజౌ,
కాళిందీమధ్యగా యాతా సీతా త్వేనా మవందత. ౧౮

తే తీర్ణాః ప్లవ ముత్సృజ్య ప్రస్థాయ యమునావనాత్.
న్యగ్రోధం త ముపాగమ్య వైదేహీ వాక్య మబ్రవీత్. ౧౯
నమ స్తేఽస్తు మహావృక్ష పారయే న్మే పతి ర్వ్రతం,
కౌసల్యాంచైవ పశ్యేయం సుమిత్రాంచ యశస్వినీం. ౨౦
ఇతి సీతాఽంజలిం కృత్వా పర్యగచ్ఛ ద్వనస్పతిం ౨౦౫

* వ్యా:—తత ఇత్యనేన బాహుభ్యాం నదీతరణం న కర్తవ్య మితిసూచితం. తథా చాపస్తంబః 'వర్జయే ద్బాహుభ్యాంచ నదీతరణం, నావంచ సాంశయికీం'; మనురపి 'నబాహుభ్యాం నదీం తరే' దితి.

౧౫. అట గొన్ని కొయ్యలను వెండువాసములను వట్టివేళ్ళను దెచ్చి యొక గొప్ప తెప్పను నిర్మించిరి.

౧౬-౧౭. అచింత్యరాలగు లక్ష్మీదేవివలె నున్నదియు, నునుసిగ్గు నొందు చున్నదియు నగు సీతను శ్రీరాముడా తెప్పపై నెక్కించి యామెను భద్రముగా గూర్చుండ బెట్టి, వస్త్రంబులును, భూషణంబులును, గంపయు. నాయుధంబులును నామెకు బ్రక్కనే యుంచెను.

౧౮. * ఇట్లుగ నాదశరథరాజకుమారు లానదిని దరించుచుండ నా తెప్ప నదీమధ్యంబునకు రాగానే సీతాదేవి యానదికి నమస్కరించి స్తోత్ర ము చేసెను.

౧౯-౨౦-౨౦½. వారు యమునానదిని దాటి తెప్ప నట విడిచి పైచి యయ్యా రణ్యంబునుండి బయలుదేరి భరద్వాజుండు సెప్పిన వటవృక్షంబు జేరనరుగ "ఓ వృక్షరాజా! నీకు నమస్కారము. నాపతి యీ యరణ్యావాసవ్రతంబును నిర్విఘ్నముగా గొనసాగించు నటులను బూజ్యరాండ్రగు కౌసల్యాసుమిత్రలను మరల జూచు భాగ్యము నాకు గల్గునటులును ననుగ్రహింపు" మనుచు సీతాదేవి యంజలి యొనర్చుచు నావృక్షంబునకు బ్రదక్షిణము చేసెను.

---

*వ్యా: నదిని దరించుననుచోట:— ఇట్లు తెప్పమీద దాటి రని చెప్పుటచే శక్తిసాయమున నెన్నడును నేనదిని దాటగూడదని సూ చింపబడుచున్నది. ఇందుల కాపస్తంబుడు; "బాహువు లండగా గొని నదీతరణంబు సేయరాదు. సంశయాస్పదముగ నున్న నావను నమ్మి కొనరాదు. వర్జింపవలెను' అనియు; "బాహువులతో నది నెన్నడును దాటరాద"ని మనువును జెప్పిరి.

కౌశికమాత్రం తతో గత్వా భ్రాతరౌ రామలక్ష్మణౌ,
బహూ న్మేధ్యాన్మృగా న్హత్వా చేరతు ర్యమునావనే. ౨౧౹

విహృత్య తే బర్హిణపూగనాదితే శుభే వనే వానరవారణా
యుతే, సమం నదీవప్ర ముపేత్య సమ్మతం నివాస మా
జగ్ము రదీనదర్శనాః. ౨౨౹

[1] అథ రాత్ర్యాం వ్యతీతాయా మవసుప్త మనంతరం,
ప్రబోధయామాస శనై ర్లక్ష్మణం రఘునందనః. ౨౩౹

స సుప్తసమయే భ్రాత్రా లక్ష్మణః ప్రతిబోధితః,
జహౌ నిద్రాంచ తంద్రీంచ ప్రసక్తంచ పథిశ్రమం. ౨౪౹

[2] తదాతు లజ్జిత స్సోపి ప్రతిజ్ఞా మకరో త్శుచిః,
నభోక్ష్యే వ్రతపర్యంతం కుతో నిద్రేతి లక్ష్మణః. ౨౫౹

శ్రుత్వా తూష్ణీం స్థితో రామో భావికార్యం విలోక్య సః. ౨౬

రామానుజస్య క్షుద్బాధా నాస్తి విద్యామహాబలాత్,
నిద్రా లక్ష్మణనిర్దేశా దూర్మిళా మావిశ త్తదా. ౨౭

1 వాల్మీ. రా : సర్గ ౫౫. 2 అగస్త్యరా. పారం.

౨౧౪. ఆ సీతారామలక్ష్మణు లంతట నొక క్రోసెము దూర మరిగిరి. సోదరు లిర్వురును నయ్యడవిలో మృగంబుల నెన్నింటినో వేటాడి సాయంకాలమున కాయమునావనమం దొక వృక్షమూలమున నిద్రించిరి.

N. B.—లక్ష్మణుని నిరాహారదీక్షయు జాగరమును మఱువరాదు.

౨౨౪. అటనుండి మయూరాది శకుంతసంతాన రుతయుతంబును వానర వారణ సింహవ్యాఘ్రాది సత్వసంకులంబును నగు నయ్యమునానదీ తీరస్థాగ్రాటవిం దమకు సమ్మతమైన యొక యావాసం బేర్పరచు కొని యా రాత్రి గడపిరి.

౨౩౪. తెలతెలవారుచుండగా శ్రీరాముండు మేల్కాంచి నిద్రబోవుచున్న యాలక్ష్మణు నల్లన బ్రిబోధించెను.

౨౪౪. అతడును నిద్రించుచును శ్రీరామునికంఠధ్వని విని మార్గాయాసమును నిద్రాభారమును మాంద్యమును విడిచిపెట్టి ఉలికిపడి వెంటనే లేచెను.

౨౫౪. కాని తా నిట్లు నిద్రాదేవత కధీనుం డగుటకు లక్ష్మణుం డెంతయు సిగ్గిలి "ఇది మొదలుగ వనవాసంబు పూరియగునలకు నేను భోజనమే చేయను. మఱి నిద్ర నన్నెట్లు లోబఱుచుకొనునో చూచెద" నని యాతడు ప్రతిజ్ఞ చేసెను.

౨౬. శ్రీరాముం డీతని ప్రతిజ్ఞ వినియు కావలసిన కార్యము నాలోచించి యూరకుండెను.

౨౭. లక్ష్మణునకును బలాతిబల లను విద్యాబలంబున నాకలిబాధ లేకుండెను, తాను నద్దేశింపగా నిదుర యంతయు బోయి యాతనిభార్య యూర్మిళాదేవి నావహించెను.

1తత ఉత్థాయ తే సర్వే స్పృష్ట్వా నద్యా శ్శివం జలం
పంథాన మృషిణాదిష్టం చిత్రకూటస్య తం యయుః. ౨౮

మనోజ్ఞోయం గిరి స్సౌమ్య నానాద్రుమలతాయుతః,
బహుమూలఫలో రమ్యః స్వాజీవః ప్రతిభాతి మే. ౨౯

మునయశ్చ మహాత్మానో వసంత్యస్మి న్శిలోచ్చయే,
అయం వాసో భవే త్తావ దత్ర సౌమ్య రమేమహి. ౩౦

ఇతి సీతాచ రామశ్చ లక్ష్మణశ్చ కృతాంజలిః,
*అభిగమ్యాశ్రమం సర్వే వాల్మీకి మభివాదయన్. ౩౧

---

*వ్యా : అభిగమ్యేతి:—తదానీం చిత్రకూటే వాల్మీకే ర్వాసః, (ఇటార్సీ ప్రయాగమధ్యే చిత్రకూట మితిధూమశకటాలయం (స్టేషన్) అస్తి. తత్రైవ చిత్రకూట మితి పర్వతోత్తమం శ్రీరామాశ్రమం చాద్యాపి ద్రష్టుం శక్యతే) భరతాగమనానంతర మృషిసర్గమనకథనాత్, తతఃప్రభృతి తమసాతీరం గతవా నితిజ్ఞేయం. ప్రాప్తరాజ్యే రామే యదా కావ్యం కరిష్యతి తదా తస్య తమసాతీరాశ్రమే నివాస ఇతి ద్యోత్యతే. బాలకాండే ౨ సర్గే 'స ముహూర్తం గతే తస్మిన్ దేవలోకం మునిస్తదా, జగామ తమసాతీరం జాహ్నవ్యా స్త్వవిదూరతః. సతు తీరం సమాసాద్య తమసాయా మహామునిః.' ఇతిస్మరణా న్మాధ్యాహ్నికార్థం జాహ్నవ్యా స్సమీపే వర్తమానం తమసాతీరం జగామేత్యర్థః.

---

1 వాల్మీ. రా: సర్గ ౫౬.

౨౮. వారిట్లు మేల్కాంచి యయ్యమునానదీజలంబుల స్నానాదికంబు జేసి భరద్వాజమహర్షి చెప్పిన చొప్పున జిత్రకూటంబు జేరిరి.

౨౯-౩౦. అగ్గిరిరాజంబును జూచి శ్రీరాముడు "లక్ష్మణా! నానావృక్షలతాకులచే జెన్నారుచు, కందమూలఫలంబులచే సొంపెసగుచు, నిప్పర్వతోత్తమం బెట్లున్నదో చూడుము. సంయతాత్ములగు మహర్షులెందరెందరో యిప్పర్వతంబు నాశ్రయించి యున్నవారలు. ఇది మనకు మిగుల నివాసయోగ్యముగా గన్పట్టుచున్నది. మన మిక్కడనే యాశ్రమము నేర్పఱుచుకొందము.

౩౧. ఇట్లు నిశ్చయించుకొని యాముగ్గురును కృతాంజలులై *వాల్మీక్యాశ్రమంబును జేరి యా ఋషిపుంగవుని కభివాదము చేసిరి.

---

*వ్యా: వాల్మీక్యాశ్రమము:—అప్పుడు వాల్మీకి యాశ్రమము చిత్రకూటంబుననే యున్నట్లును [ఇటార్సీ ప్రయాగలమధ్య చిత్రకూటం బని యొకరైల్వేస్టేషను కలదు. అక్కడనే శ్రీరాముం డాశ్రమమేర్పఱుచుకొన్న చిత్రకూటపర్వతంబు నిప్పటికిని జూడవచ్చును] భరతుడు చిత్రకూటంబునకు వచ్చిన తరువాతనే యాతడు తమసాతీరమునకు బోయి యట నివాసం బేర్పఱుచుకొనినట్లును దెలియవలెను. అనగా శ్రీరాముడు రాజ్యాభిషిక్తుడై, వాల్మీకి, రామాయణంబు వ్రాయునాటికి దమసాతీరంబుననే వాల్మీక్యాశ్రమ మున్నదని బాలకాండద్వితీయసర్గమందలి యీక్రింది శ్లోకంబుల విశదమగును. "ఈ విషయమంతయు బ్రహ్మదేవునికి నివేదింపవలయు నని నారదుడు సత్యలోకమున కేగెను. వాల్మీకియును మాధ్యాహ్నికకృత్యంబులు తీర్చుకొనుటకై గంగానది కనతిదూరముననే యున్న .తమసాతీరంబునకు బోయెను!"

[1] దృష్ట్వా రామం రమానాథం వాల్మీకి ర్లోకసుందరం,
జానకీలక్ష్మణోపేతం జటామకుటమండితం. ౩౧

పూజయిత్వా జగత్పూజ్యం భక్త్యార్ఘ్యాదిభి రావృతం,
ఫలమూలై స్సుమధురై ర్భోజయిత్వా చ లాలితః. ౩౨

రాఘవః ప్రాంజలిః ప్రాహ వాల్మీకిం వినయాన్వితః. ౩౩½

పితురాజ్ఞాం పురస్కృత్య దండకా నాగతా వయం,
భవంతో యది జానంతి కిం వక్ష్యామోఽత్ర కారణం. ౩౪½

యత్ర మే సుఖవాసాయ భవేత్ స్థానం వదస్వ తత్. ౩౫

ఇత్యుక్తో రాఘవేణాసౌ ముని స్సస్మిత మబ్రవీత్. ౩౫½

త్వమేవ సర్వలోకానాం నివాసస్థాన ముత్తమం,
తవాపి సర్వభూతాని నివాససదనాని హి. ౩౬½

త్వన్మంత్రజాపకో యస్తు త్వామేవ శరణంగతః.
నిర్ద్వంద్వో నిస్పృహ స్తస్య హృదయం తే సుమందిరం. ౩౭½

రామ త్వన్నామమహిమా వర్ణ్యతే కేన వా కథం,
యత్ప్రభావా దహం రామ బ్రహ్మర్షిత్వ మవాప్తవాన్. ౩౮½

---

1 అధ్యా. రా: సర్గ ౬.

3౨-33. అమ్మహర్షియు, రమానాథుండును సమస్తలోకసుందరుండును జానకీ లక్ష్మణ సహితుండును జటాలంకారభూషితుండును నగు నా శ్రీరామచంద్రుని జూచి యర్ఘ్యపాద్యాదు లిచ్చి పూజించి, మధురంబులగు ఫలమూలంబుల నాతనికి భుజింపనిడెను.

33½. శ్రీరాముండును బ్రాంజలియై సవినయంబుగ నమ్మునితో నిట్లనెను.

3౪½. మహర్షిచంద్రమా! మాతండ్రిగారి యానతింజేసి మే మిట్లు దండకారణ్యంబునకు బయనమై వచ్చితిమి. ఈవిషయ మంతయు దమకు విదితపూర్వమే కాన మేము చెప్పవలసిన దేమున్నది?

3౫. సుఖముగ గాలము పుచ్చుటకై యేకాంతస్థల మెచ్చట దొరకునో యదిమాత్రము సెలవిండు.

3౫½. ఇట్లు రాఘవుడు పల్కగానే యా ఋషిసత్తముడును చిఱునగవొప్ప నిట్లనెను.

3౬½. శ్రీరామచంద్రా! ఈమాటల కర్థము నేనును నెఱుంగుదును. ఎందులకు జెప్పెదవు? సమస్తలోకంబులకును నీవే నివాసస్థానము. మఱి సమస్తభూతంబులందును నీవే నిండియుంటివి.

3౭½. నిన్ను శరణం బొంది నీ మంత్రమును సతతంబును జపించుచు సుఖదుఃఖాదిద్వంద్వంబులకు లోనుగాక నిస్పృహుం డగువా డెవ్వడు కలడో యాతనిహృదయమే నీకు యోగ్యావాసము- నీలీలామందిరము.

3౮½. శ్రీరామా! నీ నామం బుచ్చరించుటలో నెట్టిమహిమం బున్నదో చెప్ప నేరితరము? నీ నామోచ్చారణ మాత్రంబున నేను బ్రహ్మర్షిత్వము నే పొందితిని.

*అహం పురా కిరాతేషు కిరాతైస్సహ వర్ధితః,
జన్మమాత్రద్విజత్వం మే శూద్రాచారరత స్సదా. 35

* వ్యా : అహమితి:—స్కాందాది పురాణేషు నానా రామాయణేషుచ:

పార్వత్యువాచ:—"వాల్మీకి జన్మవృత్తాంతం శ్రోతు మిచ్ఛామి తద్వద."

శివః:—"పురా స్వాయంభువే హ్యాసీ త్ప్రాచేతస ఇతి ద్విజః, బ్రహ్మాంశజశ్చ బ్రహ్మర్షి స్తేన రామాయణం కృతం. శత కోటిసువిస్తీర్ణం నానాకల్పసముద్భవం, స కదాచి ద్బ్రహ్మ లోకే ధాతారం చాప్యనిందయత్. స్వసుతాగ్రహణా త్తేన శప్త ఆప నిపాదితాం, తతో విధాతృశాపేన దేహం త్యక్త్వా ఋషి స్త్వసౌ. చమత్కారపురే భూత్వా మాండవ్యాన్వయ సంభవః, లోహజంఘో ద్విజో హ్యాసీ త్పితృమాతృపరాయణః. భార్యా పతివ్రతా సాధ్వీ తాం పరిత్యజ్య స ద్విజః, బ్రాహ్మీం వృత్తిం పరిత్యజ్య చోరకర్మ సమాచరత్. జన్మమాత్రం ద్విజన్మాసౌ శూద్రాచారరత స్సదా, శూద్రాయాం బహవః పుత్రా ఉత్పన్నా స్తేఽజితాత్మనః. సర్వదా స వనే తిష్ఠ న్గ చ్ఛతః పథికా న్పథి, తాడయ న్చోరయన్ద్రవ్యం జీవికాం వితనోతి సః, తత్ర సప్తర్షయః ప్రాప్తా మరీచిప్రముఖా ద్విజాః, తతస్తా

౩౯౪. ప్రభో! పూర్వము నేను పేరునకు బ్రాహ్మణకులంబునందే పుట్టితిని. కాని శూద్రాచారంబు లొనర్చుచు గిరాతులలోనే పెరిగి పెద్దవాడనైతిని.

---

* వ్యా:—వాల్మీకి పూర్వవృత్తాంతము స్కాందాది పురాణంబులందును నానారామాయణంబులందును నిట్లున్నది. పరమేశ్వరుని గూర్చి పార్వతి:—ప్రభో! వాల్మీకి జన్మవృత్తాంతము విన వేడుక వొడముచున్నది. తెల్పెదరా?

శివుడు:-"సుందరీ! పూర్వము స్వాయంభువమన్వంతరమున బ్రాచేతసుం డని యొక ద్విజసత్తము డుదయించెను. ఈతడు బ్రహ్మయంశంబునం బుట్టి బ్రహ్మర్షియై కోరి శతకోటి శ్లోకంబులచే నొప్పారునదియు ననేక కల్పంబులలో జరిగిన రామకథావృత్తాంతము నంతయు సవిస్తరంబుగా దెల్పునదియునగు రామాయణంబును రచించి వాసిగాంచెను.

ఈత డొకప్పుడు సత్యలోకంబున నుండెను. అట నేదో యొక సందర్భమున బ్రహ్మదేవుని సైతము స్వసుతాగ్రహణ విషయమై తూలనాడెను. ఆ సృష్టికర్తయు నందులకు గోపించి, 'కిరాతజన్మము నొందుమ'ని యాతనిని శపించెను. ఆ ప్రాచేతసుండును నిజదేహంబును వదలి చమత్కారపురంబున మాండవ్యునింట లోహజంఘుం డను పేరున జన్మించెను. అయినను దలిదండ్రులయందు భక్తికలిగియే యుండెను. ఈతని భార్యయును బతివ్రతయు సాధ్వియునై యుండెను. కాని యేమి ప్రయోజనము? లోహజంఘు డామెను విడిచివైచెను. బ్రాహ్మణవృత్తి యాతనికి గానిపని యయ్యెను. జన్మమాత్రంబున బ్రాహ్మణుండు కాని మఱి చేయుపను లన్నియు గిరాతకపుబనులే. ఒక శూద్రస్త్రీని జేరదీసికొని యామెయందు బహుళతరంబుగ సంతానమును బడసెను. దొంగతనమునే ముఖ్యవృత్తిగా గొని, యడవిలో దోవలు కాచుకొనియుండి, పాపము! బాటసారులను జావ

ఆగచ్ఛ రామ భద్రం తే స్థలం వై దర్శయామ్యహం. ౪౦

న్విజనే దృష్ట్వా లోహజంఘో ద్విజాధమః. యష్టి ముద్యమ్య వేగేన తిష్ఠధ్వ మితిచాబ్రవీత్. ఋషయ ఊచుః:-అహో త్వం బ్రాహ్మణోఽసీతి తత్కస్మాదతిగర్హితం, కరోషి కర్మ చైతద్ధి మ్లేచ్ఛకృత్యంతు బాలిశ. లోహజంఘ ఉవాచ:—కుటుంబార్థం విజానీథ ధర్మమేత న్నసంశయః. ఋషయ ఊచుః.—యద్యేవం చోర తద్గత్వా త్వం పృచ్ఛస్వ కుటుంబకం, మమ పాపాంశభాగీ త్వం కిం భవిష్యసి కిం నవా,'సోఽపి గత్వాథ పప్రచ్ఛ స్వజనాన్సకలాన్ పృథక్, తస్యతద్వచనం శ్రుత్వానిందంత స్తం సమూచిరే. పాపపుంజప్రభోక్తా త్వం వయం సర్వే ప్రభోజినః. తత స్స శోకసంతప్తః పశ్చాత్తాపేన సంయుతః, గర్హయన్నేవ చాత్మానం యయౌ తే యత్ర తాపసాః, తతః ప్రణమ్య తా న్సర్వాన్ కృతాంజలిపుటస్థితః, పరస్పరం సమాలోచ్య దుర్వృత్తోఽయం ద్విజాధమః, రక్షణీయః ప్రయత్నేన మోక్షమార్గోపదేశతః, ఇత్యుక్త్వా రామమంత్రంతు వ్యత్యస్తాక్షరరూపకం, ఏకాగ్ర మనసాత్రైవ మరేతి జప సర్వదా, ఆగచ్ఛామః పున ర్యావ త్తావ దుక్తం సదా జప. ఇత్యుక్త్వా ప్రయయు స్సర్వే మునయో దివ్యదర్శనాః, ఏకాంతేన జపత్యస్మిన్ వల్మీక స్తదుపరి హ్యభూత్, తతో యుగసహస్రాంతే ఋషయః పున రాగమన్, తే మూచు ర్నిష్క్ర

౮౦. శ్రీరామచంద్రా! నీ కేకాంత స్థలమును జూపించెదను రమ్ము.

---

గొట్టి వారిని నిలువున దోచికొని యాధనముతో జీవయాత్ర గడపుచుండెను.

ఒకనాడు సప్తఋషులును మరీచి మున్నగు బ్రాహ్మణోత్తములును, ఈతడు కాచుకొనియున్న త్రోవనే పోవుచుండిరి. వారలను జూచి లోహజంఘుడు కత్తియెత్తి, 'ఆగుడు. అడుగు కదలితిరా, మీ తలలు మీవి కావని యదలించెను. వారును దివ్యదృష్టిచే జూచి 'ఓయీ! నీవు బ్రాహ్మణుడవే! ఇట్టి నీచపుబనికి - ఈ క్రూరకృత్యమునకు బాల్పడు చుంటివేల?' యనిరి. దాని కతడు "నాకుటుంబపోషణార్థమై యిట్లు చేయుచుంటిని. ఇక నిది యధర్మం బెట్లగు" ననెను. దాని కమ్మహర్షులు "ఓహో! యిదియా నీభావము? సరే. మే మిందే యుండెదము. ఎక్కడి కిని బోము. ఇంతకాలమునుండియు నీవు చోరవృత్తిచే గడించిన దాని నంతయు నీ కుటుంబమువార లనుభవించుచుండిరి కదా! మఱి యీవృత్తిచే నైన పాపంబులో గూడ వారేమైన బాలు పంచుకొందు రేమో నీ యింటికి బోయి తెలిసికొని ర" మ్మనిరి వేగమే యాత డింటికి బోయి యాశూద్రవనిత మున్నగువారి నందరిని బిలిచి, 'నాపాతకములో నేమైన బంచుకొందురా' యని వేర్వేర నడిగెను. వారును నాతనిని దిట్టుచు బరిహసించుచు "సరిసరి. నీవు తెచ్చిపెట్టిన దానిని గడుపునిండుగ గుడుచువారమే మేము. నీయధర్మకార్యముల ఫలంబును గుడువవలసినది నీవే" యని బలికిరి. అంతట నాలోహజంఘుడు మిగుల గటకటంబడి పశ్చాత్తప్తుడై తన్ను దా నిందించుకొనుచు, దాపసు లున్నచోటికి బోయి వారలకు జాగిలిమ్రొక్కి జరిగినదంతయు విన్నవించెను. వారును బతితుడగు నీ బ్రాహ్మణాధముని బరిరక్షించి యీతనికి మోక్షమార్గ ముపదేశింప వలెనని పూని యాతనికి 'మ రా' యని తలక్రిందులుగ రామమంత్రము నుపదేశించి దానిని నిండు మనంబున జపింపుమని, తాము కొలదికాలములోనే మరలి వత్తుమని చెప్పి యథేచ్ఛం జనిరి. ఈతడును నిశ్చలచిత్తముతో

ఏవ ముక్త్వా మునిశ్శ్రీమాన్ లక్ష్మణేన సమన్వితః,
శిష్యైః పరివృతో గత్వా మధ్యే పర్వతగంగయోః. ౮౧

---

మన్వేత ఇతి పృచ్ఛ్రుత్వా తూష్ణీ ముత్థితః. వల్మీకా న్నిర్గమాత్ప్రిహు ర్వాల్మీకి రితి తే ద్విజాః, తా న్నమస్కృత్య వాల్మీకి ర్వేద వేదాంగపారగః. బ్రహ్మర్షిత్వ మనుప్రాప్త స్తపసా పరమేణహి, పునశ్చ రామరాజ్యేచ రామాయణ మనుత్తమం. కరిష్య త్యపరం కావ్యం చతుర్వింశత్సహస్రకం" ఇతి. శ్రీమద్భాగవతే షష్ఠస్కంధే 188 అధ్యాయే.
శ్లో॥ చర్షణీ వరుణ స్యాసీ ద్యస్యాం జాతో భృగుః పునః, వాల్మీకిశ్చ మహాయోగీ వల్మీకా దభవత్కిలేతి.

ఉపపన్నా త్వియం చింతా బ్రహ్మవిదామపి కేషాంచి దితిహాసపురాణయో ర్దేహాంతరోత్పత్తిదర్శనాత్. తథాహి విష్ణుపురాణే: అపాంతరతమో నామ వేదాచార్యః పురాణర్షి ర్విష్ణునియోగాత్ కలిద్వాపరసంధౌ కృష్ణద్వైపాయన స్సంబభూవేతి స్మరంతి. వసిష్ఠశ్చ బ్రహ్మణో మానసః పుత్త్రస్స న్నిమిశాపా దపగతపూర్వదేహః పునర్బ్రహ్మదేశా న్మిత్రావరుణాభ్యాం సంబభూవేతి. భృగ్వాదీనా మపి బ్రహ్మణ ఏవ మానసానాం పుత్త్రాణాం వారుణే యజ్ఞే పున రుత్పత్తి స్స్మర్యతే. సనత్కుమారోపి బ్రహ్మణఏవ మానసః పుత్త్రో

౪౧-౪౨. వాల్మీకి మహర్షి యంతట గొంతమంది శిష్యులను గూడ దన వెంట దీసికొని పోయి చిత్రకూటపర్వతంబునకును గంగానదికిని

---

నా 'మరా' మంత్రమును జపింపసాగెను. అతనిపై నొక పుట్ట గుట్టగా బెరిగిపోయెను. ఇట్లు వేయి యుగంబులు గడచిపోయిన వెనుక నా ఋషిసత్తములు మఱలి వచ్చి యాతనిని జూచి 'ఓయీ! నీతపము పండినది. బయల్పడు' మని పిలిచిరి. అతడును వావల్మీకమునుండి బయల్వెడలి వారలకు మ్రొక్కెను. వల్మీకమునుండి యుద్భవించెను గాన 'వాల్మీకి' యనియు బ్రసిద్ధిగాంచెను. అంత వారలచే గ్రమముగా నుపనయనాది సంస్కారంబుల బొంది వేదవేదాంగపారంగతుడై తపస్సుచే బ్రహ్మర్షిత్వం బొందెను. శ్రీరామచంద్రుడు రావణసంహారము చేసి సింహాసనం బధిష్ఠించిన వెనుక 10 వేల సంవత్సరములు జనగా - తన యాశ్రమమున సీత యున్న కాలమున సీతాపాతివ్రత్యప్రకటనార్థమై కుశలవుల కుపదేశింప బూనికతో చతుర్వింశత్సహస్రాత్మకంబగు మఱియొక శ్రీమద్రామాయణమును రచించెను.

శ్రీమద్భాగవత షష్ఠస్కంధమున నూట యెనుబది యెనిమిదవ యధ్యాయంబున నిట్లు చెప్పబడినది. "వరుణునకు 'చరణి' యను నది పుట్టెను. ఆమెయందు పునః భృగువు జన్మించెను. అట్లే వల్మీకము నుండి వాల్మీకి యుద్భవించెను."

భృగుడు వాల్మీకి మున్నగు మహామహుల కిది యేమి బెడగు? వీరి కీ జన్మాంతరంబు లేమని సందేహపడరాదు. అట్టి బ్రహ్మవేత్తలకుగూడ నొక్కొక్కప్పుడు దేహాంతరత్వము సంప్రాప్తించుట బురాణంబుల నయ్యెచోట్ల గన్పడుచునే యున్నది. అపాంతరతము డను వేదవిదుడు, పురాణవేత్త, ద్వాపరకలియుగ సంధిలో కృష్ణద్వైపాయనుడుగా జన్మించెనని విష్ణుపురాణంబున గలదు. నిమి యిచ్చిన శాపంబున బూర్వదేహంబు వదలిపెట్టి బ్రహ్మమానసపుత్త్రుం డగు వసిష్ఠుడు మిత్రావరుణుల కుద్భవించెను.

తత్ర శాలాం సువిస్తీర్ణాం కారయామాస వాసభూః,
ప్రాక్పశ్చిమం దక్షిణోద క్కోశభసం మందిరద్వయం. ౪౨

[1] రామ స్సాన్నత్వాతు నియతో గుణవా న్జప్యకోవిదః,
సంగ్రహేణాకరో త్సర్వా న్మంత్రా న్సత్రావసానికాన్. ౪౩

ఇష్ట్వా దేవగణా న్సర్వా న్వివేశావసథం శుచిః,
వైశ్వదేవబలిం కృత్వా రౌద్రం వైష్ణవ మేవచ. ౪౪
వాస్తుసంశమనీయాని మంగళాని ప్రవర్తయన్. ౪౪½

[2] జానక్యా సహితో రామో లక్ష్మణేన సమన్వితః,
తత్ర తే దేవసదృశా హ్యావస న్భవనోత్తమే. ౪౫½

వాల్మీకినా తత్ర సుపూజితోఽయం రామ స్ససీత స్సహలక్ష్మణేన,
దేవై ర్మునీంద్రై స్సహితో ముదాఽఽస్తే స్వర్గే యథా దేవపతి స్స శచ్యా. ౪౬½

---

స్స్వయం రుద్రాప్రియ వరప్రదానాత్ స్కందత్వేన ప్రాదుర్బభూవ. ఏవ మేవ దక్షనారదప్రభృతీనా మపి భూయసీ దేహాంతరోత్పత్తికథా తేన తేన నిమిత్తేన భవతీతి స్మృతౌ.

---

1. వాల్మీ. రా: సర్గ ౫౬. 2 అధ్యా. రా: సర్గ ౬.

మధ్య నున్న యొకవిశాల ప్రదేశమందు దూర్పుపడమరలుగా నొక గృహంబును నుత్తరదక్షిణములుగా నొకగృహంబును గట్టించెను.

౪౩. మంత్రవేత్తయగు నా శ్రీరామచంద్రుడును స్నానం బాచరించి నియతుడై వాస్తుకర్మకు గావలసిన మంత్రముల నన్నటిని జపించి సంగ్రహముగా వాస్తుహోమంబును జేసెను.

౪౪-౪౪½. అంత సకలదేవతలను బ్రార్థించి శుచియై యయోధ్యాశ్రమమును బ్రవేశించి వైశ్వదేవబలియును రౌద్రవైష్ణవబలులును వేసి వాస్తు శాంతికి గావలసిన మంగళకార్యము లన్నియు నొనరించెను.

౪౫½-౪౬½. ఇట్లు వాల్మీకిమహర్షిచే దగినసత్కారము లంది, దేవతల తోడను శచీదేవితోడను స్వర్గంబున నింద్రు డున్నటుల, ఋషులతో డను, లక్ష్మణునితోడను, సీతతోడను, నా శ్రీరాముడును నయోధ్యా శ్రమమం దుండెను.

---

భృగువు మున్నగు బ్రహ్మమానసపుత్త్రులును వారుణంబను యజ్ఞం బున మరల బుట్టిరి. బ్రహ్మమానసపుత్త్రుండగు సనత్కుమారుండును వరదానంబునం జేసి కుమారస్వామిరూపంబున రుద్రునకు గలిగెను. ఇట్లే దక్షుడు నారదుడు మున్నగు మహామహులు గూడ నానా కారణంబులచే నితరజన్మంబు లందినట్లు మనము వినుచునేయు న్నాము. వారును నేదో యొక నిమిత్తపురస్సరంబుగనే యట్లుద్భ వించుచుందురు గాన వైసందేహ మక్కరలేదు. అట్లు మఱల బుట్టినను వారలకు బూర్వ మున్న నామరూపవిజ్ఞానాదులును గలవు.

[1]భరద్వాజాభిగమనం ప్రయాగే చ సహాసనం,
ఆగిరే ర్గమనం శ్రుత్వా తత్రిస్థై రుపలక్షితం. ౪౭౫

అనుజ్ఞాత స్సుమంత్రోథ యోజయిత్వా హయోత్తమాన్. ౪౮
పశ్య న్నతియయౌ శీఘ్రం గ్రామాణి నగరాణిచ. ౪౮౫

*తతః స్సాయాహ్నసమయే తృతీయేఽహాని సారథిః,
అయోధ్యాం సమనుప్రాప్య నిరానందాం దదర్శహ. ౪౯౫

[2]వస్త్రేణ ముఖ మాచ్ఛాద్య బాష్పాకులితలోచనః,
బహిరేవ రథం స్థాప్య రాజానం ద్రష్టు మాయయౌ. ౫౦

జయశబ్దేన రాజానం స్తుత్వా తం ప్రణనామహ. ౫౦౫

తతో రాజా సుమంత్రం తం సుమంత్రం విహ్వాలోఽబ్రవీత్. ౫౧

సుమంత్ర రామః క్వత్రాస్తే సీతయా లక్ష్మణేనచ,
కుత్ర త్యక్త స్త్వయా రామః కిం మాం పాపిన మబ్రవీత్. ౫౨

సీతా వా లక్ష్మణో వాపి నిర్దయం మాం కి మబ్రవీత్. ౫౨౫

* వ్యా : తతఇతి:— వాల్మీకిరామాయణే ౫౯ సర్గే "గుహేన సార్థం తత్రైవ స్థితోస్మి దివసా న్బహూన్" ఇత్యుక్తత్వా త్తృతీయేహనీతి సత్య ముక్తం భవతి.

1 వాల్మీరా: సర్గ. ౫౭ 2 అధ్యా. రా. సర్గ ౭.

౪౭½-౪౯½. రామాదులు భరద్వాజునికొఱకై పోవుటయు నాతనితో బ్రయాగలో నుండుటయు, నాతడు చెప్పిన చొప్పున జిత్రకూటం బున నివసింపబోవుటయు నక్కడనున్న గుహుని పరిజనులు చెప్పగా విని, గుఱ్ఱంబుల రథమునకు బూన్చి, గ్రామంబులును నగరంబులును జూచికొనుచు సుమంత్రుడును బయనమైపోయెను.

౪౯½. అట్లాతడు మూడవదినము సాయంకాలమునకు, నిరానందమై నిర్జనమైయున్న యయోధ్యను జేరెను.

౫౦-౫౦½. చేరి రథంబును గోటవెలుపలనే నిలిపి ముఖమును వస్త్రముచే నాచ్ఛాదించుకొని కనులవెంట బాష్పములు దొరుగుచుండగా దశరథుడున్నెడకు బోయి యాతనికి బ్రణామము చేసెను.

౫౧. అంత నా దశరథుడును మంత్రిసత్తముం డగు నాసుమంత్రుని జూచి దుఃఖించుచు నిట్లనెను.

౫౨-౫౨½. సుమంత్రా! సీతాలక్ష్మణులతో నా రామచంద్రు డెచ్చట నున్నాడు? వారల నందఱ నెచట డించివచ్చితివి? పాషాణహృదయుం డగు నన్నా శ్రీరామచంద్రు డేమని పల్కెను - సీతాలక్ష్మణు లేమనిరి?

---

వ్యా : సాయంకాలమనుచోట:—వాల్మీకిరామాయణము నేబది తొమ్మిదవ సర్గమునందు "అక్కడ గుహునితో గూడ చాల దినంబు లుంటిని" అని సుమంత్రుడు దశరథునితో చెప్పెనుకదా! దాని కనుగుణముగా నేయిట మూడవదినం బని చెప్పబడెను.

[illegible] [illegible]నిధే హాసీతే ప్రియవాదిని,
[illegible] [illegible]గ్నం మాం మ్రియమాణం న ప్రపశ్యసి. ౧౩౫

ఇతి [illegible] రామాయణసారోద్ధారే అయోధ్యాకాండే
ఏకాదశ స్సర్గః.

---

ద్వా ద శ స్స ర్గః ౧౨

ఏవం [illegible] [illegible]ంతం తం ప్రాంజలి ర్వాక్య మబ్రవీత్. ౧
రామ [illegible] సౌమిత్రి ర్మయానీతా రథేన తే,
శృంగిబేర[illegible] [illegible]భ్యాసే గంగాకూలే వ్యవస్థితాః ౧౫

గుహేన [illegible] [illegible]నీతం ఫలమూలాదికంచ యత్,
పృష్ట్వా [illegible] [illegible] సంప్రీత్యా నాగ్రహీ ద్విససర్జ తత్. ౨౫
వటక్షీర[illegible] [illegible]నాయ్య గుహేన రఘునందనః,
జటాము[illegible] [illegible]బధ్య మా మాహ నృపతే స్వయం. ౩౫
సుమంత్ర [illegible] [illegible] రాజానం శోక స్తేఽస్తు న మత్కృతే,
సాకేతా [illegible] [illegible] సౌఖ్యం విపినే నో భవిష్యతి. ౪౫

మాతు [illegible] [illegible]నం బ్రూహి శోకం త్యజతు మత్కృతే. ౫

౫౩౪. హా శ్రీరామచంద్రా! సీతా! అయ్యా! మీ రిప్పు డెచ్చట నున్నారో. దుఃఖసముద్రమున దేలియాడుచు యమసదనంబునకు బోవనైయున్న నన్ను గనరారా? నాముప్పు దాటింపరారా?

ఇది శ్రీరామాయణ సారోద్ధారంబున నయోధ్యాకాండంబునందు బదునొకండవ సర్గము.

---

## పండ్రెండవ సర్గము.

౧-౧౫. ఇట్లు దుఃఖార్ణవమగ్నుండై యాదశరథుం డాడినమాటలకు సుమంత్రుడును దుఃఖించుచు నిట్లనెను. మహాప్రభూ! మీ రాజ్ఞాపించిన ప్రకార మాసీతారామలక్ష్మణుల నరదముపై నెక్కించుకొని శృంగిబేరపురంబున కనతిదూరంబున గంగానది యొద్దున డించితిని.

౨౫-౩౫. అశృంగిబేరాధిపుడగు గుహుండు రామునికొఱకై మధురములగు ఫలంబులును గందమూలంబులును గానుకగా గొని తెచ్చెను. వానిని శ్రీరాము దూరక హ స్తముచే స్పృశించెనేకాని గ్రహింపలేదు. అత నిచే మఱ్ఱిపాలుమాత్రము తెప్పించి శ్రీరామలక్ష్మణులు జడలను దాల్చిరి.

౪౫. 'అయ్యా! నా కేమిసెల'వని నే నడిగితిని. అంత శ్రీరాముడు నాతో నిట్లనెను. 'సుమంత్రా! నాకై మాతండ్రిగారిని దుఃఖింపవలదనుము. అయోధ్యయందుకంటె నీ యరణ్యంబునందే మే మెక్కుడు సుఖముగా నుంటి మనుము.

౫. మా యమ్మగారికిఁ గొడను దుఃఖము వలదని చెప్పుము. ఆమె పాదపద్మంబులకు మ్రొక్కితినను[illegible]

సీతా చాశ్రుపరీతాక్షీ మా మాహ నృపసత్తమ,
దుఃఖగద్గదయా వాచా రామం కించి దవేక్షతీ. ౬
సాష్టాంగం ప్రణిపాతం మే బ్రూహి శ్వశ్రోః పదాంబుజే,
ఇతి ప్రరుదతీ సీతా గతా కించి దవాఙ్ముఖీ. ౭
లక్ష్మణస్తు సుసంక్రుద్ధో నిశ్వసన్ వాక్య మబ్రవీత్. ౨౪

*1అహం తావ న్మహారాజే పితృత్వం నోపలక్షయే
భ్రాతా భర్తాచ బంధుశ్చ పితాచ మమ రాఘవః. ౮౫

*అహంతావదితి:—నను "జ్యేష్ఠభ్రాతా పితృసమో మృతే పితరి భూసురాః, కనిష్ఠా స్తం నమస్యేరన్ సర్వే ఛ్ఛందానువర్తిన" ఇత్యాది స్మృతిపర్యాలోచనయా పితురనంతర మేవ జ్యేష్ఠభ్రాత్రనుసరణస్య కర్తవ్యత్వావగమేన తద్విరుద్ధతయా విద్యమాన ఏవ పితరి లక్ష్మణేన జ్యేష్ఠభ్రాత్రనుసరణం కథం కృతం ? 'తస్యాం శుశ్రూషా నిత్యా పతితాయా మపి' ఇత్యాపస్తంబవచన పర్యాలోచనయా మాతృశుశ్రూషణస్య అవశ్యకర్తవ్యత్వావగమేన స మాతృశుశ్రూషణం కథంవా న కృత మితిచే న్న, పిత్రో స్సమ్మతత్వేన జ్యేష్ఠానుసరణస్య యుక్తత్వాత్ పితృసమ్మతత్వా చ్చ "రామం శుశ్రూషతా భక్త్యా వైదేహ్యా సహ సీతయా,

1 వాల్మీ. రా. సర్గ ౫౮.

౬-౩. సీతయు నేత్రముల నిండుగ బాష్పము లరుగుదేర గద్గదకంఠయై శ్రీరాముని వంక జూచుచు నత్తమామలకు సాష్టాంగము లనిచెప్పుమని నాతో నని కొంచెము తల వంచుకొని దుఃఖించుచు ప్రక్కకు బోయెను.

౩౫. లక్ష్మణుడు మాత్రము కోపసంవర్తితేక్షణుడై కాలభుజంగంబుపగిది రోజుచు నిట్లనెను.

౪౫. సుమంత్రా! యీదశరథుడు నాకు దండ్రిగా దోచుటలేదు. తండ్రియు, నన్నయు, ప్రభువును, బంధువుడును నన్నియు నాకు శ్రీరాముడే.

---

* వ్యా: 'నాకు దండ్రిగా' ననుచోట:— "తండ్రి మరణించిన వెనుక జ్యేష్ఠసహోదరునే తండ్రిగా నెంచుకొని, మిగిలిన సహోదరు లందఱు నాతని యిష్టప్రకారము నడచుకొనుచు నాతనికి నమస్కరించుచుండవలెను." ఇట్టుగ స్మృతిప్రమాణం బున్నను లక్ష్మణుడు తనతండ్రి యగు దశరథుడు జీవించియుండగానే జ్యేష్ఠసహోదరుండగు శ్రీరాము నెట్లనుగ మించిపోయెను?— "పలుతురా లైనను దల్లి కెల్లపుడును శుశ్రూష యొనరింపవలెనని యాపస్తంబులు చెప్పినట్లుగ మాతృసేవ యవశ్యము చేయవలసియుండగ లక్ష్మణుండామెనుగూడ నెట్లు విడనాడెనని ప్రశ్నింపరాదు. తలిదండ్రుల సమ్మతితో జ్యేష్ఠానుసరణము యుక్తమే కాని యందు దోసము లేదు. యుద్ధకాండమందలి "సీతతో బాటుగ నీవును శ్రీరామునికి సేవ లొనర్చితివి. అందులకు నా మనం బెంతయు సంతసించినది. నీకును ధర్మఫలావాప్తియైన" దని దశరథుం డాడిన వచనంబుచే, లక్ష్మణుడు శ్రీరాము ననుగమించిపోవుట దశరథునకు సమ్మతమే యని తెలియుటలేదా! ఇట్లే "దుఃఖితుడు కానిమ్ము లేక సకలవైభవ

సర్వప్రజాభిరామం హి రామం ప్రవ్రాజ్య ధార్మికం,
సర్వలోకం విరుద్ధ్యేమం కథం రాజా భవిష్యతి. ౯౫

1తత స్తేఽభ్రుపరీతాక్షా నావ మారురుహు స్తథా,
యావ ద్గంగాం సముత్తీర్య గతాస్తావ దహం స్థితః. ౧౦౫

1గంగా ముత్తీర్య తౌ వీరౌ ప్రయాగాభిముఖౌ గతౌ,
అగ్రతో లక్ష్మణో యాతః పాలయ న్రఘునందనం. ౧౧౫
అనంతరం చ సీతాథ రాఘవో రఘునందనః. ౧౨

కృతా మమ మహాప్రీతిః ప్రాప్తం ధర్మఫలంచ తే" ఇతి యుద్ధకాండస్థ దశరథవచనా దవగమ్యతే; తథా మాతృసమ్మతత్వమపి "వ్యసనీ వా సమృద్ధో వా గతి రేష తవానఘ, ఏష లోకే సతాంధర్మో యజ్జ్యేష్ఠవశగో భవేత్" "రామం దశరథం వి* ద్ధి త్యాదా సుమిత్రవచనా దవగమ్యతే. పితా కథం నింద్య ఇత్యత్ర పరమైకాంతిభిః ప్రాకృతపిత్రాదయః పరిత్యాజ్యాః, భగవానేవ నిరుపాధికః పితా భర్తా బంధుశ్చే త్యుక్తం ముఖ్యం పితరం విహాయ కథం గౌణ మనువర్తసే? ఇత్యత్రాహ సర్వప్రజాభిరామ మిత్యాది.

౯ అధ్యా. రా. సర్గ౭; ౯ భారద్వాజశా.

౯౪. సమస్తప్రజారంజకుండును బరమధార్మికుండును నగు శ్రీరాముని నడవులపాల్జేసి యీతడు కట్టుకొనిపోవునదేమి ? సర్వలోకంబునకును విరుద్ధం బగు నిట్టి చెట్ట యొనరించి యీతడు ప్రజానురంజకుండగు ప్రభు వెట్లు కాగలడు !

౧౦౪. ఇట్లు వాతో నని వారు మిగుల దుఃఖించుచు నావ నెక్కి గంగానదిని దాటిరి. వా రట్లు దాటి యావలియొడ్డు జేరువఱకును నే నచ్చటనే యుంటిని.

౧౧౪. తరువాత వారు ప్రయాగవైపునకు బోయిరి. ధనుర్ధారియై లక్ష్మణుడు త్రోవదీయుచుండెను. పిమ్మట సీతయు వెనుకవైపున రాముడును నడచుచుండిరి.

---

సంపూర్ణుడు కానిమ్ము - శ్రీరాముడే నీకు గతి యగువాడు'' ''ఆతని వశవర్తివై మెలంగుటచే నీవు ధార్మికుడవై పరగుము'' ''శ్రీరాముని దశరథునిగా నెఱుంగుము'' ఇత్యాద్యర్థమిచ్చు శ్లోకంబులం బట్టి లక్ష్మణుడు జ్యేష్ఠభ్రాత్రనుసారి యగుట సుమిత్రకును నిష్టమే యని కన్పట్టుచున్నది. కాన లక్ష్మణు డిట్లు సేయుటలో దోసం బేమియులేదు.

కాని తండ్రిని లక్ష్మణు డిట్లు తూలనాడజనునా యని మఱియొక్క ప్రశ్నము కల్గుచున్నది. దానికి, కేవలము తండ్రిని నిందించినట్లుగా నెంచుకొనక. ప్రాకృతపితరులు త్యాజ్యులనియు నిరుపాధికపిత యగు భగవంతు డొక్కడే తండ్రియు బ్రభువును బంధుగును నై యున్నాడను భావమే యిట గ్రహింపవలెను. కనుకనే తరువాత శ్లోకములో సర్వప్రజాభిరంజకుండగు తండ్రిని విడనాడి యముఖ్యుండగు ప్రాకృత పిత నెట్లనుసరింపవలె నను భావము తెలుపబడుచున్నది.

సద్యః పురీపరసరేషు శిరీషమృద్వీ, గత్వా జవాత్కతిచి ద్దేవ
పదాని సీతా, గంతవ్య మస్తి కియదిత్యసకృ ద్బ్రువాణా
రామాశ్రుణః కృతవతీ ప్రథమావతారమ్. ౧౩

తాం స్తథా గచ్ఛతో దృష్ట్వా నివృత్తో స్మ్యవశ స్తథా. ౧౩౪

1గుహేన సార్ధం తత్రైవ స్థితో౽స్మి దివసా న్బహూన్,
ఆశయా యది మాం రామః పున శ్శబ్దాపయేదితి. ౧౪౪

విషయే తే మహారాజ రామవ్యసనకర్శితాః,
అపి వృక్షాః పరిమ్లానా స్సపుష్పాంకురకోరకాః. ౧౫౪
ఉపతప్తోదకా నద్యః పల్వలాని సరాంసి చ,
పరిశుష్కపలాశాని వనా న్యుపవనానిచ. ౧౬౪
నచ సర్పంతి సత్త్వాని వ్యాళా న ప్రచరంతిచ,
రామశోకాభిభూతం త న్నిష్కూజ మభవ ద్వనం. ౧౭౪
దేవ! రాజరథం దృష్ట్వా వినా రాఘవ మాగతం,
దుఃఖా దశ్రుముఖ స్సర్వో రాజమార్గగతో జనః. ౧౮౪

---

1 వాల్మీ. రా: సర్గ ౫౯.

౧౩. శిరీషకుసుమకోమలగాత్రి యగు నాసీతాదేవి గుహుని పట్టణము వెలుపలకుఁ బోయి పోవకమున్నే మిగుల వేగముగ గొన్ని యడుగులుఁ నైచి 'నాథా మన గమ్యస్థానమింకెంతదూరమున్న'దని పాపము! పలుమాఱు లడుగుచుండెను. ఇది విని కంట నీ రెఱుగని యా శ్రీరామచంద్రుని నేత్రములనుండి యశ్రుబిందువులు జారెను. రాముని కంటినీటి కిదియే ప్రథమావతారము.

౧౩౪. ఆసీతారామలక్ష్మణు లిట్లు పోవుచుండుట గాంచి యది సహింపలేక మఱలివచ్చితిని.

౧౪౪. అట్లు మఱలివచ్చుచు, నొకవేళ శ్రీరామచంద్రుడు తన నిశ్చయమును మార్చుకొని యయోధ్యకు దిరిగి వత్తునని మఱల నా కేమైన గబురంపు నేమో యను నాసతో గుహునితోగూడ నట రెండొండు దినంబు లుంటిని.

౧౫౪-౧౬౪-౧౭౪. ప్రభో! పూమొగ్గలతో గనులపండువుగ నున్న మన వృక్షంబు లన్నియు శ్రీరామచంద్రుని వియోగము సహింపలేక. వాడి వత్తలైపోవుచున్నవి, చెట్ల నున్న యాకులన్నియు గలగల రాలి పోవుచున్నవి. మడువులును సరస్సులును నదులునుగూడ నెండిపోవు చున్నవి. ఏ మృగంబులును దామున్న చోటునుండి కదలుటలేదు. వ్యాఘ్రాదిఘాతుకమృగంబులును దమ యాహారము నిమిత్తమై క్రుమ్మరుచుండుటలేదు. వనంబులలో గోకిలాది పక్షుల కూకూధ్వనులే వినంబడుటలేదు.

౧౮౪. మహారాజా! శ్రీరాముడు లేకుండనే రాజరథము మార్గము వెంట వచ్చుచుండుట గాంచి పౌరు లందఱును బాష్పపూరిత నయనులై యేగుచుండిరి.

బాష్పోపహతవాగ్రాజా తం సూత మిద మబ్రవీత్. ౧౯

మామేవ రథ మారోప్య శీఘ్రం రామాయ దర్శయ,
లోహితాక్షం మహాబాహు మాముక్తమణికుండలం, ౨౦
రామం యది న పశ్యేయం గమిష్యామి యమక్షయం. ౨౦½

[1]తతో భూతోపసృష్టేవ వేపమానా పునఃపునః,
ధరణ్యాం గతసత్త్వేవ కౌసల్యా సూత మబ్రవీత్. ౨౧
నివర్తయ రథం శీఘ్రం దండకాన్నయ మామపి,
అథ తా న్నానుగచ్ఛామి గమిష్యామి యమక్షయం. ౨౨

[2]తతో రుదంతీ కౌసల్యా రాజాన మిద మబ్రవీత్,
కైకేయ్యై ప్రియభార్యాయై ప్రసన్నో దత్తవా న్వరం. ౨౩
త్వం రాజ్యం దేహి తస్యైవ మత్పుత్రః కిం వివాసితః. ౨౩½
[3]దహ్యమాన స్స శోకాభ్యాం కౌసల్యా మాహ భూపతిః,
వేపమానోఽంజలిం కృత్వా ప్రసాదార్థ మవాఙ్ముఖః. ౨౪½

1 వాల్మీ. రా. సర్గ ౨౦; 2 అధ్యా. రా: సర్గ ౬.
3 వాల్మీ. రా. సర్గ ౬౨.

౧౯. ఇట్లు సుమంత్రుడు చెప్పగా దుఃఖము పైకొని యొలుంగు డగ్గుత్తిక వడ నాతనితో దశరథుం డిట్లనియె.

౨౦-౨౦½. సుమంత్రా! నన్ను వెంటనే రథముపై నెక్కించుకొనిపోయి యా శ్రీరామునికి జూపుము. రక్తాంచల నేత్రుండును, నాజాను బాహుండును, మణికుండలకాంతిపరిస్ఫురత్కపోలుండును నగు నా శ్రీరామచంద్రుని జూడకపోతినా నే నిప్పుడే యమాలయంబునకు బోవుట నిక్కువము.

౨౧-౨౨. అంత, భూతముచే నావేశింపబడిన దానివలె మిగుల గంపము నొందుచున్నదియు, బలమరిపోయినదానివలె భూమిపై బడియున్నదియు నగు నాకౌసల్యకూడ సుమంత్రునితో 'ఓయీ! త్రిప్పుము - రథమును మఱల వెనుకకు ద్రిప్పుము. దండకారణ్యమునకు నన్ను గూడ గొంపొమ్ము. వారలతో నేను గూడ బోకపోతినా యమక్షయంబునకైనను బోవుట సత్య''మనెను.

౨౩-౨౩½. ఆమె యంత బెద్దపెట్టున నేడ్చుచు దశరథునితో 'నీప్రియురాలు గాన కైకేయికి బ్రసన్నుడవై యామె కిచ్చినవరంబులం చేసి రాజ్యం బిచ్చిన నిచ్చెదవుగాక. కాని నాకుమారు నెందుల కడవుల పాల్సేసితివో!' యనెను.

౨౪½. ఆమాట విని దుఃఖముచేతను శ్రీరాము నడవికి బంపిన దుఃఖముచేతను నాదశరథు డట్లు సంతప్తుడై శరీర మంతయు వణకుచుండ దల వంచికొని యాకౌసల్యాదేవి దయ నొందుటకై యంజలిసేయుచు నామెతో నిట్లనెను.

భర్తా తు ఖలు నారీణాం గుణవా న్నిర్గుణోపివా,
నార్హానే విప్రియం వక్తుం దుఃఖితాఽపిసుదుఃఖితం. ౨౫

సా మూర్ధ్ని బద్ధ్వా రుదతీ రాజ్ఞః పద్మమివాంజలిం,
సంభ్రమా దబ్రవీ త్త్రస్తా త్వరమాణాక్షరం వచః. ౨౬

జానామి ధర్మం ధర్మజ్ఞ త్వాం జానే సత్యవాదినం,
పుత్రశోకార్తయా తత్తు మయా కిమపి భాషితం. ౨౭

యతయో వీర ముహ్యంతి శోకసమ్మూఢచేతసః. ౨౮

*వనవాసాయ రామస్య పంచరాత్రోద్యఽ గణ్యతే,
యశ్శోకహతహర్షాయాః పంచవర్షోపమం మమ. ౨౯

---

*వ్యా: వనవాసాయేతి:—వనే వాసం కర్తుం ప్రస్థితస్య రామస్య పంచ రాత్రోఽద్య గణ్యతే. వనే పంచరాత్రో ద్యగణ్యతే-వనే పంచరాత్రో వాసో గణ్యతే.' అగిరే ర్గమన మిత్యత్ర గమనోద్యోగ మిత్యర్థః' గుహేన సార్థం తత్రైవ స్థితోస్మి దివసా న్నపహార్షం, ఇత్యుక్త్వా దినత్రయం శృంగిబేగపురే సూతస్య వాసః, చతుర్థదినే ఋజుమార్గేణ రాత్రావేవాగత చారముఖా చ్ఛ్రీరామస్య చిత్రకూటప్రవేశోద్యోగం నిశమ్య సుమంత్రవచసాపి పంచమదినే సాయంకాలే వేగే

౨౪. దేవీ! గుణవంతుడైనను గుణహీనుండైనను స్త్రీలకు భర్తకంటెవేరేము న్నది? ఎంతదుఃఖితురాల నయ్యును, నీ విట్లు విచారసాగరమగ్నుండగు నన్ను నోడా డఁజెల్లునా?

౨౫. అనుటతోడనే యాకౌసల్యయు మిగుల దత్తరపాటొందుచు లేచి భర్తదోయిలిని దన శిరముపై నుంచికొని తొందరగా నిట్లు పలికెను.

౨౬. నాథా! నీవు చెప్పిన ధర్మంబు లెస్సగా నెఱుంగుదును. నీవు సత్యవాది వనియు నెఱుంగుదును. కాని పుత్త్రశోకార్తనై మనము కలగుండు వడియుంటచే నేమేమో భాషించితిని.

౨౭. రాజా; అతిశోకపరీతాత్ములై యతీంద్రులట్టివారలే మోహము నొందుచున్నారు. అట్టియెడ నాడుదాననగు నా లెక్క యేమి?

౨౮. శ్రీరాముడు వనవాసంబుచేయ మొదలిడి యిప్పటికి *నయిదు దినము లైనది. ఈ యైదు దినములును నాకు నైదువత్సరములుగా దోచుచున్నవి.

---

*వ్యా: అయిదురాత్రము లనుచోట:— అనగా శ్రీరాముడు వనంబు బ్రవేశించి యరణ్యావాసము సేయుట మొదలిడి యప్పటికయిదురాత్రులు గడచిపోయినవని భావము. ఇట్లు 'అగిరేర్గమన' మను శ్లోకమందుగూడ గమన మనుచోట ప్రయాణోద్యోగమని భావము.

శ్రీరాముడు తనకు మఱల నేమైన గబురంపు నేమోయను నాసతో, తానుకొన్ని దినములు గుహునియొద్ద నుంటినని యీసర్గములోని ౧౪ వ శ్లోకములో సుమంత్రుడు దశరథునితో జెప్పియుండెను. అక్కడ 'కొన్ని దినము' లను దానికి మూడు దినములనియే యర్థము చేసికొనవలెను. అనగా సుమంత్రుడు తిరిగి వచ్చునప్పుడు మూడు దినములు శృంగిబేరపురంబున గుహునితో గడపి, శ్రీరాముండు చిత్రకూటపర్వతంబు జేరినసంగతి నాల్గవదినంబున చారులవలన, విని

ఏవంహి కథయంత్యాస్తు కౌసల్యాయాశ్శుభం వచః,
మందరశ్మి రభూత్సూర్యో రజనీ చాభ్యవర్తత. ౩౦

తతః ప్రభాతే విమలే శోకోపహతచేతసః,
[1]కౌసల్యాసహితో రాజ॰ పుత్రదుఃఖ ముపాగతః. ౩౧

[2]స రాజా రజనీం షష్ఠీం రామే ప్రవ్రజితే వనం,
అర్ధరాత్రే దశరథ స్సంస్మరన్ దుష్కృతం కృతం, ౩౨
కౌసల్యాం పుత్రశోకార్తా మిదం వచన మబ్రవీత్. ౩౨½
[3]దేవ్యనూఢా త్వ మభవో యువరాజో భవామ్యహం,
తతః ప్రావృ డనుప్రాప్తా మద కామవివర్ధినీ. ౩౩½

తస్మి న్నతిసుఖే కాలే ధనుష్మా నిషుమా న్రథే,
వ్యాయామకృతసంకల్ప స్సరయూ మన్వగాం నదీం. ౩౪½
[4]తత్రార్ధరాత్రిసమయే మునిః కశ్చి త్తృషార్దితః,
ఆపూరయన్ జలే కుంభం తదా శబ్దోఽభవన్ మహాన్. ౩౫½
గజః పిబతి పానీయ మితిమత్వా మహానిశి,
బాణం ధనుషి సంధాయ శబ్దవేదిన మక్షిపమ్. ౩౬½

---

నాయోధ్యాప్రవేశః, తస్మిన్ దినే కౌసల్యా దశరథంప్రత్యాహ పంచరాత్రో గత ఇతి.

---

1. కవి. 1. వాల్మీ రా: సర్గ ౬౩. 2 వాల్మీ రా: సర్గ ౬౩.
3. అధ్యా రా. సర్గ ౩.

౩౦. ఇట్లు కౌసల్య పల్కుచుండగానే ప్రొద్దుగుంకెను. ఆ రాత్రియు గడచిపోయెను.

౩౧. తెల్లవారగనే దశరథుడు కౌసల్యాసహితుడై శ్రీరామునికై మఱల దుఃఖింపసాగెను.

౩౨-౩౨. అట్లు దుఃఖించి దుఃఖించి మరునాటి యర్ధరాత్రము నందు దాను దన చిన్నతనములో జేసిన యొక యకార్యము జ్ఞప్తికి రాగా దశరథుడు కౌసల్యతో నిట్లు చెప్పమొదలిడెను.

౩౩. దేవీ! నీ వప్పటి కింకను నీ పురమునకు రాలేదు. నేనును యువరాజనై యుంటిని. అప్పుడు కామవర్ధని యగు వర్షాకాలము సంప్రాప్తించెను.

౩౪. నేనును నా ధనుర్బాణంబులు గైకొని సరయూనదీతీరంబునకు బోయితిని.

౩౫. అట నొక ముని యర్ధరాత్రంబున దాహపీడితుడై వచ్చి యానదిలో బాత్రమును ముంచుచుండెను.

౩౬. బుడ బుడ మని గొప్ప ధ్వని యగుటచే నది యొక యేనుంగని యెంచి వింట బాణంబు సంధించి శబ్దవేది నగుటచే యాధ్వని వచ్చిన దిక్కునకై సూటిగా బాణమును వదలితిని.

---

యైదవ దినంబు సాయంకాలంబున శయోధ్యం జేరెను. ఆరాత్రియే పై శ్లోకములో జెప్పినరీతిగా గౌసల్య యయిదురాత్రులు గడచినవని దశరథునితో ననెను.

హా హతోఽస్మీతి తత్రాభూ చ్ఛబ్దో మానుషసూచకః. ౩౭

శనైర్గత్వాథ తత్పార్శ్వం స్వామిన్ దశరథోఽస్మ్యహం,
అజానతా మయా విద్ధ స్త్రాతు మర్హసి మాం మునే. ౩౮
ఇత్యుక్త్వా పాదయో స్తస్య పతితో గద్గదాక్షరః. ౩౮½
[1]తదా మా మాహ స ముని ర్మాభైషీ ర్నృపసత్తమ,
బ్రహ్మహత్యాకృతం పాపం హృదయా దపనీయతాం. ౩౯½
న ద్విజాతి రహం రాజన్ మాభూ త్తే మనసో వ్యథా,
శూద్రాయా మస్మి వైశ్యేన జాతో జనపదాధిప. ౪౦½
[2]పితరౌ మాం ప్రతీక్షేతే క్షు త్తృడ్భ్యాం పరిపీడితౌ,
తత స్త్వ ముదకం దేహి శీఘ్రమే వాఽవిచారయన్. ౪౧½
జలం దత్వాతు తౌ నత్వా కృతం సర్వం నివేదయ. ౪౨

శల్య ముద్ధర మే దేహా త్ప్రాణాన్ స్త్యక్ష్యామి పీడితః. ౪౨½

[3]తస్య త్వానమ్యమానస్య తం బాణ మహ ముద్ధరం,
స మా ముద్వీక్ష్య సంత్రస్తో జహౌ ప్రాణాం స్తపోధనః. ౪౩½

---

1 వాల్మీ. రా: సర్గ ౬౩; 2 అధ్యా. రా: సర్గ ౭.
3 వాల్మీ. రా: సర్గ౬౩.

౩౭. "హా! హా! చచ్చితిని!! చచ్చితిని!!" అనుచు నొక మానుషవాక్య మాచెవుల బడెను.

౩౮-౩౮½. నేను నాప్రాణముల బిగబట్టుకొని యాధ్వని గల్గినవైపునకు మెలమెల్లగ బోయి "మహర్షిసత్తమా! ఎఱుంగక చేసిన యపరాధము. నన్ను క్షమించుము. నాతప్పు మన్నింపుము." అనుచు నికమాటాడనేరక యాతని పాదములపై బడితిని.

౩౯½-౪౦½. అతడును 'రాజా! భయము నొందకుము. నేను బ్రాహ్మణుడను గాను. శూద్రస్త్రీయందు వైశ్యునకు జన్మించితిని. కావ బ్రహ్మహత్యాదోషం బంటు నని నీ వేమియు దిగు లొందకుము.

౪౧½-౪౨. అయ్యా! అంధులగు నా తలిదండ్రులు డప్పిగొని జలంబులు దెమ్మని నన్నంపిరి. నాకొఱకై వా రెదురుచూచుచుందురు. జరిగిన దానికి విచారము నెందకుము. శీఘ్రముగా బోయి ముందుగ వారల కీయుదకముల నిమ్ము. పిమ్మట నీ యుదంతం బంతయు వారలకు మెల్లగా దెల్పి వారల శరణొందుము.

౪౨½. రాజా! యీవేదన నే నిక భరింపలేకున్నాను. ఈయమ్ము నూడ బెఱుకుము. (అప్పుడుగాని ప్రాణము చప్పున పోదు.)

౪౩½. అట్లు పల్కుచున్న యమ్మునిబాలకుని మైనాటిన యమ్ము నూడ బెఱికితిని. అతడును న న్నుగ్రముగా జూచుచు బ్రాణములు వాసెను.

సజలం కలశం ధృత్వా గతో౽హం యత్ర దంపతీ,
అతివృద్ధా వంధదృశౌ క్షుత్పిపాసార్దితౌ నిశి. ౪౪½

1పదశబ్దం తు మే శ్రుత్వా ముని ర్వాక్య మభాషత,
కిం చిరాయసి మే పుత్ర! పానీయం క్షిప్ర మానయ. ౪౫½

సమాసక్తా స్త్వయి ప్రాణాః కిం త్వం నో నాభి భాషసే. ౪౬

ముని మవ్యక్తయా వాచా త మహం సజ్జమానయా,
ఆచచక్షే త్వహం తస్మై పుత్రవ్యసనజం భయం. ౪౭

2తత శ్శ్రుత్వా తు దుఃఖార్తా విలప్య బహుశోచ్యతం,
పతితో నో సుతో యత్ర నయతత్రా విలంబయన్. ౪౮

తతో నీతౌ సుతో యత్ర మయా తౌ వృద్ధదంపతీ,
స్పృష్ట్వా సుతం తౌ హస్తాభ్యాం బహుశోఽథ విలేపతుః. ౪౯

మా మువాచ మహాతేజాః కృతాంజలి ముపస్థితం. ౪౯½

3అజ్ఞానాద్ధి కృతం యస్మా దిదం తేనైవ జీవసి,
అపి హ్యద్య కులం నస్యా దిక్ష్వాకూణాం కుతో భవాన్. ౫౦½

4సాధుసజ్జనసంతాపా త్కిమాశ్చర్యః కులక్షయః. ౫౧

---

1. వాల్మీ. రా: సర్గ ౬౪. 2 అధ్యా. రా: సర్గ ౭.
3 వాల్మీ. రా: సర్గ ౬౪. 4 కవి.

౪౪½. నేనును నా జలకలశమును ధరించి పిపాసాపీడితులగు నాయంధ వృద్ధ దంపతు లున్నచోటికి బోయితిని.

౪౫½-౪౬. నా పదముల చప్పుడు విని యావృద్ధమునియు 'నాయనా! జలంబులు త్వరగా నిటు దెమ్ము.—తండ్రీ! యేల మాతోడ బలుకవు? మా ప్రాణంబు లన్నియు, మాయాస లన్నియు నీపై బెట్టుకొనియుంటిమి - అట్టినీవే యిట్లుచేసిన మా కింకేదిగతి?

౪౭. ఇట్లు పుత్త్రుడను భ్రాంతిచే బల్కుచున్న యా మునితో నేనును మిగుల కంపమునొందుచు నస్పష్టముగా నాతని కుమారుని మరణవార్తను జల్లగా జెప్పివైచితిని.

౪౮. అంత వృద్ధదంపతులు గొల్లున నేర్పడుచు దమకొమరుం డున్న చోటికి దమ్ము గొంపొమ్మనిరి.

౪౯. నేనంత వారల నచ్చోటికి గొంపోయితిని. వారును నాశవమును జేరి బహుప్రకారంబుల జింతించిరి.

౪౯½. అట్లేడ్చి యేడ్చి మహాతేజస్వి యగు నమ్మహర్షి నన్నుగూర్చి యిట్లనెను.

౫౦½-౫౧. ఓయీ! రాజా! నీ వొనర్చిన యకార్యమునకై నీ యిక్ష్వాకు కులంబు నంతయు భస్మీపటము చేసియుందును. ఇక నీయొక్కని లెక్కయేమి? కాని నీ వీకార్యము నజ్ఞానముచే నొనరించియుంటివి. అందులకే యింతవరకైనను బ్రదుకగంటివి. సాధుసజ్జనులకు సంతాపమును గల్గించిన కులక్షయమగుట యొక వింతయా?

4తతో మా మూచతు శ్శీఘ్రం చితిం రచయ భూపతే,
మయా తత్రైవ రచితా చితి స్తత్ర నివేశితాః. ౫౨

త్రియ స్తతాగ్ని రుత్సృష్టే దగ్ధా స్తే త్రిదివం యయుః,
తత్ర వృద్ధః పితా ఆహ త్వమప్యేవం భవిష్యసి. ౫౩
పుత్రశోకేన మరణం ప్రాప్స్యసే వచనా న్మమ. ౫౩½

స ఇదానీ మనుప్రాప్త శ్శాపకాలోఽనివారితః ౫౪

ఇత్యుక్త్వా విలలాపాథ రాజా శోకసమాకులః,
హారామ! పుత్ర! హాసీతే! హాలక్ష్మణ! గుణాకర! ౫౫
త్వద్వియోగా దహం ప్రాప్తో మృత్యుం కైకేయిసంభవం
ఇతి రామస్య మాతుశ్చ సుమిత్రాయాశ్చ సన్నిధౌ, ౫౬
రాజా దశరథ శ్శోచన్ జీవితాంత ముపాగమత్. ౫౬½
1అథ రాత్ర్యాం వ్యతీతాయాం ప్రాతరే వా పరేఽహని,
వందినః పర్యుపాతిష్ఠన్ తత్పార్థివనివేశనం. ౫౭½

అథ యాః కోసలేంద్రస్య శయనం ప్రత్యనంతరాః,
తా స్త్రియస్తు సమాగమ్య భర్తారం ప్రత్యబోధయన్ ౫౮½
తా స్త్రియ స్స్వప్నశీలజ్ఞా శ్చేష్టాసంచలనాదిషు,
తా వేపథుపరీతా శ్చ రాజ్ఞః ప్రాణేషు శంకితాః ౫౯

4 వాల్మీ.రా: సర్గ. 1. వాల్మీ రా! సర్గ ౬౫;

౬౪.

౫౨. అయ్యా! మా కుమారుడు లేకుండ మే మెట్లును జీవింపజాలము. మాకొఱకై యిట నొక చితిని పేర్పుము.

౫౩-౫౩½. ఓయీ దశరథా? అజ్ఞానముచేతగానిమ్ము, మఱి దేనిచేనైన కానిమ్ము - మాకిట్టి దుఃఖసంప్రాప్తికి నీవ కారణము. కాన నీవును బుత్త్రవియోగము నొంది తద్దుఃఖముచే మరణము నొందెదవుగాత" మని శపించుచు జితిపై నెక్కి దహింపబడి యా మువ్వురును స్వర్గంబునకు బోయిరి.

౫౪. దేవీ! ఆశాపకాల మిప్పుడు సమీపించినది. అమ్మునిశాప మమోఘము

౫౫-౫౬-౫౬½. ఇట్లు చెప్పుచు నాదశరథుడు 'హారామచంద్రమూర్తీ! పతివ్రతాసీతా! హాగుణనిధీ! లక్ష్మణా! మీవియోగంబునం జేసి యిదే నాకు మరణ మాసన్న మైనదనుచు నాకౌసల్యా సుమిత్త్రల యెదుటనే యాతడు మిగుల వాపోవుచుండెను. కౌసల్యా సుమిత్రలు దుఃఖముచే స్మృతి తప్పియుండ నర్ధరాత్రియందు దశరథుడు ప్రాణములబాసెను

౫౭½. ఆరాత్రి గడచిపోగా మఱునాటి యుదయమున బ్రాతఃకాలము నందే వందిమాగధు లాభూమీశుని శయనాగారంబు సొచ్చి యట దీర్చి నిలుచుండిరి.

౫౮½. అంత నాతని శయనమునొద్ద నున్న స్త్రీలు కొందరు పోయి యా మహారాజును మేల్కొలుపం జూచిరి.

౫౯½. వా రందఱును స్వప్నస్థుం డగుమనుజుని ప్రకృతియు జేష్టాసంచలనాదిస్థుండగు వానిప్రకృతియు లెస్సగా నెఱింగినవారు. కాని వారం దఱికి నొక్కమాఱుగ గంపము పుట్టెను. రాజునకు మేన బ్రాణము లున్నవో లేవో యని వారి యనుమానము.

తతః ప్రచుక్రుశు ర్దీనా స్సస్వరం తా వరాంగనాః. ౬౦

తాసా మాక్రందశబ్దేన సహసోద్గతచేతసే,
కౌసల్యాచ సుమిత్రాచ త్యక్తనిద్రే బభూవతుః. ౬౧
హానాథేతి పరిక్రుశ్య పేతతు ర్ధరణీతలే. ౬౧½

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అయోధ్యాకాండే
ద్వాదశ స్సర్గః.

---

త్రయోదశస్సర్గః.

తత స్సర్వా నరేంద్రస్య కైకేయీప్రముఖా స్స్త్రియః,
రుదంత్య శ్శోకసంతప్తా నిపేతు ర్గతచేతనాః. ౧

1కౌసల్యా బాష్పపూర్ణాక్షీ వివిధం శోకకర్శితా,
ఉపగృహ్యా శిరో రాజ్ఞః కైకేయీం ప్రత్యభాషత. ౨

సకామా భవ కైకేయి! భుంక్ష్వ రాజ్య మకంటకం,
విహాయ మాం గతో రామో భర్తాచ స్వర్గతో మమ. ౩
విపథే సార్థహీనేవ నాహం జీవితు ముత్సహే,
*ఇదం శరీర మాలింగ్య ప్రవేక్ష్యామి హుతాశనం. ౪

---

*వ్యా : ఇదమితి:—పతివ్రతా పతివ్రతానాం మృతం

౬౦. ఇట్లాదశరథుని విగతజీవునిగా నెఱింగి వా రంద రొక్కుమ్మడి రోద నము సేయదొడంగిరి.

౬౧-౬౧ ౪. ఈ సద్దు విని యాకౌసల్యా సుమిత్రలకు మెలకువ గల్గి వారును హా నాథా యని దుఃఖించుచు నొక్కపెట్టున భూమిపై దెళ్లిరి.

ఇది శ్రీరామాయణసారోద్ధారంబున నయోధ్యాకాండంబునందు బండ్రెండవ సర్గము.

---

## పదమూడవ సర్గము.

౧. అంత నా భూవిభుని మరణవార్త యిట్లు వ్యాపించుటతోడనే దశరథుని భార్యలు మున్నగు నంతఃపుర స్త్రీ లందఱును దుఃఖము నొందుకొని విగతచేతన లైపోయిరి.

౨. కౌసల్యాదేవియు నెట్టకేలకు దెలివొంది మిగుల దుఃఖించుచు బాష్ప పర్యాకులేక్షణయై యాదశరథమహారాజు శిరమును బట్టుకొని కైకేయి నిటుల బ్రివ్వనాడెను.

3-౪. కైకేయీ! యిప్పుడు నీ కోర్కి నెరవేఱినది. ఇక నీరాజ్యం బంత యు నిరాటంకముగా నీవే యనుభవింపుము. నీ కేమియు నడ్డు లేదు. నా శ్రీరామచంద్రుఁడు నన్ను విడనాడి. యడవికి బోయెను. పూజ్యుడగు నాభర్త స్వర్గముం జేరెను. ఇంక నా కేమిగతి? నాపని చోరగ్రస్తంబగు మార్గమున సార్థవాహులు తోడులేకుండ బోవు పాంథునిపగిది యైనది. ఇక నే జీవించుట కుత్సహింపను. *ఈ నాపతి శరీరము నాలింగనము చేసికొని యగ్నిం బ్రవేశింతును.

---

*వ్యా: సహగమన విషయము:—ఈ శ్లోకమును బట్టి పతివ్రత లగువారు మరణించిన పతిశరీరము నాలింగనము సేసికొని సహగమ

తాం తత స్సంపరిష్వజ్య విలపంతీం తపస్వినీం,

---

పతి మాలింగ్య అనుగమనం ధర్మ ఇత్యవగమ్యతే, తదసంగతం, ఆత్మహత్యారూపానుసరణస్య నిషిద్ధత్వాత్. తథాచ శ్రుతిః, 'తస్మాదుహాన పురాయుషః ప్రేయాత్" ఇతి. ఈశావాస్యేప్యపి "అసూర్యానామ తే లోకా అంధేన తమసా వృతాః, తాంస్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః' ఇతి. తథాచాంగిరసస్మృతిః "యా స్త్రీ బ్రాహ్మణజాతీయా మృతం పతి మనువ్రజేత్, సా స్వర్గ మాత్మఘాతేన నాత్మానం న పతిం నయేత్" ఇతి. వ్యాఘ్రపాదశ్చ "న మ్రియేత సమం భర్త్రా బ్రాహ్మణీ శోకకర్శితా, స బ్రహ్మగతి మాప్నోతి మృగగా దాత్మఘాతినీ" ఇతి. తస్మా దాత్మఘాతానురూపానుసరణం కథం ధర్మో భవేత్? ప్రత్యుత అవస్థానేనైవ స్వర్గాది ఫలావగమే నావస్థానస్యైవ యుక్తత్వాత్. తథాచ పరాశరః "మృతే భర్తరి యా నారీ బ్రహ్మచర్యవ్రతే స్థితా, సా మృతా లభతే స్వర్గం యథా తే బ్రహ్మచారిణః." ఇతి. మనురపి "ఆసీతా ఽఽమరణా త్క్షాంతా నియతా బ్రహ్మచారిణీ, యో ధర్మ ఏకపత్నీనాం కాంక్షంతీ త మనుత్తమం. అనేకాని సహస్రాణి కౌమారబ్రహ్మచారిణాం, దివంగతాని విప్రాణా మకృత్వా కులసంతతిం. మృతే భర్తరి సాధ్వీ స్త్రీ బ్రహ్మచర్యవ్రతే స్థితా, స్వర్గం గచ్ఛత్యపుత్రాపి యథా తే బ్రహ్మచారిణః." ఇతి. ఏవంచ బహుఫల మవస్థానం పరిత్యజ్య ప్రసిద్ధ మనుమరణం కథం కరిష్యామీ త్యుక్తవతీ కౌసల్యా

౫౮. ఇట్లు భర్తశరీరము గౌగిలించుకొని ఘోరముగ నేడ్చుచుండు కాస

---

నము చేయవలెనని తోచుచున్నది. దీనిమీద నీక్రిందివిధమున బూర్వపక్షము చేసి సిద్ధాంతము చెప్పబడును.

(పూర్వపక్షము).

ఆత్మహత్యాసదృశంబగు నిట్టి యనుగమనము సేయరాదు. "ఆయుష్కాలము ముగియకముందు హత్యయొనరించుకొనరాద"ని శ్రుతిప్రమాణమును గలదు. ఈశావాస్యోపనిషత్తునందును "ఆత్మహత్య యొనరించుకొనిన వార లంధకారబంధురములై యుండు ననూర్యనామకనరకంబులకు బోదు" రని చెప్పబడియున్నది. అంగిరసస్మృతియందును "ఏ బ్రాహ్మణస్త్రీయైనను బతిమరణానంతర మాత్మహత్య యొనర్చికొని సహగమనం బొనర్చినచో నామెకు సద్గతులు లేవు సరిగదా పతికి కూడ గలుగ" వని చెప్పబడినది. వ్యాఘ్రపాదులును నట్లే "బ్రాహ్మణస్త్రీ పతిమరణానంతరము సహగమనము సేయరాదు. అట్లొనర్చినచో నామె కాత్మహత్యాదోషం బంటి సద్గతులును గలుగక పోవు" నని చెప్పెను. కావున నాయాప్రమాణంబులం జేసి యాత్మహత్యారూపసహగమనమే చేయరాదనియు నట్లు చేయకపోయినను ధర్మమే యనియు పర్యవసితంబగుచున్నది. ఇంతియకాదు భర్తృమరణానంతరము జీవించియుంటయే యెక్కుడు ఫలప్రదం బని యీక్రింది ప్రమాణంబుల చేత తెలియ గాగలదు. పరాశరస్మృతి "భర్త మరణించిన యనంతర మే స్త్రీ బ్రహ్మచర్యవ్రతమం దుండునో యామె మరణించి, బ్రహ్మచర్యవ్రతనిష్ఠ లగువారు స్వర్గమును బొందినట్లు తానును నుత్తమగతు లందును." ఇట్లే మనుస్మృతి "భర్త చనిపోయినను నాతనితో సహగమన మొనరింపక స్త్రీ నియతురాలై బ్రహ్మచారిణియై యుండవలెను. ఏకపత్నీవ్రతులగువార లనుష్ఠించు నయ్యుత్తమోత్తమ ధర్మమే యామెయు నేమఱకుండవలెను. వివాహం బాడకపోయినను బ్రహ్మచర్యనిష్ఠులగు విప్రు లెందఱో యుత్తమస్వర్గము నందిరి.

వ్యపనీయ సుదుఃఖార్తాం కౌసల్యాం వ్యావహారికాః. ౫

చేన్న, నియతతయాఽవస్థానే ఫలావగమాత్; అనుగమనేఽపి వైధవ్యావస్థాననిందాపూర్వకం బహుఫలప్రతిపాదనాత్. తథా చ సంగ్రహే "జీవహీనో యథా దేహః క్షణా దశుచితాం వ్రజేత్, భర్తృహీనా తథా యోషిత్సుస్నాతా ప్యశుచి స్సదా. అమంగళేభ్య స్సర్వేభ్యో విధవా హ్యత్యమంగళం, విధవాదర్శనా త్సిద్ధిః క్వాపి జాతు న జాయతే. విహాయ మాతరం చైకాం సర్వమంగళవర్జితాం, తదాశిష మపి ప్రాజ్ఞ స్త్యజే దాశీవిషోపమాం. కన్యావివాహసమయే వాచయేయు రితి ద్విజాః. భర్తు స్సహచరీ భార్యా జీవతోఽజీవతోఽపి వా, భర్త్రా సహానుయాతవ్యా దేహావస్థా యయా సదా. చంద్రమా జ్యోత్స్నయా తద్వద్విద్యుత్వా న్విద్యుతా యథా, అనువ్రజంతి భర్తారం గృహాత్పితృవనం ముదా, పదే పదేఽశ్వమేధస్య ఫలం ప్రాప్నోత్యసంశయం. యమదూతాః పలాయంతే సతీ మాలోక్య దూరతః, అపి దుష్కృతకర్మాణం సముత్సృజ్యాచ తత్పతిం. న తథా బిభిమో వహ్నే ర్నతథా విద్యుతో యథా, ఆపతంతీం సమాలోక్య వయం త్రస్తాః పతివ్రతాం. తపన స్తపతేఽత్యంతం దహనోపి చ దహ్యతే. కంపంతే సర్వతేజాంసి దృష్ట్వా పాతివ్రతం మహః. యావత్స్వలోమసంఖ్యాఽస్తి తావత్కోట్యయుతానిచ, భర్త్రా స్వర్గసుఖం భుంక్తే రమమాణా పతివ్రతా." ఇతి. శంఖో

ల్యను వ్యావహారికులు సాంత్వనవచనంబులచే సమాధానపఱిచి,

---

అట్లే భర్తృమరణానంతరము స్త్రీ బ్రహ్మచారిణియై యుండినచో నామె యపుత్రకురాలైనను, బ్రహ్మచర్యవ్రతనిష్ఠులగువారు తమ స్వర్గము లందినట్లే యామెకును నుత్తమగతులు కలుగును." ఇట్లుగ భర్తతో సహగమనము సేయరాదనియు, జీవించియుండుటే శ్రేయస్కరం బనియు జెప్పు ప్రమాణంబులు కుప్పతెప్పలుగ నుండ సహగమనము సేతునని కౌసల్య యెట్లు పలికె నని యాక్షేపణ సేయరాదు.

(ఇక సిద్ధాంతము.)

ధర్మశాస్త్రము మహాసూక్ష్మము. ఏలయన నియతురాలై యుండినను ఫల మున్న దనియును, నట్లు విధవయై నిందాపూర్వక జీవనము గడుపుటకంటె సహగమనము సేయుటలోను బహుళఫలం బున్న దనియును పై వచనముల భావము. దీని కనుగుణంబుగ నీ క్రింది వచనములును జెప్పబడెను. "జీవముల బాసినదేహము క్షణములో నపరిశుద్ధం బైనట్టుల భర్తృహీనయగు స్త్రీ తా నెంత శుచిగా నున్నను శుచిగా బరిగణింపబడదు. సర్వామంగళంబులందును నామె యమంగళతమ. ఆమెను జూచినచో నేకార్యమును ఫలసిద్ధినొందదు. *** విధవయగు తల్లియిచ్చిన యాశీర్వచనంబును దప్ప దదితరుల యాశీర్వచనమును సైతము సర్పమునుబోలె దూరముగా ద్యజింపవలెను. జీవించియున్నను మరణించినను గూడ పతినే పతివ్రత యనుసరింపవలెను. ఇట్లే వివాహకాలంబునను బ్రాహ్మణులు సేయింతురు. మేఘుని తటిల్లత యనుసరించినట్లును జంద్రుని వెన్నెల యనుసరించినట్లును సాధ్వి యెల్లపుడును భర్తతోడిదే లోకమని యుండవలెను.* భర్త మరణింపగా నే స్త్రీ యాతనితో సహగమనము సేయుటకై శ్మశానమునకు బోవునో యట్లు పోవునప్పుడామె యొక్కొక్క పాదవిన్యాసమున కొక్కొక్క యశ్వమేధఫలంబు గల్గును. సహగమనము సేయబోవు పతివ్రత నాలోకించి, యామెపతి యెంత దుష్టుడై

తైలద్రోణ్యా మథామాత్యా స్సంవేశ్య జగతీపతిం,

---

"మృతే భర్తరి యా నారీ సమారోహే ద్ధుతాశనం, సాఽరుంధతీ సమాచారా స్స్వర్గే లోకే మహీయతే." పరాశరోఽపి "తిస్రః కోట్యోఽర్ధకోటీశ్చ యాని రోమాణి మానుషే, తావదబ్ద సహస్రాణి స్వర్గలోకే మహీయతే" ఇతి. వ్యాసోఽపి "యది ప్రవిష్టో నరకం పతిః పాపై స్సుదారుణైః, సంప్రాప్తో యాతనాస్థానం గృహీతో యమకింకరైః, తిష్ఠతో హ్యవశో దీనో వేష్టమాన స్స్వకర్మభిః, వ్యాళగ్రాహీ యథా వ్యాళం బలా ద్గృహ్ణా త్యశంకితః, తద్వద్భర్తార మాదాయ దివం యాతి చ సా బలాత్. యా భర్తృపరమా నిత్యం స్తూయమానాఽప్సరోగణైః, క్రీడతే పతినా సార్ధం యావ దింద్రా శ్చతుర్దశ. బ్రహ్మఘ్నో వా కృతఘ్నో వా మిత్రఘ్నో వా భవే త్పతిః, పునా త్యవిధవా నారీ త మాదాయ మృతం తు యా" ఇతి. ఏవంచ ఉదాహృత శాస్త్రబలా ద్భర్త్రా సహానుగమనం ధర్మ ఏవ, తథైవాచారోఽపి పతివ్రతానాం, యథా విష్ణుపురాణే "రేవతీ చైవ రామస్య దేహ మాశ్లిష్య సత్తమ, వివేశ జ్వలితం వహ్నిం తత్సంగాహ్లాదశీతలం." ఇతి. తత్రైవ స్థలాంతరే జనక తనయ మాలింగ్య కాశిరాజతనయాఽనుమరణం కృతవతీతి ప్రతిపాదితం. "తత శ్చితాస్థం భూయోఽపి భర్తారం సా శుభేక్షణా, అన్వారురోహ విధివ ద్యథాపూర్వం ముదా పతిం, తతోఽవాప తయా సార్ధం రాజపుత్ర్యా స పార్థివః, ఇంద్రా నతీత్య వై లోకా ల్లోకా న్కామదుహోఽక్షయాన్, స్వర్గత్వ

యామెను దోలగంగొనిపోయి యాదశరథుని శవము నొకగొప్ప తైలపాత్రంబులో నుంచిరి. తరువాతను కౌసల్యాదులు మున్నగు

---

వను నాతనింగూడ విడిచిపెచి యమదూతలు పలాయనము గావలసి వదే. "ఛగఛగమండు మహాగ్నికైనను వెఱువము. ఘూరిధ్వనిసమన్వితంబగు నశనిపాతంబునకును నంత వెఱువము. భర్తృచితానధిరోహించు పతివ్రతామతల్లిం గాంచుటతోడనే యుద్విగ్నహృదయుల మగుదుము" మని యమదూతలు భయంపడుదురు. ఆ పతివ్రతామతల్లి సహగమనంబు సేయుపట్టున సర్వలోకములను దీపింపజేయు సూర్యునకు దాపము గలుగు. సర్వసందాహకుం డగు నగ్ని దహింపబడును. సర్వతేజంబులు నీమె తేజముక్రింద వెలవెల బోవును. ఏ సతీమతల్లి హృదయపూర్వకంబుగ భర్త్రనుగమనంబు సేయునో యామె రోమసంఖ్యాపరిమితంబు లగు నన్నికోట్ల సంవత్సరము లామె భర్తతో స్వర్గసుఖంబులు బొందును. శంఖుడును "భర్త మరణింపగనే యే స్త్రీ యనుగమనంబు సేయునో యామె స్వర్గసుఖంబు లందును." పరాశరుడును "భర్త్రనుగమనంబు జేసినచో మానుష రోమంబు లెన్నియుండునో యన్ని సహస్రవర్షంబులు స్వర్గసుఖంబులు గలుగును." వ్యాసుండును "బ్రహ్మహత్యాది మహాపాపంబులొనర్చి, మరణించి యమకింకరులచే యాతనాస్థానమునకు గొంపోబడి దీనుడై యవశుడై స్వకర్మఫలం బనుభవించుటకు సిద్ధముగ నున్నను, నతనిభార్య సహగమనంబు చేసినచో, సర్పగ్రాహకుడు సర్పంబును గొనివచ్చునట్లా నాపతివ్రతయు దనభర్తను స్వర్గమునకు గొంపోవును. ***ఏమహాసాధ్వి తనభర్తతో సహగమనము సేయునో యామెయు నామె పతియునుగూడ బదునాలు గింద్ర మన్వంతరములు స్వర్గసుఖంబులందుదురు. బ్రహ్మఘ్నుండైనను కృతఘ్నుండైనను నాతనితో ననుగమనము చేసి భార్య యాతనిని బునీతుని జేయును."

కాన నీ పై జెప్పబడిన ప్రమాణంబులంజేసి సహగమనంబు సేయుట ధర్మమేయని స్థిరపడుచున్నది. ఇట్లు మహాపతివ్రతలగువారు సామాన్యముగ ననుగమనము సేయుచుండిరనియు విష్ణుపురాణము

రాజ్ఞ స్సర్వా ణ్యథాదిష్టా శ్చక్రుః కర్మా ణ్యనంతరం. ౬

---

యజ్ఞ్య మతులం దానవత్య మతిదుర్లభం, ప్రాప్తం పుణ్య ఫలం ప్రాప్యం సశుద్ధిం తాం ద్విజోత్తమ." మౌసలపర్వ ణ్యపి "శ్వో భూతేతు తత శ్శౌరి ర్వసుదేవః ప్రతాపవాన్, త్యక్త్వాత్మానం మహాతేజా జగామ గతి ముత్తమం, తం దేవకీచ భద్రాచ రోహిణీ మదిరా తథా, అన్వారోహంత చ తథా భర్తారం యోషితాంవరాః." ఇతి. యదుక్తం ప్రాక్ తచ్ఛ్రుతివిరోధ ఇతిచే న్న, ఆత్మహత్యాపరాయాః శ్రుతే ర్విహితానుమరణవ్యతిరిక్తాత్మహింసావిషయత్వాత్. అన్యథా "సితాసితే సరితే యత్ర సంగతే" ఇత్యాదిశ్రుతి విహితదేహత్యాగోపి న స్యాత్, "యే యుధ్యంతే ప్రధనేషు శూరాసః" ఇతి శ్రుతివిహితశరీరపరిత్యాగోపి యుద్ధే న స్యాత్. తథా వైదికపశ్వాలంభనమపి న స్యాత్, తస్యా హింసాత్వాత్, ప్రయాగమరణాదికంచానుపపన్నమితి, తథా స్మృతేపి తుల్య మితి. యదపిచోక్తం యా స్త్రీ బ్రాహ్మణజాతీయేత్యాదిస్మృతివిరోధ ఇతి తన్న, తస్యాః శృంగే బ్రాహ్మణీ పృథక్చితి మారుహ్య న గచ్ఛే దిత్యే తత్పరత్వాత్. తథాచ బ్రహ్మవైవర్తకే 'పృథక్చితిం సమారుహ్య న విప్రా గంతు మర్హతి." ఇతి. తస్మా దనుగమనావస్థాయా ముభయో రపి వికల్ప ఏవ. అత ఏవ ఉభయవిధా

వారి నోదార్చుటాదిగాఁగల కార్యకలాప మంతయు బెద్దలు చెప్పిన చొప్పున జేసిరి.

---

నందలి యీ క్రింది సందర్భముల బరికించినచో దేటపడగలదు. "బలరాముఁడు నిర్యాణము పొందగా నాతనిశరీర మాలింగనము చేసి కొని యాతని ధర్మపత్నియగు రేవతీదేవి సహగమనముచేసెను." ఆ పురాణమునందే స్థలాంతరమున "జనకతనయుండు మరణింపగా నాతని ధర్మపత్నియగు కాశిరాజతనయ యాశరీర మాలింగనముచేసి కొని యాతనిసెజ్జ పైకెక్కినట్లుగనే కడుముదంబున నాతని చితిపై కెక్కెను. ఇట్లొనరించుటచే పాపక్షయకారకంబును నతిదుర్లభం బునగు దాంపత్యసుఖంబును, నింద్రాది లోకాతీత పుణ్యలోక సుఖంబులును నామెకు గల్గెను. మౌసలపర్వమునందును "ప్రతాప ఖనియగు వసుదేవుండును నిదేహమును జాలించి యుత్తమగతి గాంచెను. ఆతని పత్నులగు దేవకీ రోహిణీ భద్రాదులును నాతని తోడనే చితి నధిరోహించి" రని చెప్పబడెను.

కాని యీపై జెప్పబడిన ప్రమాణంబు లన్నియు నాత్మహత్య గావించుకొనరాదని చెప్పు శ్రుతికి విరోధం బని యనుకొనరాదు. అయ్యది విహితంబగు ననుమరణముకంటె వ్యతిరిక్తంబగు నాత్మ హత్యానిషిద్ధపరమేకాని మఱియొండుగాదు. అట్లుగానిచో 'సితా సితే' యిత్యాదిశ్రుత్యుక్తంబగు దేహత్యాగంబును హింసాత్మకం బగును. యుద్ధముల ఘోరంబుగ బోరుసలిపి మరణించునాతనికి వీరస్వర్గ ము గల్గునని చెప్పు శ్రుతివిహితమరణంబును, యజ్ఞముల బశ్వాలంభనం బును బ్రయాగమరణాదికంబునుగూడహింసాత్మకములే కావలసివచ్చు ను. అట్లే యాంగిరసస్మృతికి నిది విరోధము కాజాలదు. ఆంగిరసస్మృతి చెప్పునదియుగూడ భర్తృమరణానంతరము భార్య వేఱొక చితిపై నెక్కి యనుమరణము పొందరాదనియేకాని వేఱొండుకాదు. దీని కనుగుణంబుగనే బ్రహ్మవైవర్తపురాణమునందు బ్రాహ్మణస్త్రీలు పృథక్చితి నెక్కి సహగమనము చేయరాదని తెలుపబడినది

చారోపి పతివ్రతానాం యథాచాదిపర్వణి "అహం జ్యేష్ఠా ధర్మపత్నీ జ్యేష్ఠధర్మఫలం మమ, అవశ్యం భావినో భావా న్మా మాం మాద్రీం నివర్తయ, అన్వేష్యా మిహా భర్తార మహం ప్రేతవశం గతా" ఇతి వదంతీం కుంతీం "దారకే ష్వప్రమత్తా చ భవేథాశ్చ హితా మమ, అతోన్యం న ప్రపశ్యామి సందేష్టవ్యం న కించన, ఇత్యుక్త్వా తం చితాగ్నిస్థం ధర్మపత్నీ నరర్షభ, మద్రరాజసుతా తూర్ణ మన్వారోహ ద్యశస్వినీ" ఇతి కుంత్యా అవస్థానం మాద్ర్యాః సహగమనంచ ప్రతిపాదితం, తథాచ మౌసలేపి "ఇంద్ర ప్రస్థే దదౌ రాజ్యం వజ్రాయ పరవీరహా, వజ్రేణా క్రూరదారా స్తు వార్యమాణాః ప్రవవ్రజుః, రుక్మిణీ త్వథ గాంధారీ శైబ్యా హైమవతీత్యపి, దేవీ జాంబవతీ చైవ వివిశు ర్జాతవేదసం, సత్యభామా తథైవాన్యా దేవ్యః కృష్ణస్య సమ్మతాః, వనం ప్రవివిశూ రాజం స్తాపస్యే ధృతనిశ్చ యాః" ఇతి. ఏవ మితిహాసపురాణేషు పతివ్రతాభి రనుగమ నం కృతం అవస్థితం చ ఇతి ప్రతిపాదనేన ఉభయవిధశాస్త్ర నురోధేనచ ఉభయ మపి ధర్మం తుల్యకల్పంచ తుల్యఫల త్వాత్, తుల్యఫలత్వం ; బ్రహ్మచర్యేణ వ్యవస్థితాయాః, త స్మాత్ కౌసల్యో క్త మనుగమనం నానుపపన్నం; అతఏవావస్థాన స్యాపి శాస్త్రీయత్వాత్ కౌసల్యాఽనుగమన మకృత్వా స్థితే

(అట్లయినకౌసల్యాదులు సహగమన మేల చేయకుండి రని శంకిం చుకొని సమాధానము చెప్పబడుచున్నది.)

ఇట్లుగ సహగమనము సేయుటకును సేయకుండ నుండుటకును గూడ బ్రమాణము లనేకము లున్నవి. కాన నీరెంటిలో నేదియైనను జేయ వచ్చుననియు నీరెండాచారములును ననాదిసిద్ధములే యనియు నెఱుం గునది. కనుక నే పాండుమహారాజు చనిపోయినపుడు మాద్రీదేవి యొక్కరుక మాత్రమే సహగమనము చేసి కుంతీదేవి చేయలేదనునది ప్రసిద్ధవిషయమేకదా! ఈ విషయ మాదిపర్వమునం దిట్లు సెప్పబడి నది. "నేను (కుంతీదేవి) రాజునకు ధర్మపత్నినైయుంటిని. అందును జ్యేష్ఠురాలనుగాన నాకు జ్యేష్ఠధర్మఫలమే రావలెను. అందులకై సహగమనముసేయబోవుచుంటిని, నన్నెవరును వారింపవలదు. మాద్రీ దేవినిమాత్రము వారింపుడు." అని కుంతీదేవి చెప్పుచుండగ నామెను వారించి మాద్రి "దేవీ! నీవుకాదు సహగమనము చేయవలసినది. నీ వెల్లపుడు భర్తృవిషయంబున గడు జాగరూకతమై మెలంగితివి. నన్ను జూచి మన్మథవశుడై మనభర్త యీమరణమును గొనితెచ్చు కొనెను. కాన భర్తృఘాతిని నగు నాకు సహగమనముకంటె వేఱు తరణోపాయము గానరాదు. నన్నే సహగమనము సేయనిమ్ము"ని చెప్పుచు మాద్రి యనుగమనము చేసెను, కుంతీదేవి యట్లొనరింపలేదు. కదా. ఇట్లే మౌసలపర్వమునందు "పరంతపుడగు నాత డింద్రప్ర స్థంబున వజ్రునకు రాజ్యం బంతయు నిచ్చెను. అవ్వజ్రునిచే వారింప బడి యక్రూరునిభార్య లందఱు వనంబుకు బోయిరి. శ్రీకృష్ణుని భార్య లగు రుక్మిణీజాంబవతీశైబ్యాదులుమాత్ర మగ్నింజొచ్చిరి సత్య భామాది దేవేరులు కొందఱు శ్రీకృష్ణుని సమ్మతినొంది దృఢనిశ్చ యులై వనంబునకు బోయి తపస్వినులైరి." అని చెప్పబడినది.

ఇట్లుగ బురాణేతిహాసములందు బతివ్రతలు భర్తతో సహగమ నము చేసినట్లును భర్తృమరణానంతరము నియతురాండ్రై జీవించి యున్నట్లును జెప్పబడుటచే రెండునుగూడ నాచరణీయములే యనియు రెంటికి సమానఫలమే యున్నదనియు దెలియవలెను. కాన కౌసల్యా

*నతు సంకలనం రాజ్ఞో వినాపుత్త్రేణ మంత్రిణః,
స్వాజ్ఞాః కర్తు మీషు స్తేతతో రక్షంతి భూమిపం. ౭

గతే తు శోకా త్త్రిదివం నరాధిపే మహీతలస్థాసు నృపాంగ
నాసుచ, నివృత్తచార స్సహసా గతో రవిః ప్రవృత్తచారా
రజనీ హ్యుపస్థితా. ౮

వ్యతీతాయాంతు శర్వర్యా మాదిత్యస్యోదయే తతః,
సమేత్య రాజకర్తార స్సభా మీయు ర్ద్విజాతయః.

---

త్యేత దప్యుపపన్న మేవ. తతో గతచేతనం రాజాన మాలింగ్య పరిదేవమానాం కౌసల్యాం వివిధసాంత్వనశతైః కథంచి దపనీయు ర్వ్యావహారికా ఇతి వక్ష్యతి.

*వ్యా: నన్వితి:— అనేనాఽఽహితాగ్ని సంస్కార ... మృతశరీరం తైలద్రోణ్యాం వినిక్షిప్య రక్షణీయ మితి ...చితం. తథా చాపస్తంబః “సూ:— ఆహితాగ్నిం జనో ...తం తైలద్రోణ్యా మవధాయ శకటేన హరంతి” ఇతి. నపుత్త్రస్య పుత్త్రేణవినా అన్యేన సంకలనం న కారయి ...మితిసూచితం. తథాచ స్మృత్యంతరే “పుత్త్రేషు విద్య ...షు నాన్యేవై కారయేత్స్వధాం, పుత్త్రాన్విహింసితా ...స్త్వేవం కురుతే నరః.”

---

రా: స్గ ౬౭.

౩. * దశరథుని పుత్త్రు లేరును దగ్గఱ లేనందున మంత్త్రు లాతని దహనసంస్కారము సేయక యాతనిశవమును భద్రముగా గాపాడుచుండిరి.

౪. ఇట్లుగ నాదశరథమహారాజు పుత్త్రశోకార్తుడై మరణించుటచే యాతనిపత్నులందరును భూమిపైబడి రోదనము సేయుచుండుట గాంచి యదిచూడలేకయో యనునట్లు రవి యస్తమించెను. రాత్త్రియు బ్రవేశింపజొచ్చెను.

౫. ఇట్లారాత్త్రి గడచిపోయి సూర్యోదయము కాగానే రాజకార్య నిర్వాహకులగు ద్విజాతు లందఱును వచ్చి యాసభ నలంకరించిరి.

---

భర్తతోగూడ సహగమన మొనరింతునని యనుటలోగాని యట్లు సహగమనము చేయకుండ జీవించియుండుటలోగాని దోసములేదు. కనుకనే గతచేతనుండగు దశరథు నాలింగనము చేసికొన పరితపించుచున్న కౌసల్య నటనుండి సాంత్వనవచనంబులచే వ్యావహారికులు కొంపోయిరని ముందు శ్లోకంబుల జెప్పబడుచున్నది.

* వ్యా: దహనసంస్కారవిషయము.— అహితాగ్నిసంస్కార విలంబన మైనప్పుడు శవమును తైలద్రోణియందుంచి రక్షించుచుండవలె నని యీ శ్లోకంబున సూచింపబడుచున్నది. ఇట్లే యాపస్తంబులును జెప్పిరి. అట్లుగ కుమారు లెవ్వరును సమీపమున లేనప్పుడు మరణము సంభవించినచో సంకలనకార్యము సేయరాదనియును గూడ నిందే సూచింపబడుచున్నది. ఈ విషయమే స్మృత్యంతరమందును గలదు. "పుత్త్రు లుండగ మఱెవ్వడును సంకలనము సేయరాదు. అట్లు చేసిన వాడా పుత్త్రకుల హింసించినవాడగును గాన నది శ్రేయము కాదు."

మార్కండేయోఽథ మౌద్గల్యో వామదేవశ్చ కాశ్యపః,
కాత్యాయనో గౌతమశ్చ జాబాలిశ్చ మహాయశాః. ౧౦
ఏతే ద్విజాః సహామాత్యైః పృథగ్వాచ ముదీరయన్,
వసిష్ఠమేవాభిముఖా శ్శ్రేష్ఠం రాజపురోహితం. ౧౧

స్వర్గతశ్చ మహారాజో రామశ్చారణ్యమాశ్రితః,
లక్ష్మణశ్చాపి తేజస్వీ రామేణైవ గతస్సహ. ౧౨
ఉభౌ భరతశత్రుఘ్నౌ కేకయేషు పరంతపౌ,
పురే రాజగృహే రమ్యే మాతామహనివేశనే. ౧౩

ఇక్ష్వాకూణామిహాద్యైవ కశ్చిద్రాజా విధీయతాం,
అరాజకం హి నో రాష్ట్రం న వినాశమవాప్నుయాత్. ౧౪

నారాజకే పితుః పుత్రో భార్యా వా వర్తతే వశే,
నారాజకే జనపదే వణిజో దూరగామినః. ౧౫
గచ్ఛంతి క్షేమమధ్వానం బహుపణ్యసమాచితాః. ౧౫½

నారాజకే జనపదే నరాశ్శస్త్రవిశారదాః,
సంపదంతోఽవతిష్ఠంతే వనేషూపవనేషు చ. ౧౬

౧౦-౧౧. మార్కండేయుడు మౌద్గల్యుడు వామదేవుడు కాశ్యపుడు కాత్యాయనుడు గౌతముడు జాబాలి మున్నగు మహర్షి పుంగవులమాత్యులతో గూడి యరుదెంచి రాజపురోహితుం డగు వసిష్ఠ మహర్షిం జూచి యిట్లనిరి.

౧౨-౧౩. అయ్యా, మహర్షీ! దశరథమహారాజు స్వర్గము నలంకరించెను. రామలక్ష్మణు లిద్దరును వనవాసంబు సేయబోయిరి. భరతశత్రుఘ్ను లిద్దఱును మాతామహుం డగు కేకయరాజునొద్ద నుండిపోయిరి.

౧౪. కావున నిప్పట్టున మనలను గాపాడుటకు రాజు లేడు. ఇక్ష్వాకులలో నొకరి నిప్పుడు రాజుగా విధించితీరవలయును. లేకున్న నరాజకం బగు మన రాజ్యము నాశమొందును.

౧౫-౧౬. అరాజకంబగు రాజ్యంబున బుత్త్రుడు తండ్రియాజ్ఞలో నుండడు. భార్య భర్తయాజ్ఞలో నుండదు. అరాజకంబగు రాజ్యంబున వణిజులు తమతమ వ్యాపారములను నిర్భయముగా జేసికొనజాలరు. చోరాదిభయగ్రస్తులగుట బ్రయాణము సేయజాలరు. ఒకచో నట్లు పోయినను దమతమ వస్తుజాలమును సేమముగా జేర్చుకొనజాలరు.

౧౭. అరాజకంబగు రాజ్యంబున నానాశాస్త్రవిశారదు లగు పండితులు వనోపవనములందు దమ శిష్యులకు శాస్త్రములు సెప్పుచు హాయిగా జీవయాత్రను గడుపజాలరు.

*రాజా సత్యంచ ధర్మశ్చ రాజా కులవతాం కులం,
రాజా మాతా పితాచైవ రాజా హితకరో నృణాం. ౧౭½

తేషాం తద్వచనం శ్రుత్వా వసిష్ఠో వాక్యమబ్రవీత్,
ఏహి సిద్ధార్థ విజయ జయంతా శోకనందన! ౧౮½
[1]గచ్ఛత త్వరితం సాశ్వా యుధాజిన్నగరం ప్రతి,
తత్రాస్తే భరత శ్శ్రీమాన్ శత్రుఘ్నసహితః ప్రభుః. ౧౯½
ఉచ్యతాం భరత శ్శీఘ్ర మాగచ్ఛేతి మమాజ్ఞయా. ౨౦
[2]మా చాస్మై ప్రోషితం రామం మా చాస్మై పితరం మృతం,
భవంత శ్శంసిషు ర్గత్వా రాఘవాణా మిమం క్షయం. ౨౧

వసిష్ఠేనాభ్యనుజ్ఞాతా దూతా స్సంత్వరితా యయుః,
తే శ్రాంతవాహనా దూతా వికృష్టేన పథా తతః, ౨౨

*వ్యా : రాజా సత్యంచేతి :— అనేన లౌకిక వైదిక వ్యవహారాఖ్యావస్థాసిద్ధ్యర్థం ప్రజాభీ రాజా అవశ్యకర్తవ్య ఇత్యుక్తం. తథాచ మనుః "అరాజకే జనపదే సర్వతో విద్రుతే భయాత్, రక్షార్థ మస్య సర్వస్య రాజాన మసృజత్ప్రభుః" ఇతి.

1 వాల్మీ రా: సర్గ ౬౮.

౧౬. *సత్యధర్మములను గాపాడువాడు నిజముగా రాజై యున్నాడు. కులీనులగువారి కులాచారంబులను గాపాడువాడు రాజైయున్నాడు. అతడు ప్రజలకు దల్లియు దండ్రియునై హితము సేయువాడుగ నున్నాడు.

౧౭. ఈమాటలు వినుటతోడనే వసిష్ఠుడు సిద్ధార్థుడు విజయుడు జయంతుడు అశోకనందనుడు మున్నగు దూతల బిలిచి యిట్లనెను.

౧౮-౨౦. ఓయీ దూతలారా! మీ రందఱును వడ్వారూఢులై యుధాజిన్నగరమునకు శీఘ్రముగా బోయి యట నున్న భరతశత్రుఘ్నులతో వాయాజ్ఞగా జెప్పి శీఘ్రముగా నిక్కడకు దోడ్కొనిరండు.

౨౧. కాని శ్రీరాముం డరణ్యంబునకు బోయినట్లుకాని దశరథుడు మరణము నొందినట్లుకాని - రాఘవుల కిట్టి దురవస్థ వాటిల్లినట్లు నేరతోడను జెప్పవలదు.

౨౨-౨౫. ఇట్లు ఋషికుల సమాశ్రిటుచే వాజ్ఞాపింపబడి యాదూతలందఱు సత్వరనుగా బోయి తమతమ వాహనము లలసి పోయి

---

*వ్యా: రాజు సత్యధర్మము లనుచోట:— ఇట్లు చెప్పుటచే లౌకిక వైదిక వ్యవహారములను నడుపుటకు రాజొక డవశ్య ముండి తీరవలయునని యేర్పడుచున్నది. ఇట్లే మనుస్మృతియందును "అరాజకంబగు దేశమునం దెల్లెడలను దీరని భయ ముండును. కాన నట్టి చోరాది-భయములు లేకుండజేసి ప్రజలను గాపాడుటకై రాజు సృష్టింపబడెను." అని చెప్పబడెను.

*గిరివ్రజం పురవరం శీఘ్ర మాసేదు రంజసా. ౨౨

1♦ యామేన రాత్రిం తే దూతాః ప్రవిశంతిస్మ తాం పురీం,
భరతేనాపి తాం రాత్రిం స్వప్నో దృష్టోఽయ మప్రియః. ౨౩
2 భరతే బ్రువతి స్వప్నం దూతా స్తే క్లాంతవాహనాః,
ప్రవిశ్యాఽసహ్యపరిఘం రమ్యం రాజగృహం పురం. ౨౪
రాజ్ఞః పాదౌ గృహీత్వాతు త మూచు ర్భరతం వచః. ౨౫

పురోహిత స్త్వాం కుశలం ప్రాహ సర్వేచ మంత్రిణః,
త్వరమాణశ్చ నిర్యాహి కృత్య మాత్యయికం త్వయా. ౨౬

---

*గిరివ్రజపత్తనంనామ మగధదేశస్థపత్తనవిశేషః. సఏవ భారతకాలే జరాసంధపురీ. తత్పరితః గోరథ ఋషభ వైహారిక చైత్రకాఖ్యాః పర్వతా స్తిష్ఠంతి. సఏవ 'బీరారు' అంతర్గత రాజగిరిః. (Rajgiri in Behar the ancient capital of Magadha)

♦వ్యా:— యామేవేతి: అత్రాహ స్వప్నాధ్యాయే బృహస్పతిః "అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి స్వప్నపుణ్యఫలం ధ్రువం, వాతకం పిత్తకం చైవ చింతితం చాదు వర్జయేత్, అతిదీర్ఘం దివా దృష్ట్వా స్వప్నం తం పరివర్జయేత్" ఇత్యాది.

---

1 వాల్మీ. రా: సర్గ ౬౮; 2 వాల్మీ. రా: సర్గ. ౭౦

నను గూడ నాకేకయరాజురాజధాని యగు *గిరివ్రజపట్టనమును శీఘ్రముగా జేరిరి.

౨౩. ఇట్లు దూతలు పోయి గిరివ్రజపట్టనమును జేరిన యా పూర్వపు రాత్రియే భరతు డొకమహాభయంకరస్వప్నమును † గాంచెను.

౨౪-౨౭. ఆతడు గన స్వప్నవృత్తాంతము నచటివారలకు దెల్పుచుండ బరిశ్రాంతవాహనులగు సిద్ధార్థాదిదూత లగడ్తను దాటి రాజభవనములోని కేగి యా భరతునిపాదములపై బడి యాతనితో నిట్లు విన్నవించుకొనిరి.

౨౮. ప్రభూ! తమ మంత్రిసత్తము లందఱును, దమ పురోహితుండగు వసిష్ఠుండును మీ క్షేమం బడిగిరి. తా మొక యవశ్యకార్యమును జేయవలసియున్నారు. అందులకై శీఘ్రముగా నయోధ్యకు బయనమై రావలయును.

---

* వ్యా: గిరివ్రజపట్టనము:— ఇది మగధదేశమున నున్న యొక పట్టన విశేషము. భారతకాలమున 'జరాసంధపురి' యని వ్యవహరింప బడెను. ఇదియే యిప్పుడు బీహారురాష్ట్రమున నున్న రాజగిరిపట్టనమై యున్నది. ఈ పట్టమునుజుట్టి గోరథము, ఋషభము, వైహారకము చైత్రకము నను పర్వతములు గలవు. చైత్రకాద్రిశృంగమున భేరులు గలవు. శత్రులు వచ్చునప్పు డవి తమంతట మ్రోగునట.

† వ్యా: స్వప్నవిషయము:— బృహస్పతిచే స్వప్నాధ్యాయమం దిట్లు చెప్పబడినది. "వాతపిత్తంబులు ప్రకోపించుటచే నైన స్వప్నంబులు ఫలంబుల నీయజాలవు. అట్లే పట్టపగలు గలిగిన యే *దీర్ఘ స్వప్నంబునకును ఫలిత ముండజాలదు. తక్కుంగలవి ఫల మిచ్చును."

స మాతామహ మాపృచ్ఛ్య మాతులంచ యుధాజితం,
రథ మారుహ్య భరత శ్శత్రుఘ్నసహితో యయౌ. ౨౭

[1]వసంచ సమతీత్యాశు శర్వర్యా మరుణోదయే,
అయోధ్యాం మనునా రాజ్ఞా నిర్మితాం సందదర్శహ. ౨౮

తాం పురీం పురుషవ్యాఘ్ర స్సప్తరాత్రోషితః పథి. ౨౮½

*అయోధ్యా మగ్రతో దృష్ట్వా సారథిం వాక్య మబ్రవీత్. ౨౯

అరణ్యాభూతేవ పురీ సారథే! ప్రతిభాతి మే,
నిమిత్తా న్యమనోజ్ఞాని తేన సీదతి మే మనః. ౩౦
శ్రుతా నో యాదృశాః పూర్వం నృపతీనాం వినాశనే,
ఆకారాం స్తానహం సర్వా నిహ పశ్యామి సారథే! ౩౧

ఇత్యేవ ముక్త్వా భరత స్సూతం తం దీనమానసః,
తా న్యనిష్టా న్యయోధ్యాయాం ప్రేక్ష్య రాజగృహం యయౌ. ౩౨

---

*అయోధ్యానామ సరయూతీరస్థా కోసలదేశస్య రాజధానీ. సా ఇదానీం 'ఔఢ్' ఇత్యుచ్యతే. (Oudh the birth place of Rama.)

---

1. వాల్మీ రా: సర్గ ౭౧.

౨౭-౨౮. అని చెప్పగానే భరతుడు మాతామహుండగు కేకయరాజా తోడను మేనమామయగు యుధాజిత్తుతోడను జెప్పి వారలసెలవు గైకొని శత్రుఘ్నసహితంబుగ రథం బెక్కి బయలుదేరి వనంబులు దుర్గంబులు గడచి ప్రాతఃకాల మగునప్పటికి మనురాజనిర్మితం బగు నయ్యయోధ్యను జూచెను.

౨౮½. ఇట్లాపురుషసింహం బెంత త్వరగా బ్రయాణము గావించినను నాతని కేడుదినములు త్రోవలోనే కడచిపోయెను.

౨౯. ఇట్లాభరతుం డయ్యయోధ్యాపట్టనమును డగ్గఱి సారథితో ని ట్లనెను.

౩౦-౩౧. సారథీ! ఇ ప్పట్టనము నాకు బూర్వరీతిని దోచుటలేదు. అది యేమో కాని యరణ్యమువలె గన్పట్టుచున్నది. నాకు నగుచున్న శకునంబులును నశుభంబులుగానే యున్నవి. నామనం బెంతయు దత్తరము నొందుచున్నది! రాజులకు వినాశము గలుగునప్పు డెట్టి చిన్నెలు పొడకట్టునని వినుచుందుమో యా చిహ్నంబు లన్నియు నా కిచట బొడసూపుచున్నవి.

౩౨. భరతు డిట్లు సారథితో బల్కుచు దీనమానసుడై యీ దుర్నిమిత్తంబుల కేమి కారణమో యనుకొనుచు బోయి రాజకళలేక వెలవెల బోవు రాజగృహంబును బ్రవేశించెను.

---

• వ్యా: అయోధ్య :— అయోధ్యాపట్టనము సరయూనదీతీరమున నున్న కోసలదేశమునకు రాజధానియై యున్నది. దీనినే యిప్పు డాంగ్లేయభాషలో ఔధ్ (Oudh) అందురు.

1ప్రవిశ్య రాజభవనం రాజ్యలక్ష్మీవివర్జితం,
అపశ్య త్కేకయీం తత్ర ఏకామే వాసనే స్థితాం. 33

ననామ శిరసా పాదౌ మాతు ర్భక్తిసమన్వితః, 33½

ఆగతం భరతం దృష్ట్వా కైకేయీ ప్రేమసంభ్రమాత్,
మూర్ధ్న్యవఘ్రాయ పప్రచ్ఛ కుశలం స్వకులస్య వా. 3౪½

ఇతి పృష్ట స్స భరతో మాత్రా చింతాకులేంద్రియః,
దూయమానేన మనసా మాతరం సమపృచ్ఛత. 3౫½

మాతః పితా మే కుత్రాఽఽస్తే ఏకా త్వ మిహ సంస్థితా?
అదృష్ట్వా పితరం మేఽత్ర భయం దుఃఖంచ జాయతే. 3౬½

2తం ప్రత్యువాచ కైకేయీ ప్రియవ ద్ఘోర మప్రియం,
అజానంతం ప్రజానంతీ రాజ్యలోభేన మోహితా. 3౭

3యా గతి ర్ధర్మశీలానా మశ్వమేధాదియాజినాం,
తాం గతిం గతవా నద్య పితా తే పితృవత్సల! 3౮

తచ్ఛ్రుత్వా నిపపాతోర్వ్యాం భరత శ్శోకవిహ్వలః,
హా తాత క్వ! గతోఽసి త్వం త్యక్త్వా మాం వృజినార్ణవే. 3౯
అసమర్ప్యైవ రామాయ రాజ్ఞే మాం క్వగతోఽసి భోః! ౪

1 అధ్యా రా: సర్గ ౭. 2 వాల్మీ. రా: సర్గ ౭౨.
3 అధ్యా. రా: సర్గ ౭.

౩౩-౩౩½. అట నొక యాసనమున నొంటిగా గూర్చుండిన మాతయగు కైకేయిం గాంచి బత్తియొప్పార నామె పాదంబుల కెఱగెను.

౩౪½. కైకేయియు భరతుని గాంచి ప్రేమసంభ్రమం బొప్ప నాతని మూర్ధం బాఘ్రాణించి తన పుట్టింటివారల సేమం బడుగ జొచ్చెను.

౩౫½. తల్లి తన్నిట్లడుగుచున్నను భరతుని మనస్సు చింతాకులముగా నుండి యామెతో ని ట్లనెను.

౩౬½. అమ్మా! ఆ విషయమున కేమిగాని మా తండ్రిగా రెచ్చట నున్నారు? ఈ యాసనంబున నీ వొంటిగా గూర్చుంటి వేల? నాయన కన్పట్టక పోవుటచే నాకు మిగుల భయకంపము లొదవుచున్నవి. దుఃఖమును బైకొని వచ్చుచున్నది. ఆయన యెక్కడ నుండెనో త్వరగా జెప్పుము.

౩౭½-౩౮½. భరతుం డి ట్లడుగగానే యాతని పరిశుద్ధాంతఃకరణం బెఱుంగక రాజ్యలోభమోహితురా లగుటచే కైక "నాయనా! ధర్మశీలురును నశ్వమేధాదియాగకర్తలును నగు మహాత్ము లెట్టి సద్గతులకు బోదురో యట్టి సద్గతికే నీ తండ్రియు నేగినా" డని యప్రియం బగు నా దశరథుని మరణవార్తను నెంతయో ప్రియముగా జెప్పసాగెను.

౩౯½-౪౦. ఈ మాటలు కర్ణరంధ్రముల జొరుటతోడనే భరతుడు నేలపై గూలి 'అయ్యో! తండ్రీ! న న్నీ పాపసముద్రమున ముంచి యెందు బోతివి? అయ్యో! శ్రీరాముని రాజుగా జేసి యాతనిచేతికి న న్నొప్పగింపకుండనే పోయితివా, తండ్రీ!' యని పరిపరివిధముల వాపోవుచుండెను.

ఇతి విహ్వలితం పుత్రం పతితం ముక్తమూర్ధజం,
ఉత్థాప్యాశ్రు పరిమృజ్య నయనే కైకేయీ పుత్ర మబ్రవీత్. ౪౧
సమాశ్వసిహి భద్రం తే సర్వం సంపాదితం మయా. ౪౧½

తా మాహా భరత స్తాతో మ్రియమాణః కిమబ్రవీత్. ౪౨½

త మాహా కైకయీ దేవీ భరతం భయవర్జితా,
హా రామ! రామ! సీతేతి లక్ష్మణేతి పునః పునః, ౪౩
విలపన్నేవ సుచిరం దేహం త్యక్త్వా దివం యయౌ. ౪౩½

తా మాహా భరతో హేఽమ్బ! రామ స్సన్నిహితో న కిం?
తదానీం లక్ష్మణో వాఽపి సీతా వా కుత్ర తే గతాః. ౪౪½

కైకేయ్యువాచః—
1 సహి రాజ సుతః పుత్ర! చీరవాసా మహా ద్వనం,
దండకాన్ సహ వైదేహ్యా లక్ష్మణానుచరో గతః. ౪౫½
తచ్ఛ్రుత్వా భరత స్త్రస్తో భ్రాతుశ్చారిత్రశంకయా,
స్వస్య వంశస్య మాహాత్మ్యా త్ప్రష్టుం సముపచక్రమే. ౪౬½

1 వాల్మీ. రా. సర్గ. ౭౨.

౪౧-౪౧½. ఇట్లు విహ్వలుడై వివశుడై ముక్తశిరోరుహుడై పడి యేడ్చుచున్న యా భరతుని గాంచి యాతనిబట్టి లేవనెత్తి కండ్లు తుడిచి 'నాయనా! దుఃఖము దిగమ్రింగుము. భయపడబోకుము. నీకొఱకై సర్వంబును సంపాదించి సిద్ధపఱచియుంచితి' నని కైకేయి కొమరు నూరడింపజొచ్చెను.

౪౨. భరతుడును దుఃఖమున మునింగి యుంటచే నామె మాటల భావముం దెలియజాలక యల్లనల్లన 'అమ్మా! తండ్రిగారు మరణించుచు నవసానపుమాటలుగా నేమి చెప్పి?' రనెను.

౪౩-౪౩½. కైకేయియు భయరహితయై పుత్త్రునితో "హా రామా, సీతా! హా లక్ష్మణా యనితప్ప నాయననోట మఱేమాటయును రాలేదు. వారలకై యిట్లు పలవించుచునే యాతడు మరణం బొందె" నని చెప్పెను.

౪౪½. ఇది విని భరతుడు "అమ్మా! తండ్రిగారి మరణకాలమున కా సీతారామలక్ష్మణు లేమైపోయిరి? ఆయన సన్నిధానమందు లేరా?" యనెను.

౪౫½. కైకేయియు "నాయనా? లేరు. అప్పటికి నా సీతారామలక్ష్మణులు జటావల్కలధారులై దండకారణ్యమునకు బోయియుండి" రనెను.

౪౬½-౪౭. భరతుం డీమాటలు విని తనయన్న చారిత్రమునందు గించిచ్ఛంక వొడమినను దనవంశాధిక్యముంబట్టి యెట్టి ప్రమాదంబును జరిగియుం

*కస్మాత్స దండకారణ్యే భ్రూణహేవ వివాసితః. ౪౭

ఉవాచ వచనం హృష్టా మూఢా పండితమానినీ, ౪౭½

మయా తు పుత్ర! శ్రుత్వైవ రామస్యైవాఽభిషేచనం,
యాచిత స్తే పితా రాజ్యం రామస్యచ వివాసనం. ౪౮½

స స్వవృత్తిం సమాస్థాయ పితా తే తత్తథాఽకరోత్,
పుత్రశోకపరిద్యూనః పంచత్వ ముపపేదివాన్. ౪౯½

త్వదధీనా హి నగరీ రాజ్యం చైత దనామయం ౫౦

తత్పుత్ర! శీఘ్రం విధినా విధిజ్ఞై ర్వసిష్ఠముఖ్యై స్సహితో
ద్విజేంద్రైః, సంకాల్య రాజాన మదీనసత్త్వ మాత్మాన
ముర్వ్యా మభిషేచయస్వ. ౫౧

---

*కస్మాదితి:— భ్రూణః శ్రుతాధ్యయనసంపన్నః "అనూచానో గుణై ర్యుక్తో వ్రతస్వాధ్యాయవాన్ శుచిః, భ్రూణ ఇత్యుచ్యతే సద్భి స్త్వేష యో విజితేంద్రియః." ఇతి స్మృతేః. తస్య హంతా భ్రూణహేత్యర్థః.

డదని మనమును గుములపఱచికొని "అమ్మా * భ్రూణహంతకుండగు వాడు ప్రవాస మంపబడినటుల ధర్మాత్ముండగు శ్రీరామచంద్రుడు దండక కేల పంపబడినా" డని యడిగెను.

౪౭½. అంత మాధురాలును పండితమ్మన్యురాలును నగు నా కైకేయి యిట్లనెను.

౪౮½. కుమారా! శ్రీరాముని యౌవరాజ్యమున నభిషేకించుటకై మీ తండ్రి తలపెట్టెను. అది నేను విని పూర్వము నా కిచ్చిన వరంబు లంజేసి నీకు బట్టాభిషేకంబును శ్రీరామునకు బదునాల్గేం డ్లరణ్యావాసంబును గోరితిని.

౪౯½. నీ తండ్రియు నాడినమాట దప్పువాడు గామింజేసి యట్టులే యొనర్చెనుగాని పుత్త్రవియోగము సైపలేక పంచత్వ మొందెను.

౫౦. ఇయ్యయోధ్యానగరంబును నిమ్మహారాజ్యంబును నిక నీయధీనంబులై యున్నవి.

౫౧-౫౧½. కాన వసిష్ఠాది ద్విజేంద్రులు తెల్పినప్రకారము యథావిధిగ రాజునకు దహనాది సంస్కారంబులు కావించి యీరాజ్యమున

---

* వ్యా: భ్రూణహంతకు డనుచోట;— "వినయాదిసద్గుణసంపన్నుడును తపస్స్వాధ్యాయనిరతుండును జితేంద్రియుడును శుచియు నగువాడు భ్రూణుడని చెప్పబడుచున్నాడు" అను స్మృతి ప్రమాణముంబట్టి భ్రూణుం డన సదాచారాధ్యయనశ్రుతసంపన్నునిగా దెలియవలెను. అటివానిని హత్య యొనర్చినవాడు భ్రూణహంతకు డనబడును. 

1రాజ్యే మహతి సంప్రాప్తే దుఃఖ స్యావసరః కుతః? ॥౧౫

ఇతి బ్రువంతీ మాలోక్య మాతరం ప్రదహన్నివ. ॥౨

అసంభాష్యాఽసి మే పాపే! ఘోరే! త్వం భర్తృఘాతినీ,
పాపే! త్వద్గర్భజాతోఽహం పాపవా నస్మి సాంప్రతం. ॥3

అహ మగ్నిం ప్రవేక్ష్యామి విషం వా భక్షయామ్యహం,
ఖడ్గేన వాఽథ చాత్మానం హత్వా యామి యమక్షయం. ॥४

భర్తృఘాతిని! దుష్టే! త్వం కుంభీపాకం గమిష్యసి. ॥४५
2దుఃఖే మే దుఃఖ మకరో ర్వ్రణే క్షార మివాదధాః,
రాజానం ప్రేతభావస్థం కృత్వా రామంచ తాపసం. ॥౫౫.

ఇతి నిర్భర్త్స్య కైకేయీం కౌసల్యాభవనం యయౌ. ॥౬

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అయోధ్యాకాండే
త్రయోదశ స్సర్గః.

---

1. అధ్యా. రా: సర్గ ౭. 2 వాల్మీ. రా: సర్గ ౭3.

శభిషిక్తుడవు గమ్ము. ఇట్టి విపులసామ్రాజ్యము లభించినప్పుడు దుఃఖించు కతంబును నాకు గానవచ్చుటలేదు.

౫౨. ఇటులు కొంకుకొసరులు లేక మాటలాడుచుండు నాకైకేయిని జూచి నేత్రాగ్నిజ్వాలలు నామెను దహించువానింబోలె నాభరతుం డిట్లనియె.

౫3. ఓసీ! భర్తృహంతకురాలా! సిగ్గులు లేక యిట్టి యసంభాషణము లాడుచుంటివి? పాపిని! నీకడుపున బుట్టి యిట్టి ఘోరనిందకు బాల్పడ నుంటిని? అయ్యో! నీ వొనర్చిన యీయకార్యమున నన్నుగూడ నొకభాగస్వామిగా నీలోక మెంచును గాబోలు!

౫౪. ఛీ! ఛీ! నే నిప్పుడే నాయీదేహము నగ్నిహోత్రుని కాహుతిచేసెదను. విసంబునైనను మెసవెదను. ఈ ఖడ్గముచే గంఠంబునైనను ద్రెంచుకొందును. ఈలోకంబున నుండి యపనిందలు వడుటకంటె యమక్షయంబునకైనను బోవుట లగ్గగును.

౫౪५. భర్తృహంతకురాల వగు నీవు కుంభీపాతనరకమునకే పోవుదువు.

౫౫. ఓసీ! నీ యీపాపపుంగడుపున బుట్టునొందితనిగదా యనియు శ్రీరాముం డరణ్యములపాలై పోయెనుగదా యనియు నే నిప్పటికే కుగిపోవుచుంటిని. అట్టిచో దండ్రినిగూడ మడియించి యురిసిన పుండుపై నుప్పు పెట్టినటుల మఱియొక దుఃఖమునుగూడ నాకు గల్పించితివి.

౫౬. ఇట్లు కైకేయిని మిగుల దూఱుచు నాభరతుడు కౌసల్యాగృహంబునకు బోయెను.

ఇది శ్రీరామాయణ సారోద్ధారంబున నయోధ్యాకాండంబునందు బదమూడవ సర్గము.

---

## చతుర్దశ స్సర్గః.

1 సాపి తం భరతం దృష్ట్వా ముక్తకంఠా రురోదహ.
పాదయోః పతిత స్తస్యా భరతోఽపి తథాఽరుదత్. ౧

ఆలింగ్య భరతం సాధ్వీ రామమాతా యశస్వినీ,
కృశాతిదీనవదనా సాశ్రునేత్రేద మబ్రవీత్. ౨

పుత్ర! త్వయి గతే దూర మేవం సర్వ మభూ దిదం,
ఉక్తం మాత్రా శ్రుతం సర్వం త్వయా తే మాతృచేష్టితం. ౩

పుత్ర స్సభార్యో వన మేవ యాతః సలక్ష్మణో మే రఘు
రామచంద్రః, చీరాంబరో బద్ధజటాకలాప స్సంత్యజ్య
మాం దుఃఖసముద్రమగ్నాం. ౪

2 క్షిప్రం మా మపి కైకేయీ ప్రస్థాపయితు మర్హతి. ౪౫

అథవా స్వయమేవాహం సుమిత్రానుచరా సుఖం,
* అగ్నిహోత్రం పురస్కృత్య ప్రస్థాస్యే యత్ర రాఘవః. ౪౬
కామం వా స్వయమేవాద్య తత్ర మాం నేతు మర్హసి. ౬

*వ్యా: అగ్నిహోత్రమిత్యత్ర:— నను "అగ్నిహోత్రం పురస్కృత్య ప్రస్థాస్యే యత్రరాఘవః" ఇత్యుక్తం,

1. అధ్యా రా: సర్గ 2. 2 వాల్మీకి రా: సర్గ 21

## పదునాలుగవ సర్గము

౧. ఆకౌసల్యయు నాభరతుని జూచి మిగుల దుఃఖింపసాగెను. ఆమె పాదములపై బడి భరతుడును మిగుల వాపోవదొడంగెను.

౨. అట్లేడ్చుచున్న యా భరతుని లేవనెత్తి యాతని గౌగిలించుకొని, దీనవదనయై, నయనంబుల బాష్పములు దొఱగుచుండ నాతనితో నిట్లనెను.

3. కుమారా! నీ వెక్కడనో దూరమున మేనమామలయింట నుండుటచే నిట్టి యనర్థము వాటిల్లినది. ఈ యుదంతం బంతయు నీకు మీతల్లి చెప్పియుండును, నీవును వినియుందువు.

౪. పుత్రకా! శ్రీరామచంద్రుడును లక్ష్మణసమేతంబుగ వన్య-చీరంబులు దాల్చి మౌనులు వోలె జటాకలాపంబులు దాల్చి, నన్ను దుఃఖసముద్రంబున ముంచి సభార్యకంబుగ నడవికిం బంపబడెను. అందులకై మిగుల బొగులుచుండ, బిడుగువడినవానిం గొఱవిం జూడినభంగి మీతండ్రియు మరణించెను.

౪౫. ఇక నన్నుగూడ సాగనంపుటయే కైకేయికి శేషించినకార్యము.

౫-౬. అయినను నామె కంత ప్రియాస మక్కఱలేదు. సుమిత్రతో గూడ నేనే స్వయముగా నీ యగ్నిహోత్రంబును దీసికొని శ్రీరాముం డున్నచోటికి బోయెదను. నాయందు గరుణించి నన్నక్కడకు దీసికొని పొమ్ము. ఇదియే నాకు నీ వొనరింపవలసిన మహోపకారము.

---

* అగ్నిహోత్రం బనుచోట:— అగ్నిహోత్రంబును దీసికొని శ్రీరాముం డున్నచోటికి నేనే పోయెదనని కౌసల్య స్వతంత్రయై

ఏవం విలపమానాం తాం భరతః ప్రాంజలి స్తదా,
కౌసల్యాం ప్రత్యువాచేదం శోకై ర్బహుభి రావృతాం. ౮

---

తదనుపపన్నం. మృతే భర్తరి తత్సంస్కార స్యావశ్యకర్తవ్య
త్వేన సంస్కారకర్తుర్భరతస్య సంస్కార్యస్య రాజ్ఞశ్చ సన్ని
ధానే తా వనాదృత్య వనం ప్రత్యగ్నిహోత్రనయనస్య అయు
క్తత్వమితి చేన్న, "ప్రియం చేద్భరతస్యైత ద్రామప్రవ్రాజనం
భవేత్, మాస్మ మే భరతః కార్షీ త్ప్రేతకృత్యం గతాయుషః"
ఇతి రాజవచనా ద్రామగమన మంగీకుర్వతో భరతస్య పితృ
సంస్కారేఽనధికారాత్ భరతకృతశపథా త్ప్రాక్ తదా
శయ స్యాజ్ఞానా ద్రామసమీపమేవ సంస్కార్యేణ సహాఽగ్నీ
నాం నయనం యుక్తం. న చ కైకేయ్యా అపి పత్నీత్వా త్తయా
వినా కథ మగ్నీనాం నయన మితివాచ్యం, కౌసల్యాయా
జ్యేష్ఠాత్వాత్ "జ్యేష్ఠా చే దగ్నిసంయుక్తా హ్యన్యా గచ్ఛే
ద్యథా సుఖం" ఇతివచనేన జ్యేష్ఠాయా ఏవాగ్నిసంబంధా
వగమాత్ పూర్వోక్తవచనం యుక్తమేవ. అతఏవాగ్రే భర
కృతశపథై రవగతతదాశయా కౌసల్యా భరతకృత భర్తృ
సంస్కార మభ్యుపేత్య వనం గతవతీతి సిద్ధం.

౮. ఇట్లు మిగుల దీనముగా నేడ్చుచున్న కౌసల్యం జూచి ప్రాంజలియై భరతు డామెతో నిట్లనెను.

---

పల్కుచున్నది. తనభర్త మరణించువాడు గాన దత్సంస్కారంబు లవశ్యకర్తవ్యంబులై యుండగను, దత్సంస్కారకర్తయగు భరతుండు సన్నిధానమం దుండగను గౌసల్య యగ్నిహోత్రంబు నట్లు వనములో శ్రీరామునిపాలికి గొంపోమనన ట్లు పాడియా యని శంకింపరాదు. "శ్రీరాముం డరణ్యమునకు బోవుట భరతుని కిష్టంబయేని నామరణానంతర మాతడు నాకు బ్రేతకర్మంబు సేయ వలనుపడ" దని దశరథుడు కైకేయితో బల్కియుండెను. అట్లు శ్రీరాముని దండకారణ్యగమనము భరతునికి బ్రీతిగొల్పుచో నాతడు సంస్కారము సేయ వీలుగాదు. ఇంతవఱకును నాతని కిష్టమో యనిష్టమో కౌసల్య కెట్లు తెలియును? అనిష్టం బని ముమ్ముం దాతడు చేయు శపథంబులచేతగదా యెఱుంగబడును. కావ భరతుని కనిష్టం బనువిషయము తెలియబడకపూర్వమే యగ్నిహోత్రముల శ్రీరాము నొద్దకు గొంపొమ్మ నని తనయాశయమును గౌసల్య యట్లు వెలిపుచ్చెనుగాన దోసము లేదని సమర్థనము.

కాని మఱియొక చిక్కు గల్గుచున్నది. కైకేయికూడ దశరథునకు ధర్మపత్ని యగుటచే నామె రాకుండనే కౌసల్య యొక్కతెయే యగ్నిహోత్రంబును శ్రీరామునొద్దకు గొంపోవు టెట్లు? "జ్యేష్ఠభార్యయొద్ద నగ్నిహోత్రం బున్నచో దదితర దేవేరు లందఱును నామె ననుసరించిపోవచ్చు" నను విధిలో జ్యేష్ఠురాలికే యగ్నిహోత్రసంబంధ మున్నదని స్పష్టముగా దెలియవచ్చుచుండుటచే నిందును నసందర్భం బేమియు లేదని యెఱుంగవలెను. కనుకనే ముందు శ్లోకంబుల నున్నప్రకారము భరతుడు చేసిన ఘోరశపథంబుల నాలించి యాతని స్వాశయ మేమో తెలిసి యాతడే దశరథుని కగ్నిసంస్కారంబు సేయ గౌసల్య యనుమతించెను.

ఆర్యే! కస్మా దజానంతం గర్హసే మా మకల్మషం. ౭

*కృతా శాస్త్రానుగా బుద్ధి ర్మా భూ త్తస్య కదాచన,
సత్యసంధ స్సతాం శ్రేష్ఠో యస్యార్యోఽనుమతే గతః. ౮

బలిషడ్భాగ ముద్ధృత్య నృపస్యారక్షతః ప్రజాః. ౯

సంశ్రుత్య చ తపస్విభ్య స్సత్రే వై యజ్ఞదక్షిణాం,
తాం విప్రలపతాం పాపం యస్యార్యోఽనుమతే గతః. ౧౦

పాయసం కృసరం ఛాగం వృథా సోఽశ్నాతు నిర్ఘృణః,
గురూం శ్చాప్యవజానాతు యస్యార్యోనుమతే గతః. ౧౧

---

వ్యా : కృతేత్యనేన:-సచ్ఛాస్త్రావిశ్వాసః పాపదాయక ఇత్యుక్తం భవతి. తథా చానుశాసనికే "యః ప్రవృత్తం శ్రుతం సమ్య క్ఛాస్త్రం వా మునిభిః కృతం, దూషయ త్యనభిజ్ఞాయ తం విద్యా ద్బ్రహ్మఘాతుకం" ఇతి.

౭౫. అమ్మా! ఈ గడచిన విషయం బేమియు నాకు దెలియదు. నిర్దోషి నగు నన్ను వృథాగా నేల నిందించెదవు.

౮౫. సత్యసంధుడును సత్పురుషపుంగవుడును నగు శ్రీరాముని వనవాస మున కెవ్వ డనుమతించెనో యాతనికి *శాస్త్రశిక్షితంబగు జ్ఞాన మొకప్పు డైనను లేక పోవుగాక.

౯. ప్రజల యొద్దనుండి యారవపాలు సుంకములను గొనియు నా ప్రజలను రక్షింపనొల్లని దుష్టప్రభువున కెట్టి పాపము సంఘటిల్లునో యట్టి పాపమే శ్రీరామునివనవాస మంగీకరించినవానికిని గల్గుగాక.

౧౦. యాగంబుల భూరిదక్షిణ లిచ్చెద నని ఋత్విక్కుల కాసలుపెట్టి వారియాస లడియాసలుచేయు కష్టుం డెట్టి ఫలం బనుభవించునో యట్టి ఫలమే శ్రీరాముని వనవాసం బంగీకరించినవానికిని గల్గుగాక.

౧౧. శాస్త్రనిమిత్తంబు లేక పాయసమాంసాదులు వృథాగా నెవ్వడు భుజించునో, యెవ్వడు గురుజనంబుల కవజ్ఞ యొనర్చునో యట్టి వారలకు గల్గిన కిల్బిషమే శ్రీరామచంద్రుని వనవాస మంగీకరించిన వానికిని గల్గుగాక.

---

* వ్యా : శాస్త్రశిక్షితబుద్ధి:—ఇట్లు చెప్పుటచే సచ్ఛాస్త్రంబున విశ్వాస ముంచకపోవుట పాపకారణం బని తెలియవలెను. ఇట్లే యానుశాసనికపర్వంబునను "శ్రుతులను, మహర్షి ప్రోక్తంబులగు శాస్త్రంబులను ధర్మంబులను నాచారంబులను, వానియథార్థంబు దెలియక యెవడు నిందించునో వాడు బ్రహ్మహత్యాపాతకం బొడిగట్టుకొను" నని చెప్పబడినది.

♦ లాక్షయా మధుమాంసేన లోహేన చ విషేణ చ,
సదైవ బిభృయా ద్భృత్యా న్యస్యార్యోఽనుమతేగతః. ౧౨

ఉభే సంధ్యే శయానస్య యత్పాపం పరికల్ప్యతే,
తచ్చ పాపం భవే త్తస్య యస్యార్యోఽనుమతే గతః. ౧౩

బహుపుత్త్రో దరిద్రశ్చ జ్వరరోగసమన్వితః,
స భూయా త్సతతక్లేశీ యస్యార్యోఽనుమతే గతః. ౧౪

*మా స్మ ధర్మే మనో భూయా దధర్మే స నిషేవతాం,
అపాత్త్రవర్షీ భవతు యస్యార్యోఽనుమతే గతః. ౧౫

---

♦ వ్యా : లాక్షయేతి :— భృత్యాన్ భరణీయాన్ లాక్షాదివిక్రయలబ్ధద్రవ్యేణ బిభృయా ద్రక్షే దిత్యర్థః, "లాక్షాలవణమాంసాని వర్జనీయాని విక్రయే" ఇతి స్మృతేః. అప్యకార్యశతం కృత్వేత్య స్యాపవాదోఽయం.

*వ్యా : మాస్మ ఇత్యనేన ధర్మే ద్వేషః అధర్మే స్నేహః అపాత్రే ప్రదానంచ పాపఫల మిత్యుక్తం భవతి తేన గతాయుషో భవతి. తథా చానుశాసనికే "యే నాస్తికా నిష్క్రియాశ్చ గురుశాస్త్రాతిలంఘినః, అధర్మజ్ఞా దురాచారా స్తే భవంతి గతాయుషః." ఇతి.

౧౨. ♦ లాక్షామధుమాంసలోహవిషాదివ్యాపారంబుల ధన మార్జించి యెవ్వడు భృత్యుల బోషించుచుండునో యాతనికి గల్గు పాతకమే శ్రీరామచంద్రుని వనవాస మంగీకరించినవానికిని గల్గుగాక.

౧౩. రెండుసంజవేళల నెవడు నిదురబోవుచుండునో యట్టివానికి గల్గు పాపమే శ్రీరామచంద్రుని వనవాస మంగీకరించినవానికిని గల్గుగాక!

౧౪. బహుపుత్త్రకుండును దరిద్రుడును జ్వరాదిరోగసతతసంబాధితుండును శ్రీరామచంద్రుని వనవాస మంగీకరించినవా డగుగాక.

౧౫. *ధర్మమార్గం బెన్నడును ననుసరింపక యధర్మమార్గముననే ప్రవర్తించువాడును, నపాత్రునకు దానం బొనరించువాడును నెట్టిపాపం బొందుదురో శ్రీరామచంద్రుని వనవాస మంగీకరించినవానికిని నట్టి పాప పంకం బంటుగాక.

---

♦ వ్యా: లాక్ష (లక్క) యనుచోట:—లక్క మున్నగు నిషేధ వస్తువులతో వ్యాపారము చేసి ధన మార్జించి భృత్యులను బోషించుట పాతక మని యీశ్లోకమువలన దెలియవచ్చుచున్నది. 'లాక్షా లవణ మాంసాదుల విక్రయింపరా'దను స్మృతియు నీవిషయమునే బలపఱచుచున్నది. అకార్యశతం బైనను జేసి భృత్యుల బోషింపవలెనను విధి వాక్యమున కిది యపవాదం బని యెఱుంగవలెను.

* వ్యా: ధర్మంబనుచోట:—ధర్మమునందు ద్వేషమును నధర్మమునందు స్నేహమును నపాత్రునికి దానమును, బుద్ధిపూర్వకముగ జేసినవానికి పాప మేర్పడునని యర్థము. ఇట్లే యానుశాసనిక పర్వమందును "నిష్కర్ములును, నాస్తికులును, ధర్మశాస్త్రోల్లంఘులును దురాచారులును నగు వారికి నాయువు క్షీణించు" నని చెప్పబడినది.

[1]కైకేయ్యా యత్కృతం కర్మ మమ రాజ్యాభిషేచనే,
అన్యద్వా యది జానామి సా మయా నోదితా యది. ౧౬
పాపం మేఽస్తు తదా మాత ర్బ్రహ్మహత్యాశతోద్భవం. ౧౬½

ఇత్యేవం శపథం కృత్వా రురోద భరత స్తదా. ౧౭

[2]కౌసల్యా త మథాలింగ్య పుత్ర జానామి మా శుచః
ఇత్యుక్త్వా చాఽంక మానీయ భరతం భ్రాతృవత్సలం. ౧౮
పరిష్వజ్య మహాబాహుం రురోద భృశదుఃఖితా. ౧౮½

లాలప్యమానస్య విచేతనస్య ప్రణష్టబుద్ధేః పతితస్య భూమౌ,
ముహు ర్ముహు ర్నిశ్వసతశ్చ ఘర్మం సా తస్య శోకేన
జగామ రాత్రిః. ౧౯½

[3]ఏతస్మి న్నంతరే శ్రుత్వా భరతస్య సమాగమం,
వసిష్ఠో మంత్రిభి స్సార్థం ప్రయయౌ రాజమందిరం. ౨౦½
రుదంతం భరతం దృష్ట్వా వసిష్ఠః ప్రాహ సాదరం. ౨౧

వృద్ధో రాజా దశరథో జ్ఞానీ సత్యపరాక్రమః,
అశ్వమేధాదిభి ర్యజ్ఞై ర్లబ్ధ్వా రామం సుతం హరిం. ౨౨
అంతే జగామ త్రిదివం దేవేంద్రార్ధాసనం ప్రభుః. ౨౨½

---

1. అధ్యా. రా: సర్గ 7. 2 వాల్మీ. రా: సర్గ 75; 3 అధ్యా. రా: సర్గ

౧౬-౧౬౻ తల్లీ! నేను యౌవరాజ్యమున నభిషేకింపబడుటకు మాయమ్మ యేమేమి యత్నంబులు చేసెనో నా కెఱుంగరాదు. అట్టి యధర్మంబునకై యామె నెన్నడు నే బ్రోత్సహించినదిలేదు. అట్టియకార్యంబు నే జేసియుండిన బ్రహ్మహత్యాశతంబునకైన కిల్బిషము న న్బొందు గాక!

౧౭. ఇ ట్లనేకశపథంబులు వల్కుచు నాభరతుడు బిగ్గ రోదనముసేయ దొడంగెను.

౧౮-౧౮౻. కౌసల్యయు 'పుత్రా! నే నంతయు నెఱింగితిని. దుఃఖింపకు' మని యాతని నంకమున జేర్చుకొని భ్రాతృవత్సలుండగు భరతుని, శ్రీరాముని గౌగిలించికొనిన ట్లాలింగనము జేసికొని, కౌసల్య, విశేషముగ రోదనము జేసెను.

౧౯౻. ఇట్లాభరతుడు విచేతనుడును నష్టబుద్ధియునై నిట్టూర్పులు వుచ్చుచు భూమిపై బడి మిగుల దీనముగా నేడ్చుచుండ నారాత్రి గడచిపోయెను.

౨౦౻-౨౧. ఇంతలో భరతుడు వచ్చుటాదిగా గల సమాచార మంతయు దెలిసి వశిష్ఠమహర్షి మంత్రియుక్తుండై రాజమందిరము జేరి యట దుఃఖపరవశుండైయున్న యారఘుసత్తముని జూచి సాదరంబున నిట్లనెను.

౨౨-౨౨౻. రాకుమారా! నీ వెందుల కిటులు వాపోవుచుంటివో యెఱుంగ రాకున్నది. మీ తండ్రియు వయోవృద్ధుడు - జ్ఞానవృద్ధుడు - సత్యపరాక్రముడు. అశ్వమేధాదియజ్ఞంబులు చేసి సాక్షాన్నారాయణుండగు శ్రీరాముని సుతునిగా బడసినాడు, మరణించియు దేవేంద్రుని యర్ధాసనము గాంచినాడు.

తం శోచసి వృథైవ త్వ మశోచ్యం మోక్షభాజనం. ౨౩

కృత్యం కురు యథా న్యాయ మస్మాభిః కులనందన. ౨౩౪

ఇతి సంబోధిత స్తాతా ద్గురుణా భరత స్తదా,
విసృజ్యాఽజ్ఞానజం శోకం చక్రే స విధివ త్క్రియాం. ౨౪౪

గురుణో క్తప్రకారేణ ఆహితాగ్నే ర్యథావిధి,
సంస్కృత్య స పితు ర్దేహం విధిదృష్టేన కర్మణా. ౨౫౪

1ప్రేతకార్యాణి సర్వాణి కారయామాస ధర్మవిత్. ౨౬

*కృత్వోదకం తే భరతేన సార్ధం నృపాంగనా మంత్రిపురోహితాశ్చ, పురం ప్రవిశ్యాశ్రుపరీతనేత్రా భూమౌ దశాహం వ్యనయంత దుఃఖం. ౨౭

* వ్యా: కృత్వేతి:—అనేనాఽశౌచిభి ర్యావదాశౌచం నివాపాంజలిం ప్రదాయ అక్షారలవణాశన భూశయనాది నియమవద్భి స్థేయ మితిసూచితం: తథాచ బోధాయన సూ: "జ్యోతిష్కృత్వాగారం ప్రవిశం త్యేకరాత్రి ముపోష్య తేషామక్షారలవణభోజన మథశ్శయనం బ్రహ్మచర్య మాదశరాత్రా" దితి; "క్రియల్లబ్ధాశనా భూమౌ స్వపేయు స్తే వృ

1 వాల్మీ. రా: సర్గ ౭౭

౨౩. అశోచ్యుండును, గాన మోక్షభాజనుండు నగు నాతనింగూర్చి యేల నీవు విచారించుచుంటివో నాకు దెలియవచ్చుట లేదు.

౨౪. రఘునందనా! నీవు యథాన్యాయంబుగ నాయనకు గావలసిన సంస్కారవిధుల నన్నిటిని మాతో గలిసి చక్కగ నిర్వర్తింపుము.

౨౫-౨౬-౨౭. ఈ విధంబుగా భరతుడు వశిష్ఠునిచే నుద్బోధింపబడి, యజ్ఞానవశంబుననైన శోకంబును డిగ్రమింగి, పితృదేహంబున కాహితాగ్నిసంస్కారంబు గావించి ప్రేతకర్మము లన్నియు యథావిధిగ జేసెను.

౨౮. పిమ్మట భరతుని వెంటవచ్చిన స్త్రీలును, వశిష్ఠాదిపురోహితులును నాతనితో బాటు స్నానం బొనరించి, *యాపదిరాత్రులును భూశయనాదినియమబద్ధులై దుఃఖావేశంబున నెట్టెటో కడపి మఱల పట్టనములోనికి బోయిరి.

---

* వ్యా: పదిరాత్రులను చోట:-ఇట్లు చెప్పుటచే నాశౌచముగల వారందరును నశౌచాంతమువరకును జలాంజలు లిచ్చుచు నుప్పు కారములులేని సాత్త్వికాహారములు గొనుచు భూతలశయనంబు మున్నగు నియమంబుల ననుష్ఠింపవలెనని సూచితమగుచున్నది. ఇట్లే బోధాయనుడును "దీపారాధన మొనరించి గృహంబు ప్రవేశించి యొక రాత్రి యుపవసించి యది మొదలుగ నక్షారంబులును నలవణంబులునైన భోజనంబులు గొనుచు నధశ్శయ్యం బండుచు బ్రహ్మచర్యవ్రతస్థుడై యాపదిరాత్రములును గడుపవలె" నని చెప్పెను. లభించిన

♦ [1] తతో దశాహేఽతిగతే కృతశౌచో నృపాత్మజః,
ద్వాదశేఽహని సంప్రాప్తే శ్రాద్ధకర్మాణ్యకారయత్. ౧౮

---

కృథక్."ఇతిచ. నను "క్షత్రియో ద్వాదశేఽహా"నీతిక్షత్రియస్య ద్వాదశాహాశౌచసద్భావా త్కథం దశాహ మిత్యుచ్యత ఇతిచే త్సత్యం. "క్షత్రియస్తు దశాహేన స్వకర్మ నిరత శ్శుచి"రిత్యాది విశేషశాస్త్రానుసారేణోక్త మితి న దోషః.

♦ వ్యా: తత ఇతి. దశాహే అతిగతే - ఏకాదశాహే ఇత్యర్థః. కృతశౌచః - శౌచాపాదక పుణ్యాహవాచకనవశ్రాద్ధాదిక ఇత్యర్థః. ద్వాదశేహని శ్రాద్ధకర్మాణి షోడశమాసికాని సపిండీకరణాంతానీత్యర్థః. అత్ర "ద్వాదశేహని సంప్రాప్తే శ్రాద్ధకర్మాణ్యకారయత్" ఇత్యేత త్సంస్కారా త్ప్రాక్ తైలద్రోణ్యా మనేకదిన సంస్థాపితస్యాపి ఆహితాగ్నిత్వాత్ సంస్కారదివస మారభ్యేతి జ్ఞేయం. తథాచ ఉశనా "దాహాద్యశౌచం కర్తవ్యం ద్విజానా మగ్నిహోత్రిణాం, సపిండానాంతు మరణే మరణా దితరేషుచ" ఇతిస్మరణాత్.

---

1 వాల్మీ. రా: సర్గ 88

౨౮. ♦ ఇట్లు పదిరాత్రిలును గడువగ బదునొకండవ దినమున బుణ్యా హవాచనాదు లొనరించి పండ్రెండవదినమున షోడశమాసికాది శ్రాద్ధకర్మంబు లన్నియు యథావిధిగా జేసెను.

---

మాత్రము భుజించి భూశయ్యపై బరుండవలెనని స్మృత్యంతరమం దును జెప్పబడెను.

కాని క్షత్రియునకు బండ్రెండుదినంబు లశౌచంబని ధర్మ శాస్త్రంబులు వక్కాణించుచుండ నిచట శ్లోకములో 'బదిరాత్రులు గడపి' రని భరతాదులకు దశాహాశౌచమే యెట్లు సెప్పబడెనని శంకింపరాదు. "స్వకర్మనిరతుం డగు క్షత్రియుడు దశాహాశౌ చంబుచే శుచియగు" నను విశేషశాస్త్రము ననుసరించి యిది చెప్ప బడెను గాన నిందు వ్యత్యస్తం బేమియు లేదు.

♦ వ్యా: శ్లోకములో 'దశాహేఽతిగతే':— (పదియవ దినము గడచినదగుచుండగా) యని చెప్పబడెను. దీనికి 'బదిదినములు గడచి పదునొకండవ దినమున' అని యర్థము చేసికొనవలెను. ఇట్లే 'కృత శౌచః'-(చేయబడిన శౌచము కలవాడు. అనగా శుచిత్వము నొందిన వాడు) అనుపదముచే "బదునొకండవ దినమున గావింపవలసిన పుణ్యాహవాచన నవశ్రాద్ధాదికము లొనరించి" యనియు 'శ్రాద్ధ కర్మాణ్యకారయత్'- (పండ్రెండవదినంబున శ్రాద్ధకర్మంబులు చేసెను) అను పదముచే "షోడశమాసికం బాదిగా సపిండీకరణాం తము గావింపవలసిన శ్రాద్ధకర్మంబులు చేసెను." అనియు వరుసగా నర్థములు చేసికొనవలెను.

శ్లోకములో 'భరతుడు పండ్రెండవదినమున శ్రాద్ధకర్మంబులు చేసె' నని చెప్పబడెను. ఎప్పటినుండి పండ్రెండుదినములు? దశర థుని మరణదినము నుండియునా? కాదు. అతనికి సంస్కారంబు గావించిన నాటినుండియును బండ్రెండుదినములు. దశరథునిశవము తైలద్రోణియం దనేకదినము లుంచబడెను. ఆహితాగ్ని యగు

బ్రాహ్మణేభ్యో దదౌ రత్నం ధన మన్నంచ పుష్కలం,
వాసాంసి చ మహార్హాణి రత్నాని వివిధానిచ. ౨౯

* తతః ప్రభాతసమయే దివసేఽథ త్రయోదశే,
శబ్దోపహితకంఠస్తు శోధనార్థ ముపాగతః. ౩౦

సతు దృష్ట్వా రుదన్ దీనః పపాత ధరణీతలే. ౩౧

ఉత్థాప్యమాన శ్శక్రస్య యంత్రధ్వజ ఇవచ్యుతః. ౩౨

---

వ్యా: త్రయోదశే ఇత్యత్ర:—వాల్మీకిరామాయణేఽ౭౭ సర్గే ౨౨ శ్లోకే వశిష్ఠోక్తిః "త్రయోదశోఽయం దివసః పితుర్వృత్తస్య తే విభో, సావశేషాస్థినిచయే కిమిహ త్వం విలంబసే." ఇత్యుక్త్వా 'సావశేషాస్థినిచయే' ఇతి వక్ష్యమాణత్వాత్ దశాహమధ్యే శాస్త్రవిహితం ప్రధానావయవాస్థిసంచయనం కృతం. త్రయోదశే దివసే తద్దేశీయ శిష్టాచారప్రాప్తస్థలశోధనమాత్రం కృత మిత్యవగమ్యతే. త్రయోదశేఽహ న్యస్థిసఞ్చయనం కర్తవ్య మితి బోధాయనాదిసూత్రేషు దృశ్యమానత్వాత్ స్మృతేరపి న విరోధ ఇత్యవగంతవ్యమ్.

౨౯. బ్రాహ్మణులకు రత్నాదిధనంబులును బుష్కలమగు భోజనంబులును దివ్యంబులగు వస్త్రంబులును దానముఁజేసిరి.

౩౦-౩౦½. అంత బదమూఁడవదినంబున బ్రాతఃకాలమందు భరతుఁడస్థిశోధనము సేయఁబోయి చితసమీపములోనుండి మిగుల దీనముగా నేడ్చుచు దుఃఖావేశంబున భూమిపై బడిపోయెను.

౩౧. సమీపముననుండువా రాతనిని లేవనెత్తినను నింద్రధ్వజమును బోలె మఱల బడిపోయెను.

---

టచే నట్లుంచినను వాతని శవసంస్కారదినము నుండియే పండ్రెండు దినము లని యెఱుంగవలెను.

ఇట్లే శుక్రాచార్యులును *సపిండులును నాహితాగ్నులును నైన ద్విజులు చనిపోయినచో వారికి దహనము మొద లశౌచంబనియు ననాహితాగ్నులైన ద్విజులకు మరణంబాదిగ నశౌచంబనియు జెప్పిరి.

* వ్యా: అస్థిశోధన మనుచోట:—వాల్మీకిరామాయణము డెబ్బదియెన్మిదవ సర్గములో నిర్వదిరెండవ శ్లోకంబున వశిష్ఠుఁడు. "నాయనా, భరతా! నీ తండ్రిగారు గతించి యిది పదమూఁడవదినము గదా! మిగిలిన యస్థులను గూడ సంచయనము చేయవలసియున్న దని" చెప్పెను. అనగా బదిరోజులలో యథాశాస్త్రముగ బ్రధానావయవాస్థులను సంచయనము చేసి పదమూఁడవదినమున నాయా దేశాచారానుసారముగ స్థలశోధనము మాత్రము చేయబడిన దని యీశ్లోకముం బట్టి తెలియవలెను. ఇట్లే పదమూఁడవ దినమున నస్థిసంచయనము సేయవలయు నని బోధాయనులు సూత్రించుటచే విరోధమేమియు లేదని యెఱుగవలెను.

శత్రుఘ్న శ్చాపి భరతం దృష్ట్వా శోకపరిప్లుతం,
విసంజ్ఞో న్యపత ద్భూమౌ భూమిపాల మనుస్మరన్. ౩౨
[1]తత స్సంబోధిత స్సాతు ద్గురుణా భరత స్తదా,
విసృజ్యాఽజ్ఞానజం శోకం చక్రే స విధివ త్క్రియాం. ౩౩
అవసత్ స్వగృహే తత్ర రామమే వానుచింతయన్,
వశిష్ఠేన సహ భ్రాత్రా మంత్రిభిః పరివారితః. ౩౪
[2]తతః ప్రభాతసమయే దివసేఽహ్ని చతుర్దశే,
సమేత్య రాజ కర్తారో భరతం వాక్య మబ్రువన్. ౩౫
[3]వత్స! రాజ్యేఽభిషేక్ష్యామ స్త్వా మద్య పితృశాసనాత్,
కైకేయ్యా యాచితం రాజ్యం త్వదర్థే పురుషర్షభ. ౩౬
అభిషేకో భవత్వద్య మునిభి ర్మంత్రపూర్వకం, ౩౬½
త చ్ఛ్రుత్వా భరతో ప్యాహ మమ రాజ్యేన కిం మునే. ౩౭
రామో రాజాధిరాజ శ్చ వయం తస్యైవ కింకరాః. ౩౭½

శ్వః ప్రభాతే గమిష్యామో రామ మానేతు మంజసా,
అహం యూయం మాతరశ్చ కైకేయీం రాక్షసీం వినా. ౩౮

[1]చరితబ్రహ్మచర్యస్య విద్యాస్నాతస్య ధీమతః,
ధర్మే ప్రయతమానస్య కో రాజ్యం మద్విధో హరేత్ ౩౯

1. అధ్యా. రా: సర్గ ౭; 2. వాల్మీ. రా: సర్గ ౭౯;
3. అధ్యా. రా. సర్గ: ౮. 1. వాల్మీ రా: సర్గ ౮౨.

3౨. శోకపరీతాత్ముండగు వన్నగారిని జూచి తండ్రిని స్మరించుచు శత్రుఘ్నుండును విగతచేతనుఁడై పడిపోయెను.

33-3౪. అంత పురోహితుండగు వశిష్ఠుడు సంబోధింపఁగ లేచి యజ్ఞానజంబగు శోకంబు విడిచి యథావిధిగ గర్మంబును జేసి గృహంబుసేరి వశిష్ఠశత్రుఘ్నాదిముఖ్యజనపరివృతుండై శ్రీరాముని స్మరించుచు నారాత్రి గడపెను.

3౫. మఱునటి (పదునాల్గవ) దినము ప్రభాతకాలమున రాజ్యకార్యనిర్వాహకులగు మహామహులందఱు వచ్చి భరతునితో నిట్లనిరి.

3౬-3౭½. రాకుమారా! మీ తల్లి యగు కైకేయి నీకొఱకై యీ రాజ్యంబంతయు సంపాదించినది. కాన నీ తండ్రి యానతి ననుసరించి యిప్పుడే మంత్రిపూర్వకంబుగ నీ కభిషేకము సేయనైయున్నది.

3౮. ఈ మాటలు విని వశిష్ఠుని కభిముఖుఁడై భరతు డిట్లనెను.

3౮½. మునిచంద్రమా! ఈ రాజ్యముతో నా కేమిపనియున్నది? శ్రీరాముఁడే రాజాధిరాజు. మన మందరము నాతని ప్రజలము—అతని కింకరులము.

౪౦½. నేనును మీరును గౌసల్యాదులగు మాతలునుగూడ రేపు వేకువనే శ్రీరాముని దీసికొనివచ్చుటకై పోదము. ఆ కైకేయీరాక్షసి మాత్రము మనవెంట రానక్కరలేదు.

3౯½. మహర్షిచంద్రమా! బ్రహ్మచర్యవ్రతనిష్ఠుఁడై గురుకులవాసం బొనరించి వేదాదివిద్యాసముపార్జనము జేసి ధర్మమార్గప్రవర్తకుండై మించిన యా శ్రీరామచంద్రుని రాజ్యమును నావంటివాఁడా యపహరించువది?

కథం దశరథా జ్జాతో భవే ద్రాజ్యాపహారకః. ౪౦

జ్యేష్ఠ శ్శ్రేష్ఠశ్చ ధర్మాత్మా దిలీపనహుషోపమః,
త్రియాణామపి లోకానాం రాజ్య మర్హతి రాఘవః. ౪౧

యత్ర రామో భయం నాత్ర నాస్తి తత్ర పరాభవః. ౪౧

[1]అభిషేచనికం చైవ సర్వ మేత దుపస్కృతం,
పురస్కృత్య గమిష్యామి రామహేతో ర్వనంప్రతి. ౪౨
తత్రైవ తం నరవ్యాఘ్ర మభిషిచ్య పురస్కృతం,
ఆనేష్యామి తు వై రామం హవ్యవాహ మివాధ్వరాత్. ౪౩
న సకామాం కరిష్యామి స్వా మిమాం మాతృగంధినీం,
వనే వత్స్యా మ్యహం దుర్గే రామో రాజా భవిష్యతి ౪౪

క్రియతాం శిల్పిభిః పంథా స్సమాని విషమాణిచ,
రక్షిణ శ్చానుసంయాంతు పథి దుర్గవిచారకాః. ౪౫

[2]ఇతిసంభాష్య భరత స్తూష్ణీమేవా వతస్థివాన్,
సాధు సాధ్వితి తం సర్వే ప్రశశంసు ర్ముదాఽన్వితాః. ౪౬

[3]ప్రాగ్ద్వారేఽభూ త్తదా కుబ్జా సర్వాభరణభూషితా,
లిప్తా చందనసారేణ రాజవస్త్రాణి బిభ్రతీ.

1. వాల్మీ రా: సర్గ ౭౯. 2. అధ్యా.రా: సర్గ ౭. వాల్మీ

౪౦. సత్యసంపాలనమునకై పుత్రు నడవిపాల్సేసి తద్దుఃఖమున మరణమును సైతము పొందిన దశరథున కొరసుండనై భ్రాతృరాజ్యాపహారకుండ నగుదునా?

౪౧. ధర్మాత్ముండును జ్యేష్ఠుడును దిలీపనహుషాది రాజరాజేంద్రోపముండును నగు శ్రీరాముడే త్రిలోకరాజ్యాధిపత్యంబుజేయనర్హుండు.

౪౧½. ఎక్కడ శ్రీరాము డుండునో యచ్చట భయము లేదు, అచ్చట బరాభవమును లేదు.

౪౨½-౪౩½. కాన శ్రీరాముని పట్టాభిషేకమునకై సమకూర్పబడిన యీ వస్తుసంచయం బంతయు దోడగొనిపోయి వనంబులో నున్న శ్రీరాముని కచ్చటనే యభిషేకం బొనరించి యాగమునుండి త్రేతాగ్నిం దెచ్చునటుల నాతని నయోధ్యకు దోడ్కొని వచ్చెదను.

౪౪½. అంతియేకాని యీ మాతృనామధారిణియగు కైకేయి కోర్కెను మాత్రము చెల్లనీయను. అమ్మహామహునికి మాఱుగ నేనే యడవిలో నుందును. అతడే యథావిధిగ రాజు కాగలడు.

౪౫½. కనుక శిల్పు లందఱును ముందుగా బయనమైపోయి శ్రీరాముని గొనివచ్చుమార్గము మిట్టపల్లములు లేకుండ జదును సేయవలయును. వనమార్గంబుల నెఱింగియున్న వార లిప్పుడే బయలుదేరిపోవలయును.

౪౬½. ఇట్లు భరతుడు తన నిశ్చయమును దెల్పి మిన్నకుండెను. అసభాభవనమునం గల వశిష్ఠాది ద్విజోత్తములును సుమంత్రాది మంత్రిసత్తములున్ను నాతని బలురీతుల బ్రశంసించిరి.

౪౭½-౪౮. ఇట్టియెడ, సర్వాభరణములను ధరించి, చందనాదుల నలందుకొని, కైకేయి బహుమతిగా నిచ్చిన రాజవస్త్రంబులు గట్టికొని, స్వర

బభాసే బహుభి ర్బద్ధా రజ్జుబద్ధేవ వానరీ. ౪౮

సచ రోషేణ తామ్రాక్ష శ్శత్రుఘ్న శ్శత్రుతాపనః,
విచకర్ష తదా కుబ్జాం క్రోశంతీం ధరణీతలే. ౪౯

తస్యా హ్యాకృష్యమాణాయా మంథరాయా స్తత స్తతః,
చిత్రం బహువిధం భాండం పృథివ్యాం తద్వ్యశీర్యత. ౫౦.

తాం ప్రేక్ష్య భరతః క్రుద్ధం శత్రుఘ్న మిద మబ్రవీత్,
అవధ్యా స్సర్వభూతానాం ప్రమదాః క్షమ్యతా మితి. ౫౧

ఇమామపి హతాం కుబ్జాం యది జానాతి రాఘవః,
త్వాంచ మాంచ హి ధర్మాత్మా నాభిభాషిష్యతే ధ్రువం. ౫౨

భరతస్య వచ శ్శ్రుత్వా శత్రుఘ్నో లక్ష్మణానుజః,
న్యవర్తత తతో రోషా త్తాం ముమోచ చ మంథరాం,
*అథ భూమిప్రదేశజ్ఞా స్సూత్రకర్మవిశారదాః,
ఖూపకారా స్సుధాకారా వంశకర్మకృత స్తథా.

---

* వ్యా: అథేతి:—తదను భరతనిదేశేన మహా...
నిధిశాస్త్రోక్తభూప్రదేశాభిజ్ఞైః ఖనకయంత్రకర్మాంతి...

రజ్జుబద్ధయగు వానరింబోలె నామంథర, తక్కుచు దారుచు, నొక రత్నభాండమును చేబూని దూర్పుద్వారము వైపున కెందులకో వచ్చెను.

౪౯. అది చూచుటతోడనే శత్రుఘ్నుడు పట్టరాని కోపంబున బోయి దానిని బట్టి యీడ్చుకొని వచ్చుచుండెను.

౫౦. ఆమె నట్లు పట్టుకొని యీడ్చుకొనివచ్చుచుండగ దానిచేత నున్న చిత్రవర్ణభాసురం బగు భాండము భూమిపై బడి తుత్తునియలై పోయెను.

౫౧. అట్లామంథర నీడ్చికొనివచ్చుచున్న యా శత్రుఘ్నుం జూచి "తమ్ముడా! సర్వభూతములందును దయ జూడవలసిన వారు స్త్రీలై యున్నారు. కాన నిమ్మంథరను క్షమించి విడిచి పుచ్చుము.

౫౨. ఇది యొకవేళ నీచే నిహతురాలైనచో, నిట్టి పాపం బొనరించినందుల కై ధర్మాత్ముండగు శ్రీరాముడు మనతో నిక సంభాషింపడు. మనల గన్నెత్తియైన జూడడు. ఇది నిశ్చయ" మని భరతుడు చల్లగా బల్కెను.

౫౩. ఇట్లు భరతుండు పల్కగానే శత్రుఘ్నుండును శాంతకోపుడై యమ్మంథరను విడిచిపుచ్చెను.

౫౪-౫౫. * అంత భూప్రదేశమున నుండు నిమ్నోన్నతము లెఱింగిన వారును, సాలెవాండ్రును, నిర్జలప్రదేశముల వాపీకూపంబులద్వారా జలములు తేగలవారును, నప్రమత్తులై మార్గమును రక్షించువారును, దుర్గమంబగు ప్రదేశంబులు మార్గంబుల కడ్డువచ్చినప్పుడు వానికి

---

* వ్యా: ఇట్లు భరతుం డాదేశింపగనే మహాకాలాది నిధిశాస్త్రోక్త భూప్రదేశము లెఱింగిన వారును ఖనకయంత్రాదికంబులచే బనులు సేయువారును మున్నగువారందఱును బయలుదేరిరి. అ యా మిట్టు

సమర్థా యేచ ద్రష్టారః పురత స్తే ప్రతస్థిరే. ౧౪

బబంధు ర్బంధనీయాంశ్చ క్షోద్యాన్ సంచుక్షుదు స్తదా,
బిభిదు ర్భేదనీయాంశ్చ తాం స్తాన్ దేశా న్నరాం స్తదా.
౧౫

నివేశా న్స్థాపయామాసు ర్భరతస్య మహాత్మనః. ౧౬

వృక్షతక్షకకూపకారసుధాకారాదిభి ర్వివిధశిల్పిభి ర్నిమ్నోన్నతధరణీసరణిసమీకరణాయ టంకలవిత్రఖనిత్రపరశుకుద్దాలాది వివిధాయుధైః పురః ప్రస్థాపితైః క్వచి దతిగహన గుల్మలతాపాషాణా నుచ్ఛిందద్భిః క్వచిదవృక్షక్షితిభాగే క్షణేన వృక్షా నుపక్ష్మవద్భిః క్వచన పాంసుపటలై రదభ్రకూపశ్వభ్రాణి పూరయద్భిః క్వచన సముజ్జృంభమాణాంభోనిధిసంభ్రమకారిణో జలాశయాన్ ఖనద్భి స్సమీకృత స్తత్ర తత్ర చ నవవిధవిమలతరమణిగణవిరచితకుట్టిమప్రదేశభూషితః దరవికసితకుసుమసముదయసముదయదనుపమ బహుళ పరిమళ పరిమిళదళికులదళితనవకిసలయ నివహరుచిరతరుపటలజటిలః క్వచిన్మంద చందనజలసంసేకసురభిళః తత్రతత్రచ విరచితవిశాలసన్నివేశమండపః క్వచిదంబరచుంబిసౌధశిఖర సమానతపతాకాపవనకంపితతారకాగణః శుభశిల్పినిర్మితో నరేంద్రమార్గ స్సమధికం విరరాజ.

స్థారంగములు తొలిచి త్రోవ కల్పించువారును, కొదురుబద్దలతో బని చేయగల మేదరివాండ్రును, నాయామార్గంబు లన్నియు దెలిసిన వారును, ముందుగ బయలుదేరిరి.

౫౪. ఇట్లు ముందుగ బయనమై పోయినవార లందఱును నెక్కడెక్కడ వంతెనలు మున్నగునవి నిర్మింపవలెనో, యెక్కడెక్కడ దోవ నడ్డము వచ్చిన గుట్టలాదిగా గలవి పొడిచేసి పగులగొట్టవలసిన వానిని బగులగొట్టవలెనో యా యాపనులన్నియు నెఱవేర్చిరి.

౫౬. భ[illegible]కి వలసిన వాసస్థలములును నట నట నిర్మించిరి.

---

పల్లంబులు సమముగా జేయుటకును, లతాగుల్మంబులు ఛేదించుటకును, టంకలవిత్రాదిపరికరంబులు పుచ్చుకొని కొందఱు పయనంబైరి. వృక్షహీనం బగుప్రదేశంబున వృక్షసృష్టిచేయువారు కొందఱు పోయిరి. త్రోవ నడ్డువచ్చు మడువులు పాడునూతులు మున్నగు వానిని బూడ్చువారు కొందఱు చనిరి. నీళులు లేనిచోట నంబుధిం బోలె బొంగి పొరలు జలాశయంబుల ద్రవ్వువారు కొందఱు ప్రయాణంబైరి.

ఇట్లొకచో నవరత్నఖచితకుట్టిమప్రదేశంబును, మఱియొకచో నానాపుష్పనివహనిర్యత్పరిమళంబును, నొకపట్టున మకరందపాన సమాగతాళిఝుంకారసంకులంబును, మఱియొకపట్టున జందనజలసంసేకంబును, నొకతావున విశాలమండపమండితంబును, మఱియొకతావున నత్యున్నత సౌధశిఖరసక్తపతాకాపవనకంపితతారకాసముదయంబును నై యారాజమార్గం బెంతయు నొప్పారెను.

తతేంద్రకీలప్రతిమాః ప్రతోళీవరశోభితాః,
సముచ్ఛ్రితై ర్నివేశా స్తే బభుః శక్రపురోపమాః. ౫౭
జాహ్నవీం తు సమాసాద్య వివిధద్రుమకాననాం. ౫౭½
[1]తతో నాందిముఖీం రాత్రిం భరతం సూతమాగధాః,
తుష్టువు ర్వాగ్విశేషజ్ఞా స్తవై ర్మంగళసంహితైః. ౫౮½

తతః ప్రబుద్ధో భరత స్తం ఘోషం సన్నివర్త్య చ,
నాహం రాజేతి చాప్యుక్త్వా శత్రుఘ్న మిద మబ్రవీత్. ౫౯½
[2]విష్టికర్మాంతికా స్సర్వే మార్గశోధకరక్షకాః,
ప్రస్థాపితా మయా పూర్వం యాత్రాపి మమ రోచతే. ౬౦½
యాత్రా మాజ్ఞాపయ క్షిప్రం బలం చైవ సమానయ. ౬౧
శత్రుఘ్నోపి తథా చక్రే భరత స్యానుశాసనాత్. ౬౨
‡ప్రతస్థే భరతోఽయోధ్యాపురే సంస్థాప్య రక్షకాన్,
తేన సాకం ప్రతస్థే స వసిష్ఠోఽరుంధతీయుతః. ౬౩
[3]తతః ప్రభాతే భరతం గచ్ఛంతం సర్వసైనికాః,
అనుజగ్ము స్సుమంత్రేణ చోదితా స్సాశ్వకుంజరాః. ౬౪
కౌసల్యాద్యా రాజదారా వశిష్ఠప్రముఖా ద్విజాః.

---

1 వాల్మీ. రా: సర్గ ౮౧; 2 వాల్మీ. రా: సర్గ ౮౨
‡మార్కండేయ రామాయణ సారం. 3 అధ్యా. రా: సర్గ

౫౭-౫౭౼. ఇంద్రకీల పర్వతోపములును, రాజమార్గవర శోభితంబులును స్వర్లోకభవన విరాజమానంబులు నగు నా రాజ నివేశగృహంబు లన్నియు గంగానదివలెకును మిగుల నొప్పారుచుండెను.

౫౮౼. ఇట్లంతయు నాయత్తమగుచుండ స్తోత్రజ్ఞులగు వందిమాగధు లేతెంచి భరతుని మేల్కొలుపు నిమిత్తమై మంగళారావంబులు సేయ దొడంగిరి.

౫౯౼. భరతుడును మేల్కొని 'ప్రభువును నేను గానుగదా? నాకీలాంఛనంబు లేల' యని వారిని వారించి శత్రుఘ్నుం జూచి యిట్లనియెను.

౬౦౼-౬౧. తమ్ముడా! విష్టికర్మాంతికులును మార్గశోధకులును మార్గరక్షకులును నింతకుముందే పంపబడిరి. నేనును శ్రీరామానయనంబునకై యాత్ర సాగింపనున్నాను. కాన మన బలంబుల నెల్లను సమకూర్చి మనవెంట రావలసినదిగ నాజ్ఞాపింపుము.

౬౧౼. శత్రుఘ్నుండును భరతుని యాజ్ఞానుసార మట్లే యొనర్చెను.

౬౨౼-౬౩౼. అంత నా భరతు డయోధ్యాపట్టన రక్షణార్థమై కొందఱు రక్షకుల నియమించి దండకకు బయనమయ్యెను. సుమంత్రునిచే నాజప్తులై సమస్తసైనికులును నశ్వరథకుంజరయుతులై బయలుదేరిరి. అరుంధతీసహితుండై యవ్వశిష్ఠమహర్షియు బయలుదేరెను.

౬౪. కౌసల్యాదులగు రాజదారలును వసిష్ఠాదిమహర్షులును నతనితోడ బో సమకట్టిరి.

ఛాదయంతో భువం సర్వే పృష్ఠతః పార్శ్వతో ఽగ్రతః
శృంగిబేరపురం గత్వా గంగాకూలే సమంతతః. ౬

వాస మహతీ సేనా శత్రుఘ్నపరిచోదితా. ౬౭

ఇతి శ్రీరామాయణ సారోద్ధారే అయోధ్యాకాండే
చతుర్దశ స్సర్గః.

---

పంచదశ స్సర్గః.

గతం భరతం శ్రుత్వా గుహ శ్శంకితమానసః.
నిషాదరాజో దృష్ట్వైవ జ్ఞాతీన్ సంత్వరితో ఽబ్రవీత్.

థ దాశరథిం రామం పిత్రా రాజ్యా ద్వివాసితం,
౦తః కైకయీపుత్రో హంతుం సమధిగచ్ఛతి.

వ్వంతు సర్వే దాశాశ్చ గంగా మన్వాశ్రితా నదీం,
వాం శతానాం పంచానాం కైవర్తానాం శతం శతం.

దా తుష్టస్తు భరతో రామస్యేహ భవిష్యతి,
యం స్వస్తిమతీ సేనా గంగామద్య తరిష్యతి.

త్యుక్త్వోపాయనం గృహ్య మద్యమాంసమధూనిచ,
భిచక్రామ భరతం నిషాదాధిపతి ర్గుహః.

---

1 వాల్మీ. రా: సర్గ ౯౪.

౭౩-౭౫ ఇట్లు మాతృమంత్రిపురోహితచతురంగబలంబులు నలుగెలంకుల బలిసిరా నా భరతుండు శృంగిబేరపుర సమీపమున గంగాతీరము సేరి యట విడిసెను.

ఇది శ్రీరామాయణసారోద్ధారంబున నయోధ్యాకాండంబునందు బదునాల్గవ సర్గము.

---

## పదునైదవ సర్గము.

౧. ఇట్లు సముద్రసైన్యసమేతముగా వచ్చిన భరతుని జూచి గుహుడు శంకాకులమానసుడై తన దాయాదుల నందరిని జేరబిలిచి వారలతో నిట్లనెను.

౨. ఓయీ! యీభరతుని జూచిన నా కనుమాన మగుచున్నది. దశరథునిచే బ్రవాసితుడైన శ్రీరాముని జంపుటకై యీతడు పోవుచున్నట్లున్నది.

3. కావున మన దాశజనంబు లందఱు నీగంగానది రేవు లన్నిటిని నప్రమత్తులై కాపాడుచుండుడు. మనయొద్దనున్న యైదువందల యుద్ధనావలను సన్నద్ధపఱుపుడు. ఒక్కొక నావకు నూర్గురుయోధులుండుడు.

౪. అట్లుగాక యీతడు శ్రీరామునియందు స్నేహభావముతో బోవుచో నీతని సైన్యంబంతయు సేమముగా నావలి యొడ్డునకు జేరును.

౫. అని తనవారల కాజ్ఞాపించి యానిషాదరాజు మత్స్యమాంసాదులు కానుకగా గొని భరతుని కెదురేగెను.

[1] దృష్ట్వా భరత మాసీనం సానుజం సహ మంత్రిభిః,
రామరామేతి శోచంతం రామ రామేతివాదినం. ౬
ననామ శిరసా భూమౌ గుహోఽహ మితి చాబ్రవీత్. ౬½

శీఘ్ర ముత్థాప్య భరతో గాఢ మాలింగ్య సాదరం,
పృష్ట్వాఽనామయ మవ్యగ్ర స్సఖాయ మిద మబ్రవీత్. ౭½
ధన్యోఽసి కృతకృత్యోఽసి యత్త్వయా పరిభాషితః. ౮

రామో రాజీవపత్రాక్షో లక్ష్మణేనచ సీతయా,
యత్ర రామ స్త్వయా దృష్ట స్తత్ర మాం నయ సువ్రత. ౯
ఇతి సంస్మృత్య సంస్మృత్య రామం సాశ్రువిలోచనః,
గుహేన సహిత స్తత్ర యత్ర రామ స్థితో నిశి. ౧౦
యయౌ దదర్శ శయనస్థలం కుశసమాస్తృతం. ౧౦½

సీతాభరణసంలగ్నస్వర్ణబిందుభి రంచితం,
దుఃఖసంతప్తహృదయో భరతః పర్యదేవయత్. ౧౧½

అహోఽతిసుకుమారీ యా సీతా జనకనందినీ,
ప్రాసాదే రత్నపర్యంకే కోమలాస్తరణే శుభే. ౧౨½
రామేణ సహితా శేతే సా కథం కుశవిష్టరే. ౧౩

1. అధ్యా. రా: సర్గ ౮.

౬-౬½. సహోదరమంత్రిసహితుండై కూరుచుండి యనయంబును శ్రీరాముని దలంచుకొని దుఃఖించుచు శ్రీరామనామస్మరణంబె చేయుచున్న యమ్మహామహుం డగుభరతుని గాంచి తన్నెఱింగించుకొనుచు గుహుం డాతనికి బ్రణామము చేసెను.

౭½. భరతుండును దిగ్గనలేచి యాతనిని సాదరంబుగ నాలింగనము చేసికొని కుశలప్రశ్నం బడిగి యిట్లనెను.

౮. ఓయీ! నిషాదరాజా! నీవు నిజముగా ధన్యుండవు, కృతకృత్యుండవు, శ్రీరాముండు మనసిచ్చి నీతో మాటలాడి యుండెను. ఇంతకంటెను నీకు గావలసినదేమున్నది?

౯. రాజీవదళలోచనుం డగు శ్రీరాముని నీ వెక్కడ జూచితివో యేడ సంభాషించితివో యక్కడకు నన్నుగూడ గొంపొమ్ము.

౧౦-౧౦½. ఇట్లుగ నా సీతారామలక్ష్మణులను సంస్మరించి మిగుల దుఃఖించి శ్రీరాముండు గంగాతీరము సేరిననాటిరాత్రి యాతడు శయనించినతావును గుహుండు చూపగా నచ్చటికి జేరి, వారు నిద్రించిన కుశాస్తరణంబుల జూచెను.

౧౧½. అట సీతామహాదేవి శయనించిన కుశాస్తరణంబుం జూచి యామె యాభరణంబులనుండి భ్రంశమునొందిన సువర్ణశకలంబులను వస్త్రచ్యుతములైన జరీపోగులను జూచియు నాతడు దుఃఖింపసాగెను.

౧౨½. అమ్మా! జనకపుత్త్రీ! నీ వెన్నడును రత్నపర్యంకంబున బుష్పమృదులంబులగు శయ్యలనే పండుచుందువు. అట్టి శిరీషకుసుమకోమలివీ కుశాస్తరణంబున నెటులు నిదురచెందితివి తల్లీ!

మన్నిమిత్త మిదం క్లేశం రామస్య పరమాత్మనః. ౧౩½

అహోఽతిసఫలం జన్మ లక్ష్మణస్య మహాత్మనః. ౧౪

[1]అద్యప్రభృతి భూమౌతు శయిష్యేఽహం తృణేషు వా
ఫలమూలాశనో నిత్యం జటాచీరాణి ధారయన్. ౧౫
తస్యార్థ ముత్తరం కాలం నివత్స్యామి సుఖం వనే. ౧౫½

[2]తదా సంహృష్టహృదయో గుహో భరత మబ్రవీత్. ౧౬
ధన్య స్త్వం న త్వయా తుల్యం పశ్యామి జగతీతలే,
అయత్నా దాగతం రాజ్యం య స్త్వం త్యక్తు మిహేచ్ఛసి. ౧౭

[3]ధర్మోపదేశసమయే జనా స్సర్వేపి పండితాః,
తదనుష్ఠానసమయే మునయోపి న పండితాః. ౧౮

అనర్ఘ మపి మాణిక్యం హేమాశ్రయ మపేక్షతే,
తద్వ ద్రామపదద్వంద్వభక్తి స్సాతీవ శోభనా. ౧౯

[4]శాశ్వతీ ఖలు తే కీర్తి ర్లోకా ననుచరిష్యతి. ౧౯½
ఏవం సంభాష్యమాణస్య గుహస్య భరతం తదా,
బభౌ నష్టప్రభ స్సూర్యో రజనీ చాభ్యవర్తత. ౨౦½

1 వా.రా: స ౮౮. 2 వా.రా: స ౮౫. 3 శివరా. 4 వా.రా: స ౮౫.

౧౩½. పరమధార్మికుం డగు నాశ్రీరామచంద్రుడు నా నిమిత్తంబుగ నిట్టి క్లేశము ననుభవింపవలసెను.

౧౪. నిజముగా లక్ష్మణుని జన్మమే ధన్యంబైనది. వనంబుననుగూడ శ్రీరామునికి బరిచర్యసేయులాభం బాతనికి గల్గెను.

౧౫–౧౫½. మహాత్ముండగు శ్రీరాముం డట్లు వనంబున గష్టము లొందుచుండ నాకీ భోగంబులు వలయునా? ఛీ! ఛీ!! నేనును నింతనుండి భూశయనంబున బవళింతును. జటాజినంబుల దాల్చి కందమూలంబులు గొనుచు నాతనికి మాఱుగ నేనే వనంబున గాలముబుత్తును.

౧౬. ఇట్లు పల్కుచున్న భరతుని జూచి గుహుం డిట్లనియె.

౧౭. ప్రభూ! నీవంటి యుత్తమ ధార్మికుని నే నెందును గనినది లేదు. అనాయాసంబుగ లభించిన యీ సమస్తరాజ్యంబును దృణప్రాయముగా నెంచి త్యజించివైచుచుంటివి.

౧౮. ఇతరులకు ధర్మోపదేశంబు సేయుపట్టున నందఱును దమతమ పాండిత్యము జూప ముందునకు వత్తురు. మఱి యా ధర్మాచరణంబుపట్టున మునీంద్రులును నపండితు లగుచుందురు.

౧౯. అనర్ఘరత్నంబైనను బంగారము నాశ్రయింపనిదే వన్నె కెక్కజాలదు. అటులే శ్రీరామ పదద్వంద్వాశ్రయంబు లేనిది యెంతటి భక్తుని భక్తియు వాసిగాంచజాలదు.

౧౯½. ప్రభూ! నీకీర్తి లోకంబుల శాశ్వతమై నిలువగలదు.

౨౦½. ఇత్యాదిగ భరతుండును గుహుండును బరస్పరము భాషించుకొనుచుండగ నస్తమయమం బై చీకటులు నల్దెసల గ్రమ్ముకొనుచుండెను.

విమలేఽభ్యుదితే సూర్యే కృత్వా పూర్వాహ్ణికీః క్రియాః. ౨౧

[1]పంచ నావాం శతా న్యాశు సమానిన్యు స్సమంతతః,
అన్యాః స్వస్తికవిజ్ఞేయా మహాఘంటాధరా వరాః. ౨౨

తా మారురోహ భరత శ్శత్రుఘ్నశ్చ మహాబలః,
పురోహితశ్చ తత్పూర్వం గురవో బ్రాహ్మణాశ్చ యే. ౨౩
అనంతరం రాజదారా స్తథైవ శకటాపణాః,
పతాకిన్యస్తు తా నావ స్స్వయం దాశై రధిష్ఠితాః. ౨౪

వహంత్యో జన మారూఢం తథా సంపేతు రాశుగాః,
నావ శ్చారురుహు శ్చాన్యే ప్లవై స్తేరు స్తథాఽపరే. ౨౫
అన్యే కుంభఘటై స్తేరు రన్యే తేరుశ్చ బాహుభిః,
సా పుణ్యా ధ్వజినీ గంగాం దాశై స్సంతారితా స్వయం. ౨౬

* మైత్రే ముహూర్తే ప్రయయా ప్రయాగవన ముత్తమం. ౨౬¼

---

* వ్యా: మైత్రే ఇత్యత్ర:—ముహూర్తసంఖ్యోక్తా బృహస్పతినా - "రౌద్ర స్సార్ప స్తథా మైత్రః పైత్రో, వాసవ ఏవచ, ఆప్యో వైశ్వ స్తథా బ్రాహ్మప్రాజేశేంద్రా

---

1 వాల్మీ ౮౬ స॥

౨౧. అంత వేకువ వగుటతోడనే భరతాదులు తమప్రాతఃకాల్యంబులు తీర్చికొనిరి.

౨౨. గుహుని యాజ్ఞాప్రకార మాదాశజను లందఱును బోయి యైదువందల నావలను సిద్ధము చేసి తెచ్చిరి. అట్లుగ జిరుగంటలచే జెల్వారు స్వస్తికంబులను రాజనావలు గూడ నచటికి దే బడెను.

౨౩. అనంతరము భరతశత్రుఘ్నులును, వశిష్ఠాదిపురోహితులును నితర ద్విజోత్తములును గ్రమముగ నావలలోని కెక్కిరి.

౨౪. తదనంతరము కౌసల్యాదులగు రాజదారలును, నటుపైన రథాదికంబులును, సైన్యములు, వారివారి పరికరంబులు మున్నగున వన్నియు నాయాయి నావలలో నుంపబడెను. పతాకాసహితంబులై దాశజనులచే నధిష్ఠింపబడిన యానావల నంద రధిరోహించిరి.

౨౫-౨౬. ఇటుల నాభరతుని సేనాదికంబుల నన్నింటిని గొని యానావలు మహావేగంబున బోవుచుండెను. మిగిలినవారందరు, కొందఱు నావలలోను, మఱికొందఱు తెప్పలపైనను, గొందఱు ఘటకుంభంబుల సాహాయ్యంబునను, మఱికొంద ఱీదుకొనుచును, ఇట్లు భరతుని సైన్యంబంతయు నా దాశజనుల సాహాయ్యంబున సురక్షితముగా నాగంగా నదిని దరించెను.

౨౭-౨౮. ఇట్లు గంగానదిని దరించి * మైత్రముహూర్తంబున బయలుదేరి ప్రయాగవనంబు వైపునకుబోయి యట నొక్కచో సకల

* మైత్రముహూర్తంబను చోట :— ముహూర్తంబుల గూర్చి బృహస్పతి యిట్టులు చెప్పినాడు. రౌద్రము, సార్పము, మైత్రము, పైత్రము, వాసవము, ఆప్యము, వైశ్వము, బ్రాహ్మము, ప్రాజేశము ఐంద్రము, ఐంద్రాగ్న్యము, నైరృతము, వారుణము, ఆర్యమణము, భగాఖ్యము నని పగటిముహూర్తములు పదునైదుగా దెలియంగవలెను.

ఆశ్వాసయిత్వా చ చమూం మహాత్మా నివేశయిత్వా చ
యథోపజోషం, ద్రష్టుం భరద్వాజ మృషిప్రవర్య మృత్వి
గ్వృతస్సన్ భరతః ప్రతస్థే. .౨౭౪

[1]ఆశ్రమే ముని మాసీనం జ్వలన్త మివ పావకం,
దృష్ట్వా ననామ భరత స్సాష్టాంగ మతిభక్తితః. ౨౮౪

జ్ఞాత్వా దాశరథిం ప్రీత్యా పూజయామాస మౌనిరాట్. ౨౯

భరద్వాజ ఉవాచః—

ఆగతోఽసి కిమర్థం త్వం విపినం మునిసేవితం. ౨౯౪

భరద్వాజవచ శ్శ్రుత్వా భరత స్సాశ్రులోచనః,
సర్వం జానాసి భగవ న్సర్వభూతాశయస్థితః. ౩౦౪

జ్ఞాతు మర్హాసి మాం దేవ! శుద్ధోవాఽ శుద్ధ ఏవవా. ౩౧

మమ రాజ్యేన కిం స్వామిన్ రామే తిష్ఠతి రాజని,
నేష్యేఽయోధ్యాం రమానాథం దాసవే వ్యతిసీచవత్. ౩౨

---

స్త్రథైవచ ఐంద్రాగ్నేయ్య నైరృతశ్చైవ వారుణాఽర్యమణౌ భగీ.
ఏతేఽహ్ని క్రమశో జ్ఞేయా ముహూర్తా దశపంచ వై చేతి.
మైత్రే ముహూర్తే ప్రయాగవనం యయా విత్యన్వయః.
ఘటికామట్కఏవ గంగాతరణ మితి భావః. తత్రాతిథ్యేన
నిరవధికలాభా న్ముహూర్త విశేషోక్తిః.

---

1 అధ్యా. రా: సర్గ ౮

సైన్యంబును నిలిపి వశిష్ఠాదిఋషిసమన్వితంబుగ బాదచారియై భరద్వాజాశ్రమంబునకు బోయెను,

౨౮. పోయి మహాతేజంబున హుతాగ్నింబోలె వెలుంగుచున్న యమ్మునిసత్తముని గాంచి భరతుడు సాష్టాంగదండప్రణామం బొనరించెను.

౨౯. ఆ మహర్షిసత్తముడును నా భరతుని యథావిధిగ సత్కరించి 'నాయనా! మునిజనసేవితంబగు నివ్వనంబునకు రాగతం బే'మని యడిగెను.

౩౦-౩౧. భరతుడును బాష్పపిహితలోచనుడై 'దేవా! మీ రెఱుంగరాని దేదియు లేదు. సర్వజ్ఞులగు మీకు నే జెప్పవలసినదియు లేదు. నా యంతఃకరణము శుద్ధమైనదో కాదో తా మెఱుంగగలరు.

౩౨. స్వామీ! జ్యేష్ఠుండై రాజ్యార్హుండగు శ్రీరామచంద్రుం డుండ నీ రాజ్యముతో నా కేమిపనియున్నది. అమ్మహామహుని నయోధ్యకు గొంపోయి యాతనిని రాజ్యంబున నిల్పి సేవకుడనై పరిచరింతును.

---

*భరతాదులు మైత్రముహూర్తంబున బ్రయాగవనంబునకు బోయి రని చెప్పబడుటచే నాలుగడియలలోనే గంగానదిని దరించి రని యెఱుంగవలెను. ఇట్టి సుముహూర్తంబున బయలుదేరుటచేతనే వారికి భరద్వాజాశ్రమంబున నిట్టి నిరుపమానం బగు నాతిథ్యము లభించినదని యెఱుంగవలెను.

భరద్వాజ ఉవాచ:—

వత్స! జ్ఞాతం పురైవైత ద్భవిష్యం జ్ఞానచక్షుషా,
మా శుచ స్త్వం పరో భక్త శ్శ్రీరామే లక్ష్మణాదపి. 33

[1]విశేషం జ్ఞాతు మిచ్ఛామి మాతౄణాం తవ మాతరం! 33½

ఉవాచ ప్రాంజలి ర్భూత్వా భరత స్సత్యవా గృజుః. 34

యా మిమాం భగవన్ దీనాం కౌసల్యాం విద్ధి రాఘవ!
అస్యా వామభుజం శ్లిష్టా సుమిత్రా తిష్ఠతి స్వయం. 35
ఐశ్వర్యకామాం కైకేయీ మనార్యా మార్యరూపిణీం,
మమైతాం మాతరం విద్ధి నృశంసాం పాపనిశ్చయాం. 36
ప్రత్యువాచ మహాబుద్ధి ర్భరద్వాజ స్త మర్థవత్. 36½

న దోషేణావగంతవ్యా కైకేయీ భరత! త్వయా. 37
రామప్రవ్రాజనం హ్యేత త్సుఖోదర్కం భవిష్యతి,
దేవానాం దానవానాంచ ఋషీణాం భావితాత్మనాం. 38

[2]సేనాయాస్తు తవైతస్యాః కర్తు మిచ్ఛామి భోజనం,
మమ ప్రీతి ర్యథారూపా త్వ మర్హో మనుజర్షభ. 39
ఆనీయతా మిత స్సేనే త్యాజ్ఞప్తః పరమర్షిణా,
తతస్తు చక్రే భరత స్సేనాయా స్సముపాగమం.

1. వాల్మీ. రా: సర్గ ౯౦. 2. వాల్మీ. రా: సర్గ ౯౧.

౩౩. ఇట్లు భరతుడు పల్కగానే భరద్వాజుం డిట్లనియె! 'కుమారా! ఈ విషయం బంతయు దివ్యదృష్టింజేసి మున్నె తెలిసితిని. ఊరక దుఃఖింపకుము. నిజముగ లక్ష్మణునికంటెను శ్రీరామునికి నీవే యెక్కువ భక్తుండవు.

౩౩½. నీ తల్లు లందఱును వీరేనా? వీరల నామవిశేషంబులను నాకు సుంత తెల్పెదవా?

౩౪. అని యడుగగానే సత్యవాక్యుండగు నా భరతు డిట్లు చెప్పదొడగెను.

౩౫. దేవా! దీనురాలై నిలుచున్న యామెయే కౌసల్యాదేవి. ఆమెవామ భుజం బవలంబించి నిలుచున్నయాపె సుమిత్రాదేవి.

౩౬. ఐశ్వర్యకాముకురాలును దుష్టచింతనురాలును,పాపవినిశ్చయురాలును, నగు నీ పయోముఖవిషకుంభమే మా తల్లియగు కైకేయి.

౩౬½. ఈమాటలు విని యాగతానాగతజ్ఞుం డగు నా భరద్వాజమహర్షి యిట్లనెను.

౩౭-౩౮-౩౯. ప్రభుకుమారా! యీ కైకేయియందు దోస మెంచబోకుము. అయినను శ్రీరాముం డిట్లరణ్యంబులకు బోవుటచేతనే తపస్వులకును, దేవతలకును సుఖంబౌన గూడును. కాన నా విషయమై నీవు చింతింపవలసిన యవసరం బించుకయు లేదు. అది యటులుంచుము, ఇప్పుడు నీతోడ నీసైనికు లందఱు నా కతిథుల రైతిరి. నాయిచ్చు నాతిథ్యంబు గైగొని నన్ను సఫలీకృత మనోరథుని గావింపుడు.

౪౦. ఇట్లు భరద్వాజుడు పల్కగానే భరతుడు తన సమస్తసైన్యంబుల రాబంచెను.

అగ్నిశాలాం ప్రవిశ్యాఽథ పీత్వాఽపః పరిమృజ్య చ,
ఆతిథేయక్రియాహేతో ర్విశ్వకర్మాణ మాహ్వయత్. ౪౧

ఆహ్వయే విశ్వకర్మాణ మహం త్వష్టార మేవచ
ఘృతాచీ మథ విశ్వాచీం మిశ్రకేశీ మలంబుసాం. ౪౨
శక్రం యా శ్చోపతిష్ఠంతి బ్రహ్మాణం యాశ్చ యోషితః.
౪౨½

ఏవం సమాధినా యుక్త స్తేజసాఽప్రతిమేనచ,
శిక్షాస్వరసమాయుక్తం తపసా చాబ్రవీ న్మునిః. ౪౩½

మనసా ధ్యాయత స్తస్య ప్రాఙ్ముఖస్య కృతాంజలేః,
ఆజగ్ము స్తాని సర్వాణి దైవతాని పృథక్ పృథక్. ౪౪½

తతోఽభ్యవ ర్తంత ఘనా దివ్యాః కుసుమవృష్టయః,
దివ్యదుందుభిఘోషశ్చ దిక్షు సర్వాసు శుశ్రువే. ౪౫½

చతుశ్శాలాని శుభ్రాణి శాలాశ్చ గజవాజినాం,
హర్మ్యప్రాసాదసంబాధా స్తోరణాని శుభానిచ. ౪౬½

క్లృప్తసర్వాపణం శ్రీమత్ స్వాస్తీర్ణశయనోత్తమం,
వివేశ మంత్రిభి స్సాకం భరతః కైకయీసుతః. ౪౭½

బిల్వా మార్దంగికా ఆస న్ఛమ్యా గ్రాహా విభీతకాః,
అశ్వత్థా నర్తకా శ్చాస న్భరద్వాజస్య శాసనాత్. ౪౮½

४౧. అంత నా భరద్వాజుండు తన యాశ్రమములోనికి బోయి యాచ మనము చేసి నేత్రాదికంబును దుడిచికొని యాతిథ్యం బిచ్చుటకై సకలశిల్పనిర్మాత యగు విశ్వకర్మను, గృహనిర్మాతయగు త్వష్టను నాహ్వానించెను.

४౨-४౨౻. ఘృతాచి, విశ్వాచి, మిశ్రకేశి, అలంబుస మున్నగు జేజేవెల్లాటక త్తెల నందఱిని, దుంబురునితోగూడ, నాట్యనిమిత్తమైయాహ్వానించెను.

४३౻. ఇట్లమ్మహామహుండు నిరవధికతేజోవిరాజమానుండై శిక్షోక్తస్వర ప్రకారంబున నాయాయి దేవతల నందఱిని నాహ్వానించెను.

४४౻. త్రికరణశుద్ధియుక్తుండగు నమ్మహర్షి తపశ్శక్తిం జేసి యయ్యోదేవతా నికరంబును నచటికి వచ్చి చేరిరి.

४౫౻-४౬౻. అంత నంతరిక్షంబునుండి పుష్పవర్షములు కురియసాగెను. నల్దెస లందును దివ్యదుందుభినాదంబులు మ్రోయసాగెను. గజాశ్వముల కనువగు శాలలన్నియు నిర్మితములుకాసాగెను. హర్మ్యప్రాసాదతోర ణాదికములును నచ్చువడసాగెను.

४౭౻. భరతునికి మృదులాస్తరణంబుతో నొప్పుశయనోత్తమంబును, భద్రా సనంబును, సభాభవనంబును నేర్పడెను. అందాభరతుండును నాతని మంత్రులు మున్నగువారును గొల్వుదీర్చియుండిరి.

४౮౻-४౯౻-౫౦౻. ఆహా! ఆ భరద్వాజముని మహిమం బేమని చెప్పవచ్చును? అతని యనుశాసనముచే నచటనున్న మారేడుచెట్లు మృదంగములు

మాలతీ మల్లికా జాతి ర్యా శ్చాన్యాః కాననే లతాః,
ప్రమదావిగ్రహం కృత్వా భరద్వాజాశ్రమేఽవదన్. ४९।
సురా స్సురాపాః పిబత పాయసం చ బుభుక్షితాః,
మాంసాని చ సుమేధ్యాని భక్ష్యతాం యావ దిచ్ఛథ. ५०।

యచ్చాద్య స్నాపయంతిస్మ నదీతీరేషు వల్గుషు
అప్యేకమేకం పురుషం ప్రమదా స్సప్త చాష్టచ ५१।
సంవహాత్య స్సమం పేతు ర్నార్యో రుచిరలోచనాః
పరిమృజ్య తదాన్యోన్యం పాయయంతి వరాంగనాః. ५२।
తర్పితా స్సర్వకామై స్తే రక్తచందనరూషితాః,
నాశ్వబంధోఽశ్వ మాజానా న్న గజం కుంజరగ్రహః, ५३।
మత్త ప్రమత్త ముదితా చమూ సా తత్ర సంబభౌ. ५४
సంప్రహృష్టా వినేదు స్తే నరా స్తత్ర సహస్రశః,
నృత్యంతిస్మ హసంతిస్మ గాయంతిస్మచ సైనికాః. ५५
సమంతా త్పరిధావంతి మాల్యోపేతా స్సహస్రశః. ५६
అప్సరోగణసంయుక్తా సైన్యా వాచ ముదైరయన్.
నైవాయోధ్యాం గమిష్యామో న గమిష్యామశ్చ దండకాన్.
కుశలం భరతస్యాస్తు రామస్యాస్తు తథాసుఖం.

వాయింపసాగెను. జమ్మివృక్షములు తాళములు వేయుచుండెను. రావిచెట్టులు నాట్యముసేయుచుండెను. మాలతీమల్లికాదులగు లతాతల్లజంబులు తరుణీవేషంబులు గలవై మద్యపాయులగు నా భరతుని సైనికులకు మద్య మందిచ్చుచుండెను. ఆకట బడలినవారికి పాయస మందిచ్చుచుండెను. వలసినవారికి మేధ్యంబులగు మాంసంబు లిచ్చుచుండెను. తృప్తిగా భుజింపు డని యుపచారవాక్యంబులు పల్కుచుండెను.

౫౧½-౫౨½. ఒక్కొక్క పురుషుని నేడు నెనమండుగురు తలిరుబోడులు సైత మెత్తుకొనిపోయి నదీజలంబుల నోలలాడించి యొడ్డుపైకి దెచ్చి తడియార్చి వారలకు దృప్తియగునట్లు మద్యపానంబు సేయించుచుండిరి.

౫౩½-౫౪. ఇట్లుగ రక్తచందనాదిసంసేవితులై సర్వకామభోక్తలైన యా సైనికు లెల్లరకు మన్నుమిన్నులు దెలియలేదు. అశ్వబంధకుని కశ్వము కన్పడలేదు; మావంతునకు గజం బెఱుకపడలేదు.

౫౫-౫౫½. కొందఱు బిగ్గ గేకలిడుచుండిరి; కొందఱు నాట్యములు సేయుచుండిరి; కొందఱు కలకల నవ్వుచుండిరి; కొందఱు గానము సేయుచుండిరి. కొందఱు పూదండ లలంకరించుకొని యటు నిటు బర్వు లెత్తుచుండిరి.

౫౬-౫౭. ఆ సైనికు లందఱు నిట్లప్సరోగణపరివేష్టితులై యమ్మహర్షి యిచ్చిన యాతిథ్యమునం జేసి మత్తప్రమత్తులై మే మిటనుండి యయోధ్యకును బోము. దండకకును బోము. భరతునకు కుశలం బగుగాక. రామునకును సేమం బగుగాక యని పల్కుచుండిరి.

తతో భుక్తవతాం తేషాం తదన్న మమృతోపమం,
దివ్యా నుద్వీక్ష్య భక్ష్యాం స్తా నభవ ద్భక్షణే మతిః. ౫౮

పాత్రాణాంచ సహస్రాణి స్థాలీనాం నియుతాని చ,
న్యర్బుదానిచ పాత్రాణి శాతకుంభమయాని చ. ౫౯

శుక్లా నంశుమత శ్చాపి దంతధావనసంచయాన్,
దర్పణాన్ పరిమృష్టాం శ్చ వాససాం చాపి సంచయాన్. ౬౦

[1]నాంగీచకార భరతో మృష్టాన్నం రామభక్తితః,
చఖాద కందమూలాని భరద్వాజాశ్రమే కృతీ. ౬౧

[2]ఇత్యేవం రమమాణానాం దేవానా మివ నందనే,
భరద్వాజాశ్రమే రమ్యే సా రాత్రి ర్వ్యత్యవర్తత. ౬౩
ప్రతిజగ్ముశ్చ తా నద్యో గంధర్వాశ్చ యథాగతం. ౬౪

*తథైవ మత్తా మదిరోత్కటా నరా స్తథైవ దివ్యాగురుచందన

* వ్యా : తథైవేత్యత్రి:—ఇదం చాతిథ్యకరణ మైంద్ర
జాలికవ న్నమిథ్యేత్యాహ - తథైవేతి. మత్తాః - దృష్టా

1. యాజ్ఞ. రా : సారం; 2. వాల్మీ. రా : సర్గః ౯౧

౫౮. కొంతవడికి భోజనంబునకై యాహ్వానింపబడిరి. వారు భుజించుచున్న యన్న మమృతోపమానముగ నుండెను. వారలకు వడ్డింపబడిన భక్ష్యంబులన్నియు దివ్యంబు లగుటచే నెన్ని భక్షించినను వారికి దృప్తి కలుగలేదు.

౫౯. పాదాదిప్రక్షాళనంబునకై యచ్చట వేనకువేలు పాత్రంబు లుండెను; లక్షలకొలందిగ బంగరు కుండలుండెను. నీరు దావ్రుటకై మఱి కోట్లకొలదిగ బంగారుగిండు లుండెను.

౬౦. నిర్మలములై కొసలుదీఱిన దంతకాష్ఠంబులును నయ్యాశ్రమంబున గుప్పతెప్పలుగ నుండెను. నునుపుదేరిన యద్దంబులును బహళముగా నుండెను. ధరించుటకు వస్త్రసమూహంబులును లెక్కకు మిక్కిలిగా నుండెను.

౬౧. కాని యా మృష్టాన్నంబు లేమియు భరతు డంగీకరింపలేదు. శ్రీరామునియందలి భక్తివిశేషంబున జేసి యాతడు కందమూలంబులు మాత్రము భక్షించెను.

౬౨. ఇట్లుగ నా భరతుని సైనికు లందఱును, భరద్వాజాశ్రమంబున, దేవతలు నందనవనములో బలె గడపిరి.

౬౪. భరద్వాజునిచే నాహూతంబులైన దేవతాద్యప్సరోగణంబు లన్నియును యథాగతంబుగ దమ తమ నెలవులకుం బోయిరి.

౬౫. * అమ్మహర్షి సత్తమునియాశ్రమంబున వచ్చిన జేజే లేగినను సైనికు లందఱు మద్యపానమత్తులై దివ్యాగురుచందనభూషితులై యుండిరి.

---

* వ్యా: భరద్వాజుని యాతిథ్యము :— ఈ భరద్వాజుని యాతిథ్య మింద్రజాలమువలె మిథ్యగాదని తెలియుటకై శ్లోకములో 'తథైవ' అను పద ముపయోగింపబడినది. ఈ శ్లోకములోని మఱి

నోషితాః, తథైవ దివ్యా వివిధా స్స్రగుత్తమాః వృథ
క్స్రకీర్ణా మనుజైః పరిమర్దితాః ౬౩౫

3పరిత్యువాచ భరద్వాజో భ్రాతృదర్శనలాలసం,
భరతాఽర్ధతృతీయేషు యోజనే ష్వజనే వనే. ౬౪౫
చిత్రకూటో గిరి స్తత్ర రమ్యనిర్ఝరకాననః,
ఉత్తరం పార్శ్వ మాసాద్య తతో ద్రక్ష్యసి రాఘవం. ౬౫౫

4భరత స్తు కృతానుజ్ఞః ప్రియయా రామసన్నిధిం,
చిత్రకూట మనుప్రాప్య దూరే సంస్థాప్య సైనికాన్. ౬౬౫
రామసందర్శనాకాంక్షీ ప్రియయా భరత స్స్వయం,
శత్రుఘ్నేన సుమంత్రేణ గుహేనచ పరంతపః. ౬౭౫
తపస్విమండలం సర్వం విచిన్వానో న్యవర్తత, ౬౮

భోగై స్తృప్తాః. మదిరోత్కటాశ్చ - మద్యేన మత్తాశ్చ తథైవ అనుభవకాల ఇవ సర్తిషతేత్యర్థః. పరిమర్దితాః - ప్రకీర్ణాశ్చ భోగవశా దితిభావః. పృథక్ పూర్వపరిశోభా విలక్షణాః

3. వాల్మీ. సర్గ ౯౨. 4. అధ్యా. రా: సర్గ ౯.

దివ్యంబు లగు పుష్పోపహారంబు లన్నియు నా సైనికులు బాగుగా ననుభవించి వదలివేసిరి. అయినను నీ భోగంబులన్నియును యథాపూర్వముగా సంతృప్తిగా ననుభవించిరే కాని యింద్రజాలములో వలె గాదు.

౬౪½-౬౫½. ఇట్లారాత్రి కడచని ప్రభాతకాలము కాగానే నా భరద్వాజుడు 'నాయనా! భరతా! యిక్కడికి మూడుయోజనముల న్నర దూరములో విజనంబగు విపినంబున చిత్రకూటగిరి యున్నది. దాని యుత్తరభాగంబున నొక యాశ్రమంబున శ్రీరాముని నివు చూడగలవని యాతనికి శ్రీరాముడున్న నెలవును జెప్పెను.

౬౬½-౬౭½-౬౮. భరతుండును నట్లమ్మునిచే ననుజ్ఞాతుండై శ్రీరాముని సన్నిధిం జేరుటకై బయలుదేరి చిత్రకూటంబు జేరి తన సైనికుల నందఱను దూరముగా నునిచి శత్రుఘ్నుడును సుమంత్రుడు గుహుడు నాదిగా గల ముఖ్యజనము వెంటరాగా, ఋషిసంఘంబు లెల్ల నక్కజము పడునట్లుగ బాదచారియై పోవుచుండెను.

---

కొన్ని పదములకు వివరణమును నిట తెలుపబడుచున్నది. మత్తాః = భోగములచే దృప్తినొంది మత్తిల్లినవారు (భరతుని సైనికులు); మదిరోత్కటాః = మద్యపానముచే మత్తిలినవారు; తథైవ = పూర్వ మనుభవించినకాలమందు వలెనే యథావిధిగా నున్నట్టి; ప్రమర్దితాః ప్రకీర్ణాః = నలుగగొట్టబడినవియును జెదరియున్నవియును నగు పూలమాలలు. అనుభవించుటచే నిటులయినవని భావము; పృథక్ = వేఱుగా నున్నవి - పూర్వము తా మనుభవించినవానికంటె విలక్షణముగా నున్నవని భావము.

[1]అథ దాశరథి శ్చిత్రం చిత్రకూట మదర్శయత్,
భార్యా మమరసంకాశ శ్శచీ మివ పురందరః. ౧

న రాజ్యా ద్భ్రంశనం భద్రే! న సుహృద్భి ర్వినా భవః,
మనో మే బాధతే దృష్ట్వా రమణీయ మిమం గిరిం. ౨
యదీహ శరదో ఽ నేకా స్త్వయా సార్థ మనిందితే. ౨౦

లక్ష్మణేనచ వత్స్యామి న మాం శోకః ప్రధక్ష్యతి. ౨

అనేన వనవాసేన మయా ప్రాప్తం ఫలద్వయం,
పితు శ్చానృణతా ధర్మే భరతస్య ప్రియం తతః ౨

వైదేహి! రమసే కచ్చి చ్చిత్రకూటే మయా సహ,
అధికం పురవాసాచ్చ మన్యేచ తవ దర్శనాత్. ౨

లక్ష్మణ శ్చాపి ధర్మాత్మా మన్నిదేశే వ్యవస్థితః,
త్వం చానుకూలా వైదేహి! ప్రీతిం జనయతో మమ. ౨

[2]అయం గిరి శ్చిత్రకూట ఇయం మందాకినీ నదీ,
ఏత త్ప్రకాశతే దూరా న్నీలమేఘనిభం వనం. ౨

1 వాల్మీ. రా: సర్గః ౯ ; 2 వాల్మీ. రా: సర్గః

౹౮. అట శ్రీరాముండును నింద్రుడు శచీదేవితో బోలె చిత్రకూటమున విహరించుచు సీతతో నిట్లనెను.

౨౦-౨౦౪. దేవీ! రాజ్యము లేకపోయినను, మిత్రులందఱిని వీడి వచ్చినను నా కేమియు బాధ కలుగుట లేదు. ఈ చిత్రకూట పరిసరంబు లన్నియును నంత యానంద మొసంగుచున్నవి. అట్టి యానందమున కాలవాలంబగు నివ్వనంబున నీవు నాదండ నున్నచో నిట్టి వత్సరంబు లెన్నియేని యిట్టె కడచిపోగలవు.

౨౧. మఱి లక్ష్మణుండును నాయొద్దనే యున్నచో నిక జెప్పెడిదేమి? నాకు విచారకారణమే లేదు.

౨౨. దేవీ! యీ వనవాసంబున నాకు రెండు ఫలితమ్ములు గల్గినవి. ఒకటి తండ్రిని సత్యప్రతిజ్ఞుని గావించుట, రెండవది భరతునికి బ్రియంబు చేయుట.

౨౩. వైదేహీ! ఈ చిత్రకూటంబున నాతోడ గలిసియుండుట నీ కెట్లుగా నున్నది? నాకు మాత్రము, నిన్ను నయంబును జూచుచుండుటచే, నయోధ్యలో నున్నదానికంటెను నెక్కుడు సుఖంబుగానే యున్నది.

౨౪. ధర్మాత్ముండగు లక్ష్మణుండును మదాజ్ఞాపరిపాలకుండై యున్నాడు. నీవును నా కనుకూలంబుగ బ్రవర్తించి నా కెంతయు ముదంబు గొల్పుచున్నావు.

౨౫. దేవీ! యిప్పర్వతప్రియదర్శనంబు నెంత పొగడినను దనివితీఱదు. ఇది చిత్రకూటపర్వతము. అయ్యదియే దివిజగంగ, అల్లదే నీలమేఘప్రతీకాశంబగు కాననరాజము.

కుర్వంతి కుసుమాపీడా న్శిరస్సు సురభీ నమీ,
మేఘప్రకాశైః ఫలకై ర్దాక్షిణాత్యా యథా నరాః. ౨౬

అయోధ్యేవ జనాకీర్ణా సంప్రతి ప్రతిభాతి మే. ౨౬½

[1] ఇతీవ రామో బహు సంగతం వచః ప్రియాసహాయ స్సరితం,
ప్రతి బ్రువన్, చచార రమ్యం నయనాంజనప్రభం సచిత్ర
కూటం రఘువంశవర్ధనః. ౨౭½

“పర్ణశాలాం తతో జగ్ము స్త్రయ స్తుష్టాః స్థితా స్తదా.” ౨౮

[2] ఏతస్మి న్నంతరే తత్ర శబ్దం శుశ్రావ రాఘవః,
ఉవాచ రామ స్సౌమిత్రిం పశ్యేహ శ్రూయతే స్వనః. ౨౯

స లక్ష్మణ స్సంత్వరిత స్సాల మారుహ్య పుష్పితం,
ఉదఙ్ముఖః ప్రేక్షమాణో దదర్శ మహతీం చమూం. ౩౦

శశంస సేనాం రామాయ వచనం చేద మబ్రవీత్. ౩౦½

అగ్నిం సంశమయ త్వార్య సీతా చ భజతాం గుహాం,
సజ్యం కురుష్వ చాపంచ శరాంశ్చ కవచం తథా. ౩౧½

సంప్రాప్తో ౽యమరి ర్వీర! భరతో వధ్యఏవ మే. ౩౨

1. వాల్మీ, రా : సర్గ. ౯౫. 2. వాల్మీ. రా : సర్గ. [illegible]

౩౬. ఈ వనంబుల జూడుము. గమ గమ వలచు పూమొత్తంబు లన్నియు నాదలల దాల్చి దాక్షిణాత్యులం బోలె నెట్లు నెన్నుమీఱు చున్నవో !

౩౬½. బహుజనసంకులం బగు నయోధ్య నున్నపు డెటుల నుండునో యీ కాననంబున నున్నను నా కట్లే యున్నది.

౩౭½. ఇట్లా రఘువంశశ్రేష్ఠుం డగు నా శ్రీరామచంద్రుడు మందాకినీతీర కాననంబుల సీతకు వర్ణించి చెప్పి యంజనపర్వతభాసమానం బగు నా చిత్రకూటంబునం గల చిత్రంబు లన్నియు విలోకించుచు విహరించెను.

౩౮. అనంతర మా సీతారామలక్ష్మణులు పర్ణశాలలోనికిం బోయిరి.

౩౯. ఇంతలో భరతుని సైనికుల కోలాహలధ్వని శ్రీరాముని కర్ణరంధ్రములం బడుటచే నాతడు కారణ మరయ లక్ష్మణుని బంపెను.

౪౦-౪౦½. అతండును వైళంబ పోయి యొక సాల వృక్షం బధిరోహించి యుత్తరపు దిక్కున నొక గొప్పసేన విడిసియుండుట జూచి యన్నతో నిట్లనెను.

౪౧½. శ్రీరామా ! అ యగ్నిహోత్రంబుల నాత్మారోపణము చేయుము. ఇమ్మహాదేవిని ద్వరగా గుహలోనికి బంపివేయుము. నీ ధనున్సున కల్లెత్రాడు తగిలించి కవచమ్మును దొడిగికొని యమ్ములపొదులు గైకొమ్ము.

౪౨. మనకు దుఃఖకారకుం డగు భరతు డదే సైన్యసమేతుడై మనపై నెత్తి వచ్చుచున్నాడు. ఇదే నే నతని వధింపబోవుచున్నాను.

*భరతస్య వధే దోషం నాహం పశ్యామి రాఘవ,
పూర్వాపకారిణ స్త్యాగే న హ్యధర్మో విధీయతే. ౮౩

ఏతస్మి న్నిహతే కృత్స్నా మనుశాధి వసుంధరాం, ౮౩౪

ఇతి శ్రీ రామాయణ సారోద్ధారే అయోధ్యాకాండే
పంచ దశస్సర్గః.

---

షోడశస్సర్గః.

1రామస్తు పరిసాన్త్వ్యాఽథ వచనం చేద మబ్రవీత్. ౪

కి మత్ర ధనుషా కార్య మసినా వా సచర్మణా,
మహేష్వాసే మహాప్రాజ్ఞే భరతే స్వయ మాగతే. ౧౪

కు్రిత్వా ప్రవ్రాజినం మాం హి జటావల్కలధారిణం,
జానక్యా సహితం వీర! త్వయాచ భరతర్షభ.

---

* వ్యా: భరత ఇతి:—అనేన త్యక్తధర్మస్య పూర్వాపకారిణో వధే దోషో నాస్తీతి సూచితం. తథాచాపస్తంబః "యో హి సార్థ మసికాగ్రింతం హంతి మన్యురేవ మన్యుం స్పృశతి, న తస్మి న్దోష ఇతి పురాణే" ఇతి.

---

1 వాల్మీ రా: సర్గ ౯౭.

౨౩. * అట్లాతని వధించుట పాపకారణం బని నా కడ్డుసెప్పకుము. కృతాపకారు లగువారిం జంపుటలో దోషంబు లేశంబును లేదు. మఱి భరతుడు మనకు మహాపకారి. ఈతని నా వాడిములుకుల కెర సేయుటలో దప్పేమి?

౨౪. మఱియొక విశేషము - ఈతడు నిహతుం డగుచో నీవు నిష్కంటకముగా రాజ్యముం బాలింపవచ్చును.

ఇది శ్రీరామాయణ సారోద్ధారంబున నయోధ్యాకాండంబునందు
బదునైదవ సర్గము.

## పదునారవ సర్గము

౧. శ్రీరాముండును నా లక్ష్మణునితో సాంత్వన వచనంబులచే నిట్లనెను.

౧౫. తమ్ముడా! ప్రాజ్ఞుండును మహాధనుర్ధరుండును నగు భరతుడు మన నిమిత్తమై స్వయముగ వచ్చియుండెను. అట్టిచో ఖడ్గముతోగాని ధనుస్సుతోగాని చేయవలసిన కార్యంబేమియో నాకు దోచుటలేదు.

౨౫-౩౫-౪. మనము జటావల్కలములు దాల్చి యారణ్యావాసంబు సేయబూని యిటు లరణ్యముం జేర్చి వచ్చినది విని మిగుల దుఃఖము

* భరతుని వధించుట:— ఇట్లు చెప్పుటచే నధార్మికుండును బూర్వాపకారియు నగు వానిని జంపుటలో నధర్మంబు లేదని తెలియుచున్నది. ఇట్టే యాపస్తంబులును, "సాయుధుం డైనవానిని బూర్వవైరిని జంపుట దోసము కాదని పురాణము లుద్ఘోషించుచున్న" వని సూత్రించిరి.

స్నేహేనాక్రాన్తహృదయ శ్శోకేనాకులితేన్ద్రియః,
ద్రష్టు మభ్యాగతో హ్యేష భరతో నాన్యథాఽఽగతః. ౩½
అస్మాసు మనసా హ్యేష నాప్రియం కించిదాచరేత్. ౪

విప్రియం కృతపూర్వం తే భరతేన కదా ను కిం? ౪½

యది రాజ్యస్య హేతో స్త్వ మిమాం వాచం ప్రభాషసే,
వక్ష్యామి భరతం దృష్ట్వా రాజ్య మస్మై ప్రదీయతాం, ౫½
ఉచ్యమానోపి భరతో బాఢ మిత్యేవ వక్ష్యతి. ౬

తథోక్తో ధర్మశీలేన భ్రాత్రా తస్య హితే రతః,
అవతీర్యతు సాలాగ్రం తస్మా త్స సమితింజయః. ౭

లక్ష్మణః ప్రాంజలి ర్భూత్వా తస్థౌ రామస్య పార్శ్వతః. ౭½
ఉవాచ వ్రీడితో రామం లక్ష్మణ శ్శుభలక్షణః,
త్వాం మన్యే ద్రష్టు మాయాతః పితా దశరథ స్స్వయం. ౮½
వ్రీడితం లక్ష్మణం దృష్ట్వా రాఘవః ప్రత్యువాచ హ,
ఏష మన్యే మహాబాహు రిహాఽస్మాన్ ద్రష్టు మాగతః. ౯½

1 అథాన్తరే మహాతేజా భరతః పురుషర్షభః,
పద్భ్యామేవ మహాబాహుః ప్రవివేశ మహద్వనం. ౧౦

1. వాల్మీ. రా. సర్గ. ౯౯.

నంది, స్నేహభావంబున మనలను బురికి గొంపోవుటకై యీతడు వచ్చియున్నాడు. అంతియేకాని యీతని మనంబున గొండొక దురుద్దేశ మున్నట్లు నాకు బొడకట్టుటలేదు. ఈతడు మన పట్టున నెన్నడును మనంబుననైనను విప్రియం బాచరించునది లేదు.

౪౫. ఓయీ! అట్లుగాక నీ కెన్నడే నేదే నప్రియం బొనర్చెనా?— అతనిగూర్చి నీ విట్లు పల్కుచుంటివి?

౫౫-౬. లేక రాజ్యాకాంక్షచే నిట్లనుచుంటివా? అగుచో నా రాజ్యం బంతయు నీకే సమర్పింపుమని యా భరతునితో జెప్పి వైచెదను. బుద్ధిమంతుం డగు వాతడును నే జెప్పిన చొప్పున దప్పక చేయును.

౭-౨౫. ఇట్లు శ్రీరామచంద్రుడు పల్కగానే యా లక్ష్మణుడును నా సాలవృక్షాగ్రమునుండి గ్రక్కున డిగివచ్చి మాఱుమాటాడక యా రాముని దండకు జేరెను.

౭౫-౯౫. చేరి 'యన్నా! నిన్ను జూచుటకై మన తండ్రిగారే స్వయముగా వచ్చినారని తలంచుచున్నానని లక్ష్మణుం డనగా 'అవును. అయనయే యొకవేళ వచ్చియుండవచ్చు'నని రాముండు బదులు చెప్పెను.

౧౦౫-౧౧౫. వీ రిట్లు సంభాషించుకొనుచుండగానే మహాతేజస్కుండగు భరతుండును బాదచారియై యా వనము ప్రవేశించి చిత్రకూటపర్వతంబున శ్రీరాముని యాశ్రమం బున్నట్లు విని తనసైన్యంబంతయు

*స చిత్రకూటేతు గిరౌ నిశమ్య రామాశ్రమం పుణ్యజనో
పపన్నం, గుహేన సార్థం త్వరితో జగామ పునర్నివేశ్యైవ
చమూం మహాత్మా. ౧౧

1 శాలాయా స్త్వగ్రత స్తస్యా దదర్శ భరత స్తదా,
కాష్ఠాని చావభగ్నాని పుష్పా ణ్యుపచితాని చ. ౧౨
కృతం వృక్షే ష్వభిజ్ఞానం కుశచీరైః క్వచిత్ క్వచిత్. ౧౩
దదర్శచ వనే తస్మి న్మహత స్సంచయాన్ కృతాన్,
మృగాణాం మహిషాణాం చ కరీషై శ్శీతకారణాత్. ౧౪

2 అథ గత్వాశ్రమపద సమీపం భరతో ముదా,
సీతారామపదై ర్యుక్తం పవిత్ర మతిశోభనం. ౧౫

3 దదర్శ దూరా దతిభాసురం శుభం రామస్య గేహం ముని
బృంద సేవితం, వృక్షాగ్రసంలగ్న సువల్కలాఽజినం
రామాభిరామం భరత స్సహానుజః. ౧౬

4 నిరీక్ష్య స ముహూర్తంతు దదర్శ భరతో గురుం
ఉటజే రామ మాసీనం జటామండలధారిణం, ౧౭

---

* వ్యా: చిత్రకూటేతి:—గుహేనేతి ప్రధానజనోప
లక్షణపదం. అన్వేషణార్థం చమూం స్థాపయిత్వేత్యర్థః.

---

1. వాల్మీ. రా: సర్గ. ౯౯. 2. అధ్యా. రా : సర్గ ౯.
3. అధ్యా. రా: సర్గ ౯. 4. వాల్మీ. రా: సర్గ ౯౯.

నయ్యరణ్యంబున నుండ బంచి * గుహాదిముఖ్యజన పరివృతుండై యటకు బోయెను.

౧౨-౧౩-౧౪. అట జన నాతని కయ్యాశ్రమసమీపంబున నింధనంబులును బుష్పసముదయంబులును బొడకట్టెను. మార్గము తిన్నగ దెలియుటకై దర్భలతోడను గుడ్డపేలికలతోడను నేర్పరుపబడిన సంకేతంబులును గన్పట్టెను. శీతబాధను నివారించుకొనుటకై చేర్చిన లేడులయు నెనుబోతులయు నేరుపిడుకలరాసులును జూపట్టెను.

౧౫-౧౬. అట్లు చూచుచు నేగి, యా సీతారాఘవ పదారవింద పవిత్రితంబును మునిసమూహసంసేవితంబును సమీపవృక్షాగ్రబద్ధ వల్కలాజినంబును రామాభిరామేరితంబును నగు శ్రీరామచంద్రుని నివాసంబును జూచెను.

౧౭-౧౮-౧౯-౨౦-౨౧. తత్ప్రాంగణంబున, జటామండలధారియు వల్కలాజినధరుండును మహాసారబాహుండును సింహస్కంధుండును

---

*వ్యా:—ఈ శ్లోకములో 'గుహేన సార్ధం' అని 'గుహునితో గూడ రామాశ్రమమునకు భరతుడు పోయె' నని చెప్పబడినది. గుహుండొక్కనితోడను మాత్రమే పోయెననియర్థము కాదు - గుహుడు మొదలైన ముఖ్యజనులని యర్థము చేసికొనవలెను. అట్లే సైన్యమును గూడ రామాన్వేషణార్థమే యచ్చటచ్చట నడవిలో నుంచెనని భావము.

తం తు కృష్ణాజినధరం చీరవల్కలవాససం,
సింహస్కంధం మహాబాహుం పుండరీకనిభేక్షణం, ౧౮

పృథివ్యా స్సాగరాంతాయా భర్తారం ధర్మచారిణం,
స్థండిలే దర్భసం స్తీర్ణం సీతయా లక్ష్మణేనచ, ౧౯
ఉపవిష్టం మహాబాహుం బ్రహ్మాణ మివ శాశ్వతం.
అభ్యధావత ధర్మాత్మా భరతః కైకయీసుతః. ౨౦
యస్సంసది ప్రకృతిభి ర్భవే ద్యుక్త ఉపాసితుం,
వన్యై ర్మృగై రుపాసీనస్సోఽయ మాస్తే మమాగ్రజః. ౨౧
ఇత్యేవం విలప న్దీనః ప్రస్విన్నముఖపంకజః,
పాదా వప్రాప్య రామస్య పపాత భరతో రుదన్. ౨౨
శత్రుఘ్న శ్చాపి రామస్య వవందే చరణౌ రుదన్. ౨౨

తా వుభౌ స సమాలింగ్య రామ శ్చాశ్రూణ్యవర్తయత్. ౨౩
తత స్సుమంత్రేణ గుహేనచైవ సమాగతౌ రాజసుతౌ వరణ్యే, దివాకరశ్చైవ నిశాకరశ్చ యథాఽంబరే శుక్రబృహస్పతిభ్యాం. ౨౪

[1] జటిలం చీరవసనం ప్రాంజలిం పతితం భువి,
అంకే భరత మారోప్య పర్యపృచ్ఛ త్సమాహితః. ౨౫

చిరస్య బత! పశ్యామి దూరా ద్భరత మాగతం,

1 వాల్మీ. అ: సర్గ ౧౦౦.

చతురుదధివేలావలయితవిశ్వంభరాధూర్వహుండును ధర్మమార్గానురక్తుండును స్థండిలశయనుండును నాద్యంతరహితబ్రహ్మనుకారియు నగు నా శ్రీరామచంద్రుని జూచి రివ్వున బరువెత్తి పోవుచు 'నయ్యా! సామంతమంత్రిభట పరివారజనసమేతుండై కొల్వుదీర్చి యుండు నా యన్న యీ వన్యమృగంబుల కెల్ల బ్రభువై కొలుచున్నాడా!'

౨౧. అని విలపించుచు నా శ్రీరాముని పాదసరోరుహంబులు చేరక మునుపే భూమిపై బడిపోయెను.

౨౨. శత్రుఘ్నుండును దీనముగా నేడ్చుచు శ్రీరాముని పాదారవిందములకు నమస్కరించెను.

౨౩. ఆ భరతశత్రుఘ్నుల గౌగిలించుకొని శ్రీరాముండును కన్నీరువిడిచెను.

౨౪. ఇట్లయ్యరణ్యంబున నున్న శ్రీరామభరతులు, సుమంత్రగుహసహితులై శుక్రబృహస్పతియుతులగు సూర్యచంద్రులంబలె వెలింగిరి.

౨౫. జటావల్కలధరుండును భూపతితుండును బ్రాంజలియు నైన భరతుని నొడిలో చేర్చుకొని యాతనితో శ్రీరామచంద్రుం డిట్లనియె.

౨౬. తమ్ముడా, భరతా! నిన్ను జూచి యెన్నినాళ్లయినదోయీ! నీవు నీ మేనమామగృహంబునకు బోవునప్పుడు చూచితిని. అప్పటి కిప్పుడు

దుష్ప్రతీక మరణ్యేఽస్మిన్ కిం తాత! వన మాగతః. ౨౬

* కచ్చి ద్దశరథో రాజా కుశలీ సత్యసంగరః,
కచ్చి చ్ఛుశ్రూషసే తాత! పితరం సత్యవిక్రమం. ౨౭

ఇక్ష్వాకూణా ముపాధ్యాయో యథావ త్తాత! పూజ్యతే. ౨౭½

సా తాత కచ్చి త్కౌసల్యా సుమిత్రా చ ప్రజావతీ,
సుఖినీ కచ్చి దార్యా చ దేవీ నందతి కైకయీ? ౨౮½

కచ్చి దాత్మసమా శ్శూరా శ్శ్రుతవంతో జితేంద్రియాః,
కులీనా శ్చేంగితజ్ఞాశ్చ కృతా స్తే తాత మంత్రిణః. ౨౯½

కచ్చి త్సహస్రా న్మూర్ఖాణా మేక మిచ్ఛసి పండితం. ౩౦

కచ్చి న్ముఖ్యా మహత్స్వేవ మధ్యమేషు చ మధ్యమాః,
జఘన్యాస్తు జఘన్యేషు భృత్యాః కర్మసు యోజితాః. ౩౧

---

* వ్యా: కచ్చి ద్దశరథేతి:—అథ భగవాన్ శ్రీరామః ప్రశ్న వ్యాజేన రాజ్య రక్షణనీతిప్రకారాన్ శిక్షయతి, పశ్చా ద్దశరథాత్యయశ్రవణ భరతస్థండిలశయనాదివ్యాపారేణ తదుపదేశావకాశాభావాత్.

గురుతింపరాని సితలో మిలల జూచుచున్నాను. నాయనా! నీవు వనంబునకు రాగతంబేమి?

౨౪. ఓయీ! సత్యపరాక్రముండగు మన తండ్రిగారు కుశలముగా నున్నారుగద? అమ్మహామహుని కేమరక శుశ్రూష యొనర్చుచుంటివా?

౨౬½. ఇక్ష్వాకుల కాచార్యుండగు నా వసిష్ఠమహర్షి నరమరలు లేక పూజించుచుంటివా?

౨౭½. నన్ను బాసినదుఃఖముచే నెల్లపుడు కడుం బొగులుచుండు కౌసల్యయు, ప్రజావతియగు సుమిత్రయు సుఖముగా నున్నారా? కైకేయీమాత సంతసము గనుచున్నదా?

౨౮½. నీ మంత్రు లందఱును ప్రాణసమానులును శూరులును నీతిశాస్త్రపారంగతులును లంచములు మున్నగునవి యపేక్షింపనివారును సత్కులప్రసూతులును బరాభిప్రాయజ్ఞులును నైయున్నారా?

౩౦. మూర్ఖులగువారు వేయిమందికంటె బండితు డగువాని నొక్కని ప్రాపును గోరుచుంటివికదా!

౩౧. భటులలో గొంచె మత్కృష్టులుగ నుండువారిని పెద్దటికపు బనులలోను మధ్యములుగ నుండువారిని వంతకంటె దక్కువపనులలోను, హీనజాతిభృత్యులను హీనకార్యములలోను మాత్రమే నియమించుచుంటివికదా?

---

వ్యా: తండ్రిగా రనుచోట:—ఇట శ్రీరామచంద్రుడు కుశలప్రశ్నమిషచే భరతునికి రాజనీతి ప్రకారంబు గఱపుచున్నాడు. ఇక్కార్యము తరువాత జేయ ననువుపడదు. ఏలయన శ్రీరాముడు దశరథుని మరణవార్తను విని తద్దుఃఖమున మునింగియుండును. భరతుండును స్థండిలశయనాదివ్యాపారంబు చేసికొనుచుండును గాన నీ యుపదేశంబున కిదియే యదను.

*ఉపాయకుశలం వైద్యం భృత్యసందూషణే రతం,
శూరం మైశ్వర్యకామంచ యో న హంతి స వధ్యతే. 3౨

---

* వ్యా : ఉపాయకుశలమితి :- ఉపాయేషు-సామాద్యుపాయేషు; కుశలం - నిపుణం; వైద్యం - కణికోక్తకుటిలనీతివిద్యావిదం యద్వా చాణక్యాద్యుక్తకుటిల నీతిశాస్త్రవిదం; భృత్యసందూషణే రతం— అంతరంగభృత్యానాంసందూషణే - అసద్దోషోద్ఘాటనేన తద్విఘటనే రతం; శూరం_రాజహింసనేఽపి నిర్భయం; ఐశ్వర్యకామం - క్రమేణ రాజైశ్వర్యాక్రమణకామం చ పురుషం యో న హంతి స రాజా తేనైవ వధ్యతే, రాజ్యాద్భ్రష్టో భవతీత్యర్థః. తథా చ కామందకః :— శ్లో॥ "తుల్యార్థం తుల్యసామర్థ్యం మర్మజ్ఞం వ్యవసాయినం, అర్ధరాజ్యహరం భృత్యం యో న హంతి స వధ్యతే." ఇతి.

౪౭. *ఉపాయంబులు దెలిసినవాఁడును గణికుఁడును గొండెములుచెప్పు భృత్యులపై ప్రభువునకు నసహ్యము గల్గించువాఁడును, శూరుండును, నెప్పుడో యొకప్పుడు ప్రభురాజ్యమును సైతము కబళింపఁజూచువాఁడును నగు భృత్యుఁ డున్నచో నాతఁడు వెడలనడుపబడవలయును. అట్లు కానిచో నా ప్రభువునకే ముప్పు వాటిల్లును.

---

*వ్యా: సామాద్యుపాయంబు అనుచోట:— ఈ శ్లోకంబులోని పదంబులకు వివరణము తెలుపబడుచున్నది. ఉపాయేషు = సామ దాన భేదదండోపాయములందు; కుశలం = నిపుణుడును; వైద్యం = కణికుడు చాణక్యుడు మున్నగు రాజనీతిశాస్త్రజ్ఞులు చెప్పిన నీతిశాస్త్రము తెలిసినవాడును; భృత్యసందూషణే రతం=అంతరంగిక భృత్యులైనవారలందు లేనినేరము లారోపించి వారలను వెడల నడిపింపజూచువాడును; శూరం = రాజును హింసించుటలోగూడ నిర్భీకుండును; ఐశ్వర్యకామం = క్రమముగా రాజునైశ్వర్యంబుగూడ నాక్రమింప నిచ్ఛగలవాడునునగు; పురుషం = పురుషుని; యః = ఎవడో న హంతి = చంపడో; సః = అట్టిరాజు; తేనైవ = ఆ సామాద్యుపాయజ్ఞుండగు పురుషునిచేతనే; వధ్యతే = చంపబడు చున్నాడు. అనగా రాజ్యభ్రష్టుడు కావింపబడుచున్నాడు. ఇట్టి పురుషుండు నీ సన్నిధానమున లేడుగదా? యని శ్రీరాముడు భరతుని బ్రశ్నించుచున్నాడు. అట్టిపురుషుని జేరదీయరాదని కామందక నీతిశాస్త్రమందును జెప్పబడుచున్నది: "తనతో సమానమైన ధనముగలవాడును సమానమగు సామర్థ్యము గలవాడును, మర్మంబులు దెలిసినవాడును నెల్లప్పు డెద్దియో ప్రయత్నంబున మగ్నుడైయుండువాడును, రాజ స్వమును రాజ్యంబును హరించువాడునువగు భృత్యుడు నిహతుడు కాకున్నచో వానిచేత ప్రభువే నిహతు డగుట సునిశ్చయము.

కచ్చి ద్బలస్య భక్తంచ వేతనంచ యథోచితం,
సంప్రాప్తకాలం దాతవ్యం దదాతి న విలంబసే. 33

1 ప్రసాదో నిష్ఫలో యస్య క్రోధశ్చాపి నిరర్థకః,
... ం భర్తార మిచ్ఛంతి షండం పతి మివ స్త్రియః 34

• 2 కచ్చి జ్జానపదో విద్వా& దక్షిణః ప్రతిభానవా&,
యథోక్తవాదీ దూత స్తే కృతో భరత! పండితః? 35

వ్యా: కచ్చిజ్జాన పదఇత్యత్ర:—జానపదః - స్వజన పదభవః, పరజనపదభవశ్చే త్స్వ...పాత మాచరేత్; విద్వా& - పరాభిప్రాయజ్ఞః; దక్షిణః - సమర్థః; ప్రతిభాన వా& - ప్రత్యుత్పన్నమతిః; పరోక్తస్యాఽవిలంబ ముచి తోత్తరజ్ఞ ఇతియావత్; యథోక్తవాదీ - ఉక్త మనతిక్రమ్య ...సందేశవచనశీలః; కార్యోపయోగితయా బహువిధం ...వహారన్నపి స్వామ్యుక్త మజహాదేవ వ్యవహర్తేతియావత్; ...తః - పరిచ్ఛేత్తా, "పరిచ్ఛేదో హి పాండిత్య" మిత్యుక్తేః. ...చ మనుః :—శ్లో॥ దూతం చైవ ప్రకుర్వంతి సర్వశాస్త్ర ...రదం, ఇంగితాకారచేష్టజ్ఞం శుచిం దక్షం కులోద్గతం" ఇతి.

1 భారద్వాజ రా: 2-34. 2 వాల్మీ. రా: సర్గ 100.

౩౩. సైన్యంబుల కీయవలసిన జీతబత్తెములు యథోచితంబుగా గాలహర ణంబులేక యథాకాలంబుగా నిచ్చుచున్నావా?

౩౪. ఏరాజు ననుగ్రహముచే నించుకైనను లాభసంపద పొరయకయు నాతని యాగ్రహముచే లేశమైన శిక్షాపారుష్యము గలుగకయు నున్నచో నట్టిధరణీశుని, నపుంసకుండగు పతిని స్త్రీలుబోలె, బ్రజలు తుటారించివేయుదురు.

౩౫. స్వదేశమందే జన్మించినవాడును బరుల యభిప్రాయము లెస్సగా దెలియగలాఁడును, సమర్థుడును, రాజున కనుకూలంబుగ బ్రతిభాష ణము సేయువాడును దౌత్యంబు సక్రమంబుగ నెఱపగలవాడును మాత్రమే నీచే దూతగా నియమింపబడెను గదా.

---

* వ్యా : దూతునివిషయము:—శ్లోకములోని కొన్ని పదముల కిట వివరణము తెలుపబడుచున్నది. జానపదం - స్వదేశమందు జన్మించిన వాడు; విదేశజన్ముడైనచో దన దేశసంబంధముగల రాజకార్యము వచ్చినచో బక్షపాత మాచరింపవచ్చును. కాన దూత స్వదేశజుడై యుండవలెనని భావము; విద్వాన్ - పరాభిప్రాయజ్ఞుడు; దక్షః- సమర్థుడు; ప్రతిభానవాన్ - సమయస్ఫూర్తికలవాడు. అనగా నితరు డాడినమాటకు వెంటనే తగు ప్రత్యుత్తర మిచ్చువాడు; యథోక్త వాదీ- రాయబారము సేయునపుడు రాజు చెప్పిన సందేశముమాటలు విడువకుండ రాజకార్యసంధానానుకూలంబుగ మాటలాడు నేర్పు గలవాడు; ఇట్టివాడే దూతగా నుండదగునని మనువును జెప్పు చున్నాడు. "నీతిశాస్త్రపారంగతుడును బరుల యింగితకారచేష్టలు చూచుటతోడనే తెలియగలవాడును రాజునకు ద్రోహమాచరింపని పరిశుద్ధమనస్కుడును కులక్రమాగతముగ వచ్చినవాడును నగు వానిని దూతగా నియమింపదగును."

* కచ్చి దష్టాదశాఽన్యేషు స్వపక్షే దశపంచచ,

వ్యా: కచ్చి దష్టాదశేత్యత్ర:— అన్యేషు = పర పక్షేషు; అష్టాదశతీర్థాని; స్వపక్షే పంచదశ తీర్థానిచ; అవిజ్ఞాతైః = పరస్పర మన్యై శ్చావిజ్ఞాతైః - విజ్ఞాతత్వే తేషాం సాంకేతికవ్యవహారహానిస్స్యాత్. ఏతస్మిన్ తీర్థే త్రిభిస్త్రిభి శ్చారకైః = వేషాంతరధారిభి శ్చారైః - కృత్రిమార్థే కప్రత్యయః, వేత్సి కచ్చిత్? = ఏతాని న్యాయతోఽన్యాయతో వా ప్రవర్తనం జానాసి కచ్చి దిత్యర్థః. తీర్థశబ్దార్థ మాహ హాలాయుధః:— శ్లో॥ "యోనౌ జలావతారేచ మంత్ర్యా ద్యష్టాదశాస్వపి, పుణ్యక్షేత్రే తథా పాత్రే తీర్థం స్యా ద్దర్శనేష్వపి." ఇతి.

తానీమా న్యష్టాదశచాణక్యనీతిశాస్త్రోక్తాని తీర్థాని - మంత్రిపురోహిత యువరాజ సేనాపతి దౌవారి కాఽంతర్వంశిక కారాగారాధికృతాఽర్థసంచయకృ త్కార్యనియోజక ప్రాడ్వివాక సేనానాయక నగరాధ్యక్ష క ర్మాంతిక సభ్య ధర్మాధ్యక్ష దండపాల దుర్గపాల రాష్ట్రాంతపాలాః. ఏష్వేవ మంత్రిపురోహిత యువరాజ వ్యతిరిక్తాని స్వపక్షే పంచదశ తీర్థాని.

(1) మంత్రి (2) పురోహిత (3) యువరాజ (4) సేనాపతయః Commander -in-chief ప్రసిద్ధాః (5) దౌవారికః అంతఃపురాదిద్వారరక్షణాధికృతజననిర్వాహకః Royal body guard(6)అంతర్వంశికః—అంతఃపురకార్యనిర్వాహకః.(Home manager) (7) కారాగారం - అపరాధినాం బంధగృహం

౩౮. ముగురేని దూతల నొకరి విషయ మొకరికి దెలియకుండ బంపి శత్రుపక్షములో * పదునెన్మిది తీర్థములయు, స్వపక్షంబున పదునైదు

---

* వ్యా: పదునెన్మిదితీర్థములు:- తీర్థశబ్దపర్యాయపదములు హలాయుధ నిఘంటువులో నిట్లుచెప్పబడినవి: తీర్థము= కారణము; జలావతారము, మంత్రియున్నగు పదునెనమండ్రు తీర్థములు; పుణ్యక్షేత్రము ; పాత్రి; షడ్దర్శనములు (1 కపిలకృతసాంఖ్యము 2 పతంజలికృతయోగము 3 గౌతమకృతన్యాయము 4 కాణాదకృతవైశేషికము 5 జైమినికృతపూర్వమీమాంస 6 వ్యాసకృతోత్తరమీమాంస)

చాణక్యనీతిశాస్త్రానుసారము పదునెన్మిదితీర్థము లిట్లు చెప్పబడినవి. 1. మంత్రి, 2. పురోహితుడు, 3. యువరాజు, 4. సేనాపతి, 5. దౌవారికుడు, 6. అంతర్వంశికుడు, 7. కారాగారాధిపతి, 8. అర్థసంచయకర్త, 9. కార్యనియోజకుడు, 10. ప్రాడ్వివాకుడు, 11. సేనానాయకుడు, 12. నగరాధ్యక్షుడు, 13. కర్మాంతికుడు, 14. సభ్యుడు, 15. ధర్మాధ్యక్షుడు, 16. దండపాలుడు, 17. దుర్గపాలుడు, 18. రాష్ట్రాంతపాలుడు. వీరిలో మంత్రిపురోహిత యువరాజులు దక్క మిగిలినవారు స్వపక్షముతో బదునైదు తీర్థము లనబరగుచున్నారు.

ఈ పదునెన్మిది తీర్థములనుగూర్చి యిట విశేషముగా దెలుపబడుచున్నది. మంత్రి పురోహిత యువరాజులు ప్రసిద్ధులే. కాన నా పదముల కర్థము వివరింపలేను. (4) సేనాపతి (కమాండర్ ఇన్ ఛీఫ్), (5) దౌవారికుడు - (రాయల్ బాడీగార్డు) అంతఃపురాది ద్వారము లందుండు కాపలావారలపై నధికారి. అనగా వారు తమతమవిధిని సక్రమముగా నెరవేర్చుచుండిరా లేదాయని చూచువాడు. (6) అంతర్వంశికుడు - (హోము మానేజరు) అంతఃపురములోని జనంబులకు గావలసిన వస్తుసంచయము నిచ్చుట మున్నగు కార్యములను నిర్వహించువాడు, (7) కారాగారాధిపతి - (సూపరింటెండెంటు ఆఫ్ జైల్సు.) జైల్లకధికారి (8) అర్థసంచయకృత్తు -(ట్రెజరర్) బొక్క-

త్రిభి స్త్రిభి రవిజ్ఞాతై ర్వేత్తి తీర్థాని చారకైః ॥ 36

తత్రాధికృతః Superintendent of jails కారాగారాధికృతః; (8) అర్థసంచయకృత్ (Treasurer) - ధనాధ్యక్షః; (9) కార్య నియోజకః - Secretary రాజాజ్ఞయా బహిః ప్రచారకర్తా; (10) ప్రాడ్వివాకః Law member వ్యవహారప్రష్టా; తల్లక్షణ ముక్తం-"వివాదే పృచ్ఛతి ప్రశ్నం ప్రతిప్రశ్నం తథైవచ, ప్రియపూర్వం ప్రాగ్వదతి ప్రాడ్వివాక స్తత స్మృతః" ఇతి; (11) సేనానాయకః- సేనాయాః భృతిజీవనాదిదానాధ్యక్షః; Commander (12) నగరాధ్యక్షః - రాత్రౌ నగర శోధన నగరద్వారప్రాకారాదిరక్షణ సంవిధానకర్తా Mayor; (13) కర్మాంతికః - కార్యాంతే వేతనగ్రాహిణాం సైనికవ్యతిరిక్తానాం సర్వేషాం రాజ్ఞ స్సకాశా ద్దేకదా స్వయం వేతనం గృహీత్వా ప్రత్యేకం తద్యో గ్యం దాపయతి సః; Financiar (14) సభ్యః - ప్రతిదినం సభాలంకరణ రాజమంత్రి ప్రభృతి సముచితాసనవినసభ్యానయనా వశ్యనిరోధన యథోచిత వేశన సభానిశ్శబ్దీకరణ సభా రక్షణాది నియోజన నిర్వాహకః. Executive member (15) ధర్మా ధ్యక్షః Chief Justice - యదా భాగాదివిషయేషు వివాదం [illegible] తాం వివాదపదపరిశోధన పూర్వకం యథాధర్మశాస్త్రం [illegible] శమనకరః; (16) దండపాలః - పరస్వాపహార [illegible] రాధకారిణాం రాజాజ్ఞాప్రకారేణ కరశిరచ్ఛేదాది [illegible] జనపినియోజకః; Jailer (17) [illegible] సర్వ సంతతరక్షక జన [illegible]

సముపై నధికారి (9) కార్యనియోజకుడు - (సెక్రెటరి) రాజాజ్ఞల నన్నిటిని బ్రజలకు దెలియుటకై ప్రకటింపజేయువాడు. (10) ప్రాడ్వివాకుడు - (లా మెంబరు) వివాదములలో బ్రశ్న ప్రతి ప్రశ్నములు చేయు న్యాయాధికారి (11) సేనానాయకుడు - (కమాండర్) సైన్యముల కీయవలసిన జీతబత్తెములు బహుమానములు మున్నగునవి రాజునొద్దనుండి కైకొనియిచ్చువాడు. (12) నగరాధ్యక్షుడు - (మేయర్) రాత్రులందు దొంగతనమాదిగా గల నేరములు జరుగకుండ జూచుచు, నగరద్వారములు సరిగా బంధింపబడు చుండుట ప్రాకారరక్షణము మున్నగునవికూడ జూచువాడు. (13) కర్మాంతికుడు - (ఫైనాన్షియర్) సైనికులు గాక మిగిలినవారి కందఱికి రావలసిన జీతబత్తెముల నొక్కసారిగా రాజునొద్ద గైకొని వారివారికి బ్రత్యేకముగా నిచ్చువాడు (14) సభ్యుడు - (ఎగ్జిక్యూటివ్ మెంబరు) రాజసభాభవనము నలంకరించుట, రాజు మంత్రమున్నగు వారికి నుచితాసనముల నుచితస్థలంబుల నేర్పఱచుట, అసభ్యులను సభలోనికి రానియకుండుట, సభ్యులనుమాత్రమే రానిచ్చి వారల కుచితాసనంబు లిచ్చి గౌరవించుట, సభలో నుండువారు నిశ్శబ్దముగ నుండునట్లుచేసి తత్సభారక్షణము సేయుచున్న జనులకు నిర్వాహకుడు (15) ధర్మాధ్యక్షుడు - (ఛీఫ్ జస్టిస్) వివాదకారణముల నారసి ధర్మశాస్త్రానుసారముగ వివాదముల నుపశమింప జేయువాడు (16) దండపాలుడు - (జైలర్) అపరాధులకు విధించిన దండనములను నిర్వహించు జనుల కధికారి. (17) దుర్గపాలుడు - (ఫ్రాంటియర్ గార్డు) దుర్గముల నన్నిటిని రక్షించు జనుల కధికారి (8) రాష్ట్రాంతపాలుడు - (లెఫ్టినెంట్ గవర్నరు) తమరాజ్యమునకు సరి

*కచ్చి న్న లోకాయతికాన్ బ్రాహ్మణాం స్తాత సేవసే,
అనర్థకుశలా హ్యేతే బాలాః పండితమానినః. 38

♦ ధర్మశాస్త్రేషు ముఖ్యేషు విద్యమానేషు దుర్బుధాః,
బుద్ధి మాన్వీక్షికీం ప్రాప్య నిరర్థం ప్రవదంతి తే. 39

---

Guard (18) రాష్ట్రాంతపాలః - స్వరాష్ట్రసీమాం తే సర్వాసు దిక్షు పరరాజాక్రమణాదినివారణాయ సదా తద్రక్షణం కుర్వతాం నిర్వాహకః. Lieutenant governer ఇతి.

* వ్యా: కచ్చి న్న లోకాయతికానితి :— లోకాయతికాన్ - లోకే ష్వాయతం విస్తృతం లోకాయతం, ప్రత్యక్ష ప్రమాణం, తదేతేషా మస్తీతి లోకాయతికాః - ప్రత్యక్ష ప్రమాణకాః - నాస్తికాః - బౌద్ధచార్వాకాదయః. తాన్ బ్రాహ్మణాన్ న సేవసే కచ్చిత్? అసేవాయాం హేతుమాహ- అనర్థేతి. అనర్థః - ధర్మానుష్ఠానశ్రద్ధావైకల్యతన్మూలకజన బహిష్కారనరకపతనాదిః; తత్ర కుశలాః - దుర్బోధనేన తత్సంపాదకా ఇత్యర్థః. బాలాః - తత్త్వజ్ఞానవిరోధ్యజ్ఞాన యుక్తాః; అథచ పండితమానినః- అపండితం ఆత్మానం పండితం మన్వానాః.

♦ వ్యా: ధర్మశాస్త్రేష్వితి:—దుర్బుధాః - [illegible] విపరీత బుద్ధయః; తే ముఖ్యేషు ధర్మశాస్త్రే[illegible]

3౮. *ప్రత్యక్షప్రమాణకులగు బౌద్ధచార్వాకులను నీ విప్పుడును సేవించుట లేదుగదా? ఏలయన వీరిబోధలు వేదవిహిత ధర్మమార్గంబును బోధింపక యధర్మమార్గమున దోయుటచే నరకపతన మాదిగాగల్గు ననర్థముల గల్గించుటలో వీరు మహాబుద్ధికుశలులు.

3౯. ♦ ముఖ్యంబులగు ధర్మశాస్త్రంబు లెన్నియో యుండ శుష్కతర్కవిషయంబుల జేకొని వీ రెల్లప్పుడును నిరర్థకముగ బ్రలపించుచుందురు.

---

హద్దులుగా నున్న ప్రదేశములను ఆ సరిహద్దులలో నున్న రాజు లాక్రమణము చేసికొనకుండ జూచువాడు.

*వ్యా: ప్రత్యక్షప్రమాణకు లనుచోట:—శ్లోకములోని కొన్ని పదముల కిచట వివరణము తెలుపబడుచున్నది. లోకాయతికాః - ప్రత్యక్ష ప్రమాణకు లయిన బౌద్ధచార్వాకాదులు అనగా నాస్తికులని భావము. వారలను సేవింపరాదు. అట్లు సేవజేయుటచే ననర్థములు గల్గునని తెల్పబడుచున్నది; అనర్థకుశలాః - ధర్మానుష్ఠానమందాసక్తి నశించి శ్రద్ధావైకల్యమును, సజ్జనబహిష్కారమును గల్గి యాపైన నరకపతనమాదిగాగల్గు దుష్టఫలితములు గల్గించుటలో బిరుదందిన చేతులు. బాలాః - తత్త్వజ్ఞానమునకు విరోధియైన యజ్ఞానముతోగూడు కొన్నవారు; పండితమానినః - తా మపండితులయ్యు బండితుల మను కొనువారు; దుర్బుధాః - వేదమార్గమునకు విపరీతమైన బుద్ధిగలవారు.

♦ అట్టి వేదమార్గవిపరీత బుద్ధులు ముఖ్యములగు ధర్మశాస్త్రము లుండగ శుష్కతర్క విషయంబగు బుద్ధిని జేకొని ప్రలాపములు

♦కచ్చిత్ స్త్రియ స్సాంత్వయసి కచ్చి ద్గుహ్యాం న భాషసే
కచ్చి ద్దర్శయసే నిత్యం మనుష్యాణాం విభూషితం. ३८

దేవతార్థే చ పిత్రర్థే బ్రాహ్మణాభ్యాగతేషు చ,
యోధేషు మిత్రవర్గేషు కచ్చి ద్గచ్ఛతి తే వ్యయః. ४०

యాని మిథ్యాభిశస్తానాం పతం త్యశ్రూణి రాఘవ !
తాని పుత్త్రపశూ౯ ఘ్నంతి ప్రీత్యర్థ మనుశాసతః. ४१

---

సత్సంప్రదాయ పరంపరయా పఠ్యమానేషు సత్సు; ఆన్వీక్షికీం బుద్ధిం ప్రాప్య- శుష్కతర్కవిషయాం బుద్ధి మాస్థాయ; నిరర్థం - నిష్ప్రయోజనం; ప్రవదంతి. "ఆర్షం ధర్మోపదేశంచ వేద శాస్త్రావిరోధినా, యస్తర్కేణాఽనుసంధత్తే స ధర్మం వేద నేతరః" ఇతి.

♦ వ్యా: కచ్చిత్ స్త్రియ ఇతి :—అనేన స్త్రియో దానమానసత్కారైః పోష్యా ఇతి గమ్యతే, "అనిషిద్ధసుఖ త్యాగీ పశురేవ న సంశయః" ఇతి స్మరణాత్. తాసు విశ్వా సోపి నకర్తవ్యః. తథా చోద్యోగే, శ్లో "స్త్రీషు రాజసు సర్పేషు స్వాధ్యాయే శత్రుసేవిషు, భోగే ష్వాయుషి విశ్వాసం కః ప్రాజ్ఞః కర్తు మర్హతీ"తి.

౩౯. * నీ స్త్రీ లందఱికి సాంత్వనవచనంబులచే బ్రియంబు గల్గించుచు న్నావా? వారల కేమియు రహస్యంబులు చెప్పకుండనున్నావుగదా? సమస్తభూషణభూషితుండవై నీ ప్రజ లందరకు దర్శన మిచ్చుచు న్నావా?

౪౦. దేవతలు పితరులు బ్రాహ్మణులు అభ్యాగతులు యోధులు స్నేహితులు- వీరి విషయములో నీధనము పుష్కలముగ వెచ్చింపబడుచున్నదా?

౪౧. నేర మాచరింపకపోయినను నన్యాయముగ దండింపబడిన నిరప రాధులకన్నీ రా దండనాయకుని, బశుపుత్త్రిసహితంబుగ నాశము సేయును సుమా.

---

సేయుచుందు రనిభావము. "ఋషిప్రోక్తమై ధర్మోపదేశ రూపమై వేదశాస్త్రవిరోధియైన తర్కముచే జక్కపరచినచో నయ్యది చేకొనవలెను. ఇతరము చేకొనరాదు."

* వ్యా: నీ స్త్రీ లనుచోట:— ఇట్లు చెప్పుటచే నలంకారాది దానంబులచే స్త్రీల నెప్పుడును సమ్మానింపవలెనని యెఱుంగునది. శాస్త్రనిషిద్ధంబు కాని సుఖము ననుభవించుటయే లెస్స. అట్లు సేయని వాడు పశుతుల్యుడుగా బరిగణింపబడి పరిహాసమునకు బాత్రుడగును. ఇంతియకాని వారలందు సంపూర్ణ విశ్వాస ముంచుట మాత్రము ప్రమాదకరము. ఇట్లే యుద్యోగపర్వంబునను జెప్పబడినది:— స్త్రీలు రాజులు సర్పములు వేదాధ్యయనము శత్రుల సేవించువారు భోగములు ఆయువు - వీరియందు విశ్వాస ముంచరాదు.

♦ దశపంచచతుర్వర్గా న్సప్తవర్గంచ తత్త్వతః,
అష్టవర్గం త్రివర్గంచ విద్యా స్తిస్రశ్చ రాఘవ!, ౭౨

---

♦ వ్యా: దశపంచచేత్యత్ర:—దశవర్గాదికాన్ త్యాజ్యత్వే నోపాదేయత్వేన చ జ్ఞాత్వా యథావ దనుతిష్ఠసి కచ్చిదితి వాక్యార్థః. తత్రాదౌ త్యాజ్యత్వేన దశవర్గ ముదాహృతం. దశవర్గాదయో మనునా దర్శితాః:—"మృగయాఽక్షో దివా స్వాపః పరివాదః స్త్రియోమదః, తౌర్యత్రికం వృథాఽట్యాచ కామజో దశకో గుణః" ఇతి. పంచవర్గః- పంచ దుర్గాణి :—తథాహ మనుః :—"ఔదకం పార్వతం వార్‌క్ష మైరిణం ధాన్వనం తథా, శస్తం ప్రశస్తమతిభి ర్దుర్గం దుర్గోపచింతకై" రితి. చతుర్వర్గః - సామదానభేదదండోపాయాః. సప్తవర్గ స్స్వామ్యమాత్యాదిః, యథోక్తం స్వామ్యమాత్యౌచ రాష్ట్రంచ దుర్గం కోశో బలం సుహృత్, పరస్పరోపకారీదం రాజ్యం సప్తాంగ ముచ్యతే." యద్వా ప్రధాన వ్యూహా స్సప్త వా సప్తవర్గః. "శ్యేన సూచీచ వజ్రశ్చ శకటో మకర స్తథా, దండాఖ్యః పద్మనామాచ వ్యూహా స్సప్త ప్రధానతః" ఇతి. అష్ట వర్గ మాహ కామందకః:—"కృషి వాణిజ్య దుర్గాణి సేతుః కుంజరబంధనం, ఖన్యాకరః కరాదానం శూన్యానాంచ నివేశనం, అష్టవర్గ మిమం సాధు స్వవృత్తో నలోపయే" దితి. అథత్రివర్గః. ధర్మార్థకామాః; యద్వా ఉత్సాహప్రభు మంత్ర శక్తయ స్త్రివర్గః; యద్వా పరేషాం క్షయస్థానవృద్ధయః. తిస్రో విద్యాః- త్రయీ వార్తా

౪౨-౪౩-౪౪. ♦ దశవర్గమును, పంచవర్గమును, చతుర్వర్గమును, సప్తవర్గమును, నష్టవర్గమును, త్రివర్గమును, మూడువిద్యలను, నింద్రియములవశము గావించుకొనుట, సంధివిగ్రహాదులగు నాఱుగుణములను, దైవవశ

---

♦ ఈ శ్లోకములో గొన్నికొన్ని వర్గములు చెప్పబడినవి. వానివాని కన్నిటికి మన్వాదిస్మృతులనుండి ప్రమాణములు చూపబడుచున్నవి. కాన నిట సూచుకొనవలెను.

దశవర్గ మిట్లు చెప్పబడినది, మనుస్మృతి:— "వేట, జూదము, పగలు నిదురవోవుట, నిందవడుట, స్త్రీలోలత, మదము, నృత్తము, గీతము, వాద్యము, వృథాపర్యటనము నను నీ దశవర్గము కామవృద్ధికరంబగుట బరిహరింపదగినది." పంచవర్గము - మనుస్మృతి:— "జలదుర్గము, పర్వతదుర్గము, వృక్షదుర్గము, ఐరిణము, ధాన్వనము నను పంచవిధములగు దుర్గములు శ్రేష్ఠములుగా జెప్పబడుచున్నవి." చతుర్వర్గము:— సామము దానము భేదము దండము ననునవి, సప్తవర్గము:—రాజు, మంత్రి, రాష్ట్రము, దుర్గము, బొక్కసము, సేన, స్నేహితుడు ననువారు. వీనినే సప్తాంగ మందురు. ఇవి పరస్పరసాహాయ్యకరములు లేక సేనావ్యూహములలో బ్రధానమైన వేడు కలవు. వానిని సప్తవర్గ మన జెల్లును. అవి "శ్యేనవ్యూహము, సూచీవ్యూహము, వజ్రవ్యూహము, శకటవ్యూహము, మకరవ్యూహము, దండవ్యూహము, పద్మవ్యూహము" ననునవి. అష్టవర్గమును గామందకుడిట్లు చెప్పుచున్నాడు:— "కృషి, వాణిజ్యము, దుర్గము, సేతుబంధనము, (వంతెనకట్టుట) గజబంధనము, గనులు త్రవ్వుట, పన్నులు వసూలు చేయుట, శూన్యనివేశనము - ఇవి యష్టవర్గము. వీని నెప్పుడును బ్రభువు లేమరగూడదు." త్రివర్గము: ధర్మము, అర్థము, కామము; లేక ఉత్సాహశక్తి ప్రభుశక్తి, మంత్రశక్తి; లేక శత్రువులకుగల్గు క్షయము, స్థానము, వృద్ధి యనునవి. మూడువిద్యలు:— త్రయి,

ఇంద్రియాణాం జయం బుద్ధ్వా షాడ్గుణ్యం దైవమానుషం,
కృత్యం వింశతివర్గంచ తథా ప్రకృతిమండలం. ౮౩

దండనీతి శ్చేతి. తథాహ కామందకః:— "త్రయీ వార్తా దండనీతి రితి విద్యా హి మానవాః॥" ఇతి.

ఇంద్రియాణాం జయోపాయం. షడ్గుణా ఏవ షాడ్గుణ్యం తేచ సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయాః. దైవం మానుషం దేవమనుష్యేభ్య ఆగతం, వ్యసన మిత్యర్థః. దైవ మానుషంచ వ్యసనం ప్రత్యేకం పంచవిధం. యథాహ కామందకః: "హుతాశనో జలం వ్యాధి ర్దుర్భిక్షం మరణం తథా, ఇతి పంచవిధం దైవం మానుషం వ్యసనం పరం" "ఆయుక్తేభ్యశ్చ చోరేభ్యః పరేభ్యో రాజవల్లభాత్, పృథివీపతిలోభా చ్చ వ్యసనం పంచధా భవే"దితి. వింశతివర్గః బాలవృద్ధాదయో వింశతిసంఖ్యాః ప్రతిపక్షనృపతయో వింశతివర్గ ఇత్యుచ్యతే యథాహ కామందకః: "బాలో వృద్ధో దీర్ఘరోగీ తథా జ్ఞాతిబహిష్కృతః, భీరుకో భీరుజనకో లుబ్ధో లుబ్ధజన స్తథా, విరక్తః ప్రకృతిశ్చైవ విషయే ష్వతిసక్తిమాన్, అనేకచిత్తమంత్రశ్చ దేవబ్రాహ్మణనిందకః, దైవోపహతకశ్చైవ దైవచింతక ఏవచ, దుర్భిక్షవ్యసనోపేతో బలవ్యసనసంకులః, అదేశస్థో బహురిపు ర్యుక్తో కాలేన యశ్చ సః, సత్యధర్మవ్యపేతశ్చ వింశతిః పురుషా అమీ, ఏతైస్సంధిం న కుర్వీత విగృహ్ణీయాత్తు కేవల"మితి. ప్రకృతిమండలం:—"అరి ర్మిత్ర మరే ర్మిత్రం మిత్రమిత్రమతః పరం, తథాఽరిమిత్రమిత్రంచ విజిగీషోః పురస్సరాః.

ముచే గలుగు దుఃఖములు, మనుజులవలన గలుగు దుఃఖములును, బాలుండాదిగా గల నిరువదుండ్రు వర్గమును, ప్రకృతి, మండలము, యాత్రాదండవిధానములును, పద్మశకటాది వ్యూహప్రకారము

---

(వేదము) వార్త, దండనీతి యనునవి మనువు చెప్పిన మూడువిద్యలు. షడ్గుణములు:—సంధి, విగ్రహము. దండయాత్ర, ముట్టడివేయుట, మిత్రభేదము, సమాశ్రయము ననునవి. దైవమువలన గలుగు వ్యసనము లైదు. వీనిని కామందకు డిట్లు చెప్పుచున్నాడు:—"అగ్నిదాహము, జలబాధ, వ్యాధి, కఱవు, మరణము". మనుజులవలన గలుగు వ్యసనములును నైదువిధము లని కామందకుఁడు:— దుర్మార్గులు, చోరులు, శత్రువులు, రాజవల్లభులు, ప్రభువులు నను వారలవలన గలుగు వ్యసనములు మానుషవ్యసనము లనబరగుచున్నవి." వింశతి వర్గమనగా బాలాదులగువార, లిరువదివిధములుగ శత్రురాజు లున్నారు. ఆ యిరువదిరకముల వారిని గామందకు డిట్లు చెప్పుచున్నాడు:—బాలుడు, వృద్ధుడు, దీర్ఘరోగి, బంధుజనబహిష్కృతుడు, భయస్థుడు, భయస్థులగు పరిజనులు గలవాడు, లుబ్ధుడు, లుబ్ధులగు పరిజనము గలవాడు, విరక్తులగు పరిజనులు గలవాడు, విషయాభిలాష గలవాడు, చిత్తభ్రమ గలవాడు, దేవబ్రాహ్మణనిందకుడు, దైవవంచితుడు, దైవముమీదనే భార ముంచువాడు, క్షామపీడితుడు, సేనలు నాశమగుటచే దుఃఖించుచుండువాడు, విదేశీయుడు, శత్రువు లెక్కువగా గలవాడు, దుష్టగ్రహపీడితుడు, సత్యధర్మదూరుడు,—వీర లిరువదిమందితోడను సంధి చేసికొనరాదు. వీరలను నిగ్రహించియే తీరవలెను." ప్రకృతు లిట్లు చెప్పబడినవి:— మంత్రి, దేశము, దుర్గము, బొక్కసము, దండనము, సాధనము ననునవి. మండలం బనగా ద్వాదశరాజమండలం బని యర్థము. ఆ పండ్రెండుగురు రాజులును గామందకీయమం దిట్లు చెప్పబడుచున్నారు:— "జయమును గోరువాడు, (1) తన శత్రువు

యాత్రాదండవిధానంచ ద్వియోనీ సంధివిగ్రహౌ,
కచ్చిదేతా న్మహాప్రాజ్ఞ యథావ దనుమన్యసే. ౪౪
యాం వృత్తిం వర్తతే తాతో యాం చ నః ప్రపితామహాః
తాం వృత్తిం వర్తసే కచ్చి ద్యాచ సత్పథగా శుభా. ౪౫

---

పార్ష్ణిగ్రాహ స్తతః పశ్చా దాక్రంద స్తదనంతరః, ఆసారావనయో శ్చైవ విజిగీషో స్తు పృష్ఠతః, అరేశ్చ విజిగీషోశ్చ మధ్యమో భూమ్యనంతరః, అనుగ్రహే సంహతయో ర్వ్యస్తయో ర్నిగ్రహే ప్రభుః, మండలా ద్బహి రేతేషా ముదాసీనో బలాధికః, అనుగ్రహే సంహతానాం వ్యస్తానాంచ వధే ప్రభు''రితి. మండలం ద్వాదశవిధరాజాత్మకం - మధ్యతో విజిగీషుః - తస్య శత్రుః, మిత్రం, శత్రో ర్మిత్రం, మిత్రమిత్రం, శత్రుమిత్రం చేతి పురోవర్తినః పంచ; పార్ష్ణిగ్రాహః ఆక్రందః, పార్ష్ణిగ్రాహాసారః, ఆక్రందాసారశ్చేతి పృష్ఠభాగస్థా శ్చత్వారః; పార్శ్వస్థో మధ్యమః - తేషాం బహిరవస్థిత ఉదాసీన శ్చేతి. యాత్రాదండవిధానం యాత్రా - యానం, దండస్య - సైన్యస్య, సంవిధానం - వ్యూహభేదవిధానం. ద్వియోనీతి పూర్వోక్తమేవ. ఏతా న్పూర్వోక్తాన్ యథావ దనుమన్యసే కచ్చి దిత్యర్థః. ఉక్తదశవర్గాదీనాం తత్త్వం జ్ఞాత్వా హేయాన్ జహాసి గ్రాహ్యాన్ గృహ్ణాసి కచ్చి దితియావత్.

లును, సంధివిగ్రహములు - వీనిలో నే కనువుగ నున్నవి గైకొని మిగిలిన వాని నుజ్జగించుచుంటివా ?

౪౬. మన పితరులగు రాజర్షు లనుష్ఠించిన ధర్మప్రవృత్తిని నీవును విడనాడ కున్నాడవుగదా ?

---

2 మిత్రుడు 3 శత్రుమిత్రుడు 4 మిత్రునిమిత్రుడు 5 శత్రునిమిత్రునిమిత్రుడు నను జయింపనిచ్ఛగించువానికి ముందుండు వారైదుగురును, పార్ష్ణిగ్రాహుడు, ఆక్రందుడు, పార్ష్ణిగ్రాహాసారుడు, ఆక్రందాసారుడు నను వెనుకనుండువారు నల్వురును, పార్శ్వస్థుడు, మధ్యముడు, అను ప్రక్క వారిర్వురు, అవ్వలనుండు ఉదాసీనుడు, వెరసి ముప్వురును-మొత్తము పన్రెండుగురు. యాత్రా విధానంబన యుద్ధయాత్రావిధాన మని యర్థము. అది యిట్లు చెప్పబడినది:—మధ్యనుండు రాజుతో పోరి యావల నుండు రాజుపై నెత్తుట, సమీపస్థుడగు రాజుతో సంధిచేసికొని పరరాజుపై నెత్తుట, సమీపస్థుడగు రాజును గూడ గైకొనిపోవుట, ఒకనిపై యుద్ధసన్నద్ధుడై యాతడు బలవత్తరు డగుట దెలిసి యాతని నుజ్జగించినటుల నటించుచు మఱొకనిపై నెత్తిపోవుట యనునవి.

¹రామస్య వచనం శ్రుత్వా భరతః ప్రత్యువాచ హ. ౪౬½
కిం మే ధర్మాద్విహీనస్య రాజధర్మః కరిష్యతి,
జ్యేష్ఠే పుత్త్రే స్థితే రాజన్ న కనీయాన్ నృపో భవేత్. ౪౭½

అభిషేచయ చాత్మానం కులస్యాఽస్య భవాయ నః. ౪౮

కేకయస్థే తు మయి చ త్వయి చారణ్య మాశ్రితే,
దివ మార్యో గతో రాజా యాయజూక స్సతాం మతః. ౪౯

ఉత్తిష్ఠ పురుషవ్యాఘ్ర క్రియతా ముదకం పితుః,
అహం చాయం చ శత్రుఘ్నః పూర్వమేవ కృతోదకౌ. ౫౦

²వాగ్వజ్రం భరతే నోక్త మమనోజ్ఞం పరంతపః,
ప్రగృహ్య బాహూ రామో వై పుష్పితాగ్రో యథా ద్రుమః ౫౧
వనే పరశునా కృత్త స్తథా భువి పపాత హ. ౫౧½

ఉవాచ శోకసంతప్తః పూర్ణచంద్రనిభాననాం,
సీతే! మృత స్తే శ్వశురః పిత్రా హీనోసి లక్ష్మణ! ౫౨½

సుమంత్ర స్తై ర్నృపసుతై స్సార్ధ మాశ్వాస్య రాఘవః,
అవతారయ దాలంబ్య నదీం మందాకినీం శివాం. ౫౩½

---

1 వాల్మీ. రా: సర్గ ౧౦౧; 2 వాల్మీ. రా: ౧౦౨ సర్గః

౪౬½. ఇట్లు శ్రీరామచంద్రుడు పల్కుచుండ నాతనితో భరతు డిట్లనెను.

౪౭½. అన్నా! శ్రీరామచంద్రా! యీ రాజనీతిమార్గ మేల కఱపుచుంటివి? ఎవరికి గఱపుచుంటివి? ధర్మవిహీనుండ నగు నాకీ రాజధర్మోపదేశములతో బనియేమి? జ్యేష్ఠుడవగు నీ వుండ గనిష్ఠుడ నగు నాకీ రాజ్యపాలనము సేయు నధికారమే లేదుగదా.

౪౮. ప్రభూ! జ్యేష్ఠుడ వగు నీ వయోధ్యకు వచ్చి పట్టాభిషేకము బొందినచో మన వంశమునకును మిగుల సేమంబగును.

౪౯. నేను కేకయదేశమునకు బోయియుంటిని. మఱి గారాబుబట్టివగు నీ వడవులపాలై వచ్చితివి. సన్మార్గప్రవర్తకుడును యజ్ఞశీలుడును నైన మనతండ్రి యిది భరింపలేక స్వర్గమునకు బోయెను.

౫౦. కాన నాయన కుదకప్రదానంబు సేయవలయును, లెమ్ము. ఈ శత్రుఘ్నుడును నేనును మున్నె చేసియుంటిమి.

౫౧-౫౧½. వజ్రకఠినం బగు నీవాక్కు చెవిని బడుటతోడనే గొడ్డలిపెట్టు వడిన చెట్టుంబోలె, బాహువులు పైకెత్తుచు శ్రీరాముండును నిట్ట నిలువున గూలిపోయెను.

౫౨½. కొంతవడికి దెలిసి యా శ్రీరాముడు పూర్ణచంద్రప్రతిమానానన యగు నాసీతతో 'జానకీ! నీ మామగారు మరణించి' రనియు వినయ సంపన్నుండగు లక్ష్మణునితో 'నాయనా! లక్ష్మణా! నీవు తండ్రిలేని వాడ వయితి' వనియు ననుచు మిగుల దుఃఖింపసాగెను.

౫౩-౫౪ శ్రీరామచంద్రు నల్లన లేవనెత్తి సుమంత్రుడును భరతాదులును నాతని గంగానదికి గొంపోయి తత్పుణ్యజలంబుల మెల్లగా దింపి స్నానము చేయించి తామును గ్రుంకు లిడినపైన నారాజపుత్త్రు

♦ నిషిచు స్తూదకం రాజ్ఞే తత్రైత త్తే భవత్వితి. ౫౪

* ఐంగుదం బదరీమిశ్రం పిణ్యాకం దర్భపి స్తరే,
న్యస్య రామ స్సుదుఃఖార్తో రుదన్ వచన మబ్రవీత్. ౫౫

---

♦ వ్యా: నిషిచు రిత్యత్ర:–అత్ర కృతౌర్ధ్వదైహికస్యాపి పితూ రామేణ నివాపోదకదానాత్ అన్యై రపి దేశాంతరస్థైః పుత్రైః కృతౌర్ధ్వదైహికస్యాపి పితుః నివాపోదకదానాది కర్తవ్య మితి సూచితం. తథా చ గౌతమః "దహానాదినపిండాంతం కనిష్ఠాద్యైః కృతం యది, పితో ర్దేశాంతరేజ్యేష్ఠ స్త చ్ఛ్రుత్వా శ్రవణాహతః, కుర్యా త్క్షౌరాది శోకేవా రాత్రౌ శ్రుత్వా పరాహ్ణతః, ఉప్తకేశో దశాహాంతం దద్యా త్త్రింశ ద్ఘటైవవా."

* వ్యా:—నన్వనేన వచనేన స్నానసమనంతరమేవ రామేణ పిండదానం కృతమితి ప్రతిపాదితం. తత్కిం దశాహమధ్యే కర్తవ్య పిండదానాదిక ముత సపిండీకరణాదికం? నాద్యః దశాహమధ్య కర్తవ్యపిండదానస్య కృతౌర్ధ్వదైహికవిష[illegible] పునరావృత్తిప్రతిషేధాత్. తథాచ స్మృత్యంతరే

లిద్దఱును "ఈ యుదకము నీకొఱకై యగుగా"కనుచు ♦ నుదక
ములు విడిచిరి.

౫౫-౫౬ శ్రీరాముండును *నింగుదీబదరీపిణ్యాకమిశ్రమం బగు పిండమును
గైకొని దక్షిణాగ్రంబులగు దర్భలపై నుంచి మిగుల దీనముగా
నేడ్చుచు, 'మహాప్రభూ! ఇదిగో యీ పిండమును భుజింపుము

---

♦ వ్యా: ఉదకదానమనుచోట:— భరతుడును శత్రుఘ్నుడును
దశరథుని కిదివఱకే యథావిధిగా నపరకర్మము జేసియుండిరి. అయి
నను నిప్పుడు శ్రీరాముడు పితృ మరణవార్తను విని మఱల నుదక
దానం బిచ్చినటుల నిట బోడకట్టుచున్నది. దీనింబట్టి జ్యేష్ఠుడు
దేశాంతరగతు డైనప్పుడు పితరులు మరణించినచో సన్నిధానమున
నున్న కనిష్ఠాదికుమారులు యథావిధిగ నపరకర్మంబు జేసినను,
జ్యేష్ఠుం డామరణవార్త వినినప్పుడు మఱల నుదకదానాదికంబు
సేయవలయునని యేర్పడుచున్నది. ఇట్లే గౌతముడును:—"జ్యేష్ఠుండు
గాక తక్కినకుమారులు శవదహనమాదిసపిండీకరణాంతముగ గర్మంబు
జేసినను దేశాంతరగతుడగు జ్యేష్ఠుం డీ మరణవార్తను విన్నప్పుడు
క్షురకర్మం బాదిగ సమస్తకర్మంబును జేయవలయును. రాత్రిపూట
వినినచో మఱునాటి పగలు చేయవలయును. ఇట్లు క్షురితకేశుండై
దశాహాంతము నివాపాంజలు లీయవలెను."

* వ్యా: ఇంగుదీపిండమనుచోట:— ఈ శ్లోకములో స్నానా
నంతరము శ్రీరాము డింగుదీపిండదానము చేసెనని చెప్పబడి
నది. ఇది యేపిండదానము? దశాహములలో జేయంబడు పిండ
దానమా? దశాహాశౌచానంతరము చేయబడు సపిండీకరణమా?
దశాహములలోపల జేయదగు పిండదానముకాదు. ఏలయన ఔర్ధ్వదై
హిక మాచరింపబడిన తరువాతి మఱల చేయబడు నిత్యశ్రాద్ధమంతు

ఇదం భుంక్ష్వ మహారాజ ప్రీతో యదశనా వయం,
యదన్నః పురుషో భవతి తదన్నా స్తస్య దేవతాః. ౩౮

---

కర్తా విదేశస్థః కాలే ఽ కాలే శ్రుతౌ యది, తిలవారి ప్రకు ర్వంతి పిండదానం విసర్జయేత్'' ఇతి. కాలే - ఏకోద్దిష్ట సమయే; అకాలే - తదనంతరమితి. న ద్వితీయః "పిత రాచేన్మృతౌ స్యాతాం దూరస్థోపి హి పుత్రకః, శ్రుత్వా తద్దిన మారభ్య దశాహం సూతికో భవేత్" ఇతి పైఠీనసి వచనపర్యాలోచనయా శ్రవణదిన మారభ్య దశాహ పర్యంత మశౌచసత్త్వేన "శ్లో. సర్వేషామేవ వర్ణానా మాశౌ చాంతే సపిండన" మితికాత్యాయనవచనపర్యాలోచ నయా ఆశౌచాంతే కర్తవ్యస్య సపిండీకరణస్య శ్రవణదిన ఏవ అశుద్ధేన కర్తు మశక్యా దితిచేన్న, సపిండీకరణప్రతిపాదక ఏవాయం పిండశబ్దః. న చ శుద్ధ్యనంతరకర్తవ్యస్య సపిండీకర ణస్య శ్రవణదిన ఏవ కథ మనుష్ఠాన మితివాచ్యం, వ్రతినః క్రియావతో రాజ్ఞో రామభద్రస్య సద్య శ్శుద్ధత్వేన స్నాన సమనంతరమేవ కర్తుం శక్యత్వాత్. తథాచ దక్షః. "రాజ ర్త్విగ్దీక్షితానాం చ బాలే దేశాంతరేతథా, వ్రతినాం సత్రి ణాంచైవ సద్యశ్శౌచం విధీయతే." ఇతి. "వృత్తస్వాధ్యాయ సాపేక్ష మఘసంకోచనం తథా" ఇత్యుపక్రమ్య "కలా యుగే త్విమా న్ధర్మా స్వర్జ్యా నాహు ర్మనీషిణః, దశాహ ఏవ విప్రస్య సపిండమరణే సతి, కల్యంతరాణి కుర్వాణః కలా వ్యామోహ కిల్బిషి" ఇతిహారీతః. "న కర్తవ్యంశ్చ క

మేమును నింగుదీపిష్టమునే భుజించుచున్నాము. ఏ యన్నము నే పురుషుడు భక్షించునో యాతని దేవతలకును నదియే భోజ్యమగు చున్నదిగదా?" యనెను.

---

పిండదానము చేయుటకు ధర్మశాస్త్రం బొప్పుకొనదు గాన నిప్పుడు చేసినది యా పిండదానము కాదు. ఇందులకు స్మృతి ప్రమాణమును గలదు:— "ముఖ్యకర్తయగు వాడు (అనగా జ్యేష్ఠుడు) విదేశముల నుండగా దలిదండ్రులు మరణించిన వార్త వాడు పది దినములలోగా వినినను బది దినముల యనంతరము వినినను దిలోదకదానము చేయవలెను; పిండదాన మక్కఱలేదు." పోనిండు దశాహానంతరము చేసెడు సపిండీకరణమే యిది యందమా? అట్లనుటకును వలనుపడదు. "కుమారుడు సన్నిధానమున లేనప్పుడు తలిదండ్రులు మరణించినచో నత డావార్త (దశాహముల తరువాత) వినినచో నప్పటినుండియు నాతడు పదిదినములు సూతకము పట్టవలె" నని పైఠీనసిధర్మశాస్త్రమందు జెప్పబడుచున్నది. పైశ్లోకప్రకరణముంబట్టి శ్రీరాముడు భరతునివలన బితృమరణవార్త నెఱింగిన వెంటనే సుమంత్రాదులాతనికి దుఃఖోపశమనంబు జేసి గంగానదికి గొంపోయి స్నానం బాడించిరనియు శ్రీరాముండంతట నింగుదీపిండదానము చేసెననియును దెలియుచున్నది గదా! "సర్వవర్ణములవారును నశౌచానంతరమే సపిండీకరణము చేయవలెను." అని కాత్యాయనుడు చెప్పుచున్నాఁడు. కాన మొదటి పైఠీనసిప్రమాణముచే శ్రీరామున కశౌచము గలుగుచున్నది. రెండవదగు కాత్యాయన ప్రమాణముచే నశౌచములో నుండగా సపిండీకరణము చేయరాదని తెలియుచున్నది గాన శ్రీరాముడు చేసిన యింగుదీపిండదానము సపిండీకరణమును గాదు. ఇటుల శ్రీరాముడు చేసిన పిండదానమేమని పూర్వపక్షము కలుగగా దాని క్రిందివిధమున సమాధానము చెప్పబడుచున్నది.

శ్రీరాముడు చేసిన యింగుదీపిండదానమున కర్థము సపిండీకరణమే యని నిర్ధారణగా నెఱుగవలెను. కాని యశౌచయుతుడగు

తత స్తేనైవ మార్గేణ ప్రీత్యు త్తీర్య నదీతటాత్,
ఆరురోహ నరవ్యాఘ్రౌ రమ్యసానుం మహీధరం. ౫౭

---

సుత్యాసంకోచనం కలా" ఇత్యాదివచనానగత్యోఽయ మఘ సంకోచనిషేధస్తు కలియుగవిషయః. పరమపురుషస్య కల్యాణ చరిత్రస్య శ్రీరామభద్రస్యతు త్రేతాయుగవర్తిత్వాత్ సద్య శ్శుద్ధి ర్భవత్యేవ. నన్వేవ మపి భరతేన ప్రాగేవ సపిండీకరణస్య కృతత్వేన కథం రామేణ పునఃకరణ మితిచేన్న, "యవీయసా కృతం కర్మ ప్రేతశబ్దం విహాయతు, తజ్జ్యాయసాఽపి కర్తవ్యం సపిండీకరణం పునః" ఇత్యాది శాస్త్రపర్యాలోచనయా దేశాంతరస్థేన జ్యేష్ఠపుత్రేణ కృతౌర్ధ్వదైహికమపి పితుః ప్రేతశబ్దం విహాయ పునస్సపిండీకరణస్య కర్తవ్యత్వాత్, నచ సపిండీకరణస్య బ్రాహ్మణభోజనసాపేక్షత్వాత్ ఇహాచ పిండదానమాత్రశ్రవణాత్ కథ మిదం సపిండీకరణ మితివాచ్యం, ఉదాహృతవచనపర్యాలోచనయా సపిండీకరణ స్యావశ్యకర్తవ్యత్వేన తదనురోధిత్వాత్ అత్రత్య పిండదానశబ్దస్య బ్రాహ్మణభోజనోపలక్షకత్వసంభవాత్.

౫౭-౫౮. ఇట్లు చెప్పుచు, పోయిన మార్గంబునఁ నే యన్నదీతటమునుండి వెలువడి, బహుచిత్రసానురమ్యంబగు నా చిత్రకూటంబు జేరి, పర్ణ

---

శ్రీరాముడు సపిండీకరణ మెట్లు చేసె ననుప్రశ్నకు సమాధాన మేమి? వ్రతియు గర్గనిరతుండును రాజశ్రేష్ఠుడు నగు శ్రీరామచంద్రుడు నిత్యశుద్ధుఁ డగుటవలన మరణవార్తాశ్రవణస్నానానంతరమే సపిండీకరణము జేయుటలో లోప మేమియు లేదు. అశౌచదోషము సామాన్యజనులకే కాని శ్రీరామచంద్రునిబోటి వ్రతులకు నుండదు. ఇట్లే దక్షుడును జెప్పుచున్నాడు: "రాజులు, ఋత్విక్కులు, వ్రతులు, బ్రహ్మచారులు, దేశాంతరస్థులు - వీరివిషయములో సద్యశ్శౌచమే విధింపబడుచున్నది. వ్రతులు, స్వాధ్యాయసంపన్నులు మున్నగువారి విషయములో నశౌచము పదిదినములు పట్టకుండ గొలది దినములే పట్టుట, సద్యశ్శౌచము మున్నగు ధర్మము లుండెను. కలియుగములో మాత్ర మీ ధర్మముల నాచరణములో బెట్టరాదని హారీతుడు మున్నగువారు చెప్పియుండిరి. ఇట్లు వీరు చేయరాదని చెప్పిన యశౌచసంకోచము సద్యశ్శౌచము మున్నగునవి కలియుగ విషయములుగాన త్రేతాయుగమందున్న శ్రీరామచంద్రునికి సద్యశ్శౌచమే విధింపబడుచున్నది.

ఇంక, భరతాదులు సపిండీకరణము మున్నగు నపరకర్మము నిదివఱకే చేసియుండిరి గదా ? ఇప్పుడు శ్రీరామచంద్రుడు మఱల నేల చేయవలెనను ప్రశ్న కలుగుచున్నది. "కనిష్ఠాదికుమారు లపరకర్మముం జేసినను ప్రేతకార్యముగాక సపిండీకరణాదికము ప్రత్యేకము జ్యేష్ఠుడు మఱల జేయవలెను." అను శాస్త్రప్రమాణముచే దశరథునకు భరతాదు లౌర్ధ్వదైహికం బాచరించినను జ్యేష్ఠుం డగు శ్రీరాముడు తిరిగి చేయవలసియే యున్నది. సపిండీకరణములో బ్రాహ్మణభోజనము మున్నగునవి యుండును గదా! ఇచట నింగుదీపిండదానమొక్కటే చేసినట్లు తెలియుచున్నదే! ఇది సపిండీకరణ మెట్లగునను సందేహమునకును నవకాశము లేదు. ఏలయన పైన నుదాహరించిన శాస్త్రబలముచే సపిండీకరణము తప్పక చేయవలె నని యేర్పడు

తతః పర్ణకుటీద్వార మాసాద్య జగతీపతిః,
పరిజగ్రాహ బాహుభ్యా ముభౌ భరతలక్ష్మణౌ. ౫౮

మహాబలానాం రుదతాం కుర్వతా ముదకం పితుః,
విజ్ఞాయ తుములం శబ్దం త్రస్తా భరతసైనికాః. ౫౯
హయై రన్యే గజైరన్యే రథైరన్యే స్వలంకృతైః,
సుకుమారా స్తథైవాఽన్యే పద్భిరేవ నరా యయుః. ౬౦

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అయోధ్యాకాండే
షోడశ స్సర్గః.

---

## సప్తదశ స్సర్గః.

[1]సర్వభోగైః పరిత్యక్తం రామం సంప్రేక్ష్య మాతరః,
ఆర్తా ముముచు రశ్రూణి సస్వరం శోకకర్శితాః. ౧

తాసాం రామ స్సముత్థాయ జగ్రాహ చరణాన్ శుభాన్. ౧½

సౌమిత్రిరపి తా స్సర్వా మాతౄ స్సంప్రేక్ష్య దుఃఖితః,
అభివాదయతాఽసక్తం శనై రామా దనంతరం. ౨½

సీతాపి చరణాం స్తాసా ముపసంగృహ్య దుఃఖితా. ౩

---

1 వాల్మీకి. రా : సర్గ ౧౦౩

శాలాద్వారముకడ కేగి యా భరతలక్ష్మణులను జేరియొక బాహు వుచే బట్టుకొని శ్రీరాముడు రోదనము చేయసాగెను. భరతాదులు నేడువదొడంగిరి.

౫౯-౬౦ ఇట్లా రాజపుత్రు లందఱును గొసలు మార్మ్రోగునట్లుగ విల పించుచుండ నమ్మహారావమును విని భరతుని పైనిక లందఱు నివ్వెఱ బొంది కొంద ఱేనుగులపైనను మఱి కొందఱు గజంబులపైనను, గొంద అశ్వములపైనను గొందఱు రథంబులపైనను, గొందఱు కాలినడకను నచటికి వచ్చి చేరిరి.

ఇది శ్రీరామాయణసారోద్ధారంబున నయోధ్యాకాండంబునందు బదునాఱవ సర్గము.

---

## పదునేడవ సర్గము.

౧. ఇట్లు దుఃఖసాగరంబున మునిగియున్న శ్రీరామచంద్రుని జూచి కౌస ల్యాదులగు రాజభార్య లందఱును మిగుల దుఃఖించిరి.

౧౪. శ్రీరామచంద్రుడును లేచి వారి పాదంబులు పట్టుకొని నమస్కరించెను.

౨౪. లక్ష్మణుడును వారలను జూచి వావిడిచి దుఃఖించుచు శ్రీరాముని యనంతరము తల్లులకు నమస్కరించెను.

3. సీతయును దుఃఖితురాలై యత్తల పాదములకు నమస్కరించెను.

---

చున్నది. అదిగాక పిండదానశబ్దము తక్కిన బ్రాహ్మణభోజనాది కార్యములకును నుపలక్షణం బని యెఱుగునది.

తాం పరిష్వజ్య దుఃఖార్తాం మాతా దుహితరం యథా,
వనవాసకృశాం దీనాం కౌసల్యా పర్యదేవయత్. ౪

[1] సర్వే రుదిత్వా సుచిరం స్నాత్వా జగ్ముర్యథాశ్రమం,
తస్మింస్తు దివసే సర్వే ఉపవాసం ప్రచక్రిరే. ౫

[2] పురోహితస్యాగ్నిసమస్య వై తదా బృహస్పతే రింద్ర ఇవాఽమరాధిపః, ప్రగృహ్య పాదౌ సుసమృద్ధతేజస స్సహైవ తేనోపవివేశ రాఘవః. ౬

తతో జఘన్యం సహితై స్స్వమంత్రిభిః పురప్రధానైశ్చ సహైవసైనికైః, జనేన ధర్మజ్ఞతమేన ధర్మవా నుపోపవిష్టో భరత స్తదాఽగ్రజం. ౭

తతః పరేద్యు ర్విమలే స్నాత్వా మందాకినీజలే,
ఉపవిష్టం సమాలింగ్య భరతో రామ మబ్రవీత్. ౮

[3] స్త్రియా నియుక్తః కైకేయ్యా మమ మాత్రా పరంతప!
చకార సుమహా త్పాప మిద మాత్మయశోహరమ్. ౯

తస్య మే దాసభూతస్య ప్రసాదం కర్తు మర్హసి,
ఇమాః ప్రకృతయ స్సర్వా విధవామాతరశ్చ యాః. ౧౦

త్వత్సకాశ మనుప్రాప్తాః ప్రసాదంకర్తు మర్హసి,
అభిషించస్వ చాద్యైవ రాజ్యేన మఘవా నివ. ౧౧

---

1 అధ్యా. రా: సర్గ ౯; 2 వాల్మీ. రా: సర్గ ౧౦౩; 3 వాల్మీ. రా: సర్గ ౧౦౪

౪. ఇట్లేడ్చుచున్న యాసీతాదేవిని గూతును మాతయుంబోలె గౌగిలించు కొని కౌసల్యయు బెల్లుగ నేడ్చెను.

౫. ఇట్లు కౌసల్యాదులును భరతాదులును నేడ్చియేడ్చి స్నానం బాచ రించి యాశ్రమమునకు బోయి యా దినమంతయు నుపవసించిరి.

౬. శ్రీరామచంద్రుం డిట్లు తల్లులకు నమస్కరించి యనంతరము పురో హితుండగు వశిష్ఠమహర్షి పాదంబులు పట్టుకొని బృహస్పతిపదం బుల బట్టిన యింద్రునింబోలె గడు వెలింగెను.

౭. అంత మంత్రిపురోహిత పురప్రధాన ధర్మాధ్యక్షాదులు కొల్వుదీఱి రాగా భరతుడు రాముని జేరియుండెను.

౮. మఱునా డుదయముననే లేచి గంగానదీపుణ్యజలంబుల స్నానంబా చరించి యాశ్రమమున గూరుచుండిన శ్రీరాముని జేరి భరతుం డిట్లనెను.

౯. శ్రీరామా! కైకేయీకామవశుడై మనతండ్రి యీయనిష్టకార్యం బొనరించినాడు. ఇది యీతని యశంబున కెంతయు గళంక మాపా దించును.

౧౦-౧౧. అంతియకాని నే జేసిన దోసం బేమియు లేదు. నన్ను గరుణ గాంచుము. అనాథలై యీ కౌసల్యాదు లెంతయు గుమారిలి పోవు చున్నారు. ఈ నాగరజానపదు లందఱును వగతిపులై నీ యండగోన జూచుచున్నారు. వీరలపై నింత యనుగ్రహించి యయోధ్యకు మఱలివచ్చి పట్టాభిషేకం బొందుము.

౧౨. శ్రీరామచంద్రా! నాతల్లి కోర్కెప్రకార మీ సమస్త రాజ్యంబును మన తండ్రిచే నాకీయబడెనుగదా! మఱి యీ రాజ్యంబును నీకై సమర్పించుకొనుచున్నాను. ఇకార్యంబునకై కైకేయినిగూడ నొడంబఱచియున్నాడను. కాన నీ రాజ్యంబును గైకొని నిష్కంటకముగా బాలింపుము.

౧౩. ఇట్లు దీనుడై పల్కుచున్న యా భరతుని శ్రీరాముడిట్లాశ్వాసింపదొడంగెను.

౧౪. ఓయీ! భరతా! యీ పురుషు * డస్వతంత్రుడగుటచే నేకార్యమును జేయుటకును సమర్థుడు గాడు. కాన నే మనుజునికైనను నొకదేశమునుండి మఱొక ప్రదేశమునకు గొంపోవుటకు దైవమే కారణము.

౧౫. సూర్యు డుదయంబు నొందుట జూచి ధనార్జనము మున్నగు కార్యములు సేయవచ్చుంగదా యని యీ లోకులు సంతసిల్లుచుందురు. సూర్యుం డస్తమించుటను జూచి కామాదిభోగముల గాంచవచ్చుంగదా యని యుప్పొంగుచుందురు. అంతియకాని తమ జీవితమున నొక్కొక్క దినము గడచిపోవుచుండు టెఱుంగరు.

* వ్యా: అస్వతంత్రు డనుచోట.—ఈ శ్లోకమునకు వివరణము తెలుపబడుచున్నది: యతః - ఏకారణమువలన; అయం పురుషః - ఈ పురుషుడు; అనీశ్వరః - అస్వతంత్రుడో; తతః - ఆకారణమువలన; ఆత్మనః - పురుషకారమునకు; కామచారః - స్వేచ్ఛావ్యాపారము; న - లేదు; ఇతరతః - మఱియొకప్రదేశమునుండి; ఇతః - ఇక్కడకు; కృతాంతః - దైవమే; ఏనం - ఇతనిని; పరికర్షతి - ఆకర్షించుచున్నాడు. ఇట్లే భగవద్గీతయందును జెప్పబడుచున్నది. “సర్వభూతప్రభుం డగు పరమేశ్వరు డాయాయి భూతముల హృదయక్షేత్రములం దుండి యొందఱి జాలికుడు యంత్రారూఢంబు

1 న మయా శాసనం తస్య త్యక్తుం న్యాయ్య మరిందమ!
తత్త్వయాపి సదా మాన్యం స వై బంధు స్స నః పితా. ౧౬

2 ఉవాచ భరత శ్చిత్రాం ధార్మికో ధార్మికం వచః. ౧౬॥

ప్రోషితే మయి యత్పాపం మాత్రా మత్కారణా త్కృతం,
క్షుద్రయా తదనిష్టం మే ప్రసీదతు భవా న్మమ. ౧౭॥

అంతకాలే హి భూతాని ముహ్యంతీతి పురాశ్రుతిః
రాజ్ఞైవం కుర్వతా లోకే ప్రత్యక్షా సా శ్రుతిః కృతా. ౧౮॥

ఇహైవ త్వాఽభిషిఞ్చన్తు సర్వాః ప్రకృతయ స్సహ,
ఋత్విజ స్సవశిష్ఠాశ్చ మంత్రవ న్మంత్రకోవిదాః. ౧౯॥

* శిరసా త్వాఽభియాచేఽహం కురుష్వ కరుణాం మయి,
బాంధవేషుచ సర్వేషు భూతేష్వివ మహేశ్వరః. ౨౦॥

---

ఽఽచార్యేణః-"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున!
తిష్ఠతి, భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢాని మాయ
యా" ఇతి. తథాఛాందోగ్యే చః-"జానామి ధర్మం నచ మే
ప్రవృత్తి ర్జానా మ్యధర్మం నచ మే నివృత్తిః, త్వయా హృషీ
కేశ! హృదిస్థితేన యథా నియుక్తోఽస్మి తథా కరోమి.

* వ్యా : శిరసేతి:—శ్లోకస్థమహేశ్వరశబ్దం పితృ

---

1 వాల్మీ. రా : సర్గ ౧౦౫; 2 వాల్మీ. రాః సర్గ ౧౦౬.

౧౬. కాన సత్యయుక్తుం డగు మన తండ్రియాజ్ఞను శిరసావహించుటయే నాకును నీకును గర్తవ్యము.

౧౭౪. ఇది విని ధర్మాత్ముండగు భరతుండును నిటులు చెప్పదొడంగెను.

౧౭౪. అన్నా! నేను బొదేశంబున నుండ నధార్మికురాలగు నాతల్లి యీ పాపంబున కొడిగట్టినది. కాని యిట్టి యనిష్టంబును నే నెన్నడును వాంఛించి యుండలేదు. నన్ననుగ్రహింపుము.

౧౮౪. అవసానకాలమందు బ్రాణులకు విపరీతబుద్ధులు పొడముచుండునని సామెత గలదు. అది మనతండ్రివిషయములో బ్రత్యక్షప్రమాణ మైనది.

౧౯౪. కాన మతిచెడిన నాయనతో మనకు నిమిత్తమేల? ఈ సర్వజనంబులును వశిష్ఠాది పురోహితులును సుమంత్రాదిమంత్రిసత్తములును నీ కిక్కడనే యభిషేకం బొనరింతురు.

౨౦౪ శ్రీరామా! నీ కిదే తలతో మ్రొక్కుచున్నాను. అభిషేకం బొంది నాయందు దయ జూపుము. *భూతములందు మహేశ్వరుడువోలె నీ సమస్తబంధువులందును గరుణింపుము.

లగు వసుజాలము ద్రిప్పినట్లుగ నా భూతముల నాడించుచున్నాడు." ఉద్యోగపర్వమందును నిట్లే చెప్పబడినది : "ధర్మంబు లన్నియు నాకు దెలియును. కాని యందు బ్రవర్తించియే తీరవలె నను నిర్బంధ ప్రవృత్తి నా కేమియు లేదు. అధర్మరూపంబును నెఱుంగుదును. అందు నిర్బంధనివృత్తియును లేదు. మఱి హృదయపీఠుం డగు పరమేశ్వరుడు నన్నేమి సేయుటకు నియోగించునో యయ్యదిమాత్రమే చేయుటకు స్వతంత్రుడను.

*వ్యా:—మహేశ్వరు డనుచోట:— ఈశ్లోకములో మహేశ్వర శబ్దంబు ప్రయోగింపబడినది. దీనిని జ్ఞాది శ్లోకదరు వదుములు గటు

అథైత త్స్వప్రతః కృత్వా వన మేవ భవా నితః,
గమిష్యతి గమిష్యామి భవతా సార్ధ మప్యహం. ౨౧౪
1 ఉవాచ భరతం రామః స్నేహార్ద్రీసయన్నై శ్శుభైః. ౨౨

శృణు వత్స! ప్రవక్ష్యామి త్వయోక్తం యత్తథైవ తత్,
కింతు మా మబ్రవీ త్తాతో నవవర్షాణి పంచచ. ౨౩
ఉషిత్వా దండకారణ్యే పురం పశ్చా త్సమావిశ,
ఇదానీం భరతాయేదం రాజ్యం దత్తం మయాఖిలం. ౨౪
తస్మా ద్రాజ్యం ప్రశాధి త్వం వయం దండకపాలకాః. ౨౪½

ఇత్యుదీరిత మాకర్ణ్య రామస్య భరతోఽబ్రవీత్,
తథైవ చీరవసనో వనే వత్స్యామి సువ్రత! ౨౫½
చతుర్దశ సమా స్త్వంతు రాజ్యం కురు యథాసుఖం. ౨౬

[2] త మృత్విజో నైగమయూథవల్లభా స్తథా విసంజ్ఞాశ్రు
కలాశ్చ మాతరః, తథా బ్రువాణం భరతం ప్రతుష్టువుః
ప్రణమ్య రామంచ యయాచిరే తాః. ౨౭

కేచన మహాత్మా పరికరబంధేన మహేశ్వరో విష్ణురితి, భూత
సంహారాధికృతస్య రుద్రస్య భూతేషు కరుణా గగనకుసుమ
తుల్యేతి చ ప్రలపితవంతః. తత్తుచ్ఛం, శివస్యాపి వరదత్వేన
వర్ణితత్వాత్, విష్ణోరపి దైత్యారి రితి స్మరణాత్.

1 అధ్యా. రా : సర్గ ౯; 2 వాల్మీ. రా: సర్గ ౧౦౬,

౨౧½. అట్లు నామాట పెడచెవింబెట్టి నీవు దండకాటవికే పోయినచో నేనును నీతోడ నిదే పయనమగుచున్నాను.

౨౨. ఇట్లు పల్కుచున్న భరతుని గాంచి స్నేహార్ద్రంబగుచూడ్కి నివ్వటిలగ శ్రీరాముం డిట్లనెను.

౨౩-౨౪. భరతా! నీవు చెప్పునది నిజమే కాని పదునాల్గు వర్షములు నన్నడవుల నుండుమనియు నిన్ను రాజ్యంబు నేలుమనియు మనతండ్రి యానతియై యున్నది.

౨౪½. అందుచేత నీవు కోసలదేశంబును; బరిపాలింపుము, నేను దండకారణ్యంబును బాలించెదను.

౨౫½-౨౬. ఈ మాటలు విని భరతుడు 'అన్నా! నే నెంతచెప్పినను నీవు దండకకే పోవుదుననుచుంటివి. ఇదిగో! నారచీరంబులు దాల్చి నేనే పదునాల్గు వత్సరము లరణ్యంబున నివసించుటకై బయలుదేరుచున్నాను. నీ వీ రాజ్యమును సుఖముగ నేలికొనుము.

౨౭. ఇట్లు పల్కుచున్న యా భరతుని జూచి సుమంత్రాదులును, ధర్మవేత్తలగు ఋష్యాదులను దన్మాతలగు కౌసల్యాదులును నాభరతు నెంతయు గొనియాడిరి.

---

కాని యత్రప్రయాసముపై నాశబ్దముఃకుఃష్ణువని యర్థము జెప్పిరి. అంతటితో బోక సంహారకర్తయగు రుద్రునకు దయాళుత్వమే లేదని యుమేమో పేర్కొనిరి. ఈ పేర్కొలుడు సరికాదు. శివుడును ననేకమందికి వరము లిచ్చుట యెవ్వరును నెఱుంగని విషయముకాదు. అట్లు విష్ణువు దానవసంహారకుం డగుటయు నెవరికిని దెలియరాని విషయము కాదు.

1పునరేవం బ్రువాణం తం భరతం రాఘవోఽబ్రవీత్. ౨౭॥

పురా భ్రాతః పితా నస్స మాతరం తే సముద్వహన్,
మాతామహే సమాశ్రౌషీ ద్రాజ్యశుల్క మనుత్తమం. ౨౮॥

దైవాసురేచ సంగ్రామే జనన్యై తవ పార్థివః,
సంప్రహృష్టో దదౌ రాజా వర మారాధితః ప్రభుః. ౨౯॥

2పిత్రా దత్తం తవైవైత ద్రాజ్యం మహ్యం వనం దదౌ,
వ్యత్యయం యద్యహం కుర్యామసత్యం పూర్వవత్ స్థిరం. 30॥

భరత ఉవాచ:—
అహ మప్యాగమిష్యామి సేవే త్వాం లక్ష్మణో యథా,
నోచే త్ప్రాయోపవేశేన త్యజా మ్యేత త్కళేబరం. 3౧॥
ఇత్యేవం నిశ్చయం కృత్వా దర్భా నాస్తీర్య చాతపే,
మనసాపి వినిశ్చిత్య ప్రాఙ్ముఖేన వివేశ సః. 3౨॥
భరతస్యాపి నిర్బంధం దృష్ట్వా రామోఽబ్రవీ దిదం. 33
3 త్వం రాజా భరత భవ స్వయం నరాణాం వన్యానామహ
మపి రాజరా ణ్మృగాణాం, గచ్ఛ త్వం పురవర

1 వాల్మీ. రా: సర్గ ౧౦౭; 2 అధ్యా. రా: సర్గ ౯.
3 వాల్మీ. రా: సర్గ ౧౦౭.

౨౭½. ఇట్లు పదింబదిగ ప్రార్థించుచున్న భరతునితో శ్రీరామచంద్రు డిట్లనియె.

౨౮½ తమ్ముడా! మనతండ్రి నీతల్లియగు కైకేయిని బెండ్లాడునప్పుడా మెకు గలిగిన కొమరునకే రాజ్యం బిచ్చెదనని నీ మాతామహుండగు కేకయు నకు బ్రతిన సేసియుండెను.

౨౯½. అదిగాక, సురలకు నసురలకు సంగ్రామము సంఘటిల్లి, యసురులతో పోరునెడ నా యుద్ధమందు నీతల్లిచేసిన యుపకారము గమనించి మన తండ్రి యామెకు వరద్వయంబు నిచ్చెను.

30½. అవ్వరంబునం దొక్కదానిచే నీసమస్తరాజ్యంబును నీకుజెందెను. మఱొ క్కదానిచే నీ దండకారణ్యపాలనము నాకు దక్కెను. కావ నింమలో మన మేమైన వ్యత్యస్తం బొనరించినచో సత్యప్రతిజ్ఞుం డగు మనతండ్రి కసత్యకళంక మాపాదించినవార మగుదుము.

3౧½-3౨½. ఇట్లు శ్రీరాముడు పల్కుట విని భరతు డాతనితో అన్నా! నేను నీతోడ వచ్చి లక్ష్మణునికైవడి నిన్ను సేవించుచుండెదను. దీనికి సమ్మతింపవేని ప్రాయోపవేశంబు చేసి యీదేహంబును విడిచెదనని తన నిశ్చయమును దెల్పుచు నట నెండలో దర్భలను బఱచుకొని యందు ప్రాఙ్ముఖుండై కూరుచుండెను.

33. భరతుని యీ నిర్బంధము జూచి శ్రీరాము డాతనితో నిట్లనెను.

3౪. తమ్ముడా! ఈ నిర్బంధ మేల చేసెదవు? కోసలరాజ్యంబున నున్న జనం బులకు నీవు రాజవు కమ్ము. దండకారణ్యంబునం గల్గు వన్యమృగం బులకును మునులకల్లను నేను ప్రభువు నయ్యెదను. కాన సంతుష్టాం

మద్య సంప్రహృష్ట స్సంహృష్ట స్త్వహామపి దండకా
ప్రవేక్ష్యే. 34

శత్రుఘ్నః కుశలమతిస్తు తే సహాయ స్సౌమిత్రి ర్మమ విదితః
ప్రధానమిత్రం, చత్వార స్తనయవరా వయం నరేంద్రం
సత్యస్థం భరత! చరామ మా విషాదం. 35

1* ఆశ్వాసయంతం భరతం జాబాలి ర్బ్రాహ్మణోత్తమః,
ఉవాచ రామం ధర్మజ్ఞం ధర్మాపేత మిదం వచః. 36

సాధు రాఘవ! మాభూత్తే బుద్ధిరేవం నిరర్థికా
కః కస్య పురుషో బంధుః కిమాప్యం కస్య కేనచిత్. 3[illegible]

* వ్యా: ఆశ్వాసయంతమితి:— ఏవం రామేణోక్తే నిరుత్తరతయా స్థితం భరత మాలోక్య హితపరతయా జాబాలి ర్వైదికసార్వభౌమోపి పిత్రాజ్ఞయా వనం ప్రస్థితస్య రామస్య వైదికమార్గేణ నివర్తనోపాయ మపశ్యన్ చార్వాకమత మాశ్రిత్య అవైదికమార్గమేవ ప్రత్యక్షప్రమాణం, దేహ ఏవాత్మేతి వదన్ ప్రత్యుత్తరమాహ - ఆశ్వాసయంత మిత్యాదినా. బ్రాహ్మణోత్తమ ఇత్యాదినా వక్ష్యమాణం నాస్తిక వచన మహృదయ మితిద్యోత్యతే.

1 వాల్మీ. రా: సర్గ ౧౦౮

తరంగుడవై నీ వయోధ్యకు బోయి రాజ్యంబును బాలింపుము. ముదిత హృదయుండనై నే నరణ్యమునకు బోవుచున్నాను.

35. ఆట నాకు లక్ష్మణుం డెంతయు బాసటయై వెలయగలడు. సునిశిత మతియగు శత్రుఘ్నుడు నీ కెంట నండగ నుండగలడు. ఇట్లు మనము నల్వురు పుత్రులమును మనతండ్రిని సత్యప్రతిజ్ఞుని గావించుదము. ఈ విషయమై నీవు ప్రాయోపవేశంబు సేయుట యెట్టిదో పాఱ జూడుము.

36. ఇట్లు భరతు నాశ్వాసించుచున్న శ్రీరాముని జూచి బ్రహ్మణ్యుండగు జాబాలిమహర్షి ధర్మయుక్తంబుగా నిట్లు వచియించెను.

37. శ్రీరామా! యిట్టి నిరర్థకంబగుబుద్ధి నీ కేల కలిగెను? ఒకడు మఱి యొకనికి బంధువగునా? ఒకనిచే మఱియొకడు పొందున దేమున్నది? ఇట్లనుకొను టెంతయు నిష్ప్రయోజనము.

---

*వ్యా: జాబాలి వచించెననుచోట:—శ్రీరాముం డిట్లు తండ్రి యాజ్ఞ శిరసావహించుటయే ముఖ్యకర్తవ్యం బని చెప్పగా భరతుడు ప్రత్యుత్తరము చెప్పలేకపోయెను. ఇది జాబాలిమహర్షి కాంచి తండ్రియాజ్ఞపై నడవికి బయనమైన శ్రీరాముని శాస్త్రబద్ధంబులగు యుక్తులచే నెట్టులును మరల్పగాదని యోచించి చార్వాకమత మవలంబించి యాతనికి నచ్చజెప్పజూచెను. అయినను నమ్మహర్షి హృదయము నాస్తికభావమగ్నము గాదని శ్లోకములో నాతనికి విశేషణముగా నుంపబడిన బ్రాహ్మణోత్తమపదముచే దెలియుచున్నది.

పిత్ర్యం రాజ్యం పరిత్యజ్య న నార్హసి నరోత్తమ,
న తే కశ్చి ద్దశరథ స్త్వంచ తస్య న కశ్చన. ౩౮

* అష్టకా పితృదైవత్య మిత్యయం ప్రసృతో జనః,
అన్నస్యోపద్రవం పశ్య మృతో హి కి మశిష్యతి ? ౩౯

యది భుక్త మిహాఽన్యేన దేహ మన్యస్య గచ్ఛతి,
దద్యాత్ప్రవసతాం శ్రాద్ధం న తత్పథ్యశనం భవేత్. ౪౦

దానసంవననా హ్యేతే గ్రంథా మేధావిభిః కృతాః,

---

* వ్యా : అష్టకేతి:—అత్ర సర్వశ్రాద్ధప్రకృతిభూతా ష్టకాగ్రహణేన సర్వాణ్యపి శ్రాద్ధా న్యుపలక్షితాని; అష్టకాయాః ప్రకృతిత్వంచ బోధాయనసూత్రేణాఽవగమ్యతే. ఏవం బహువిధసూత్రపురాణాదిషు మహాఫలత్వేన అవశ్యకత్వేనచ ప్రపంచిత మఖిల మప్యనర్థక మేవ శ్రాద్ధజాత మి త్యుక్తం భవతి

౩౮. చేతనున్న రాజ్యంబును విడిచి యడవుల పాలై పోవుదు ననుచుంటివి. ఇది యెంతయు నసమంజసము. దశరథుడు నీ కెవ్వండు? నీవు దశరథుని కెవ్వండవు? అతని యాజ్ఞ నిన్ను బంధించు టేమి?

౩౯. శ్రీరామా! *అష్టకాదులగు శ్రాద్ధములచే పితృదేవతల సంతర్పితుల జేయుదుమను వెఱ్ఱితలంపు లిడుకొని యీజను లందఱులకు బ్రవర్తించుచున్నారు. కాని యిందువలన నీయన్నం బంతయు వృథయగుట తప్ప మఱేమున్నది? మృతినందినవా డెటుల నీశ్రాద్ధాన్నమును భుజించును?

౪౦. ఈలోకమందు భోక్తల కిడిన శ్రాద్ధాన్నము పరలోకమందున్న పితృదేవతలను బొందినచో బరదేశమందున్న యొక్కనిని గూర్చి శ్రాద్ధమిడినచో నాతనికిని నాకలిదప్పులు తీరవలయును గదా? అది యాతనికి మార్గాశనంబై యొకరియింటి కతిథియై పోవుశ్రమ లేకుండును గాదా!

౪౧.* యాగములు సేయుము, దానము లిమ్ము, దీక్షలు వహింపుము, తపంబు లాచరింపుము, ఆశాదులను త్యజింపుము—ఈప్రకారముగ చెప్పు

---

వ్యా: అష్టక యనుచోట:—అష్టకా శ్రాద్ధమే తక్కినయన్ని శ్రాద్ధములకును బ్రకృతి యని బోధాయనాదిసూత్రములచే దెలియబడుచున్నది. సర్వశ్రాద్ధములకును బ్రకృతియగునందగు నష్టకాశ్రాద్ధ మన్నిటికిని నుపలక్షణంబని యెఱుంగునది.

ఇట్లు బోధాయనాది ప్రోక్తసూత్రంబులందును దక్కగల మహాపురాణాదులందును గీర్తింపబడు నష్టకాది శ్రాద్ధములన్నియు నవర్థకములని జాబాలిభావము.

*యజస్వ, దేహి, దీక్షస్వ, తప స్తప్యస్వ, సంత్యజ. ౪౧

• స నా౽స్తి పరమిత్యేవ కురు బుద్ధిం మహామతే,
ప్రత్యక్షం యత్తదాతిష్ఠ పరోక్షం పృష్ఠతః కురు. ౪౨

రాజ్యం త్వం ప్రతిగృహ్ణీష్వ భరతేన ప్రసాదితః. ౪౨౽

---

* వ్యా: యజస్వేతి:— యజస్వేత్యనేన దేవ పర్యాదిపూజావిధాయకశాస్త్రజాతం, దేహీత్యనేన దాన శాస్త్రం, దీక్షస్వేత్యనేన క్రతుబోధక శాస్త్రజాతం, తప స్తప్యస్వేత్యనేన తపోవిధాయకశాస్త్రజాతం, సంత్యజేత్యనేన సన్యాసబద్ధపరిత్యాగవిధాయకశాస్త్రజాతం చ పరవిత్తాపహార ణాయ మేధావిభిః పరికల్పితత్వా దప్రమాణమేవే త్యుక్తం.

---

• వ్యా: స నాస్తి పర మితి:— స నాస్తి పర మిత్యనేన పరలోకాభావ ఉక్తః. చార్వాకేణా౽ ప్యేతదేవ ప్రతిపాదితం. తదిదం చార్వాకమతం జాబాలి రుపన్యస్య రాజ్యం ప్రతిగృహ్ణీష్వే త్యభిహితవా నితి.

శాస్త్రములు పరవిత్తాపహరణమునకై మేధావులగు వారిచే కల్పింపబడినవి గాని యన్యములు కావు.

౪౨-౪౫. తండ్రియాజ్ఞను బరిపాలించుటచే బరలోకమను ఫలము గల్గునను మతోనున్నావు. అట్టిపరలోకము లేదనియే నిశ్చయము గానమ్ముము. ప్రత్యక్షఫలము నిచ్చునదైన యీభరతదత్తంబైనరాజ్యమును గైకొనుము. అప్రత్యక్షఫలకంబగు పితాజ్ఞాపరిపాలనమును వెట్టి వీడుము.

---

* వ్యా: యాగములుచేయుమని చెప్పుటచే దేవగుర్వాది పూజాధర్మ విధాయక శాస్త్రములును, దానము లిమ్మని చెప్పుటచే దాన విధాయకశాస్త్రములును, దీక్షలు వహింపుమని చెప్పుటచే యజ్ఞ విధాయక శాస్త్రములును, తపంబు లాచరించుమని చెప్పుటచే తపక్రియావిధాయక శాస్త్రములును, నాశాదులను త్యజింపుమని చెప్పుటచే సర్వసంగపరిత్యాగ విధాయకశాస్త్రములును ద్యోతితము లగుచున్నవి. ఇవి యన్నియు నితరుల ధనమును హరించుటకై మేధావులగు వారిచే కల్పింపబడిన వగుటచే నప్రమాణము లని జాబాలి వచనముల భావము.

---

♦ వ్యా: పరలోక మనుచోట:— ఈశ్లోకములో బరలోకము లేదని ఖండితముగా జెప్పబడినది. చార్వాకుని చేతను నిదియే ప్రతిపాదింపబడెను. ఈచార్వాకమతము నుపన్యసించి రాజ్యమును గ్రహింపుమని జాబాలి శ్రీరామునకు బోధించెను.

•జాబాలేస్తు వచ శ్శ్రుత్వా రామ స్సత్యాత్మనాం వరః,
ఉవాచ పరయా బుద్ధ్యా స్వబుద్ధ్యా చావిపన్నయా. ౪౩
1భవాన్మే ప్రియకామార్థం వచనం య దిహోక్తవాన్,
అకార్యం కార్యసంకాశ మపథ్యం పథ్యసమ్మితం. ౪౪

నిర్మర్యాదస్తు పురుషః పాపాచారసమన్వితః,
మానం న లభతే సత్సు భిన్నచారిత్రదర్శనః. ౪౫

కులీన మకులీనం వా వీరం పురుషమానినం,
చారిత్ర మేవ వ్యాచష్టే శుచింవా యదివాఽశుచిం. ౪౬

కామవృత్త స్త్వయం లోకః కృత్స్న స్సముపవర్తతే,
యద్వృత్తా స్సంతి రాజాన స్తద్వృత్తా స్సంతిహిప్రజాః. ౪౭

• వ్యా: జాబాలేరితి:— అథ యథాకథంచి దయోధ్యాం ప్రత్యానేతు మధర్మోపబృంహితవచనాని వ్యాపృతో జాబాలే రాకర్ణ్య వాక్యాని ధర్మవ్యవస్థాపకో రామభద్రో 'భవా న్మయా' ఇత్యాదినా దూషయామాస. యత్సాన రూపో బలి రితి న్యాయేన సత్య మేవం స్యా ద్యది త్వదిచ్ఛా శ్రుతి స్స్యాత్. స్వతంత్రాహి శ్రుతిః.

1 వాల్మీ. రా: సర్గ ౧౦౯

౪౩½.‡ ఇట్లుపన్యసించుచున్న జాబాలి మహర్షిం గాంచి ధర్మనిరతుండగు శ్రీరాము డవికలితబుద్ధియై యిట్లనెను.

౪౪½. ఆయ్యా! నాకు హితము గలిగించుటకై మీ రాడినమాట లెంతయు బథ్యంబులును నవశ్యకర్తవ్యంబులు నైనట్లు కన్పట్టుచున్నవి. కాని యవి యపథ్యంబులును నకార్యంబులును నైయున్నవి.

౪౫½. మర్యాదారహితుండును వేదభిన్నధర్మప్రబోధకుండును బాపాచార సమన్వితుండును నగువాడు సజ్జనుల సభలలో నెన్నడును గౌరవ మందడు.

౪౬½. వీడు సత్కుల సంజాతుడు, వీడు కాడు; వీడు వీరుడు, వీడు వీరమ్మన్యుడు; వీడు సదాచారసంపన్నుడు, వీడు పాపాచారయుక్తుడు- ఈ భేదంబులను వారివారి చరిత్రమే తెల్పుచుండును.

౪౭½. పాలకు డగువాడు స్వేచ్ఛాప్రవర్తకుడును నాస్తికుడును నైనచో బ్రజలును నాస్తికబుద్ధిని జేకొందురు. 'యథా రాజా తథా ప్రజా' యనునది తెల్లమే కదా?

---

‡ ధర్మనిష్ఠితంబు లగు యుక్తులచే శ్రీరాముని మరలింప నేరక నాస్తికమతయుక్తులచే నైనను నాతనిని ద్రిప్పనెంచి జాబాలి యిట్లు వచించియుండెను. ఈమతమును దూషించుచు శ్రీరాముడు ధర్మస్వరూపము నుగ్గడించుచున్నాడు. దేవతనుబట్టి పూజచేయవలెనని నట్లుగ శ్రుతి యిచ్ఛాధీన యైనచో నీవు చెప్పినదే ధర్మస్వరూపము కావచ్చును. కాని యది స్వతంత్ర యగుటచే నొకరి యిచ్ఛాధీనకాదని తాత్పర్యము.

*సత్యమేవానృశంసంచ రాజవృత్తం సనాతనం,
ఋషయశ్చైవ దేవాశ్చ సత్యమేవహి మేనిరే. ౪౫

---

* వ్యా : సత్యమితి:—ఏవ్వత్ర పితృవచనపరిపాలనాది కరిను యాపధర్మసహితం రాజ్యపరిపాలనం రామేణ పరిత్యక్తమితి ప్రతీయతే; తదసంగతం. అధర్మ సహితత్వేఽపి స్వధర్మత్వేన రాజ్యపరిపాలనస్యైవ కర్తవ్యత్వాత్. క్షత్రియాణాం రాజ్యపరిపాలనస్య కర్తవ్యత్వే మనుః:—"క్షత్రియస్య పరో ధర్మః ప్రజానామేవ పాలనం" ఇతి. కించ వైగుణ్యప్రసక్తావపి స్వధర్మస్యైవ కర్తవ్యత్వాత్. తథాచ గీతాయాం "శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్" ఇతి. తత్ర రాజ్యపరిపాలనే ప్రసక్తానాం పాపానాం యజ్ఞదానాదిభిర్నివృత్తిసంభవాచ్చ రాజ్యపరిపాలనం పరిత్యజ్య కిమితి వనవాసాయ ప్రస్థితో రామ ఇతిచేత్సత్యం. రాజ్ఞాం పరిపాలనమేవ పరమో ధర్మః, తథాపి రాజ్యపరిపాలనాదపి క్షత్రియస్య ప్రతిజ్ఞాతార్థనిర్వహణం శ్రేష్ఠో ధర్మః; తథాచ మహాభారతారణ్యకే భీష్మంప్రతి ధర్మపుత్రవచనం; పునశ్చ గదాపర్వణి గదాయుద్ధే నాభే రధఃప్రహారనిషేధే సత్యపి భీమకృత దుర్యోధనోరుభేదదర్శన జనిత క్రోధావిష్టం బలరామంప్రతి శ్రీకృష్ణవచనం "శ్లో॥ సుయోధనస్య గదయా భఙ్క్తాస్మ్యూరు మాహవే, ఇతిపూర్వం ప్రతిజ్ఞాతం భీమేన హి సభాతలే, అతో దోషం న పశ్యామి మా... బలం వహ" ఇతి. ఏవం చ రాజ్యపరి...

౪౭౫. అనృతరహితమై సనాతనంబగు రాజధర్మము సత్యస్వరూపమై యున్నది. దేవతలును ఋషులును సత్యముచే యుత్కృష్టధర్మముగా నగ్గడించియుండిరి.

---

* వ్యా: సత్యస్వరూపమను శ్లోకపూర్వపక్షము:- అధర్మయుక్తంబును బితృవచనాతిక్రమణరూపంబును నైన రాజ్యపరిపాలనము చేకొనుట యసంగతమని రామునభిప్రాయమైనట్లుగ నిచట బొడకట్టుచున్నది. ఇట్లాతడు రాజ్యపరిపాలనము బూనక పోవుట యెంతయు ధర్మశాస్త్రవిరుద్ధము. ఏలయన క్షత్రియుండైనవానికి నెంత యధర్మయుక్తంబైనను రాజ్యపరిపాలనము సేయుటయే యుత్కృష్టధర్మము. ఇట్లే మనుధర్మశాస్త్రమందును జెప్పబడుచున్నది. ఒకవేళ నీరాజ్యపరిపాలనములో సుగుణము లేవియు లేవని దానిని వదలివేయుదమనుకొన్నను నెంతవిగుణంబైనను బరధర్మానుష్ఠానంబుకంటె స్వధర్మానుష్ఠానమే శ్రేయస్కరంబని గీతలయందు జెప్పబడుచున్నది. రాజ్యాంతే నరకం ధ్రువమ్మనెడి రీతిగ రాజ్యపరిపాలనమున గల్గు పాపములకు యజ్ఞాదానాదులవలననే నివృత్తి గలుగజేసికొనవలెనని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి. ఇట్లుండ క్షాత్రధర్మంబగు రాజ్యపరిపాలనము బోవిడిచి వనవాసంబునకే శ్రీరాము డేల పోయెనని పూర్వపక్షము గల్గుచున్నది. (సమాధానము)

క్షత్రియులకు భూపరిపాలనము పరమధర్మం బనుమాట సత్యమే, అయినను జేసిన ప్రతిన నెరవేర్చుకొనుటయు వారికి మఱియు బరమ ధర్మము. మహాభారతారణ్యకమున భీష్మునితో ధర్మరాజాడిన వాక్యములును నీవిషయమునే బోధించుచున్నవి. ఇట్లే గదాయుద్ధమందు నాభికి గ్రిందుగ గొట్టగూడదను ధర్మమును మీఱి భీమసేనుడు దుర్యోధనుని యూరుభంగము గావించినతఱి నది కని క్రోధావిష్టుండైన బలరాముని గాంచి శ్రీకృష్ణుడు పల్కుచున్నాడు:—అన్నా! యేల యింత భయంకరాకారుడవై భీమునిపై కుపితుడవు? ఇందులో భీముడు చేసిన దుర్నయం బేమియును లేదని నా మతము. ఏలయందువా? తన గదచే దుర్యోధనోరుభంగము గావించెద నని మంత్రిసామంతా

దత్త మిష్టం హుతంచైవ తప్తానిచ తపాంసిచ
వేదా స్సత్యప్రతిష్ఠానా స్తస్మా త్సత్యపరో భవేత్. ౪౯।

ఏకః పాలయతే లోక మేకః పాలయతే కులం,
మజ్జత్యేకోహి నరకే ఏక స్స్వర్గే మహీయతే. ౫౦।

కథం హ్యహం ప్రతిజ్ఞాయ వనవాస మిమం గురౌ,
భరతస్య కరిష్యామి వచో హిత్వా గురో ర్వచః. ౫౧।

*కర్మభూమి మిమాం ప్రాప్య కర్తవ్యం కర్మ యచ్ఛుభం. ౫౨

ప్రతిజ్ఞాతార్థ పరిపాలనస్య ప్రబల ధర్మత్వాత్ తదర్థం
రాజ్యం పరిత్యజ్య వనగమనం యుక్తమేవ.

* వ్యా: కర్మభూమి మిత్యత్ర:— కర్మ భూమి... నేన కర్మభూమిం గతః పురుషః సత్కర్మా... కుర్యాదేవేతి సూచితం విష్ణుపురాణే, మహాభారతే... తేపి.

౪౯½. దానముచేయుట యాగము లొనరించుట హోమములు వేల్చుట తపంబు లాచరించుట మున్నగువాని కన్నింటికిని సత్యమే యాధారము. సత్యయుక్తంబు లగుటంజేసియే వేదముల కింతటి ప్రతిష్ఠ కల్గినది. కావ సత్యపరుడై యుండవలెను.

౫౦½. ఇట్టి సత్యమూలంబుననే యొకడు ప్రభు వగుచున్నాడు. మఱియొకడు సత్కులజుడై తత్కులోద్ధారకు డగుచున్నాడు. మఱొకడు స్వర్గసుఖంబుల జూఱగొనుచున్నాడు. కాని యసత్యముచే మాత్రము నరకకూపంబున బడి మ్రగ్గుచున్నాడు.

౫౧½. సత్యముచే నిట్లు స్వర్గాదిలోకంబులును నసత్యముచే రౌరవాదినరకంబులును గల్గుచుండ, వనవాసము చేయుదు నని తండ్రియొద్ద బ్రతిన వట్టి తద్విరుద్ధంబుగ నిప్పుడు భరతునిమాటపై రాజ్యపరిపాలన మెట్లు పూనుదును ?

౫౨. * కర్మభూమియగు నీ భరతఖండమున నెవడు జన్మించునో వాడిక్కడ విహితంబగు కర్మ మాచరించియే తీరవలెను.

---

సంవేష్టితం బగు సభాతలంబున భీమసేనుడు ప్రతిన పట్టియున్నాడు గదా! మఱి క్షత్రియుండగు భీమసేనుడు పట్టిన ప్రతిజ్ఞ తెత్తపోవల సినదేమో నీవే తెల్పుము. ఇట్టి ధర్మప్రకారంబులు పరికించియే రాజపరిపాలనంబుకంటె ప్రతిజ్ఞాసంపరిపాలనమే యుత్కృష్టాచరణీయం బని శ్రీరాముడు రాజ్యము వదలి యడవులకు బోయెను.

---

* కర్మభూమి యనుచోట:—ఇట్లు చెప్పబడుటచే గర్మభూమిం జననంబందిన పూరుషుడు సత్కర్మముల నవశ్య మాచరించితీరవలె నని సూచితం బగుచున్నది. ఇట్లే విష్ణుపురాణమునందును మహాభారతారణ్యపర్వమందును జెప్పబడినది.

౫౩-౫౩½. ఉత్కృష్టకర్మంబు లాచరించియే యగ్ని, వాయువు, చంద్రుడు మున్నగువారు మహోన్నత పదవులను బొందిరి. నూఱు యజ్ఞములు చేసి దేవేంద్రుడు స్వర్గాధిపతి యయ్యెను. ఉగ్రతపంబు లొనర్చి మహర్షి గణంబులు దివికి బోయిరి.

౫౪½. ఆ పితృదేవర్షి గణంబు లందఱి నిటకు దీసికొనిరాగలను. సత్యముచే లోకంబు లన్నిటిని జయింతును. నన్ను సత్యాగూఢునిగా నెఱుంగుము.

౫౫. బ్రహ్మవిదుండగువా డొక్కడు సంతృప్తిగ భుజించునచో సర్వలోకంబులును దృప్తి గాంచుచున్నవి.

౫౫½. అంధకారము సూర్యుని తేజ ముడుపగలుగా? మోహమిక్కిలి తానే పటాపంచలై పోవునుగాని. కాన నీవేల నాస్తికవాదముచే సత్యమును మఱుగుపఱుపజూచెదవు?

౫౬½. సత్యమాడుటయు, ధర్మమార్గంబున బ్రవర్తించుటయు, పరాక్రమంబును, భూతదయయు, ప్రియభాషణంబును, దేవబ్రాహ్మణపూజనంబును - ఇవి స్వర్గంబునకు గట్టిసోపానములై యున్నవి.

౫౭½. విషమబుద్ధివగు నిన్నుం జేరదీయుటయే మా తండ్రిగా రొనరించిన పొరపాటై యున్నది. మా తండ్రి చేసిన యీకార్య మెంతయు *నింద్యమై తెలియుచున్నది.

నాస్తికుడగు బౌద్ధుడు చోరుడుగా జూడబడుచున్నాడు. అత డెప్పుడును విషయాసక్తుడును మందప్రజ్ఞుడును గుతర్కవాదియు దురాగ్రహుండును నయి యుండును.

---

* వ్యా: మా తండ్రి చేసిన కార్యము నింద్యమనుచోట పూర్వపక్షము:- నాస్తికబుద్ధియగు జాబాలిని ఋత్విజునిగా గైకొనినందులకు దశరథుని శ్రీరాముడు నిందించినట్లుగా నిట జూడబట్టుచున్నది. పితృనింద చేయుచున్న లక్ష్మణుని మాతృనింద కావించుచున్న భరతుని గాదనిన

జాబాలి రువాచః—

న చాపి కాలోఽయ ముపాగత శ్శనై ర్యథా మయా నాస్తికవా

---

నిన్దాపరం లక్ష్మణం మాతృనిన్దాపరం భరతం చ నిషేధతో
రామస్య పితృవృత్తనిన్దాయాం ప్రవృత్త్యసమ్భవాత్
పితృవృత్తనిన్దనే దోషశ్రవణాచ్చ. తథాహి శ్లో॥ "శ్వపాక
పుల్కసాదీనాం కుత్సితానా మచేతసాం, కులేషు తేఽభిజా
యన్తే గురువృత్తావమానినః" ఇతి. నచ వైదిక ధర్మవిరుద్ధా
చారం జాబాలిం సంగృహ్ణాతిః పితుః కర్మ నిన్దామీత్యేవం
రూపస్య వచనస్య విషమాచారజాబాలినిన్దాపరత్వమేవ,
న పితృనిందాపరత్వ మితివాచ్యం. శ్లో॥ "పరామ ప్యాపదం
ప్రాప్తో బ్రాహ్మణం న ప్రకోపయేత్." ఇతి సకలశాస్త్ర
నిషిద్ధాయాం బ్రాహ్మణనిన్దాయాం రామభద్రస్య
ప్రవృత్త్యసంభవా దితిచే న్న. బ్రాహ్మణత్వేన ఋత్వి
క్త్వేన అనిన్ద్యస్యాపి జాబాలేః లోకాయతికమార్గప్రవృత్త
త్వాకారేణ నిన్ద్యత్వసంభవాత్, అబ్రాహ్మణవ న్నిన్దిత
తథా భీష్మస్య గురుత్వేన బ్రాహ్మణత్వేనచ పరిగృహీ
పరశురామం ప్రతి "ఏతే వేదా శ్శరీరస్థా బ్రాహ్మణ్య
యచ్ఛతే మహాత్, తపశ్చ సుమహ త్తప్తం న తే
స్పృహయా మ్యహం. ప్రహరేత్ క్షత్రధర్మస్య యాంత్యం రా
సమాశ్రితః, బ్రాహ్మణః క్షత్రియత్వం హి యాతి
సముద్యమాత్." ఇతి. తస్మాచ్ఛ్రీరామేణ కృతా నిం

౫౮-౪. ఈ మాటలు విని జాబాలి శ్రీరామునితో 'శ్రీరామచంద్రా! ధర్మసందేహము గలిగినప్పుడే నేను నాస్తికవాదము చేయుచుందును. అంతియేగాని హృదయపూర్వకముగ నేను నాస్తికుడను గాను. భర

---

శ్రీరాము డట్టిపనియే మఱల నాచరించు టెంతయు నసమంజసము. అట్లు తలిదండ్రులను దూలనాడు టెంతయు బాపహేతు వని 'కుత్సితులును, మతిశూన్యులును చండాలురును నగువారి కులములో జననం బందుదు రను శ్లోకమువను జెప్పబడుచున్నది. లేక తండ్రిని నిందించు మిషచే నాస్తికుడగు జాబాలిమహర్షి నే నిందించెనని చెప్పుటకును వీలుగాదు. ఏలయన, దన కెట్టియాపదయైనను బ్రాహ్మణుని దెగనాడరాదని బ్రాహ్మణనిందను సకలశాస్త్రములు నిషేధించుచున్నవి. కాన శాస్త్రనిషిద్ధంబగు పితృబ్రాహ్మణనిందలలో నేదే నొకటి శ్రీరాముడు చేసితీరినాడని పూర్వపక్షము చేయరాదు.

(సమాధానము)

శ్రీరాము డేనిందయు జేయలేదు. అట్లుగాక జాబాలి నాతడు నిందించియే తీరినాడని వితండవాదమునకు గడంగినచో నిజమే! నాస్తికవాదమును జేసిన జాబాలి, బ్రాహ్మణుడు ఋత్విజుడు నైనను, నాస్తికుడుగానే పరిగణింపదగియుండుటచే నబ్రాహ్మణుడై యందుచే నిందనార్హుం డగుచున్నాడని వితండసమాధానమే చెప్పబడుచున్నది. ఈ వాదమున కుపబలముగ మహాభారతమున గురువును బ్రాహ్మణుడును నైన పరశురామునితో భీష్ముడు పల్కువిధము, "పరశురామా! వేదంబులు నీ కంఠస్థములై యున్నావుర చున్నవి. బ్రహ్మతేజం బంతయు నీ మూర్తియై నెలకొన్నది. అమోఘంబగు తపంబు నీ వెంతయు జేసియుంటివి. కాని నీకర్మం బెంతయు గర్హ్యం బనుటకుమాత్రము నేను వెనుదీయను. నీవు క్షత్రి

గుదీరితా, నివర్తనార్థం తవ రామ! కారణా త్ప్రసాద నార్థంచ మయైత దీరితం. ౫౮.

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అయోధ్యాకాణ్డే సప్తదశ స్సర్గః.



పితు ర్వాపి జాబాలేః. కింతు జాబాలికథితలోకాయతిక వృత్త్యే ఏవ.

లోకాయతిక (చార్వాక) మతం తు పణ్డై ర్దూషితం. తదపి బౌద్ధా దూషయన్తి; తే బౌద్ధా శ్చతుర్విధాః. మాధ్యమికః, యోగాచారః, సౌత్రాన్తికో, వైభాషిక శ్చేతి తచ్ఛాస్త్రమపి తత్తద్బుద్ధిభేదా చ్చతుర్విధం. తత్ర మాధ్యమికః సర్వశూన్యతా మాచష్టే. యోగాచారస్తు విజ్ఞాన మాత్రాస్తితా మవోచత్. విజ్ఞానవ్యతిరిక్తో బాహ్యోర్థోస్తి, సచ బుద్ధ్యాకారేణాఽనుమేయ ఇతి సౌత్రాన్తికాః. వైభాషికాస్తు బాహ్యోర్థః ప్రత్యక్షగ్రాహ్య ఇతివర్ణయంతి. ఏవం బుద్ధివైభవ కల్పితస్య యౌక్తికమార్గ ఉత్తరోత్తరదోషగ్రస్తస్య ప్రమాణశూన్యస్య అవ్యవస్థితయా యౌక్తికమార్గ ముపేక్ష్య వేదప్రామాణ్య మీశ్వరం చాభ్యుపగమ్యైవ జాబాలివాక్యం చార్వాకమతదూషణవ్యాజేన సకలాఽవైదికమతం దూషితవా నితి.

కాదుల సంతుష్టికొఱకును, వనవాసోద్యోగమునుండి నిన్ను మరల్ప యత్నించుటకును నిట్లంటినే కాని వేరుకాదనెను.

ఇది శ్రీరామాయణ సారోద్ధారంబున నయోధ్యాకాండంబునందు బదునేడవసర్గము.

---

ధర్మంబు చేకొని వాతో యుద్ధమునకు దలపడుచున్నావు. అందుచే శస్త్రధారివగు నీవు క్షత్త్రియుడవే యగుచున్నావు." ఇత్యాదిగ క్షత్త్రకర్మం బాచరించు పరశురాముని నబ్రాహ్మణ్యునిగ బరిగణించి, భీష్ముడంతటిమహామహుడు బ్రాహ్మణ్యుండును గురువునునైన యాపరశురాముని సైతము ధిక్కరించెను.

కాన శ్రీరాముడు చేసిననింద యాతని తండ్రియగు దశరథునికిగాని ఋత్విజుండగు జాబాలికిగాని జెందక నాస్తికవాదపరమే యను కొనినచో సుకరముగా నుండును.

ప్రసంగము వచ్చినదిగాన బౌద్ధాములను గుఱించి కొలదిగా దెల్పబడుచున్నది. చార్వాకమతమును క్షపణకులు దూషింతురు. వీరిమతమును బౌద్ధులు దూషింతురు. మాధ్యమికులు యోగాచారులు సౌత్రాంతికులు వైభాషికులు నని బౌద్ధులు నాల్గువిధములుగా నున్నారు. వీరి భేదముల ననుసరించి వీరిశాస్త్రంబులును నాల్గురకములుగా నున్నవి. మాధ్యమికులు సర్వము శూన్యమందురు. యోగాచారులు విజ్ఞానమును మాత్ర మంగీకరింతురు. విజ్ఞానవ్యతిరిక్తంబగు మహార్థం బొందున్నది. అది బుద్ధ్యాకారంబున ననుమేయం బని సౌత్రాంతికులు వాదింతురు. వైభాషికులు ప్రత్యక్షప్రమాణమును మాత్ర మంగీకరించి తక్కినది త్రోసి రాజందురు.

## అష్టాదశ స్సర్గః

1 క్రుద్ధ [illegible] రామంతు వశిష్ఠః ప్రత్యువాచహ, ౫
జాబాలి [illegible]తే లోకస్యాస్య గతాగతిం.
నివ ర్తయి[illegible]స్తు త్వామేత ద్వాక్య ముక్తవాన్. ౧౫

ఇక్ష్వాకు[illegible] సర్వేషాం రాజాభవతి పూర్వజః,
పూర్వజే[illegible] పుత్రో జ్యేష్ఠో రాజ్యేఽభిషిచ్యతే ౨౫
తన్న్మహా[illegible] రాజ్య మవేక్షస్వ జనం నృప. ౩

2 ఏవం [illegible] క్తస్తు గురుణా రాఘవ స్స్వయం,
ప్రత్యువా[illegible]సీనం భరతం ప్రాగుపస్థితం. ౪
కిం మాం [illegible] కుర్వాణం తాత! ప్రత్యుపవేక్ష్యసి, ౪౫
బ్రాహ్మణో [illegible]క పార్శ్వేన నరాణాం రోద్ధు మిహార్హతి,
నతు మూ[illegible] క్తానాం విధిః ప్రత్యుపవేశనే. ౫౫
ఉత్తిష్ఠ త్వ[illegible]బాహో! మాంచ స్పృశ తథోదకం. ౬

1 వాల్మీ. రా. సర్గ ౧౧౦: 2 వాల్మీ. రా. సర్గ ౧౧౧

## పదునెన్మిదవసర్గము.

౫. శ్రీరాముడు కుపితుం డగుట వశిష్ఠుం డెఱింగి యాతనితో నిట్లనెను.

౧౫. శ్రీరామా! యీలోకములో బుణ్యము చేసినవారు స్వర్గాదిలోకములు చూఱగొనుటయు దత్పుణ్యము క్షీణింపగనే మఱల నీభూలోకంబున నవతరించుటయు మున్నగు నిలోకవ్యవహారం బంతయు జాబాలి యెఱుంగును.

౨౫-౩. కాని జాబాలి నీతో నట్లాడుటకు గతం బేమియో తెలిసితివా? నీ యిక్ష్వాకువంశమందు జ్యేష్ఠుం డగువాడే రాజ్యమున కర్హుడు. తండ్రి తన తనయునకు రాజ్యము నప్పగించుటయే కాని మఱియొక యాచారం బెన్నడును బొసగియుండలేదు. అయ్యాచారంబున కిప్పుడు వైపరీత్యము కల్గనుంటలేని నన్నయోధ్యకు మరలంగోరి జాబాలి యిట్లాడెను. అతని పలుకులు చేకొని నీవు రాజ్యము గైకొనుము.

౮. వశిష్ఠు డిట్లు పలుకగ శ్రీరాముడు భరతుని జూచి యిట్లనెను.

౮౫. తమ్ముడా! నీ విట్లు ప్రాయోపవేశము సేయుటకు నే జేసిన దోస గేమి?

౯౫-౬. తనకు ఋణపడియున్నవానియింటికి బోయి యాతని గుమ్మమున కడ్డముగ బరుండియుండెనను బ్రాహ్మణుడు తన ఋణమును దాను గైకొనును. అట్లు ప్రాయోపవేశము చేయుట బ్రాహ్మణుని కొఱకే చెల్లుంగాని రాజన్యుండ వగు నీకు జెల్లదు. కాన నన్ను నిర్బంధింపక సత్వరంబుగ లేచి జలప్రాశన మాచరించి నన్ను స్పృశింపుము.

---

ఇట్లుగ బుద్ధిబలముచే గల్పింపబడిన నాస్తికవాద మమూలకం బని చెప్పుచు జాబాలిప్రతిపాదితం బగు నాస్తికవాదమును ఖండించు రూపముగా శ్రీరాము డవైదికమతంబు లన్నిటిని నిరసించె నని యెఱుంగునది.

ఆసీన స్త్వేవ భరతః పౌరజానపదం జనం,
ఉవాచ సర్వతః ప్రేక్ష్య కి మార్యం నానుశాసథ.
తే త మూచు ర్మహాత్మానం పౌరజానపదా జనాః
ఏషో ౽ పిహి మహాభాగః పితు ర్వచసి తిష్ఠతి, ౮
అతఏవ న శక్తాః స్మో వ్యావర్తయితు మఞ్జసా ౮
అథోత్థాయ జలం స్పృష్ట్వా భరతో వాక్య మబ్రవీత్. ౯
శృణ్వన్తు మే పరిషదో మన్త్రియ శ్శ్రేణయ స్తథా,
న యాచే పితరం రాజ్యం నానుశాస్మిచ మాతరం. ౧౦
ఆర్యం పరమధర్మజ్ఞం నానుజానామి రాఘవం ౧౦
ఉవాచ రామ స్సంప్రేక్ష్య పౌరజానపదం జనం. ౧౧
*విక్రీత మాహితం క్రీతం యత్పితా జీవతా మమ,
న త ల్లోపయితుం శక్యం మయావా భరతేన వా. ౧౨

---

*వ్యా: విక్రీత మిత్యనేన పుత్రక్రయవిక్రయాధి... పితు ర స్తీతి సూచితం. తథాచ బోధాయనః "శోణితశుక్లసం... న్తో మాతాపితృనిమిత్తకః. తస్య ప్రదానపరిత్యాగ విక్రయేషు మాతాపితరౌ భవతః" ఇతి. యద్వా, మహ్యం వనవాసం దత్వా తన్మూల్యత్వేన రాజ్యం స్వీకృతవాన్. భరతస్య రాజ్యం దాపితవాన్. త ల్లోపయితుం నశక్య ఇత్యర్థః.

---

1 వాల్మీ. రా: సర్గ ౧౧౨

౭. భరతు డీమాటలు విని దర్భలపైనను యుండి శ్రీరామునికి మీ రేమియు బోధింప రేమని యచ్చటిజనంబుల ముదలకించెను.

౮-౮౹. వారును 'శ్రీరామచంద్రుడు తండ్రియాజ్ఞను మీరువాడు గాడు. కాన నాతని మరల్ప మాకును శక్తి చాల' దని బల్కిరి

౯. అంతట భరతుడు లేచి యాచమనముచేసి యిట్లనెను.

౧౦-౧౦౹ పురజనులు, మంత్రులు, బ్రాహ్మణులు మున్నగువా రందఱు నుంత నే జెప్పునది యాలకింపుడు. ఈ రాజ్యము కావలెనని నాతండ్రిని గాని నాతల్లినిగాని నే నెన్నడును గోరలేదు. శ్రీరాము నటవీవాసంబునకును నే నేమియు నిమిత్తంబు గాను.

౧౧. ఇట్లు భరతుడనగా శ్రీరాము డచ్చటి జనంబులతో నిట్లనెను.

౧౨. * మాతండ్రి నాకు వనవాసం బిచ్చి దానికి బదులుగ రాజ్యంబు నిచ్చుకొని భరతునికి విక్రయించినాడు. భరతుడుగాని నేనుగాని యమ్మహాత్ము డొనరించినదాని కెదురొడ్డలేము.

---

* వ్యా: నాకు వనవాసం బిచ్చి యనుచోటః— ఈశ్లోకములో 'విక్రయింపబడినది' యిత్యాదిగ జెప్పబడినదానిచే దండ్రికి పుత్రవిక్రయాద్యధికారంబులు గలవని సూచిత మగుచున్నది. ఇట్లే బోధాయనులును జెప్పుచున్నారు: 'శుక్లశోణితసంబంధము మాతాపితరులచే గల్గుచున్నది. ఆసంబంధముచేతనే పుత్రు డుదయించుచున్నాడు. కాన నాతనిని దాన మిచ్చుటకుగాని త్యజించుటకుగాని విక్రయించుటకుగాని తలిదండ్రుల కధికారము గలదు." లేక నాకు వనవాసం బిచ్చి యావెలకు బదులుగ రాజ్యంబును బుచ్చుకొని యయ్యది భరతుని భాగముగ నిచ్చినాడు. తండ్రి చేసిన యీకట్టడి మీఱఁజెల్లునా యని భావము.

తమప్రతిమతేజోభ్యాం భ్రాతృభ్యాం రోమహర్షణం,
విస్మితా స్సంగమం ప్రేక్ష్య సమవేతా మహర్షయః. ౧
అన్తర్హితా స్త్వృషిగణా స్సిద్ధాశ్చ పరమర్షయః. ౧౩
తత స్త్వృషిగణాః క్షిప్రం దశగ్రీవవధైషిణః,
భరతం రాజశార్దూల మిత్యూచు స్సంగతం వచః. ౧౪

గ్రాహ్యం రామస్య వాక్యం తే పితరం యద్యవేక్షసే
సదాఽనృణ మితి శ్రుత్వా భరతో రామ మబ్రవీత్. ౧౫
కర్తు మర్హసి కాకుత్స్థ! మమ మాతుశ్చ యాచనా,
పౌరజానపదాంశ్చాపి రక్తాన్ రంజయితుం తథా. ౧౬
ఇత్యుక్త్వా న్యపత ద్భ్రాతుః పాదయో ర్భరత స్తదా. ౧
1 భరతస్యాపి నిర్బన్ధం దృష్ట్వా రామోఽతివిస్మితః,
నేత్రాన్తసంజ్ఞాం గురవే చకార రఘునన్దనః. ౧
ఏకాన్తే భరతం ప్రాహ వశిష్ఠో జ్ఞానినాం వరః. ౧
వత్స! గుహ్యం శృణు త్వేదం మమ వాక్యాత్సునిశ్చితం,
రామో నారాయణ స్సాక్షా ద్బ్రహ్మణా యాచితః పురా. ౧
రావణస్య వధార్థాయ జాతో దశరథాత్మజః,
యోగమాయాఽపి సీతేతి జాతా జనకనన్దినీ.
రావణం హన్తుకామా స్తే గమిష్యన్తి న సంశయః.

1 అధ్యా. రా: సర్గ

౧౩-౧౩½. ఇట్లు పరస్పరము పల్కుచున్న యాసహోదరుల యైకమత్యముం జూచి యచ్చటి ఋషిగణంబులును సంతుష్టులైయున్న దేవర్షి సిద్ధగణంబులును వారి నెంతయు బ్రశంసించిరి.

౧౪½. అంతట రావణవధంబును గోరుమహర్షు లారాజసింహుండగు భరతుని జూచి రాకుమారా! నీతండ్రిని సత్యసంధునిగా జేయదలంచితేని రాముని రాజ్యము నీవు జేకొనదగిన దని వాక్రుచ్చిరి.

౧౫½-౧౬½-౧౭. అది విని భరతుడు శ్రీరామునితో 'అన్నా! తల్లులకోర్కెను. నాకోర్కెను జెల్లింపుము. రాజ్యమును గైకొనుటచేత నే యీపౌరజానపదు లెంతయు సంతసింతు' రనుచు నా శ్రీరామునిపాదములపై బడెను.

౧౮. ఇట్లు భరతుడు తన్నెంతయు నిర్బంధించుట జూచి శ్రీరాముడు తనగురువునకు గన్నుగీటెను.

౧౮½ ఆయనయు నా భరతుని జూచి యేకాంతముగా నిట్లనెను.

౧౯½-౨౦½-౨౧ రాకుమారా! నేను నీ కొక పరమరహస్యంబును దెల్పుచున్నాను. శ్రీరాము డెవరనుకొంటివి? ఆత డుసాక్షాన్నారాయణుడు. బ్రహ్మాదిదేవగణయాచితుడై రావణుని వధించునిమిత్తము దశరథాత్మజుడుగా నవతరించినాడు. యోగమాయయే జనకతనయయగు సీతగా వెలసినది. రావణవధార్థమే వీ రిట్లవతరించిరి.

కైకేయ్యా వరదానాది యద్య న్నిష్ఠురభాషణం,
సర్వం దేవకృతం నోచే ద్దేవం సా భాషయే త్కథమ్? ౨

[1] రామే విరళదన్తత్వం లక్ష్మణే పాదఘుణ్టికా
సీతాయాః కేశభగ్నత్వం త్రిభి రారణ్య మాశ్రితాః. ౨

తస్మా త్త్యజాగ్రహం తాత! రామస్య వినివ ర్తనే,
నివ ర్తస్వ మహాసైన్యై ర్భ్రాతృభి స్సహితః పురమ్. ౨

రావణం సకులం హత్వా శీఘ్రమే వాగమిష్యతి. ౨౬
ఇతి శ్రుత్వా గురో ర్వాక్యం భరతో విస్మయాన్వితః.
గత్వా సమీపం రామస్య భక్త్యా తూష్ణీం స్థిత స్తదా. ౨౭
[2] ప్రత్యువాచ వశిష్ఠస్తు రాఘవం వచనం మహత్, ౨
ఏతే ప్రయచ్ఛ సంహృష్టః పాదుకే హేమభూషితే.
అయోధ్యాయాం మహాప్రాజ్ఞ! యోగక్షేమకరే తవ.
తచ్ఛ్రుత్వా భరతో భక్త్యా రాఘవం ప్రాహ సాదరం, ౨
[3] పాదుకే దేహి రాజేన్ద్ర రాజ్యాయ తవ పూజితే.
తయో స్సేవాం కరో మ్యేవ యావ దాగమనం తవ.
ఇత్యుక్త్వా పాదుకే దివ్యే యోజయామాన పాదయో

1 శివరామాయణమ్. 2 వాల్మీ.రా: సర్గ ౧౧౩; 3. [illegible]

౨౨. మంథరాదుర్బోధన కైకేయీదాశాది నిష్ఠురకార్యంబు లన్నియు దైవసంకల్పితములే కాని యన్యథా కానేరవు. కానిచో కులశీల సంపన్నురాలగు కైకేయి యెక్కడ! యిట్టిదౌరాత్మ్యం బెక్కడ!!

౨౩. నాయనా! శ్రీరామునికి దంతంబు లెడమెడముగా నుండును. లక్ష్మణునకు నడచునప్పుడు పాదములందు చిటుకుచిటుకుమను శబ్దము గల్గుచుండును సీతాదేవితలవెండ్రుకలకొనలు చిట్లిపోయియున్నవి. సాముద్రికశాస్త్రోక్తంబుగ నీ మూడు లక్షణంబులును వర్యోదవముల కారణ్యవాసంబు గల్గించినవి.

౨౪. కాన శ్రీరాముని మరలించు జతనంబు మానుము. ఆట్లాతడు మరలి రాలేదను శంక వీడుము. ఈ ప్రాయోపవేశోద్యోగంబు చాలించి యీసైన్యంబు లన్నింటిని మరలించుకొని నీ చిన్నితమ్మునితో గూడ పురంబు జేరుము.

౨౪½. శ్రీరాముండును రావణుని సకులంబుగ వధించి మరలివచ్చును.

౨౫½. ఇట్లు పల్కుచున్న వశిష్ఠుని జూచి భరతుడు మిగుల విస్మితుడై శ్రీరాముని సన్నిధిం జేరి నిలువబడెను.

౨౬-౨౭. అది గాంచి వశిష్ఠుడు శ్రీరామునితో రామా! ఈ బంగారు పాదుకల నీ వారోహించి భరతున కిమ్ము. ఇవి నీకు బ్రతినిధులై యయోధ్యలో వెలయ గలవని చెప్పెను.

౨౭½-౨౮½-౨౯ ఈమాటలు భరతుడు విని శ్రీరామునితో అన్నా, నీరాజ్యమును బాలింప బ్రతినిధులుగా నుండుటకై యీ హేమపాదుకల నిరోహింపుము. ఈ పాదుకల పూజ నేనైనను చేయుచుండెద ననుచు తా దెచ్చిన హేమపాదుకలను శ్రీరాముని పాదములకు దొడిగెను.

1 సోఽధిరుహ్య నరవ్యాఘ్రః పాదుకే హ్యవరుహ్య చ.
ప్రాయచ్ఛ త్సుమహాతేజా భరతాయ మహాత్మనే. ౩
స పాదుకే సంప్రణమ్య రామం వచన మబ్రవీత్. ౩౦

చతుర్దశ హి వర్షాణి జటాచీరధరో హ్యహం,
తవాగమన మాకాంక్షన్ వసన్వై నగరా ద్బహిః. ౩౧
తవ పాదుకయోర్న్యస్త రాజ్యతన్త్రః పరన్తప ౩౨
చతుర్దశేహి సంపూర్ణే వర్షేఽహని రఘూత్తమ!
న ద్రక్ష్యామి యది త్వాం తు ప్రవేక్ష్యామి హుతాశనం.౩

తథేతి చ ప్రతిజ్ఞాయ తం పరిష్వజ్య సాదరం,
శత్రుఘ్నం చ పరిష్వజ్య భరతం చేద మబ్రవీత్. ౩
మాతరం రక్ష కైకేయీం మారోషం కురు తాంప్రతి,
మయా చ సీతయా చైవ శప్తోసి రఘుసత్తమ. ౩
ఇత్యుక్త్వాఽశ్రుపరీతాక్షో రాఘవం విససర్జహ. ౩

స పాదుకే తే భరతః ప్రతాపవా న్స్వలంకృతే సం
పూజ్య ధర్మవిత్, ప్రదక్షిణం చైవ చకార రాఘ
చకార తే చోత్తమ నాగమూర్ధని.

తం మాతరో బాష్పగృహీతకంఠ్యో దుఃఖేన నామ
తుం హి శేకుః, స త్వేవ మాతౄ రభివాద్య సర్వా
కుటీరం ప్రవివేశ రామః.

1 వాల్మీ. రా: స్గ ౧౧౨

౩౦. పురుషసింహుండగు శ్రీరాముడును నాపాదుకలపై దనపాదములం మోపి తీసి యవి భరతున కిచ్చెను.

౩౦½. భరతుడును వానికి మ్రొక్కి నిలుచుండి యాతనితో నిట్లనెను.

౩౧½-౩౨. దేవా! నీయాగమనంబును గోరుచు బురంబునకు వెలుపలనే వసించుచు జటాచీరంబులు దాల్చి యీపదునాల్గు వత్సరంబులు గడపుచుండెదను. మఱి రాజ్యభారం బంతయు నీ హేమపాదుకలపై నుంచెదను.

౩౩. అట్లు పదునాల్గు వత్సరంబులును గడచిన దినంబున సూర్యాస్తమయమునకు బూర్వమే నీవు వచ్చి దర్శనం బొసగనిచో నే నగ్నిప్రవేశము చేసెదను. ఇది సునిశ్చయము.

౩౪-౩౫. శ్రీరాముండును నాయనా! సందేహింపకుము. పదునాలుగేండ్లు గడచినవెనుక దప్పక వచ్చెదననుచు నాభరతశత్రుఘ్నులను గౌగిలించుకొని యాభరతునితో నీ కార్యమునకై కైకేయిని గోపింపక యామెను సంరక్షించుచుండుమనియు నట్లుసేయనివాడు తనపైనను సీతపైనను బెద్దయొట్టనియు జెప్పెను.

౩౫½-౩౬½. ఇట్లు భరతుడు శ్రీరాముని మాటల కియ్యకొనియు నా శ్రీరాముని విడువలేక శోకార్ద్రనేత్రుడై యెట్టకేలకు దమల్చుకొని శ్రీరామునికి బ్రదక్షిణము గావించి పాదుకలను లెస్సగా బూజించి వానిని బట్టంపుటేనుగుశిరముపై నుంచుకొనెను.

౩౭½. కౌసల్యాదులగు మాతలును శ్రీరాముని నారణ్యవాసప్రయత్నంబును మానుపజాలక యూరక దుఃఖించుచు నేడ్చుచుండిరి. అతడును, వారల కెల్ల నమస్కరించి, దుఃఖించుచు బర్ణశాలలోనికి బోయెను.

[1] సనైన్య స్సవశిష్ఠశ్చ శత్రుఘ్నసహిత స్సుధీః,
మాతృభి ర్మంత్రిభి స్సార్థం గమనాయోపచక్రమే. ౩౮
కైకేయీ రామ మేకాంతే ప్రపన్నేత్రజలాకులా. ౩౯

ప్రాంజలిః ప్రాహ హేరామ! తవ రాజ్యవిఘాతనం,
కృతం మయా దుష్టధియా మాయామోహితచేతసా. ౪౦
క్షమస్వ మమ దౌరాత్మ్యం క్షమాసారా హి సాధవః. ౪౧
త్వం సాక్షాద్విష్ణు రవ్యక్తః పరమాత్మా సనాతనః,
మాయామానుషరూపేణ మోహయస్యఖిలం జగత్. ౪౨

పాపిష్ఠా పాపమనసా కర్మాచర మరిందమ,
పాహి విశ్వేశ్వరానంత జగన్నాథ నమోఽస్తుతే. ౪౩
కైకేయ్యా వచనం శ్రుత్వా రామ స్సస్మిత మబ్రవీత్. ౪౪

మయైవ ప్రేరితా వాణీ తవ వక్త్రాద్వినిర్గతా,
దేవకార్యార్థసిద్ధ్యర్థ మత్ర దోషః కుత స్తవ ౪౫
[2] మయ్యాన్యథావదోషేణ ప్రాప్తం తే లోకదూషణం. ౪౬

ఏతద్రూపేణ మత్సేవా కృతా లోకే త్వయాఽనఘే!
[3] అహం సర్వత్ర సమదృగ్ ద్వేష్యోవా ప్రియ ఏవవా. ౪౭
నాస్తి మే కల్పకస్యేవ భజతోఽనుభజా మ్యహం. ౪౮

1 అధ్యా. రా: సర్గః; 2 భారద్వాజరా. 3 అధ్యా. రా:

౩౮½. తరువాత భరతుడు, వశిష్ఠాదిద్విజసహితుడును మాతృకుంతీ సహితుడునై పురంబునకు బయట వచ్చెను.

౩౯. ఈయంతరమున కైకేయి యేకాంతంబున శ్రీరాముని జూచి, బాష్పపిహితలోచనయై యాతనితో నిట్లనెను.

౪౦-౪౦½. శ్రీరామచంద్రా! మాయామోహితచేతనయై దుష్టబుద్ధితో నీరాజ్యవిఘాతం బాచరించితిని. అయినను క్షమాసాగరుడ వగు నీవు నన్ను క్షమింపుము.

౪౧½. దేవా! పరమాత్ముండును సనాతనుండును వక్యక్తుండును వగు నారాయణుండవు నీవే. అయినను మాయామానుషరూపుడవై యీజగం బంతయును మోహజలధిలో ముంచుచున్నావు.

౪౨½. పాపవిచింతనురాలనై యిట్టి బెడిదంబు నీకు జుట్టి పెట్టితిని. ఓవిశ్వేశా! నన్ను గాపాడుము. ఇదే నీకు వందనము.

౪౩. ఇట్లనుచున్న కైకేయితో శ్రీరాముం డిట్లనెను.

౪౪-౪౪½. కైకా! నాచే ప్రేరేపింపబడి దేవకార్యార్థమై వాణిదేవి యట్లు నీ నోటినుండి బయలు వెడలినది. అంతియకాని యందు నీ దోసం బిసుమంతయు లేదు. మహ్యాస్యరుషాక్షి శాపంబునం జేసి నీ విట్టిలోకనిందకు బాల్పడితివి.

౪౫½-౪౬. అనఘురాలా! నిష్ఠుర మార్గమున గానిమ్ము, సరళమార్గమున గానిమ్ము - నీవు నాసేవ యొనరించితివి. సర్వాధికుండనగు నాకు ప్రియులు నప్రియులు నను విచక్షణలేదు. కల్పకంబుం బోలె నన్ను సేవించువారల కీప్సితంబు లిచ్చుటయే నే జేయుచుందునది.

దిష్ట్యా మద్గోచరం జ్ఞాన ముత్పన్నం తే భవాపహం,
గచ్ఛ త్వం హృది మాం నిత్యం భావయంతీ దివానిశం. ౪౭
సర్వత్ర విగతస్నేహా మద్భక్త్యా మోక్ష్యసే చిరం. ౪౭½
ఇత్యుక్తా సా పరిక్రమ్య రామం సానందవిస్మయా,
ప్రణమ్య శతశో భూమౌ యయౌ గేహం ముదాన్వితా. ౪౮½
[1]తత శ్శిరసి కృత్వాతు పాదుకే భరత స్తదా,
స త మాశ్రమ మాగమ్య భరద్వాజస్య బుద్ధిమాన్. ౪౯½
అవతీర్య రథా త్పాదౌ వవందే భరత స్తదా,
తతః ప్రదక్షిణం కృత్వా భరద్వాజం పునః పునః. ౫౦½
శృంగిబేరపురం రమ్యం ప్రవివేశ ససైనికః. ౫౧
[2] తతో నిక్షిప్య మాతౄ స్స అయోధ్యాయాం దృఢవ్రతం,
నందిగ్రామం యయౌ తూర్ణం శిరస్యాధాయ పాదుకే. ౫౨
అబ్రవీ ద్భరతో భక్త్యా సర్వం ప్రకృతిమండలం. ౫౨½
ఛత్రం ధారయత క్షిప్ర మార్యపాదా విమౌ మతౌ,
ఆభ్యాం రాజ్యే స్థితో ధర్మః పాదుకాభ్యాం గురోర్మమ. ౫౩
అభిషిక్తేచ కాకుత్స్థే ప్రహృష్టముదితే జనే,
ప్రీతి ర్మమ యశశ్చైవ మమ రాజ్య చ్చతుర్గుణం. ౫౪
[3] ఇత్యుక్త్వా పాదుకే దివ్యే హేమసింహాసనే తదా,
నిక్షిప్య మంత్రివత్తాభ్యా మభిషేకం హ్యకారయత్. ౫౫

1 వాల్మీ. రా: సర్గ ౧౧౩; 2 వాల్మీ. రా: సర్గ ౧౧౫; 3 [illegible]

౪౬-౪౭½. అమ్మా! ఇప్పటికి నన్ను దెలియు జ్ఞానము నీకు గల్గినది. ఇక నీవు సుఖముగా బురమునకు బోయి పుత్రపౌత్రాది సౌఖ్యంబులం దవులక నన్నే ధ్యానించుచుండుము. మోక్షముం గనగలవు.

౪౮½. ఇట్లు కైకేయి శ్రీరాముని వీడ్కొని యాతనికి బరిపరివిధంబుల మ్రొక్కులిడుచు నాశ్చర్యనిమగ్నురాలై యింటికి బోయెను.

౪౯½-౫౦½-౫౧. అంతట భరతుడు శ్రీరాముని పాదుకలను శిరముపై నుంచుకొని భరద్వాజాశ్రమంబు జేరి యాయునకు బ్రదక్షిణనమస్కారంబు లాచరించి యమ్మహర్షిని వీడ్కొని సైన్యసమేతుడై క్రమంబుగ శృంగిబేరపురంబు జేరెను.

౫౨. అటనుండి మాతల నందరిని నయోధ్యకు బంపించి తానుమాత్రము శిరముపై పాదుకలతో నందిగ్రామము బ్రవేశించెను.

౫౨½. అట సర్వజనంబులను రావించి వారలతో నిట్లనెను.

౫౩½. ఓయీ! ఇవిగో శ్రీరాముని పాదుకలు. వేవేగమె వీనికి ఛత్రంబు పట్టుడు. రాజ్యపరిపాలన ధర్మం బంతయు నీపాదుకల మూలముగనే వెలయుగలదు.

౫౪½. శ్రీరాముండు పట్టాభిషిక్తుడై సర్వజనంబులు సంతసం బందినచో నదియె నాకు రాజ్యంబుకంటె నెన్నియోమడుంగు లధికప్రీతియు నధికయశంబును జేకూర్చును.

౫౫½. ఇట్లనుచు నాసర్వప్రకృతిమండలసమక్షంబున నాహేమపాదుకలను గనకసింహాసనముపై నుంచి యథామంత్రకంబుగ వాని కభిషేకము జేసెను.

1 తతస్తు భరత శ్శ్రీమా నభిషి చ్యార్యపాదుకే,
తదధీన స్తదా రాజ్యం కారయామాస సర్వదా. ౫౬

తదాహి యత్కార్య ముపైతి కించి దుపాయనం చోపహృతం
మహార్హం, స పాదుకాభ్యాం ప్రథమం నివేద్య చకార
పశ్చా ద్భరతో యథావత్. ౫౭

2 గణయ న్దివసా నేవం రామాగమనకాంక్షయా,
స్థితో రామా ర్పితమనా స్సాకేత ద్బ్రహ్మముని ర్యథా. ౫౮

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అయోధ్యాకాండే
అష్టాదశ స్సర్గః.

---

ఏకోనవింశ స్సర్గః.

రామస్తు చిత్రకూటాద్రౌ వస న్మునిభి రావృతః,
సీతయా లక్ష్మణే నాపి కంచిత్కాల ముపావసత్.

3 *కదాచి ద్యాజ్ఞవల్క్యస్య జయంతః ప్రేరిత స్సురైః,
కర్తుం తపోవిఘ్న ముగ్రతపసః కామరూపధృక్.

---

* వ్యా: కదాచిదితి:— అత్రైతదాఖ్యాయికా వా
కీయే వా స్తీతి చేచ్ఛాందోగ్యే 'తత్తేజోఽసృజత' ఇత్యు
స్థానే తైత్తిరీయకే 'తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకా
స్సంభూత' ఇత్యుక్త సామాన్య విశేషైకవాక్యకర
ద్యాజ్ఞవల్క్యరామాయణోక్త్యా గుణోపసంహారః కర్తవ్య

1 వాల్మీ.రా: సర్గ ౧౧౫. 2 అధ్యా. రా: సర్గ 3 యాజ్ఞ. రా:



A. J. M.

తతస్తు భరత శ్శ్రీమా నభిషి చ్యార్యపాదుకే
తిదధీన స్తదా రాజ్యం కారయామాస సర్వదా.

—వాల్మీకి రా. ౧౧౫ సర్గ.

౨౬౫-౨౭౫. ఇట్లు భరతుడు శ్రీరాముని పాదుకల కభిషేకం బొనర్చి సర్వ రాజ్యంబును వాని యధీనముచేసి బహుమానంబులు కప్పంబు లాదిగా గలవి యేవి వచ్చినను, నే పని పట్టినను, దా నేకార్యము చేయబోవు చున్నను ముందుగ బోయి యాపాదుకలకు నివేదించి యటుపైన దేని నెట్లు చేయవలెనో దాని నట్లు నిర్వహించుచుండెను.

౨౮౫. తానుమాత్రము శ్రీరాముడు మరలివచ్చుకాలము లెక్కించుకొనుచు బ్రహ్మర్షింబోలె శ్రీరామ పాదారవింద సమర్పిత మనస్కుడై యుండెను.

ఇది శ్రీరామాయణ సారోద్ధారంబున నయోధ్యాకాండంబునందు బదునెన్మిదవసర్గము.

---

పందొమ్మిదవసర్గము.

౧. ఇట్లు సీతాలక్ష్మణసమేతుడై చిత్రకూటాశ్రమంబున నుండి శ్రీరాము డచ్చటి మునిజనంబులతో గాలము గడుపుచుండెను.

౨. * పూర్వ మొకప్పుడు సురలచే ప్రేరితుడై జయంతుడు యాజ్ఞవల్క్య మహర్షి తపంబు చెఱుపబూని యమ్మునిని బాధింపదొడంగెను.

---

* వ్యా: కాకాసురునిగూర్చి:—ఈ కాకాసుర వృత్తాంతము వాల్మీకి రామాయణంబున లేదని సందేహింపబనిలేదు. సామాన్య వాక్య మొక చోటనుండి విశేషవాక్యము గ్రంథాంతర మందున్నను దానిని చేకొనుట శాస్త్రసిద్ధమైయున్నది.

అట్లే యీవిషయము వాల్మీకీయంబున లేకపోయినను యాజ్ఞవల్క్య రామాయణంబున నున్నదిగాన గైకొనబడియున్నది.

తం బాధమానో వ్యచర త్తం జ్ఞాత్వా తాదృశం మునిః,
కామరూపో రాక్షస స్త్వం భవే త్యశప దాశు తం.

పున స్సంప్రార్థిత స్తేన రామబాణేన తాడితః,
దగ్ధపాపో యథారూపం ప్రాప్స్యసీ త్యనుబోధితః.

తదానీం రాక్షసో భూత్వా రావణానుజన్నసధా,
స్థిత్వా ఖరప్రేరణయా రామశ క్తిం పరీక్షితుం.
చిత్రకూట మనుప్రాప్య కాకరూపేణ రాక్షసః.
[1]ఏకదా నిద్రితం రామం సీతాంకే సన్నిరీక్ష్య చ,
ఐంద్రకాక స్తదా సీతాంగుష్ఠం తుండా ద్వ్యదారయత్.

సీతాంగుష్ఠంతు కాకేన చ్ఛిన్నం దృష్ట్వా రఘూత్తమః,
అభిద్రవంతం రక్తాస్య ఇషీకాస్త్రం ముమోచ సః.

కేనాప్యరక్షిత స్త్వస్త్రభయా ద్బ్రహ్మాండగోళకే,
స్వమాగతస్య శరణం పున ర్నారదవాక్యతః.

ఇషీకా స్త్రేణ కాకస్య బిభేద నయనం క్షణాత్,
వధార్హ మపి కాకుత్స్థః కృపయా పర్యపాలయాత్.
ఏవం నానాకౌతుకాని కుర్వాణ స్తత్ర సుఖం ప్రభుః.

---

1 అధ్యాత్మ రా: సర్గ ౯.

౩. అమ్మునియు నాతనియుదంతం తెలిసి నీవు కామరూపుడ వగు రాక్షసుడవు కమ్మని తటాలున శపించెను.

౪. అంత జయంతు డమ్మునిపాదములపై నెఱిగిన నాతడును దయాహృదయుండై 'రామబాణతాడితుడ వైనప్పుడు యథారూపంబు గల్గు'నని శాపవిమోచనం బొసగెను.

౫-౫౪. ఇంద్రుని కుమారుండగు నాజయంతు డిట్లు శాపహతుడై రాక్షస రూపం బంది ఖరప్రేరితుడై శ్రీరామునిశక్తి బరీక్షింపగోరి కాకరూపియై చిత్రకూటంబు జేరెను.

౬. అట సీతాంకము తలాడగా నిదురపోవుచున్న శ్రీరాముని జూచి ధైర్య మవలంబించి సీత కాలిబొటనవ్రేలు పట్టిపొడువసాగెను.

౭. శ్రీరాముడు మేల్కాంచి యాదేవిపాదాంగుష్ఠము విదారితమై రక్తము స్రవించుచుంట కనుగొని క్రోధారుణితలోచనుండై యయ్యామునిపై నిషీకాస్త్రము వైచెను.

౮. అంత నాజయంతుడును నయ్యస్త్రంబున బీడితుండై దానిబారినుండి రక్షించువారిని బదునాల్గు భువనంబులందును గానక తిరిగి తిరిగి వేసరి నారదుం డుపాయము దెల్పప దుద నాశ్రీరాముని శరణంబు వే కోరెను.

౯. ఆశ్రీరాముండును నాతనియెడ గనికరించి, యయ్యస్త్రంబుచే నాతని నేత్రముమాత్రము దుల్లవేసి వధార్హుండైనను నాతని విడిచిపుచ్చెను.

౯౪. ఇట్లు వింత వింత పనులు చేయుచు నాశ్రీరాముడు చిత్రకూటంబున గాలము వెళ్ళబుచ్చుచుండెను.

[1]రావణోఽపి దిలీపాది రామాంతవధి విరోధకృత్,
క్రిమాత్యాన్త్రైః పరాభూతో రామేణసహ వ్యదీపకత్. ౧౦

[2]*ప్రతిప్రయాతే భరతే వసన్ రామ స్తపోవనే,
లక్షయామాస సోద్వేగ మథౌత్సుక్యం తపస్వినాం. ౧౧

వ్యా: * ప్రతిప్రయాతేతి:—అథాత్ర శ్రీరామచం
స్యారణ్యసంచారప్రదర్శనం క్రియతే-తద్యథా శ్రీరామచంద్ర
స్యాస్య పంచవింశతితమవత్సరే ఇదానీం (oudh) ఔధ్ ఇ
ప్రఖ్యాతోత్తర కోసలదేశ పత్తన రాజధాన్యా అయోధ్యా
పట్టణాత్ సీతాలక్ష్మణాభ్యాం సహితః సిద్ధార్థి నామ సంవత్స
చైత్రశుక్ల పుష్యమీ నక్షత్రయుక్త దశమ్యాం (దశమీతి
నిర్గతః శ్రీమద్రామాయణే చైత్రమాసే పుష్యమీనక్షత
యుక్తతిథ్యామేవ శ్రీరామచంద్రస్య యౌవరాజ్య పట్టాభిషే
ప్రయత్న ఇతి నిర్వివాదాంశః, చైత్రే పుష్యమీనక్ష
నవమ్యాం దశమ్యాం వా సంభవతీతి జ్యోతిశ్శాస్త్రప్రసిద్ధం.
నవమ్యా రిక్తతిథిత్వేన దశమీత్యేవ స్పష్టం) స్వజాతకరీ
బుధదశాయాం స్వభుక్తౌ చతుర్దశవర్ష పర్యంత మరణ్యే వ
పితాజ్ఞయా నిర్గమ్య తస్మిన్నహని సాయంకాలే ఇ
(Tons) టాన్స నామక తమసానద్యాస్తీరం ప్రా
ఇయంచ తమసానదీ మార్హా (Marha) నామ్నా అయో

1 భారద్వాజ రా. 2 వాల్మీ. రా: సర్గ ౧౧౬.

౧౦౫. రావణుఁడును దిలీపాది పూర్వప్రభువులచే బరాజితుఁడై యాక్రోధంబును గడుపులో బెట్టుకొని తద్వంశజుండగు శ్రీరామునిపై మిగుల బగబూనియుండెను.

౧౧౫. * ఇట్లు భరతుడు మఱలిపోగా శ్రీరాముఁడా తపోవనమందే యుండెను. అతని జూచి యచ్చటి మునిజనంబు లనుమానపడుచు తమ కనులతోడను కనుబొమలతోడను నేవేవో సంజ్ఞలొనరించుకొనుచు వీరినిజూచి యేమేమో మాటాడుకొనుచుండిరి.

---

వ్యా: * భరతుడు మరలిపోయె ననుచోట:— ఇచ్చట శ్రీరామచంద్రుని యరణ్యసంచారము వివరింపబడుచున్నది. మొదట శ్రీరామచంద్రమూర్తి తన యిరువదియైదవసంవత్సరంబున- ఔధ్ అని పిలువబడు నుత్తరకోసల రాజధానియగు అయోధ్యానగరమునుండి తమ్మునితో, సతితో సిద్ధార్థినామసంవత్సర చైత్రశుక్ల దశమిని పుష్యమీ నక్షత్రయుక్త ముహూర్తమున (దశమీ తిథినిర్ణయము-శ్రీరామాయణమున చైత్రమాసమందు పుష్యమీనక్షత్రయుక్త శుభదినమున శ్రీరామచంద్రునకు యౌవరాజ్య పట్టాభిషేకము నిర్ణయించి రనుట నిర్వివాదాంశము. చైత్రమాసమున పుష్యమీనక్షత్రము నవమీదశమీ తిథులందు మాత్రమే సిద్ధాంతరీత్యా ఏర్పడును. అందు నవమి రిక్తతిథియౌటచే శుభకర్మల కనర్హమగుటవలన దశమి యనియే స్పష్టమగుచున్నది.) స్వజాతకరీతిగ బుధదశయందు స్వభుక్తిని పిత్రాజ్ఞచే పదునాలుగబ్దంబు లరణ్యమందు వసించుటకై బయలుదేరెను. తొలి రోజున సాయంకాలమునకు (టౌన్సు అను) తమసానదీతీరమును జేరి అందు నివసించెను. ఈ తమసానది 'మార్హా' యనబరగుచు - అయో

పత్తనాత్ నైరృత్యాం వింశార్ధక్రోశదూరస్థ కుందర్ఖా (Kundarkha) పట్టణ ప్రాంతే జనిత్వా భరతఖండా (Bharat-khand) ఖ్యపత్తన మనుస్సృత్య ప్రోహ్య అక్బర్‌పూర్ (Akbarpur) పత్తనస్య పశ్చిమే పంచార్ధక్రోశదూరే అయోధ్యానగరా ద్వాయవ్యే సప్తవింశార్ధక్రోశదూరే విద్యమానే అతౌలా (Ataula) సింధురా (Sindhura) మధ్యే జాత బిస్వీ (Biswi) నామక వేదశ్రుతిం జాల్‌పూర్ (Jalpur) సమీపే సంగమ్య టాన్సు (Tons) నామ్నా ప్రసిద్ధాభూత్వా అహ్రౌలా (Ahraula) పట్టన మనుసృత్య ప్రోహ్య అయోధ్యాపత్తనస్యాగ్నేయదిగ్భాగే త్రింశార్ధక్రోశదూర స్థిత బంగోన్ (Bangaon) పత్తనప్రాంతోత్పన్న మొజహోయ్ (Mojhoi) నామకనదీం అహ్రౌలా (Ahraula) పత్తనస్య దక్షిణతః పంచార్ధక్రోశ దూరే మిళిత్వా అజాంఘర్ (Ajamgarh) మండల మనుసృత్య ప్రోహ్య కోపగంజ్ (Kopaganj) నామక ధూమశకటాలయ (Railway station) సమీపే చోటాసర్జు (Cho[ta] Sorj) నామకనద్యాం సంగమ్య క్రియద్దూరం వహి[త్వా] బాల్హా (Balha) పత్తనసమీపప్రాంతే గంగాయాం మిలి[తా]. తస్యామేవ రాత్రౌ తృతీయయామే రథయానేనైవ మా[ర్హా] (Marha) నామకతమసాం చ బిస్వీ (Biswi) నామక వేద[శ్రుతీం] చ గోమతీం (Gomati) సంతారితవాన్. ఇయమపి గ[ోమతీ] అయోధ్యాపురభేదనస్య వాయవ్యదిగ్భాగే పంచా[ర్ధ] క్రోశార్ధక్రోశదూరే శిశోరినాశిర్ (Sisori Nosir)

